ఈ నవల ''అంగారకుని అస్తమయం'' అనే పేరుతో 1923లో మొదట వెలువడింది. యీ నాటి పాఠకునికి ఈ నవల సాంకేతిక శాస్త్ర దృష్ట్యా మరీ సత్యకాలంగా కనబడినప్పటికీ అద్భుత కల్పన కోవకు చెందిన నవలలో అత్యంత ఆసక్తిజనకమైన వాటిలో ఒకటిగా పరిగణించబడుతూందనడంలో సందేహం లేదు.

ఈ అద్భుత కల్పన, వెనుకటి రోజుల్లో ఎలా వున్నా, ఈ నాడు యథార్థం కాబోతూందనే ఒప్పుకు తీరాలి. ఇద్దరు ధైర్యశాలురు— ఎర్ర సైనికుడు గూసెవ్, అవిష్కర్త లోశ్ — విచిత్రమూ నిగూఢమూ అయిన అంగారక గ్రహాన్ని చేరుకుంటారు. రహస్య ఘటనలు ఎన్నో వారి కళ్ల ఎదుట జరుగుతాయి. అన్నిటినీ మించినది, పురాతన తూమ లోకపు హృదయంలో బహుకాలంగా ముదురుతూ పరిపక్వానికి వస్తూన్న ఒక బ్రహ్మాండమైన సామాజిక ఉత్పాతానికి అనతికాలంలోనే వారు సాక్షులవుతారు.

ఏమైతేనేమి, ఇద్దరూ భూలోకం మళ్లీ చేరుకుంటారు. భూలోకానికి వచ్చేశాను కదా అని గూసెవ్ ఎంతగానో మురిసిపోతాడు. లోశ్‌కి మాత్రం విశ్వాంతరాళ ప్రదేశాన్ని దాటి వస్తూన్న ప్రేమ వాణి పిలుపును అందుకోవడమే — అంగారక లోకాధినేత తుస్కూబ్ కుమార్తె అయిలీత కంఠాన్ని మళ్లీ చెవులార వినడమే — జీవిత పరమార్థమంతానూ.

అలెక్సేయ్ తొల్‌స్తోయ్

# అయిలీత



"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

అనువాదం: వుప్పల లక్ష్మణరావు
డిజైన్: ఎర్. సైఫూలిన్

Алексей Толстой
Аэлита
*На языке телугу*

Alexsei Tolstoi
Aelita
*In Telugu*

సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

ISBN 5-05-002318-1

# విషయసూచిక

చిత్రమైన ప్రకటన . . . . . . . . . . . . . . . 7
లోశ్ కార్ఖానా . . . . . . . . . . . . . . . . 12
సహప్రయాణికుడు . . . . . . . . . . . . . . 22
నిద్రలేని రాత్రి . . . . . . . . . . . . . . . 31
అదే రాత్రి . . . . . . . . . . . . . . . . 37
ఆరోహణ . . . . . . . . . . . . . . . . 44
నల్లని ఆకాశంలో . . . . . . . . . . . . . . 50
అవరోహణ . . . . . . . . . . . . . . . . 57
అంగారకుడు . . . . . . . . . . . . . . . 61
మనిషివాసన లేని ఇల్లు . . . . . . . . . . . . 74
సూర్యాస్తమయం . . . . . . . . . . . . . . 83
లోశ్ భూగోళంకేసి చూస్తాడు . . . . . . . . . . 87
అంగారక వాసులు . . . . . . . . . . . . . . 90
పర్వత శిఖరాలకు ఆవల . . . . . . . . . . . . 95
సోఅత్సేర . . . . . . . . . . . . . . . . 104
నీలి అడవిలో . . . . . . . . . . . . . . . 110

విశ్రాంతి . . . . . . . . . . . . . . . 113
తుషార గోళం . . . . . . . . . . . . . . . 117
మెట్లమీద . . . . . . . . . . . . . . . 128
అయిలీత చెప్పిన తొలి కథ . . . . . . . . 135
యాదృచ్ఛ ఆవిష్కరణ . . . . . . . . . 146
అయిలీత ఉదయ కార్యక్రమం . . . . . . . . . . 158
అయిలీత చెప్పిన రెండో కథ . . . . . . . . . 166
గూసెవ్ పట్టణాన్ని అవేక్షిస్తాడు . . . . . . . . 190
తుస్కూబ్ . . . . . . . . . . . . . . . 195
లోశ్ ఏకాకి అయిపోయాడు . . . . . . . . . 207
వశీకరణం . . . . . . . . . . . . . . . 217
పురాతన గీతం . . . . . . . . . . . . . . 224
గూసెవ్ సహాయార్థం లోశ్ వాయుయానం . . . . 231
క్రితం రోజు గూసెవ్ క్రియాకలాపం . . . . . . . 237
కథ కొత్త మలుపు . . . . . . . . . . . . 247
తిరుగుదాడి . . . . . . . . . . . . . . 256
రాణి మాగ్ర్ సారంగవ్యూహం . . . . . . . . . . 265
హావో . . . . . . . . . . . . . . . 274
పలాయనం . . . . . . . . . . . . . . 281
మరుపు . . . . . . . . . . . . . . . 290
భూమి . . . . . . . . . . . . . . . 296
ప్రేమవాణి . . . . . . . . . . . . . . 304

# చిత్రమైన ప్రకటన

క్రాస్నియె జోరీ వీధిలో ఒక చిత్రమైన ప్రకటన అవుపడింది. బూడిదెరంగు కాగితంమీద రాసిన ఆ ప్రకటన గిలాబా పెచ్చులు వూడి పోతూ నిర్మానుష్యంగా వున్న ఒక ఇంటి గోడకి మేకులతో కొట్టివుంది. ఆ ప్రకటన ఎదుట ఒక యువతి నిల్చునుంది. నీలైన నూలు అద్దకం గౌను వేసుకుంది. కాళ్లకు జోళ్ళు లేవు. అక్షరం అక్షరం కూడబలుక్కుని చదువుతూన్న ఆ యువతిని, ఆ యింటి పక్కనుండే వెళ్తూన్న అమెరికన్ పత్రికావిలేకరి ఆర్చిబాల్డ్ స్కయిల్స్ చూశాడు. ముద్దులు మూటకడుతూ

అలసిపోయున్న ఆమె ముఖంలో ఏమాత్రం ఆశ్చర్యమూ కనబడలేదు; రవంత పిచ్చి కళను ప్రదర్శిస్తూన్న ఆమె నీలిరంగు కళ్ళు ప్రశాంతంగానే వున్నాయి. ముఖం మీద పడుతూన్న వుంగరాల చెంప కురులను చెవి పక్కకు దోసేసుకుని, నేలమీద పెట్టిన కూరగాయల బుట్టను తీసుకుని ఆమె వీధి దాటింది.

న్యాయానికి అసలు అదెంతో జాగ్రత్తగా చదవాల్సిన ప్రకటనన్న మాట. అదేమిటో చూద్దామనే జిజ్ఞాసతో స్క్రయిల్స్ దాన్ని చదివాడు. చదివి ఆ ప్రకటనకు మరి కాస్త దగ్గరగా వెళ్ళి కళ్ళు నులుపుకొని మళ్ళీ మరొకసారి చదివాడు.

''ట్వెంటిత్రీ'' అన్నాడు చివరకు ఎలాగైతేనేం — అనగా అతడి పరిభాషలో ఆ మాటకు అర్థం ''ఆరె, వీడి తస్సాచెక్క!'' అని.

ఆ ప్రకటనలో ఇలా వుంది:

''తనతో కూడా ఆగస్టు 18 న అంగారక గ్రహానికి పయనించేం దుకు అభిలషించేవారందరినీ 11, జ్నానొవ్‌స్క్రయ ఎంబాంక్‌మెంట్ వీధి ఇంట్లో సాయంకాలం 6 గంటలు 8 గంటలకూ మధ్య తనను కలుసుకో వలసిందని ఇంజనీర్ ఎమ్. ఎస్. లోశ్ ఆహ్వానిస్తున్నాడు.''

మామూలుగానూ ముక్తసరుగానూ నల్లని క్రెయాన్ పెన్సిలుతో రాసివుంది ఆ ప్రకటన.

స్క్రయిల్స్ తన నాడి చూసుకున్నాడు. నాడి మామూలుగానే వుంది. వాచీ చూసుకున్నాడు. నాలుగు గంటల పది నిమిషాలైంది. ఆ రోజు ఆగస్టు 17, 192...

ఈ పిచ్చి వూళ్ళో ఏం జరిగినా జరగొచ్చుననీ, అందుకు ఏమీ ఆశ్చర్య పడాల్సిన అగత్యం లేదనీ అనుకున్నాడేగాని, పెచ్చులు ఊడిపోతూన్న ఈ గోడకున్న ఈ ప్రకటన తనకు తారసిల్లుతుందని మాత్రం స్క్రయిల్స్

ఎన్నడూ అనుకోలేదు. అది చదివేసరికి అతడి నవనాడులూ కుంగిపోయి మతి పోయినంత పనైంది.

మనిషి అలికిడిలేని ఆ వీధిలో గాలి రయ్యిమని ఎగరగొట్టేస్తూంది. ఆ వీధిలో వున్న పెద్ద భవంతుల తలుపులూ అద్దాలు విరిగిపోయిన కిటికీలూ మూసి, చెక్కలతో బిగించి వున్నాయి; చూడబోతే ఆ లోగిళ్లలో ఎవ్వరూ' వుంటూన్నట్టు లేదు — అసలు నరవాసనంటూ ఆ వీధిలోనే లేదు. ఆ యువతి వీధి అవతల పక్కకు వెళ్లి, చేతనున్న బుట్టను కింద పెట్టి, స్క్వయిల్స్‌కేసి తేరిచూసింది. ముద్దులొలుకుతూన్న ముఖం ప్రశాంతంగా బడలికగా వుంది.

స్క్వయిల్స్ పౌడు కరచుకున్నాడు. జేబులోనుండి పాత కవరు ఒకటి తీసి దానిపైన లోశ్ చిరునామా రాసుకున్నాడు. అతడిలా రాసుకుంటూండగా, వెడల్పాటి భుజస్కంధాలూ పొడ్డూ పొడుగూ వున్న వ్యక్తి ఒకడు —అతగాడు తొడుక్కొన్న పటకాలేని జుబ్బా, కాళ్లకి పట్టీలూ బట్టి చూస్తే అతగాడు సోల్జరని వెంటనే తెలిసిపోతూంది — ఆ ప్రకటన ఎదుట ఆగాడు. అతడికి నెత్తిన టోపీ లేదు, చేతులకేమీ పనీ పాటూ లేకపోవడంచేత చేతులు రెండింటినీ జేబుల్లో పెట్టుకున్నాడు. అతగాడా ప్రకటన చదువుతూంటే, మంచి బలంగా వున్న ఆ మెడ నరాలు బిగుసుకుంటున్నాయి.

"ఆరె, వీడెవడో ఏకంగా అంగారకుడినే డబాయిస్తున్నాడే!" అంటూ తన ఆశ్చర్యం ప్రకటించి, ఎండకి నల్లబడి ఉత్సాహంతో తొణికిసలాడుతూన్న తన ముఖాన్ని స్క్వయిల్స్‌కేసి తిప్పాడు. అతడి కణతలమీద అడ్డుగా గాయపు మచ్చ కనబడుతూంది. గోధుమ పాంశువర్ణ మిశ్రితమైన ఆ కళ్లలో — ఆ యువతి కళ్లల్లోలాగే — నిప్పురవ్వలు మెరుస్తున్నాయి. (రష్యన్ ప్రజల కళ్లల్లో నిప్పురవ్వలు మెరుస్తూన్నట్టు ఇదివరకు చాలా కాలం కిందటే

స్క్వయిల్స్ కనిపెట్టేడు. ఆ సంగతే వెనుక తన వ్యాసాలలో ఒకసారి అతడిలా రాశాడు: "...ఈ క్షణం వెక్కిరిస్తూ మరుక్షణం ఉన్మాదదీక్ష ప్రతిబింబిస్తూ ఈ విధంగా అస్థిరత్వం ప్రదర్శిస్తూన్న వీరి కళ్ళూ, ఇక చివరకి ఇతరులకు భంగపాటు కలిగించేటట్టుగా తామే శ్రేష్ఠులమని చాటిచెప్పే ఆ చూపులూ — ఇదంతా యూరపియన్లకి ఎంతో బాధాకరంగా వుంటుంది.")

"అతడితో ఎగిరి వెళ్ళాలని నాకూ బుద్ధిపుట్టుతూంది — అంత సుళువైతేనూ," అన్నాడతడు, స్క్వయిల్స్‌కేసి ఎగా దిగా చూసి సరదాగా నవ్వుతూనూ.

తరువాత అతడు కళ్ళు సన్నగా చేసుకున్నాడు. ముఖంలో అదివరకుండిన నవ్వు మాయమైపోయింది. వీధిలో అవతలివైపున బుట్టను దగ్గర పెట్టుకుని నిల్చునున్న స్త్రీ అతని కంటబడింది. అతడు తన గడ్డాన్ని ఆమెకేసి నిగిడ్చి, ఆమెను పిలిచాడు:

"మాషా! నువ్విక్కడ నిలబడ్డావేం?" (ఆ మాటలు ఆమె చెవిని పడగానే ఆమె ఆదరా బాదరా గుడ్లు మిటకరించింది.) "నువ్వింటికెళ్ళు, నేనూ వచ్చేస్తా త్వరగానే." (ధూళిమయమై వున్న తన చిన్ని పాదాలను ఆమె ఇటూ అటూ కదిపి, నిట్టూర్చి, ముఖం కిందికి దించేసింది.) "నువ్వువెళ్ళు మరి, నే వచ్చేస్తున్నానుగా!"

ఆమె బుట్టని తీసుకుని వెళ్ళిపోయింది.

"నన్ను సైన్యంలోనుండి విడుదల చేసేశారు — చూశారు కాదూ, షెల్‌షాక్ తగిలింది, గాయపడ్డాను. కాలం ఎలా వెళ్ళబుచ్చడమో తోచక ఇలాంటి ప్రకటనలు చదవడమే ఒక వ్యాపకంగా పెట్టుకున్నా," అన్నాడా సోల్జరు.

"ఈ మనిషిని చూడాలనే అనుకుంటున్నారా ఏమిటి?" అని అడిగాడు స్క్వయిల్స్.

''తప్పకుండా చూస్తా!''

''వెర్రీ పిచ్చి కాకపోతే ఇదేమిటండీ – ఐదుకోట్ల కిలోమీటర్లు అంతరిక్షంలో ఎగరడమా?''

''కాస్త దూరమే మరి.''

''ఈ మనిషెవడో కేవలం దగాకోరేనా అయుండాలి, లేకుంటే పుత్త పిచ్చి వెధవేనా అయుండాలి.''

''ఏమోలెండి.''

ఆ మాట వినగానే స్క్వయిల్స్ ఆ సోల్జరును తదేకంగా చూడడం మొదలెట్టాడు. ఆ వెక్కిరిస్తూన్న చూపూ, ఇతరులకు భంగ పాటు కలిగించేటట్టుగా తామే శ్రేష్ఠులమని చాటిచెప్పే కళ్లూ – అదిగో మళ్లీ సరిగ్గా అవే ఇక్కడా ప్రత్యక్షమయ్యాయి. దానితో స్క్వయిల్స్‌కి కోపం వచ్చేసి ముఖం జేవురించుకుని నెవా నది దిశగా గబగబా వెళ్లిపోయాడు. ఆత్మవిశ్వాసంతో పెద్దపెద్ద అంగలేసుకుంటూ నడుచుకుని పార్కులోకి వెళ్లి, అక్కడొక బెంచిమీద కూచున్నాడు. పొగతాగుడుకి దాసుడూ, అదే సమ యంలో మంచి పొదుపరి వ్యవహర్త అయివుండడం కారణంగా, తన జేబులో వున్న పొగాకు గుండనూ పొగగొట్టాన్నీ తీసి, బొటనవేలితో పొగాకును గొట్టంలో దట్టించి, గొట్టం వెలిగించి, కాళ్లు పారజాపుకొన్నాడు.

పార్కులో వున్న ముసలి లైమ్ చెట్లు నిట్టూర్చుతున్నాయి. వెచ్చగా చెమ్మగా వుంది గాలి. చిన్న కుర్రాడొకడు పంట్లాం లేకుండానే కుళ్లోడుతూన్న చుక్కల చుక్కల షర్టు తొడుక్కుని ఇసుక కుప్పమీద కూచునున్నాడు. ఆ కుర్రాడి వాటం చూస్తే ఎన్నో గంటలై అక్కడ అలా కూచున్నట్టుంది. మెత్తగా నారలా వున్న జుత్తు గాలికి రేగిపోతూంది. ఆ పిల్లాడి చేతిలో దారం ఒకటి వుంది. దారం రెండో కొస తోకఈకలు రేగిపోయున్న ముసలి కాకి

కాలికి కట్టి వుంది. ఆ కాకి కోపంగానూ చికాకుగానూ ముఖంపెట్టి, ఆ కుర్రాడిలాగానే స్క్రాయిల్స్‌కేసి గుడ్లు ఎర్రజేసి చూస్తూంది.

దటూలుస — ఒక్క క్షణంపాత్రమే-స్క్రాయిల్స్‌కి ముఖం ఝుమ్మాలు మంది. తలకాయ గిర్రున తిరిగినట్టయింది: ఇదంతా తాను కంటూన్న కలా, లేకుంటే తాను నిజంగా కళ్లతో చూస్తూన్నదేనా?.. ఈ కుర్రాడు, ఈ కాకి, మనుషులు వదిలిపెట్టి పోయిన ఇళ్ళు, నరవాసనలేని వీధులు, వింత చూపులు, తనతో కూడా అంగారకుడిని దర్శించమని ఆహ్వానిస్తూన్న ఆ చిన్న ప్రకటన — ఇదంతా స్వప్నమేనా ఏమిటి?..

ఆ ఘాటైన పొగాకును ఒక దమ్ము పీల్చి, తన దగ్గరున్న పెట్రోగ్రాడ్ పట్నపు మ్యాపును మడతవిప్పి, పొగగొట్టం కాడతో జ్నామెన్స్కాయ ఎంబాంక్ మెంటుకి దారి దిద్దుకుంటూ గుర్తు చూసుకున్నాడు.

# లోశ్ కార్ఖానా

తుప్పుతో తూట్లుపడిన ఇనుప చెత్త, ఖాళీ సిమ్మెంటు పీపాలు చిందర వందరగా పడున్న దొడ్డిగుండా వెళ్లాడు స్క్రాయిల్స్. చుట్టలు చుట్టుకుపోయి అడ్డదిడ్డంగా చిక్కులు పడున్న ఇనుప తీగెల మధ్యనుండీ, విరిగి ముక్కలైపోయిన మరల మధ్యనుండీ, చెత్త సామానుల కుప్పమీదనూ ఈసురోమంటూన్న గడ్డిచెట్లు వెలవెలబోతూ మొలుస్తున్నాయి. దొడ్డికి ఆవల చివర పొడుగాటి షెడ్డు ఒకటుంది. ఆ షెడ్డుకున్న కిటికీ అద్దాలన్నీ దుమ్ముపట్టి వున్నాయి. ఆ దుమ్ముపట్టిన కిటికీలు అస్తమిస్తూన్న సూర్య కిరణాలను ప్రతిబింబిస్తున్నాయి. షెడ్డు గుమ్మం పొట్టిగా వుంది. ఆ గుమ్మంలో కార్మికుడొకడు కూచుని బాల్చీలో గంగసిందూరం కలుపుతున్నాడు.

"ఇంజనీర్ లోశ్ ఎక్కడున్నాడయ్యా?" అని స్క్రయిల్స్ అడిగాడా మనిషిని.

లోపలున్నాడని అర్థమిచ్చేటట్టుగా ఆ మనిషి చిఫుక్కున తన తలకాయను షెడ్డుకేసి పంకించాడు. షెడ్డులోకి వెళ్ళాడు స్క్రయిల్స్.

షెడ్డులో అంతా మసక మసకగా వుంది. ఒక చోట ఒక బల్ల వుంది. ఆ బల్ల నిండా టెక్నికల్ డ్రాయింగులూ పుస్తకాలూ గుట్టలు గుట్టలుగా పడున్నాయి. కూచిగా రేకుతో చేసిన ల్యాంప్ షేడ్ వున్న ఎలెక్ట్రిక్ దీపం ఒకటి బల్లకి ఎగువగా వేలాడుతూంది. షెడ్డు వెనకాల గజిబిజిగా వున్న పరంజా ఒకటి కప్పు వరకూ కట్టివుంది. మండుతూన్న కొలిమిని వూదుతున్నాడు మరొక కార్మికుడు. గొడుగురివెట్లు కొట్టిన గోళాకారపు వస్తువొకదాని లోహపు ఉపరితలం ఆ పరంజా నడుమనుండి స్పష్టంగా అవుపడుతూంది. అస్తమించుతూన్న సూర్యుని అరుణ కిరణాలూ, సముద్రగర్భం నుండి ఊర్ధ్వంగా లేస్తూన్న నల్లని మేఘాలూ ఆవలివైపు తెరిచి వున్న ద్వారంలోనుండి పటం కట్టినట్టు కనబడుతున్నాయి.

"మిమ్మల్ని చూడ్డానికి ఎవరో వచ్చారు, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్!" అని కొలిమి వూదుతూన్న కార్మికుడు అన్నాడు కాస్తగొంతు దించి.

మంచి కండ పుష్టి కలిగిన మనిషి ఒకతను పరంజా వెనుకనుండి ఇవతలకు వచ్చాడు. పొడుగూ కాదూ, పొట్టీ కాదూ, మధ్యస్థంగా వున్నాడు. జుత్తు వొత్తుగా తెల్లగా వుంది. గెడ్డమూ మీసమూ లేవు. పెద్దవి అందమైన పెదవులు. భవిష్యత్తులోకి తొంగి చూస్తున్నాయా అని తోపించేటట్టి కళకళలాడుతూన్న కళ్ళు రెప్పవాల్చకుండా ఎదుటివాడి కేసి తేరిపారి చూస్తున్నాయి. మరకలు కట్టి మాసిపోయి, మెడకు గుండీలు పెట్టుకోకుండా వదిలేసిన, ముతుక చేనేతిగుడ్డ లాల్చీ, మాసికలు వేసిన

పంట్లామూ తొడుక్కున్నాడు. పటుకా బదులు తాడు. డాగులు పడిన డ్రాయిం గొకటి చేతిలో వుంది. స్కాయిల్స్‌ను కలుసుకోడాని గబగబా వస్తూ, మెడకి గుండీలు పెట్టుకో బోయాడేగాని, ఆ హడావిడిలో పెట్టుకో లేకపోతు న్నాడు.

"ప్రకటన గురించేనా? మీరూ రావాలనుకుంటున్నారా?" అని బొంగురు బోయిన గొంతుతో అడిగాడా మనిషి. అలా అడుగుతూ ఎలెక్ట్రిక్ దీపం కింద వున్న కుర్చీలో కూచోమని స్కాయిల్స్‌ను ఆహ్వానించి, స్కాయిల్స్‌కు ఎదురుగా తాను కూచుని, చేతిలో వున్న డ్రాయింగును బల్లమీద పరచి, పొగాకుగొట్టం నింపుకొన్నాడు. అతడే ఇంజనీరు మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్ లోశ్.

అతడు ముఖం దించి అగ్గిపుల్ల వెలిగించుకున్నాడు. నోటికి ఇరు పక్కలా వున్న ముడుతలూ, వెడల్పుగా మలచిన ముక్కు చెరమలూ, సన్నని పొడుగాటి కారునలుపు కనుబొమలూ — ఆ దృఢమైన ముఖానికి వెలుగుతూన్న అగ్గిపుల్ల వెల్తురు మరింత వెలుగు ఇచ్చింది. ఆ ముఖం స్కాయిల్స్‌కు నచ్చింది. అంగారక గ్రహానికి పయనించే ఉద్దేశం తనకు లేదనీ, కాని క్రాస్నియె జోరి వీధిలో వున్న ప్రకటన తాను చదివాననీ, లోశ్ తల పెట్టిన ఇంతటి అనన్యసామాన్యమూ చోద్యమూ అయిన అంతర్ గ్రహ వ్యోమయానోద్యమం గురించి తన పత్రికాపాఠకులకు తెలియపర్చడం తన విధాయకమని తనకు తోచిందనీ స్కాయిల్స్ చెప్పాడు.

అతడికేసి నిదానంగా చూస్తూ అతడు చెప్పినదంతా సాంతమూ విన్నాడు లోశ్.

"మీరు రాననడం నాకెంతో విచారంగా వుంది సుమండీ — నిజం గానే!" అంటూ లోశ్ తల పంకించాడు. "ఆ వ్రాసు నేను ఎత్తేసరికే వెర్రె

త్తినట్టు పారిపోతున్నారండీ మనుషులు నాదగ్గరనుంచి. నాలుగు రోజుల్లో బయల్దేరుదామనుకుంటున్నాను, గాని ఇంతవరకు ఎవ్వడూ తోడు దొరక డంలేదు.'' అతడు మరో అగ్గిపుల్ల వెలిగించి, దమ్ము తీసి, గుప్పుగుప్పుమని పొగమేఘం వదిలాడు.

''ఏం తెలుసుకుందుకు వచ్చారుకదా మీరు?'' అన్నాడు.

''మరేంలేదులెండి, మీ జీవితచరిత్ర తెలుసుకుందామని.''

''నా జీవితచరిత్ర గురించి ఎందుకులెండి,'' అన్నాడు లోశ్. ''దానిలో పెద్దగా అద్భుతమైంది ఏమీ లేదు. చచ్చీచెడీ ఎలాగో డబ్బులు జాగ్రత్తచేసి కిందా మీదా పడి స్కూలుకెళ్లాను, నా పన్నెండో యేటనుండీ నా పొట్ట నేనే పడ్డాననుకోండి. చిన్నతనమూ, చదువూ, నౌకరీ — ఇదంతా నలుగురి లాగానే వెళ్లిపోయింది, దాన్లో బ్రహ్మాండమైందిగానీ మీ పాఠకులకి ఔత్సుక మైందిగానీ, ఏమీ వుండదు... అయితే ఒక్కటి —'' అంటూ లోశ్ కను బొమలు ముడిపెట్టి మూతి బిగించి, మళ్లీ అన్నాడు... ''ఏమిటంటే... ఈ యంత్రం వుందే,'' అంటూ తన పొగగొట్టంతో పరంజా చూపెడుతూ, ''దీనిమీద చాలా కాలంగా కృషిచేస్తున్నాను. రెండేళ్లనుండీ దీన్ని తయారు చేస్తున్నాననుకోండి. ఇదీ సంగతి!''

''అంగారక గ్రహం చేరుకుందుకు మీకు ఎన్ని నెలలు పడుతుంది అనుకుంటారు?'' అని అడిగాడు స్కాయిల్స్, తన పెన్సిలు మొనను ధ్యాన్నిస్తూ.

''తొమ్మిది, పది గంటలు పడుతుంది, అంతకు మించి అవసరం వుండదనుకుంటా.''

''ఆఁ!'' అంటూ స్కాయిల్స్ ముఖం జేవురించుకున్నాడు, పెద వులు అదిరాయి.

''మీరు నన్ను మరికొద్దిగా నమ్మి, మన భేటీని మరికాస్త గంభీరంగా తీసుకోవాల్సిందని నా మనవి,'' అంటూ అతి మర్యాద నటిస్తూ అన్నాడు స్కాయిల్స్.

లోశ్ తన మోచేతులతో బల్లపై ఆనుకుని, పొగమేఘంలో మునిగిపోయాడు. ఆ మబ్బులతెర సందుల నుంచి అతని కళ్లు తళతళ ప్రకాశించాయి.

''ఆగస్టు 18 న అంగారకుడు భూమికి దగ్గరకంటా వచ్చి, భూమికి 40 మిలియన్ల కిలోమీటర్ల దూరంలో వుంటాడు. ఇంత దూరం ఎగిరి వెళ్ళాలి నేను. మొదటి విషయం, భూవాతావరణపు పొర దాటి వెళ్ళాలి. ఈ పొర 75 కిలోమీటర్లుంటుంది. రెండోది, రెండు గ్రహాల మధ్యనూ వుండే దూరం: ఇది 40 మిలియన్ల కిలోమీటర్లుంటుంది. మూడోది, అంగారక గ్రహం చుట్టూ వుండే వాతావరణపు పొర: ఇది 65 కిలోమీటర్లుంటుంది. ఈ 140 కిలోమీటర్ల వాతావరణమే అసలు చిక్కంతా.''

అతడు లేచి, పంట్లాం జేబుల్లో చేతులు పెట్టుకుని నిల్చున్నాడు. ముఖంపైన కీనీడ పడుతూంది. గుండీలు పెట్టుకోకుండా వుండడంచేత పైకి కనబడుతూన్న ఛాతి, దండల వరకూ చొక్కా చేతులు మడుచుకున్న రోమయుతమైన హస్తాలు — ఇవే కనబడ్డాయి స్కాయిల్స్‌కి.

''ఎగరడం అనే మాట మన చెవిని పడగానే, పక్షి ఎగరడంగానీ, ఆకు రాలిపోవడంగానీ, విమానం ఎగరడంగానీ చప్పున మనకు తట్టుతుంది. నిజానికి ఇవి ఎగరనే ఎగరవు. ఇవి గాలిలో తేల్తూంటాయి. ఎగరడం అనేది, గురుత్వాకర్షణ శక్తిచే చోదితమైన వస్తువు కిందకి దిగిపోవడమే ఎగరడమన్నమాట. ఉదాహరణకి: రాకెట్టుంది, గాలి అంటూ లేనట్టీ, నిరోధమంటూ లేనట్టీ, దాని గమనానికి అవరోధం కలిగించేదేదీ లేనట్టి శూన్యాంతరిక్షంలోని

రాకెట్టు, నిరంతరమూ అధికమౌతూన్న వేగంతో పయనిస్తుంది. మరే ఇతర ఆయస్కాంతిక ప్రభావాలూ అడ్డం రాకుండా వుండే పక్షంలో నేను తేజో వేగాన్ని అందుకోగల్గుతాను. నా మెషీనుని నేను రాకెట్టు మూలసూత్రం మీద నిర్మించాను. 140 కిలోమీటర్ల భూ, అంగారక వాతావరణాలను దూసుకుపోవాల్సి వుంటుంది నేను. మొదట బయల్దేరడం, తరువాత దిగడం — అంతా కలుపుకొని ఇది గంటన్నర పడుతుంది. భూగురుత్వాకర్షణ క్షేత్రంలోనుండి బయటపడేందుకు మరో గంట కలుపుకోండి. ఇక ఒకసారి అంతరిక్షం చేరుకున్నానంటే, నా చిత్తం వచ్చినంత వేగంతో నేను పయనించగల్గుతాను. అయితే రెండు ప్రమాదాలు జరక్కుండా వుండాలి. ఒకటేమిటంటే: అధిక త్వరణం ఫలితంగా నా రక్తనాళాలు పేలిపోకుండా వుండాలి; ఇక రెండోది: అధిక వేగంతో నా మెషీను అంగారక వాతావరణాన్ని తాకి బద్దలైపోకుండా వుండాలి. అంగారక వాతావరణాన్ని తాకడమంటే ఇసుకను తాకినట్టే. మరీ జోరుతో తాకిందంటే ఆ దెబ్బకి మెషీనూ దానిలో వున్నది యావత్తూ వాయువైపోతుంది. గ్రహకణాలు — ఇంకా పుట్టి మెట్టని ప్రపంచాలు, ఇదివరకే పుట్టి గిట్టిన ప్రపంచాలు — అంతర్ నక్షత్ర ప్రదేశంలో స్వైరవిహారం చేస్తూంటాయి. ఇవి వాతావరణంలోకి ప్రవేశించాయంటే వెంటనే గుప్పున మండిపోతాయి. వాతావరణం ఒక దుర్భేద్యమైన కవచమే అనుకోండి. అయితే మన భూవాతావరణం ఇదివరకొకసారి ఛేదించబడినట్టు కనబడుతూన్నప్పటికీ —''

జేబులోంచి చేయి తీసి, దీపంకింద వున్న బల్లమీద వుంచి, పిడికిలి బిగించాడు లోశ్.

''సైబీరియాలో శాశ్వత హిమరాశిలో, నేలనెరియల నడుమ ఇరుక్కొని చచ్చిపోయిన మామ్మత్తులను తవ్వి వెలికి తీశాను. వాటి నోటిలో

పండ్లమధ్య గడ్డి వుంది — ఈనాడు మంచు విస్తరించి వున్న ప్రదేశాల్లో ఆనాడు అవి పచ్చగడ్డి మేశాయన్నమాట. వాటి మాంసం తిన్నాను. మంచులో పాతుకుపోయి గడ్డకటుకొనిపోయి వుండడంచేత వాటి శరీరాలు ఏమంతగా చెడిపోలేదు. చూడగా, భూమి అక్షం హఠాత్తుగా ఒక పక్కకు ఒరిగినట్లు కనబడుతుంది. ఏదో ఒక నభోమూర్తితో భూమి ఢీకొనే వుండాలి, లేదా చంద్రునికంటె చిన్నదైన మరొక రెండో ఉపగ్రహం మనచుట్టూ తిరుగుతూనైనా వుండి వుండాలి. ఈ ఉపగ్రహాన్ని భూమి ఆకర్షించగా, అది భూమిని ఢీకొని, తత్ఫలితంగా భూమి అక్షం ఒక పక్కకు జరిగిపోయుండాలి. ఆఫ్రికాకి పడమరగా వున్న అట్లాంటిక్ మహాసముద్రంలో ఒకప్పుడుండిన ఖండం నాశనం అవడానికి బహుశా ఇదే కారణం అయివుంటుందేమో కూడా. నా రాకెట్టుతో నేను అంగారక వాతావరణంలోకి ప్రవేశించేటప్పుడు దగ్ధమైపోకుండా వుండాలంటే నేను నా వేగాన్ని తగ్గించుకోవాల్సి వుంటుందన్నమాట. ఆ కారణం చేతనే ఊర్ధ్వాంతరిక్షంలో పయనించే కాలం ఆరు గంటలు, ఇంకా ఏడు గంటలపాటు కూడా వుంటుందనే నేను లెక్కవేస్తున్నాను. మరికొద్ది సంవత్సరాల్లో అంగారకలోకానికి ప్రయాణమంటే, మాట వరసకు మాస్కోనుంచి న్యూయార్క్‌కి విమానంమీద ప్రయాణం చేసినట్టే వుంటుందనుకోండి.''

లోశ్ బల్లదగ్గరనుండి కాస్త దూరంగా వెళ్లి అక్కడున్న 'నైఫ్ స్విచ్' వేశాడు. సరంబీకింద వున్న ఆర్క్ దీపాలు బుస్సుమంటూ వెలిగాయి. చెక్కగోడల నిండా వున్న రేఖాచిత్రాలూ, డ్రాయింగులూ, భూగోళ ఖగోళ పటాలూ; చాక్షుష పరికరాలతోనూ, కాలమానపు ఉపకరణాలతోనూ నిండిపోయున్న అలమారాలూ; అంతరిక్షపు దుస్తులూ; కుప్పతెప్పలుగా

పడి వున్న తినుబండారాల డబ్బాలూ; ఫర్ ఉడుపులూ; ఆ షెడ్డులో ఒక మూల తీనెమీద వున్న దూరదర్శనీ — ఇవన్నీ కనబడ్డాయి స్క్రాయిల్స్‌కి.

కోడిగుడ్డు ఆకారంలో నిర్మించిన లోహపు గోళం చుట్టూ కట్టిన పరంజా దగ్గరకు వెళ్లారు లోశ్, స్క్రాయిల్స్‌లు ఇద్దరూ. ఆ గోళం రమారమి $8^1/_2$ మీటర్ల ఎత్తుంటుందనీ, 6 మీటర్ల వ్యాసరేఖ వుంటుందనీ స్క్రాయిల్స్ అంచనా కట్టాడు. దాని అడుగు భాగంపైన గొడుగు మాదిరిగా కిందికి పొడుచుకొస్తూన్న బల్లపరపు ఉక్కు పటకా ఒకటి దాని నడుముచుట్టూ వుంది. వాతావరణంగుండా ఆ గోళం కిందకు దిగుతూన్నప్పుడు, దాని నిరోధాన్ని అధికం చేసేందుకు పారషూట్ బ్రేక్ మాదిరి సాధనం ఇది. పారషూట్ కింద మూడు గుండ్రని కన్నాలున్నాయి — గాలి ప్రవహించేందుకు కిటికీలివి. అండాకృతిలో వున్న ఈ మెషీను అడుగుభాగం సన్నని కంఠం రూపం ధరించి, ఈ కంఠం చుట్టూరా, దాని కిందా బ్రహ్మాండమైన రెండు వరుసల సర్పిలి ఆకారంలో వున్న బంపర్ లాంటిది ఒకటుంది — ఇది మెషీను కిందకిదిగి నేలపై వాలినప్పుడు అదురుపాటును ఓర్చుకునే స్ప్రింగు.

రివెట్లు కొట్టిన గుల్లపై లోశ్ తన పెన్సిలుతో టక్కుటక్కుమని తట్టుతూ, తాను నిర్మించిన అంతర్ గ్రహ నౌక వివరాలను వర్ణించడం మొదలెట్టాడు. ఆ గోళం నిర్మించడానికి, సులువుగా వంచేందుకు వీలైన రిఫ్రాక్టరీ ఉక్కు రేకులు వినియోగించి, వీటికి బలం చేకూర్చేందుకు వీటి లోపలినుండి తేలికైన చట్రం ఒకటి తయారుచేసి, గొడుగుపుల్లలు మోస్తరుగా పెర్కువులు లోపలినుండి అమర్చి, వీటికి ఈ రేకులు బిగించివున్నాయి. ఇదేమో వెలుపలి కేసింగు నిర్మాణం. ఇక లోపల — రబ్బరూ, ఫెల్టూ, తోలూ, రబ్బరూ ఫెల్టూ, తోలూ ఈ విధంగా ఆరు పొరలతో

తయారుచేసిన మరొక కేసింగు వుంది. దీని లోపల అవేక్షణ పరికరాలూ, చలన ఉపకరణాలూ, ఆక్సిజని సిలిండర్లూ, బొగ్గుపులుసు వాయువును విచూషించే పేటికలూ మొదలైన రకరకాల సాధనాలూ, భోజన పదార్థాలూ పరికరాలూ వుంచేందుకు ఖాళీ బాలీసులలో అమర్చిన పెట్టెలూ — ఇంకా ఇలాటివే ఎన్నో వున్నాయి. అవేక్షణలు జరిపేందుకని వెలుపలి కేసింగులోనుండి బయటికి చొచ్చుకొని వస్తూ పొట్టిగా వున్న లోహపుగొట్టాలతోనూ త్రిపార్శ్వకాలతోనూ నిర్మితమైన ప్రత్యేకపు "పర్యవేక్షక రంధ్రాలు" వున్నాయి.

మెషీనులో వున్న చలనయంత్రాంగమంతా సర్పిలితో చుట్టిన కంఠభాగంలో వుంది. అస్ట్రానామికల్ కంచుకం కంటెనూ కఠినమైన ఉక్కుతో చేసిన కవచంతో కప్పి వుందీ కంఠభాగం. దీనిలో నిటారుగా వున్న నాళాలు డ్రిల్లు చేసి వున్నాయి. ఒక్కొక్క నాళము కొనా వెడల్పుగా వుండి, ఈ కొన ఒక విధమైన డిటొనేషన్ చేంబర్‌లాగా తయారైంది. ఈ పేటికలకు స్పార్కింగ్ ప్లగ్గులూ, ఫీడర్ గొట్టాలూ వున్నాయి. మామూలు మోటారు ఇంజను సిలిండర్లలోకి పెట్రోలు ఏలాగైతే సరఫరా అవుతుందో అలాగే, అసాధారణమైన ప్రేలుడు శక్తి గల్గినట్టి అల్ట్రాలిడ్డైట్ అనే చూర్ణం ఒకటి ఈ ఇంజనులో వున్న డిటొనేషన్ చేంబర్లలోకి సరఫరా అవుతుంది. ఇంతవరకూ ఆవిష్కృతమైన ప్రేలుడు పదార్థాలన్నిటి కంటెనూ శక్తివంతమైన ఈ అల్ట్రాలిడ్డైట్ చూర్ణాన్ని ఒక పెట్రోగ్రాడ్ ఫ్యాక్టరీలో వున్న లేబరేటరీలో కనిపెట్టారు. ఈ ప్రేలుడు పదార్థం ఉత్పత్తి చేసే 'జెట్'ధార శంఖాకృతిలో వుండి, బహు సంకుచితమైన మూలం కలిగి వుంటుంది. గోళపు కంఠంలో అమర్చిన లంబనాళాల అక్షాలతో ఈ 'జెట్'ధార అక్షం నప్పేందుకని, డిటొనేషన్ చేంబర్లలోకి సరఫరా అయే అల్ట్రాలి

డ్డైట్ మొట్టమొదట ఒక అయస్కాంత క్షేత్రం గుండా ప్రసరించి ఆ తరువాత డిటొనేషన్ చేంబర్‌లోకి వెళ్ళుతుంది.

ఇదీ చలనయంత్రం పనిచేసే సాధారణ సూత్రం: అంతే మరేంలేదు — అదొక రాకెట్టు అన్నమాట. దానిలో నిలవచేసిన అల్ట్రాలిడ్డైట్ నూరు గంటల ప్రయాణానికి సరిపోతుంది. ఒక సెకనులో ఉత్పత్తయే ప్రేలుడులను హెచ్చించడమూ తగ్గించడమూ వల్ల మెషీను వేగాన్ని నియంత్రించేందుకు వీలవుతుంది. గోళం పైభాగం కంటె కింది భాగం బరువు హెచ్చు: ఈ కారణాన అది గురుత్వాకర్షణ క్షేత్రంలో వున్నప్పుడూ, దాని కంఠాన్ని ఎల్లప్పుడూ అంగారకుని దిశగానే తిప్పుకొని వుంటుంది.

"మీ పథకానికి ఎవరు పెట్టుబడి పెట్టారు?" అని అడిగాడు స్క్రాయిల్స్.

లోశ్ ఆశ్చర్యచకితుడై స్క్రాయిల్స్ వైపు చూశాడు.

"ఎవరా? రిపబ్లిక్కే..."

లోశ్ స్క్రాయిల్స్‌లు ఇద్దరూ మళ్ళీ బల్లదగ్గరకు వెళ్ళిపోయారు. స్క్రాయిల్స్ ఒక్క క్షణమాత్రం వూరుకొని, ఆ తరువాత కాస్త తటపటాయిస్తూ ప్రశ్నించాడు:

"అంగారక గ్రహంలో జీవకోటి వుంటుందనే మీ అభిప్రాయమా?"

"మీ ప్రశ్నకు శుక్రవారం ఆగస్టు 19 న సమాధానం చెబుతాను."

"మీ ప్రయాణపు వివరాలు నాకు ఇస్తే, పంక్తికి పది డాలర్ల చొప్పున మీకు నేను డబ్బు ముట్టజెపుతాను. వ్యాసానికి రెండువందల పంక్తుల చొప్పున ఆరు వ్యాసాలకు మొత్తం డబ్బంతా అడ్వాన్సుగానే మీకు వెంటనే ఇచ్చేస్తా. చెక్కును మీరు స్టాక్‌హోమ్‌లో క్యాషు చేసుకోవచ్చు మరేమంటారో చెప్పండి?"

లోశ్ ఫక్కున నవ్వి, "సరే" అంటూ తలకాయ పంకించాడు. స్కయిల్స్ చెక్కు రాయడానికని బల్లమీద ఒకమూల కూచున్నాడు.

"మీరు నాతో కూడా రానంటున్నారు, నాకెంతో విచారంగా వుంది. ఆ మాటకొస్తే, ఇక్కడనుండి స్టాక్‌హోమ్‌కి నడిచి వెళ్ళినంత సేపు కంటె తక్కువే," అన్నాడు లోశ్ పొగగొట్టం పీల్చుతూ.

# సహప్రయాణికుడు

గేటు స్తంభాన్ని ఆనుకొని నిలబడ్డాడు లోశ్. అతని పొగగొట్టం ఆరిపోయింది.

గేటు ఆవలున్న జాగా జ్దానొవ్‌క ఎంబాంక్‌మెంటు వరకూ ఖాళీగానే పడుంది. నదికి అవతలి వొడ్డునున్న పెత్రోవ్‌స్కి ద్వీపంలో వున్న చెట్ల ఆకృతులు మసక మసకగా కానవస్తున్నాయి. వాటి నడుమనుండి మంటలు గ్రక్కుతూ క్రుంగిపోతూన్న సూర్యుడు విచారభారమైన తన అస్తమయంలో వాటిని కూడా అగ్నిజ్వాలల్లో ముంచేస్తున్నాడు. మిణుగురు మంటూ ప్రకాశిస్తూన్న కొద్దిపాటి తారలతో పొదిగిన హరితవర్ణపు జలాంబుధిని పోలిన ఆకాశంలో అరుణకాంతితో వెలుగుతూన్న మబ్బుముద్దలు చెదురు మదురుగా విరజల్లిన ద్వీపాలలా అవుపడుతున్నాయి. ఈ వృద్ధ మాత భూదేవి ప్రశాంతంగా వుంది.

గంగసిందూరం కలుపుతూండిన కార్మికుడు కుజ్మీన్, గేటు దగ్గరకు పచారు చేసుకుంటూ వెళ్ళి, ఎర్రగా వెలుగుతూన్న తన సిగరెట్టు పీకను బైట అంధకారంలోకి విసిరేశాడు.

''భూమిని వదిలిపెట్టేసి వెళ్ళిపోవడమంటే ఎవరికేనా కష్టమే,'' అన్నాడు మెల్లగా. ''ఇల్లూ వాకిలీ వదిలిపెట్టేయడమంటేనే అసలు మనస్సు పీకుతుంది. రైలుస్టేషనుకి వెళ్తూ దోవలో పదేపదే వెనక్కి పదిమాట్లు తిరిగి ఇంటికేసి చూస్తూంటాం. నా ఇల్లు పూరికొంపే కావచ్చు, అయి తేనేం? అది నా ఇల్లు, నేను పుట్టి పెరిగిన ఇల్లు. అటువంటిది — ఏకంగా ఈ భూమినే వదిలివేయడమంటే — అయ్ బాబోయ్...''

''కెటిల్లో నీళ్ళు మరుగుతున్నాయి, వచ్చి టీ తాగవయ్యా!'' అన్నాడు రెండో కార్మికుడు హొహ్లోవ్.

కుజ్మీన్ నిట్టూర్చుతూ: ''అవును, మరి,'' అన్నాడు కొలిమికేసి వెళ్తూ. కొరకొరలాడుతూన్న హొహ్లోవ్ కుజ్మీన్ — ఇద్దరూ చెరొక ప్యాకేజీపెట్టెమీదా కూచున్నారు. తమతో కూడా ఇంటినుండి తెచ్చుకున్న బ్రెడ్డును జాగ్రత్తగా చిదుపుకొని, ఎండుచేపల్లోని ఎముకలు ఏరిపారేసి, బ్రెడ్డుతో చేపమాంసం నంచుకుని, సావకాశంగా నమిలి తింటున్నారు. తన గడ్డం ముందుకు తోసుకుంటూ కుజ్మీన్ సన్నని గొంతుతో అన్నాడు:

''ఈయన్ని చూస్తే నాకు జాలే వేస్తూంది. ఇలాంటి వాళ్ళు ఈ లోకంలో ఎంతోమంది వుండరు —''

''ఇతగాడు బతికుండగానే ఎందుకయ్యా నీ శోకన్నాలు?''

''వైమానికుడు ఒకడు నాతో చెప్పాడు — తాను ఇంచుమించు 4 కిలోమీటర్లు ఎత్తు ఎగిరాడట — వేసవిలో సుమా — అప్పటికే ఇంజనులో నూనె గడ్డకట్టుకుందిట. అటువంటిది — అంతకంటే ఎత్తున ఎగరడమా? అక్కడ వల్లమాలిన గొడ్డుచలి! కారుచీకటి!''

''అతడు పచ్చగా వుండగానే ఎందుకీ ఏడుపులూ రాగాలూ అంటున్నా,'' అన్నాడు మళ్ళీ మరొకసారి హొహ్లోవ్ ముఖం చిట్లిస్తూ.

''వూరంతా గాలించినా ఒక్కడు రావడంలేదు అతడితో కలిసి ఎగిరేందుకు, పాపం. ఒక్కడు కూడా ఈయన్ని నమ్మడంలేదు. అక్కడ ఆ గోడమీద వారం రోజులై పడి ఏడుస్తూంది ఆ ప్రకటన.''

''నేను నమ్ముతున్నానయ్యా.''

''ఏమిటి? అక్కడకి ఎగిరి వెళ్లగలడనే?''

''అక్కడికి ఎగిరి వెళ్తాడు. ఇహ అప్పుడు యూరప్‌లో వాళ్లందరూ 'ఆహాహా' అనీ, 'ఓహోహో' అనీ నోరెళ్లబెట్టుకుని వెర్రిమొగమేస్తారు.''

''ఎవరేస్తారు వెర్రిమొగం?''

''ఎవరేస్తారా వెర్రిమొగం? వాళ్లే! ఇతగాడక్కడకి వెళ్లొచ్చాక — ఈర్ష్యతో వాళ్లు నవ్వలేరు, ఏడవలేరు. ఎవరిదైనట్టు అంగారక గ్రహం? — సోవియట్‌ది!''

''ఇహ, భేష్!''

వారి దగ్గరకు వస్తూన్న లోశ్‌ను చూసి, కుజ్మీన్ తాను కూచున్న ప్యాకేజీపెట్టె మీద జాగా ఇచ్చాడు. లోశ్ కూచుని, తన టినురేకు డబ్బాతో ఆవిరి పొగలు వస్తూన్న టీ తాగడం ఆరంభించాడు.

''నాతో కూడా ఎగరకూడదయ్యా, హొహ్లోవ్?''

''వద్దండి, మిస్తిస్లావ్ సెర్గేయెవిచ్,'' అన్నాడు హొహ్లోవ్, ''నేను రానండి, నాకు భయం.''

లోశ్ చిరునవ్వు నవ్వి, ఒక గుటక టీ తాగి, కుజ్మీన్ కేసి తిరిగి:

''ఏం నేస్తం, మీరో?''

''మిస్తిస్లావ్ సెర్గేయెవిచ్, నేను తప్పకుండా వచ్చేవాడినే — కాని మా ఆవిడె కాయిలా మనిషి — మరి, పిల్లలేమో పసికందులు — వాళ్లని ఎక్కడ పెట్టడమో మీరే చెప్పండి!''

''అవును, అవును. చూడగా — నేను ఒంటరిగానే ప్రయాణం చేయాల్సొచ్చేట్టుంది,'' అన్నాడు లోశ్, తన రేకుడబ్బాను ఖాళీచేసి కింద పెట్టి, చేతి మడమతో మూతి తుడుచుకుని. ''ఈ భూప్రపంచం మీద వాలంటీర్లకే కొరత వచ్చినట్టుంది,'' అంటూ మళ్ళీ చిరునవ్వు నవ్వి, తల వూపాడు. ''ప్రకటన చూసి నిన్న ఒక అమ్మాయి వచ్చింది నన్ను చూడ్డానికి. 'నేను వస్తానండి మీతో,' అందామె, 'నాకు పంధొమ్మిదేళ్ళు; బాగా పాడగలను, చక్కగా డాన్సు చేస్తాను, గిటార్ వాయిస్తాను; ఇక ఈ భూమి మీద బతకడమంటే నాకు అసహ్యం వేసుకొస్తోంది — ఈ విప్లవమూ వాలకమూ అంటే నాకు తలనొప్పి, భూమిని వదలిపెట్టేసి బయల్దేరాలంటే పాస్‌పోర్టు వీసా కావాల్సొస్తుందా ఏమిటి?' అని అడిగింది. నేను చెప్పినదంతా విని, చివరకి ఆ గొప్పయింటి అమ్మాయి: 'మీరు వుత్త దగాఖోరులు. మీ ప్రకటన చూసి అట్టే దూరాభార ప్రయాణం కాదనుకున్నాను,' అంటూ భోరున ఏడ్చేసింది. ఆ తరువాత యువకుడు ఒకడొచ్చాడు. మంద్రస్థాయి కంఠస్వరం. చెమ్మగిలిన చేతులు. 'ఏమిటండీ, నన్ను పిచ్చివాడికింద కట్టారటండీ? అంగారక గ్రహానికి ఎగిరివెళ్ళడమా? ఏడ్సినట్టే వుంది. ఎవణ్ణి అడిగి ఇలాంటి ప్రకటన కట్టారయ్యా మీరు?' అంటూ రంకెలేశాడు. అతగాడిని సంబాళించే సరికి తాతలు దిగొచ్చారు.''

మోకాళ్ళమీద మోచేతులు ఆనుకుని, మండుతూన్న బొగ్గులకేసి తేరిచూశాడు లోశ్. ఆ క్షణంలో అతని ముఖం అలసటపడిపోయి, నుదురు ముడుతలు పడినట్టవుపించింది. ఎంతో కాలంగా మనస్సుకి తలిగిన దెబ్బ నుండి అతడిప్పుడు తేరుకుంటూన్నట్టుగా కనబడింది. కుజ్మీన్ లేచి పొగాకు తెచ్చుకుందుకు వెళ్ళాడు. హొహ్లోవ్ చిన్న దగ్గు దగ్గి:

''మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్, మీకేమీ భయంవెయ్యడం లేదూ?'' అన్నాడు.

రాక్షసిబొగ్గు మంటకి ఎర్రబడిన కళ్లతో హొహ్నోవ్‌కేసి చూస్తూ అన్నాడు లోశ్:

"లేదు, నాకేమీ భయం వేయడంలేదు. నేను అనుకుంటూన్న ప్రకారం తప్పకుండా నెరవేర్చగల్గుతాననే త్రికరణశుద్ధిగా నమ్ముతున్నాను. అలా నెరవేరదే అనుకోండి — ఒక్క లిప్తపాటులో అంతా అయిపోతుంది. అనాయాస మరణం. మరొకందుకు మాత్రం నాకు భయం వేస్తూంది. నేను కట్టిన లెక్కల్లో పొరపాట్లుండి, తత్ఫలితంగా అంగారకగ్రహం గురుత్వాకర్షణ క్షేత్రాన్ని తప్పిపోతాననే అనుకోండి. నాతో కూడా తీసుకు వెళ్తూన్న ఇంధనమూ, ఆక్సిజన్నూ ఆహారమూ చాలా కాలం వరకూ ఆటే వస్తాయి. ఇక నేను ఆ చీకటి అంధకారంలో అలా ఎగురుతూంటాను. నా ముందు నక్షత్రం ఒకటి అఖండజ్యోతిలా వెలుగుతూంటుంది. చలితో గడ్డ కట్టుకుపోయిన నా కంకాళం మరో వెయ్యేళ్ల వరకూ అలా పరిభ్రమణం చేసి చేసి, ఏ జ్వాలాంబుధిలోనికో ఎగిరిపోతుంది. వెయ్యేళ్ల వరకూ ఆ శూన్యప్రదేశంలో నా కంకాళం ఎగురుతూంటుంది — ఆ సంగతి ఒక్కసారి తల్చుకుంటేనే చాలు! ఆ సుదీర్ఘ విషాదపూరిత దినాల్లో — నేనింకా సజీవంగానే వుంటాను — ఎన్నో రోజులు నేనా పేటికలో ఒక్కడినే కేవలం ఒంటరిగా విశ్వాంతరాళంలో బతకాల్సి వుంటుందో! చావు అంటే నేను హడలిపోవడంలేదు. ఏకాంతంగా శాశ్వతపు శూన్యాంధకారంలో నిరాశాపూరితమైన ఏకాంతజీవిగా, ఏకాకిగా వుండడమంటే హడలిపోతున్నాను. అదీ నా భయం. ఒక్కడనే పయనించడమంటే ఎంతో మధనపడిపోతున్నాను."

కళ్లు సన్నగా చేసుకుని, మూతి మొండిగా మొరాయించుకుని, మండుతూన్న నిప్పులకేసి అలా చూస్తూ కూచున్నాడు లోశ్.

గుమ్మంలో కుజ్మిన్ అవుపడి, మెల్లగా అన్నాడు:

''మిమ్మల్ని ఎవరో చుడ్డానికి వచ్చారు.''

''ఎవరేమిటి?'' అని అడిగి, కూచున్నవాడల్లా లోశ్ లేచి నిల బడ్డాడు.

''ఎవరో ఎర్రసైనికుడు మిమ్మల్ని చూడ్డానికి వచ్చానన్నాడు.''

పటకా లేకుండా జుబ్బా వేలేసుకున్న ఒక మనిషిని — క్రాస్నీయె జోరీ వీధిలో వున్న ప్రకటన చదివిన మనిషినే — వెంటబెట్టుకుని లోపలి కొచ్చాడు కుజ్మీన్. ఆ మనిషి లోశ్‌కేసి చూసి, తల పంకించి, పరంజా వైపు కలియజూసి, బల్లదగ్గరకు వచ్చాడు.

''సహప్రయాణికుడొకడు మీకు కావాలంటున్నారుగా?'' అన్నాడా మనిషి.

ఆ ఆగంతకుడిని కూచోమని లోశ్ కుర్చీ ఒకటి చూపించి, తను కూడా అతనికి ఎదురుగా కూచున్నాడు.

''అవును, సహప్రయాణికుడి కోసమే చూస్తున్నా. అంగారక గ్రహానికి ప్రయాణం పెట్టుకున్నాను మరి.''

''తెలుసు — ప్రకటనలో వుందిగా. ఎక్కడున్నాడయ్యా అంగార కుడు అని అడిగితే ఓ మనిషి చూపించాడు ఓ నక్షత్రాన్ని. దూరాభారమే, మరి. షరతులేమిటో చెప్పారుకారు. జీతమిచ్చి, భత్యం ఇస్తారా?''

''కుటుంబీకులా మీరు?''

''పెళ్లాం వుంది, పిల్లల్లేరు.''

ఆగంతకుడు బల్లమీద వేళ్లతో మెల్లగా దరువు వాయిస్తూ, జిజ్ఞాసతో షెడ్డు నలుమూలలా పరకాయించి చూశాడు. ప్రయాణపు పరిస్థితుల గురించీ, అందులో సంభవించబోయే ప్రమాదాల గురించీ క్లుప్తంగా తెలియజేశాడు లోశ్. తన సహప్రయాణికుని భార్యకి ఏ లోటూ

లేకుండా తాను ఏర్పాటు చేస్తాననీ, జీతం అంతా రొక్కంగానూ వెచ్చాలుగానూ అడ్వాన్సుగానే ఇస్తాననీ లోశ్ చెప్పాడు. ఎర్రసైనికుడు పరధ్యాన్నంగా తల వూపాడు.

"మీ ఉద్దేశంలో అంగారక గ్రహంలో ఎవరున్నారంటారు — మనుషులా, రాక్షసులా?"

లోశ్ బుర్ర గోక్కుని నవ్వాడు.

"నేనను కుంటున్నాను మరి — ఎవరో మనలాంటి మనుషులే వుంటారని. సరే — వెళ్లి చూదాంగా! అసలు సంగతి ఏమిటంటే: కొన్ని సంవత్సరాలుగా యూరప్ అమెరికాలలో వున్న పెద్ద రేడియోస్టేషన్లకి తమాషా తమాషా రేడియో సిగ్నల్స్ అందుతూ వచ్చాయి — ఎంత తంటాలు పడ్డా వాటి అర్థమేమిటో తెలియడంలేదు. భూగోళపు అయస్కాంత క్షేత్రంలో సంభవించే తుపానులే వీటికి కారణమై వుంటుందని మొదట అనుకున్నారు. కాని చిత్రవిచిత్రంగా వున్న ఆ సిగ్నల్సు వింటే, అవి తప్పకుండా ఏవో అక్షర సంకేతాలే అయివుండాలని నమ్మకం తోచింది. ఎవరో కొందరు అదే పనిగా పట్టువిడవకుండా మనతో మాట్లాడాలని ప్రయత్నిస్తున్నారా ఏమిటి చెప్మా అనిపించింది. అయితే — అవి ఎక్కడనుంచి వస్తున్నట్టు? మనకు తెలిసినంత వరకూ, అంగారక గ్రహం మినహా మరే గ్రహంలోనూ జీవరాశి మనడానికి అవకాశంలేదు. అందుచేత ఆ సంకేతాలు అంగారకుడి నుండే వస్తూండాలి. ఇదిగో ఈ మ్యాపు చూడండి — మ్యాపునిండా వల అల్లికలా కాలువలు ఎలా వున్నాయో చూశారా?" (అంటూ గోడకున్న అంగారక గ్రహ పటాన్ని చూపించాడు లోశ్.) "చూడబోతే వాళ్లకి మంచి శక్తివంతమైన రేడియో స్టేషనే వుండి తీరాలి. అంగారక గ్రహం భూమిని పిలుస్తూంది — కాని ఇంతవరకూ మనం వాళ్లకి ప్రత్యుత్తరం ఇవ్వలేకుండా వున్నాం. అయితే

నేం — మనం అక్కడికి వెళ్ళగలం. రేడియో స్టేషను అంటూ అక్కడ ఎప్పుడైతే వుందో — అక్కడున్నవాళ్లు రాక్షసులూ కారూ, మనకు భిన్నమైన వాళ్ళూ కారూ అనే మనం అనుకోవాల్సి వుంటుంది. అంగారక గ్రహమూ, భూమీ — ఒకదాని సరసను ఒకటి భ్రమణం చేస్తూన్న చిన్న గోళాలు. మనకీ వాళ్లకీ ఒకే ప్రకృతినియమాలు వర్తిస్తాయి. విశ్వ జగత్తులో జీవధూళి ఎగురుతూంటుంది. ఆ జీవబీజాలు అంగారక గ్రహంపైనా, భూమిపైనా, గడ్డకట్టుకుపోయి ఘనీభవించిపోయిన ఇతర నక్షత్రకోటిపైనా రాల్తాయి. అన్నిచోట్లా జీవం ప్రాదుర్భవిస్తుంది. అన్నిచోట్లా అది మానవులను పోలిన జీవులచే పాలితమవుతుంది: మనకుమించి పరిణతి చెందిన జంతువు లేనేలేదు.''

''మీతో వస్తానండీ నేను,'' అన్నాడు ఆ ఎర్రసైనికుడు ఏ జంకూ గొంకూ లేకుండా. ''సామాన్లు తెచ్చుకుని ఎప్పుడు రమ్మంటారు?''

''రేపు రండి, నౌకను మీకు చూపిస్తా. మీ పేరు అడగడం మర్చిపోయానే!''

''నా పేరు అలెక్సేయ్ ఇవానొవిచ్ గూసెవ్.''

''వృత్తి?''

లోశ్‌కేసి గూసెవ్ పరధ్యాన్నంగా చూసి, కళ్ళు కిందకి దించి, వేళ్లతో బల్లమీద దరువు కొట్టాడు.

''నాకు చదవనూ రాయనూ వచ్చు,'' అంటూ చెప్పుకొచ్చాడు. ''మోటారుకార్ల గురించి కాస్తో కూస్తో తెలుసు. విమానంలో అబ్జర్వర్‌గా పనిచేశాను. నాకు పద్దెనిమిదేళ్లు రావడంతో యుద్ధంలో చేరాను — నాలుగు ముక్కల్లో చెప్పాలంటే ఇదీ నా కథ. అప్పుడప్పుడు గాయపడ్డాననుకోండి, ఇంకేముంది — ఇప్పుడేమో రిజర్వు సేనలో కూచోమన్నారాయె.

(తటాలున అతడు అరచేతితో నడినెత్తిని గట్టిగా నిమురుకుని చిన్న నవ్వు నవ్వాడు). ఈ ఏడేళ్ళూ నేను చేసినదీ చెందినదీ — ఏం చెప్పను! న్యాయం చెప్పాలంటే, ఈ పాటికి నన్ను రెజిమెంటుకి కమాండర్ చెయ్యాల్సిందన్న మాట — కాని నాకు దుడుకుతనం జాస్తి — నా స్వభావమే అంత! యుద్ధం కాస్త తగ్గిందీ — మరి నాకు కాలు నిలవదన్నమాటే. మందు పెట్టినట్టే వుంటుంది నాకు. నన్ను ఏదేనా పనిమీద పంపించమని బతిమాలుతాను — పంపించరూ, నేనే ఉడాయించేస్తాను. (అంటూ నడినెత్తి మళ్లీ నిమురుతూ పళ్ళికిలించాడు.) నాలుగు రిపబ్లిక్కులు స్థాపించాను — ఆ వూళ్ల పేర్లిప్పుడు నాకు గుర్తు లేదనుకోండి. ఒకసారి మూడొందలమంది కుర్రాళ్లని పోగుచేశాను — ఇండియాని విముక్తి చేదామని. మేం ఇండియాకు వెళ్తూ కొండల్లో దారి కాస్తా తప్పిపోయాం, తుపానులోనూ, నేలజారుడులోనూ చిక్కుబడ్డాం, మా గుర్రాలన్నీ చచ్చి వూరుకున్నాయి. కొద్దిమందిమి మాత్రమే తిరిగి రాగల్గాం... విసుగేసి, జల్సామీద బయల్దేరాలనిపించి, మహ్నోతో రెణ్నెల్లున్నా కాని బందిపోటు వెధవల్తో అసహ్యం వేసిపోయింది నాకు ఇకప్పుడు ఎర్రసైన్యంలో చేరా. పోలిష్‌వాళ్లను కీయెవ్ నగరంనుండి తరుముకుంటూ — చివరకి బుద్యోన్నీ కేవల్రీతో చేరి: 'చలో వార్సా!' అంటూ దౌడాయించాం. పెరెకోవ్ పట్టుకున్నప్పుడు ఆఖరిసారి గాయపడ్డా. దాంతో రమారమి ఏడాదిపాటు ఆసుపత్రి. ఆసుపత్రినుండి బయటికొచ్చా — ఇహ ఎక్కడికెళ్లేది? ఏంచేసేది? ఈ అమ్మాయి తారసపడింది — పెళ్లిచేసుకున్నా. నా పెళ్లాం ఎంతో మంచి పిల్ల సుమండీ. అయితే ఏం — తిని ఇంట్లో కూచోడమంటే — మతిపోతుంది నాకు. మా పల్లెటూరు వెడదామా, అంటే — అమ్మా నాన్నా పోయారు. అన్నదమ్ములా యుద్ధంలో చచ్చిపోయారు — భూమా గొడ్డుబోయింది. పట్నంలోనా

— నా బోటిగాడికి అసలు పని సున్న. యుద్ధమా పూర్తి అయిపోయె — ఇంత వేగం మళ్లీ రగుల్కొనే సూచన కనబడ్డంలేదు. ఆ అంగారక గ్రహంలో మీకు ఎందుకేనా పనికొస్తాను, బాబ్బాబు — మీతో నన్ను కూడా తీసుకుపోదురూ, మీ పుణ్యముండేను, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్!''

''సరే, అంతకంటేనా? సంతోషంగా!'' అన్నాడు లోశ్, కరచాలనం చేసి. ''రేపు మళ్లీ కల్సుకుందాం.''

# నిద్రలేని రాత్రి

భూమినుండి బయల్దేరేందుకు అంతా సిద్ధమైంది. రెండు రోజులై వారిద్దరికీ ఇంచుమించు నిద్దర్లు లేవన్నమాటే — లెక్కలేనన్ని చిల్లర సామాన్లను దగలాపెట్టెల్లో పెట్టి రోదసీనౌకలోకి ఎక్కించి సర్దడంతోనే సరిపోయింది. పరికరాలన్నింటినీ పరీక్షించి చూసుకున్నారు, పరంజా అంతా విప్పదీసేశారు, షెడ్డు పైకప్పులో ఒక భాగం పీకేశారు.

రోదసీనౌక తాలూకు చలనయంత్ర భాగాన్నీ ముఖ్యమైన ఉపకరణాలనీ లోశ్ గూసెవ్‌కి చూపించాడు. తన సహప్రయాణికుడు తెలివైనవాడనీ, దానికితోడు గడుసరి అనీ బోధపడిపోయింది లోశ్‌కి.

మర్నాడు సాయంకాలం ఆరు గంటలకి బయల్దేరడానికి నిశ్చయించుకున్నారు.

సాయంకాలం బాగా పొద్దుపోయాక లోశ్ పనివాళ్లనీ గూసెవ్‌నీ ఇళ్లకి పంపించేసి, బల్లమీద వేలాడుతూన్న ఆ ఒక్క దీపం మినహా కడమ ఎలెక్ట్రిక్ దీపాలన్నిటినీ ఆర్పేసి, ఆ మూల దూరదర్శిని వెనకాల వున్న ఇనుప మంచంమీద కట్టుబట్టలతోనే సాగిలబడ్డాడు.

రాత్రి ప్రశాంతంగా వుంది, ఆకాశం నిండా తారలు వెలుగుతు న్నాయి. లోకేశ్ నిద్రపోలేదు. తలవెనకాల చేతులు పెట్టుకుని చీకటిలో నిదానంగా చూస్తున్నాడు. విశ్రాంతి తీసుకుందామంటే అతనికి రోజుల తరబడి తీరికే దొరికిందికాదు. ఇక భూలోకం మీాద ఈ ఆఖరి రాత్రి తన హృదయవేదనను — కట్టు తెంచుకుని పొరలిపోతూన్న దుఃఖాన్ని, మనఃక్లేశాన్ని — బయటికి కక్కేసేయొచ్చు: నానా చిత్రహింసలనీ భరించు, కళ్లు వాచిపోయినట్టు ఏడువు.

వెనుకటి స్మృతులన్నీ జ్ఞప్తికొచ్చాయి... చిరుచీకటిగా వుంది గది... వెలుగుతూన్న కొవ్వొత్తికి వెనకాల అడ్డంగా నిలబెట్టిన పుస్తకం. మందు వాసన ఘాటుగా వుంది, వూపిరి సలపడంలేదు. నేలమీాద తివాసీ పైన — బేసిను. లేచి బేసిను పక్కనుండి వెళ్లినప్పుడల్లా, గోడకున్న కళకాంతులు లేని వాల్ పేపరు పైన మసక మసక నీడలు ఇటూ అటూ ఊగిసలాడు తున్నాయి. మనస్సులో భరించలేని క్షోభ! ఆ మంచంపైన, ఈ లోకంలో తనకు ప్రియతమమైనది — కాత్య, తన భార్య, పడుకునుంది. మెల్లగా వస్తోంది ఎగవూపిరి. దట్టమైన ఆమె తలకట్టు పాయలు తలగడపైన చిక్కుపడి వున్నాయి. బూర్నీసు కింద మోకాళ్లు ఎత్తిపెట్టుకునున్నాయి. కాత్య అతనిని వదిలేసి వెళ్లిపోతూంది. ముద్దులు మూటకడుతూ ఎంతో ప్రశాంతమైన ఆ ముఖం అప్పుడే మారిపోయింది. ముఖం ఎర్రబడిపోయి కలతచెందిపోతూంది. ఆమె పదే పదే బూర్నీసు కిందనుండి చేయి తీసి, వేళ్లతో బూర్నీసు అంచు గుంజుతూంది. చేయి పైకితీసినప్పుడల్లా, లోకేశ్ ఆమెచేతిని తనచేతిలో తీసుకుని, మళ్లీ బూర్నీసుకింద వుంచేసేవాడు.

"ఒక్కసారి కన్నువిప్పి నన్ను చూడవూ?"

ఆమె దీనంగా ఏమిటో ప్రత్యుత్తర మివ్వబోయింది, పెదవులు కదిలాయన్నమాటే — గాని గొంతుక వినబడలేదు: ''కిటికీ తెలు, కిటికీ తెలు,'' అంది. పసిపిల్లల ముద్దుమాటలతో వినీవినబడకుండా దీనంగా పలికిన ఆ కంఠం: ''కిటికీ తెరిచిపెట్టు,'' అని చెప్ప ప్రయత్నించింది. ఈ కంఠం అతని చెవిని పడగానే అతనిలో పెల్లుబుకుతూన్న భయం కంటెనూ, ఆమెపట్ల అతనికి కలిగిన దుఃఖమే కట్లు తెంచుకుని ప్రవహించేసింది. ''కాత్య, కాత్య, అయ్యో, అయ్యో — ఒక్కసారి కన్నువిప్పి నావేపు చూడవూ — ఒక్కసారి?'' ఆమె నుదురు, మూసుకున్న కళ్ళు, చెక్కిలి — అన్నిటినీ ముద్దుపెట్టుకున్నాడు. ఆమె మెడ గజగజ వణికింది, గుండెలు తోడేసుకుంటూ లేచిపోతున్నాయి, వేళ్ళు బూర్నీసు అంచును పట్టుకుని పీకుతున్నాయి. ''కాత్య, కాత్య, అయ్యో, అయ్యో, ఏమిటా బాధ?'' కాత్యనుండి ప్రత్యుత్తరంలేదు, ఆమె వెళ్లిపోతూంది... మోచేతులమీద ఆనుకుని ఆమె లేచింది ఎక్కుపెట్టిన విల్లులా, ఎవరో ఆమెను వెనుకనుండి ఎత్తివేస్తూన్నట్టుగా గుండెలుపైకి లేచిపోయాయి. శిరస్సు వెనక్కి వాలిపోయింది. లేచి కూచున్న మనిషి అమాంతమూ పరుపులోకి కుంగిపోయింది. కింది దవడ తెరుచుకుంది. నిరాశానిస్పృహలతో లోశ్ ఆపాదమస్తకమూ గజగజ వణకిపోతూ తన రెండు చేతులతోనూ ఆమెను హృదయానికి హత్తుకుని వదలలేకపోయాడు.

...లేదు, లేదు, లేదు — మృత్యువుతో తాను సమాధానపడడం కల్ల...

లోశ్ మంచం దగ్గరనుండి లేచి, బల్లమీద వున్న సిగరెట్టు పెట్టె తీసి, సిగరెట్టు ముట్టించి, చీకటిగా వున్న ఆ షెడ్డులో ఇటూ అటూ పచారు చేశాడు. కాస్సేపయాక దూరదర్శిని వున్న వేదిక మెట్లెక్కి, దూరదర్శినిని పెట్రోగ్రాడ్ నగరంపై ఎత్తుగా ఆకాశంలో వున్న అంగారకుడికేసి

నిగిడిరచి, కటకంలో తళతళ ప్రతిబింబించుతూ ప్రకాశమానంగా వెలుగుతూన్న ఆ చిన్న అరుణగోళాన్ని అలా ఎంతోసేపు వీక్షించాడు.

...మళ్లీ వచ్చి మంచంమీాద మెడవాల్చాడు. అతని స్మృతిపథంలో మరొక దృశ్యం నిలిచింది. పచ్చని బయలులో పచ్చికదిబ్బపై కూచుంది కాత్య. దూరాన కెరటాల్లా ఎత్తుపల్లాలున్న పొలాల కావల జ్వెనీగొరొద్ చర్చి స్వర్ణకలశాలు మెరుస్తున్నాయి. ఆ వేసవి వేడిమిలో ధాన్యపు పొలాలపై, ముక్కోణపు గోధుమ చేలపై గద్దలు ఎగురుతున్నాయి. ఆ తాపానికి తాళలేక కాత్యకి నిస్త్రాణ అనిపించింది. ఆమె పక్కను కూచుని, ఆమె లేత గోధుమవర్ణపు శిరస్సుకేసి, ఎండకి కావి తేరిన ఆమె బుజాలకేసి, కావిరంగు బుజాలకూ గౌనుకూ నడుమ వున్న తెల్లని రిబ్బనుకేసి అలా చూస్తున్నాడు లోశ్. ఆమె పాంశువర్ణపు కళ్లలో — చూడముచ్చటగా, ప్రశాంతంగా వున్న ఆ కళ్లలో — కూడా గద్దలు ఎగురుతున్నాయి. ఆమె పద్దెనిమిదేళ్ల పడుచు. మౌనంగా కూచుందామె. లోశ్ తన మనసులో అనుకున్నాడు: ''నీతో ఇక్కడ కూచుని ప్రేమ వలలో పడిపోవడం కంటె, నాకు బోలెడన్ని అత్యవసర పనులున్నాయి, అమ్మాయీ! నన్ను గాలాం పట్టి లాగేయడానికి వీల్లేదు, నీతో వనవిహారానికి ఇహ నేనొచ్చేది లేదు!..''

ఆరె దేవుడా! ఎంత పనిచేశాను! ఆ మందు వేసవిరోజుల్ని ఎంత తెలివితక్కువగా పాడుచేసుకున్నాను! ఆ రోజులు అప్పుడలా నిలబడిపోయుంటే ఎంత బాగుండిపోనో కదా! అయ్యో! ఆ రోజులు మళ్లీ రావే, మళ్లీ రావే!..

లోశ్ లేచి అగ్గిపుల్ల వెలిగించి, సిగరెట్టు ముట్టించి, మళ్లీ ఇటూ అటూ పచారు చేయడం మొదలెట్టాడు. కాని ఆ చెక్కగోడల వెంట పచారు చెయ్యడం మరీ బాధాకరంగా వుంది — అచ్చంగా బోనులో తచ్చాడుతూన్న వన్యమృగంలా.

తలుపుతీసి, ఆకాశంవంక చూశాడు, అంగారకుడిని వెతుకుతూ — అంగారకుడు అప్పుడే ఉదయించి ఉచ్చదశలో వున్నాడు.

''అక్కడకెళ్లినా ఈ బాధ తప్పదు నీకు — భూమిని వదలిపెట్టినా, మృత్యువుని తప్పించుకున్నా ఇంతే. ఈ ప్రేమని — ఈ గరళాన్ని — ఎందుకు మింగినట్టు నేను! నిద్రాణంగా బతికుండినా తీరిపొయేదే! గడ్డకట్టుకు ఘనీభవించిపోయిన జీవబీజాలు, హిమస్ఫటికాలు సుషుప్త్యవస్థలో విహరించడం లేదా ఈతరులో? అలాంటిది — ఎందుకొచ్చినట్టో నేను నేలమీద రాలి అంకురించాను — ప్రేయసీ సాయుద్యం, స్వయం విస్మరణ, ఏకాంత బీజస్థితి నుండి విముక్తి — ఈ దుర్భర తృష్ణతో లేచి మేల్కొన్నాను — ఎందుకొచ్చినట్లో మరి. లిప్తపాటు ఈ కలగన్న తరువాత — ఇంకేముంది? మృత్యువూ, విరహమూ — మళ్లీ ఈ జీవబీజం హిమస్ఫటికమైపోయి విశ్వాంతరాళంలో ఎగిరిపోవడమే.''

గేటు దగ్గర కాస్సేపు అలా నిలబడ్డాడు లోశ్. నిద్రలో మునిగి తేల్తూన్న పెట్రోగ్రాడ్ పైన ఆకాశంలో ఊర్ధ్వంగా — ప్రకాశిస్తున్నాడు అంగారకుడు, ఈ క్షణం శోణిత వర్ణంతోనూ, ఉత్తర క్షణం నీలంగానూ, మరుక్షణం వజ్రకాంతితోనూ. ''ఒక నూతన ప్రపంచం, అద్భుత ప్రపంచం,'' అనుకున్నాడు లోశ్. ''సహస్ర కల్పాలుగా నశించి పోయినట్టిదో, లేకుంటే ఒకవేళ వృక్షకోటితో సకల సిరిసంపదలతో విరాజిల్లుతూన్నట్టిదో ఒక నవ్యజగత్తే అయివుంటుందేమో! నేనూ అక్కడికెళ్లి ఒకనాడు రాత్రి — ఇక్కడిప్పుడు నిలబడి చూస్తున్నట్టే అక్కడా నిలబడి, ఇతర తారల నడుమనున్నట్టి నా కన్నతల్లి భూగోళాన్ని కూడా చూస్తాను. అలా చూస్తూన్నప్పుడు ఆ పచ్చగడ్డి దిబ్బ, ఆ గద్దలు, కాత్య సమాధి — ఇవన్నీ నాకు జ్ఞాపకం వస్తాయి. ఇవన్నీ గుర్తుకు వచ్చి, నన్ను కుంగదీస్తూన్న దుఃఖభారం ఇక కాస్త తేలికవుతుంది...''

మరి కాస్సేపటికి తెల్లవారుతుందనగా అప్పుడు లోకేశ్ పక్కమీద నడుం వాల్చి నిద్రపోయాడు. నది వొడ్డున రోడ్డుమీద నడుస్తూన్న బళ్ల చప్పుడికి అతనికి మెలకువొచ్చింది. లేచి ముఖం నిమురుకున్నాడు. రాత్రి దృశ్యాలనింకా మరచిపోని ఆ పిచ్చి కళ్లకు గోడలకున్న మ్యాపులూ రోదసీ నౌక రేఖాకృతీ కనబడ్డాయి. ఒకసారి నిట్టూర్చి, నిద్రమత్తు వదలించుకుని, నీళ్ల బేసిను దగ్గరకెళ్లి, హిమశీతలంగా వున్న ఆ నీళ్లలో తల ముంచి, శిరస్సూ ముఖమూ ప్రక్షాళన చేసుకున్నాడు. తరువాత ఓవర్‌కోటు తొడుగుకొని, ఆరు నెలల క్రితం కాత్య చనిపోయిన తన ఇంటికి గబగబా ఆ ఖాళీ జాగామీదనుండి అడ్డుగా నడిచివెళ్లాడు.

ఇల్లు చేరుకుని, గడ్డం చేసుకుని, స్నానం చేసి, చాకింటినుండి వచ్చిన బనియనూ లాగూ తొడుక్కుని, శుభ్రమైన దుస్తులు వేసుకున్నాడు. కిటికీ తలుపులన్నీ భద్రంగా గడియలు పెట్టి వున్నాయో లేదో చూసుకున్నాడు. అతడు ఇంట్లో కాలుపెట్టి ఏనాడో అయింది—ఇంట్లో ఎక్కడ చూసినా దుమ్మూ ధూళీనీ. పడకగది తలుపు తీశాడు. కాత్య చనిపోయిన తరువాత ఆ గదిలో అతడు మరి పడుకోనే లేదు. కిటికీ తెరలు వేసి వుండడంచేత గది చిరుచీకటిగా వుంది. కాత్య బట్టల బీరువా తలుపు అద్దం మాత్రం మసక మసకగా మెరుస్తూంది — బీరువా తలుపు ఓరగా తెరిచి వుంది. లోకేశ్ కనుబొమలు ముడివేసుకున్నాడు — మునివేళ్లమీద వెళ్లి బీరువా తలుపు మూసేశాడు. పడకగది తాళం వేసేసి, ఇంట్లో నుంచి వచ్చేసి, వీధి తలుపు తాళం వేసుకుని, ఇంటి తాళం తన వెయిస్టుకోటు జేబులో పెట్టేసుకున్నాడు.

అన్ని ఏర్పాట్లూ పూర్తి అయిపోవడంతో ఇక అక్కడనుండి వెళ్లిపోయేందుకు సిద్ధపడ్డాడు.

# అదే రాత్రి

ఇంత పొద్దుపోయినా తన పెనిమిటి ఇంకా ఇంటికి రాలేదేమి చెప్మా అని అనుకుంటూ అతనికోసం మాష ఆ రాత్రి కనిపెట్టుకుని కూచుంది. ఇప్పుడే వస్తాడో అప్పుడే వస్తాడో అని టీ కెటిల్‌తో నీళ్లు ప్రైమస్ స్టౌవ్‌మీద ఎన్నిసార్లు మరిగించిందో ఇక లెక్కా పద్దూ లేదు. కాని అతని జాడా నీడా లేదు — ఓక్ చెక్కతో చేసిన ఆ పెద్ద హాలుతలుపు ఆవల అంతా నిశ్శబ్దంగానూ అంధకారంగానూ వుంది.

గూసెవ్, మాష — వీరిద్దరూ ఒకపెద్ద ఇంట్లో ఒక గదిలో కాపురం వుంటున్నారు. ఒకానొకప్పుడు ఆ ఇల్లు సకల భోగభాగ్యాలతో తులతూగుతూండిన మహాభవనం. విప్లవ దినాల్లో ఆ భవనం ఖామందులు దాన్ని వదిలిపెట్టేసి పలాయనం చిత్తగించారు. గత నాలుగేళ్లలోనూ ఆ ఇల్లు వానకీ మంచు తుపాన్లకీ బాగా దెబ్బతింది.

వీరు ఆక్రమించుకున్న గది విశాలంగానూ వెల్లడిగానూ వుంది. సరంబీ అంతా రంగురంగుల చిత్రాలతో అలంకరించి వుంది. సరంబీకున్న గిల్టు అలంకరణలూ, రంగులతో చిత్రించబడిన మేఘాలూ మధ్య బొద్దుగా చిరునవ్వు నవ్వుతూన్న స్త్రీ మూర్తి విహరించుతూంది. రెక్కలున్న గంధర్వ బాలురు ఆమె చుట్టూ ఎగురుతున్నారు.

"మాషా! ఆ అమ్మాయిని చూడు," అని సరంబీ మీద చిత్రించి వున్న ఆ స్త్రీని చూపించి అంటూండడం గూసెవ్‌కి ఎప్పుడూ అలవాటే: "నవ్వుతూ మంచి హుషారుగా వున్న ఆ అమ్మాయిని చూడంటా! చక్కగా బొద్దుగా నవనవలాడుతూ ఆరుగురు పిల్లల్నీ వెంటబెట్టుకుని నవ్వుతూ ఎలా తిరుగుతూందోనూ! భేష్ — అలా వుండాలి ఆడది!"

సింహపాదాలున్న గిల్టు మంచానికి ఎగువగా నక్షత్రాభరణం తగిలించిన కోటు తొడుక్కొని పొడరు చల్లిన సవరం పెట్టుకుని, మూతి బిగించుకున్న ముసలతని తైలవర్ణ చిత్రం ఒకటి గోడకి వేల్లాడుతూంది. గూసెవ్ ఆ ముసలతనికి "జనరల్ ఎలుగ్గొడ్డు" అని పేరుపెట్టాడు. "మనిషిని పట్టుకున్నాడంటే, దయదాక్షిణ్యాలు లేకుండా ఇక ప్రాణం తింటాడు — పంజా తడాఖా చూపించాడన్నమాటే!" అంటాడు గూసెవ్. ఆ చిత్రం కేసి చూడ్డానికే భయం మాషకి. గదిలో వున్న చిన్న ఇనుప పొయ్యి నుండి బయటికి వెళ్తూన్న చిమ్నీ గొట్టం గోడకి మసి చూరబెట్టుతూంది. గదిలో సామాన్లు పెట్టుకున్న అలమారాలూ, సాదా భోజనం సిద్ధం చేసుకునే టేబిలూ నీటుగానూ శుభ్రంగానూ వున్నాయి.

నగిషీ చెక్కిన ఆ ఓక్ తలుపు అవతల రెండు వరుసలు కిటికీలున్న హాలు ఒకటుంది. కిటికీ అద్దాలు బద్దలైపోవడంచేత అద్దాల స్థానే చెక్కలు మేకులుకొట్టి వున్నాయి, సరంబీ అక్కడక్కడ బీటలు వారింది. రాత్రిళ్ళ గాలి రైంయ్ రైంయ్మని వీచిందంటే ఆ గాలి అంతా ఆ హాల్లో స్వైర విహారం సాగిస్తుంది. చుంచులు హాయిగా సంచరిస్తాయి.

మాష టేబిలు దగ్గర కూచుంది. ప్రైమస్ స్టౌవ్ బుస్సుమని వెలుగుతూంది. ఎక్కడో ఎంతో దూరాన విషాద శ్రుతితో మోగుతూన్న గడియారపు గంటల శబ్దాన్ని వార్తావహునిలా మోసుకొచ్చింది గాలి — గడియారం రెండు గంటలు కొట్టింది. గూసెవ్ ఇంకా రాలేదు ఇంటికి.

"ఏమిటీ అన్వేషణ తనకి — తనకి ఏమిటి తక్కువైందని? అల్యోషా, అల్యోషా! అయ్యో, ఎందుకు నీకీ అసంతృప్తి, ఏమిటి వేధిస్తూంది నిన్ను?.. ఏ చీకూ చింతా లేకుండా నా భుజంమీద తల పెట్టుకుని హాయిగా కళ్ళు మూసుకు నిద్రపోకుండా, ఎందుకొచ్చింది కాలికి బలపం కట్టుకుని

ఈ తిరగడం నీకు? నా ప్రేమకంటె ఎక్కువైంది నీకెక్కడ దొరుకుంది?'' అని వూరికే తలపోసింది మాష.

ఆమె కనురెప్ప వెంట్రుకల కొనల్లో కన్నీటి బొట్లు మెరిశాయి. కన్నీటిని ఆమె మెల్లగా తుడుచుకుని అరచేతిలో చెక్కిలి ఆనుకుని కూచుంది. మొగ్గలేసుకుంటూ కేరింతలు కొడుతూన్న తన గంధర్వ బాలురను వెంటబెట్టుకుని నవ్వుతూ సరంబీన విహరించుతూన్న స్త్రీ మూర్తి హాయిగా ఆకాశాన షికారు కొడుతూంది. ''ఈ స్త్రీలాగానే నేనూ వుంటే క్షణం నన్ను వదిలి వుండేవాడు కాదు కదా!'' అనుకుంది మాష.

తానొక పెద్ద కమానుమీద వెళ్తున్నానని చెప్పాడు గూసెవ్ ఆమెతో — ఎక్కడకు వెళ్తాన్నదీ మాత్రం అతను చెప్పనూ లేదు, తెలుసుకుందా మనే వున్నా ఆమె అగడనూ లేదు — అడగడానికి ఆమె భయపడింది. ఈ పిచ్చి గదిలో, వెనకటిలా తిరగడానికి వీల్లేని ఈ ప్రశాంత వాతావరణంలో తనతో కలిసి వుండడం అతనికి కష్టమనీ — దుస్సాధ్యమనీ, దుర్భరమనీ ఆమెకు పూర్తిగా బోధపడిపోయింది. అతనికి రాత్రిళ్ళు నిద్రలో ఏవేవో కలలు వచ్చేవి — పళ్ళు పటపట కొరికేవాడు, ఏదేదో కలవరించేవాడు, గబుక్కున లేచి కూచుని, పళ్ళు బిగించి, రొజుకునేవాడు — ముఖమూ గుండెలూ చెమట ముద్దలైపోయేవి. తరువాత మళ్ళీ పడుకుని — మరునాడు పొద్దున్న ధుమధుమలాడుతూ లేచి, ఆ రోజల్లా మరి యిల్లు కదిలేవాడుకాదు.

మాష అతన్నెంతో లాలించి పాలించేది, బుజ్జగించేది, అతనితో ఎంతో సర్దుకుపోయేది — కన్నతల్లి కంటే ఎంతో తెలివిగా. ఇది తెలుసు కుని అతడామెను మరింతగా ప్రేమించేవాడు. కాని తెల్లవారేసరికల్లా — అతడికి ఇక ముళ్ళమీద వున్నట్టుండి, ఇంటినుండి వెళ్ళిపోడానికి సిద్ధమ యేవాడు.

మాషకి ఎక్కడో పని. పనినుండి ఇంటికొచ్చేప్పుడు రేషన్ వెచ్చాలు తీసుకొచ్చేది. ఒక్కొక్కప్పుడు వాళ్లదగ్గర ఇక చిల్లిగవ్వేనా వుండేదికాదు. గూసెవ్ అక్కడా ఇక్కడా పనిచేస్తూండేవాడే గాని, ఏ పనిలోనూ పట్టుపని పదిరోజులుండేవాడుకాదు. "మన ముసలాళ్ళు అంటూంటారు — చైనాలో బంగారం పండే భూములున్నాయని," అనేవాడు గూసెవ్, "అదంతా వుత్తమాటే, గాని అటువేపు నేనెన్నడూ వెళ్లలేదు, అదేదో ఒకసారి చూసి రావా అనే వుంది నిజంగా నాకు, మాష — ఒక్కసారి చైనా ఎలా వుంటుందో తప్పకుండా చూపిస్తాను!"

తనను వదిలిపెట్టి గనుక గూసెవ్ ఏ క్షణమే వెళ్లిపోతాడో ఏమిటో అని, చావుకంటే హెచ్చుగా హడిలిపోయింది మాష. తనకీ లోకంలో 'నా' అనేందుకు ఎవ్వరూ లేరు. తనకు పదిహేనేళ్లప్పటి నుండి, అనేక షాపుల్లో సేల్స్‌గర్ల్‌గానూ, నెవా నదిమీద తిరిగే చిన్న స్టీమర్లపైన క్యాషియర్‌గానూ పనిచేసింది. ఆనందం ఎరగని ఏకాకి బతుకైపోయింది తన జీవితం.

ఏడాది కిందట, పండుగపూట ఒకనాడు పార్కులో తనకి గూసెవ్‌తో పరిచయమైంది. అప్పుడు అన్నాడతడు: "నువ్వు ఒక్కర్తెవే వుంటున్నావా? మనం ఇద్దరం కలిసి వుంటే బాగుంటుందిగా? ఒక్కడనే వుండడమంటే నాకూ విసుగ్గానే వుంది." ఆ మాటలు విని, ఆమె అతనికేసి నిదానంగా చూసింది — తీరైన ముఖం, నవ్వుతూన్న కళ్ళు, సరదా అయిన మనిషి — అన్నిటికంటే ముఖ్యం తాగుడు లేదు. "నాకేం అభ్యంతరం లేదు," అని ఆమె జబాబు చెప్పింది. ఇద్దరూ కలిసి పొద్దుపోయే వరకూ పార్కులో తిరిగారు. యుద్ధం గురించీ, దాడుల గురించీ, విప్లవాల గురించీ విశేషాలు — పుస్తకాల్లో ఎవ్వరూ ఎన్నడూ రాయని విశేషాలు — చెప్పాడు గూసెవ్. ఆ రాత్రి అతడు మాషను ఆమె ఇంటి వరకూ దిగబెట్టాడు, ఇక అప్పటి

నుండి అనేకసార్లు ఆమె ఇంటికి వెళ్ళి, ఆమెను కలుసుకున్నాడు. నిరాడంబరంగా, ప్రశాంతంగా ఆమె అతనిదైపోయింది. ఇకప్పుడు గభాలున అతడంటే ఆమెకు ఎక్కడలేని ప్రేమ పుట్టుకొచ్చింది — తన సర్వస్వమూ, తన ప్రాణమూ అతడే అని ఆమెకు నరనరాన తెలిసిపోయింది. ఇక దానితో ఆమె బెంగ ఆరంభమైంది...

కెటిల్‌లో నీళ్ళు మరిగిపోయి పొంగిపోయాయి. కెటిల్‌ని స్టౌవ్ మీదనుండి దింపేసింది, నిరీక్షణ మళ్ళీ ప్రారంభం. మనిషి అలికిడిలేని ఆ హాలులో ఏదో అడుగుల చప్పుడైనట్టు ఆమెకి అనిపించింది ఇందాకలా. కాని ఆ విచారంలో ఆమెకు ఆ అలికిడి ఏమిటో లేచి చూడ్డానికే బుద్ధి పుట్టలేదు. ఆ చప్పుడే — అవును సరిగ్గా ఆ చప్పుడే — మళ్ళీ ఇప్పుడు వినబడింది — ఎవరివో అడుగుల చప్పుడు.

గభాలున తలుపు తీసి మాష హాల్లోకి తొంగిచూసింది. హాలు కిటికీలలో ఒక కిటికీలో నుండి వస్తూన్న వీధిదీపం వెల్తురులో, అక్కడక్కడ గిలాబా రాలిపోతూ మరకలు పడిన పొట్టి స్తంభాలు కొన్ని హాలులో మసకమసకగా మెరిశాయి. ఎవరో ఒక మనిషి ఆ స్తంభాల మధ్య నక్కి వున్నట్టు ఆమెకి అవుపడింది. మనిషి ముసలాడు, నెరిసిన తల, ముందుకు తోసుకొస్తూన్న నుదురు, నెత్తిని టోపీ లేదు, పొడుగాటి కోటు — మనిషి అక్కడ నిలబడి, మెడ ముందుకు చాచి మాషకేసి చూస్తున్నాడు. ఆ మనిషిని చూసేసరికల్లా ఆమె కాళ్ళు చల్లబడిపోయాయి.

''ఎందుకొచ్చారు మీరు?'' అని అడిగింది మాష — బొంగురుబోయిన గొంతుతో.

ముసలతడు మెడ చాపి ఆమెకేసి తేరిచూసి, ఆమెను జడిపిస్తూ తర్జని పైకెత్తి ఝళిపించాడు. మాష దభీమని తలుపు మూసేసింది

— ఆమె గుండెలు దడదడ కొట్టుకున్నాయి. అలా హడలుతూనే ఆమె వింది — అడుగుల చప్పుడు అంతకంతకు మెల్లనై, మరిక వినబడలేదు: సరే ఆ ముసలతను మెట్లు దిగిపోయి, వీధిగుమ్మంలో నుండి వెళ్లిపోయాడు కదా అనుకుంది.

మరో గడియకల్లా తన పెనిమిటి అడుగుల చప్పుడు — పెరటివైపున్న మెట్లమీదనుండి వస్తూ త్వరత్వరగా బలంగా పడుతూన్న అడుగుల చప్పుడు — ప్రతిధ్వనించింది. వొంటి నిండా మసి డాగులతో, నవ్వు ముఖంతో ప్రత్యక్షమయాడు గూసెవ్.

"చేతులూ ముఖమూ కడుక్కోవాలి — నీళ్లు తెచ్చిపెడుదూ," అన్నాడు, లాల్చీ మెడగుండీలు విప్పుకుంటూ, "రేపే ప్రయాణం! కెటిల్ మరుగుతూందా? భేష్!" ముఖమూ, కండలు తిరిగిన మెడా మోచేతులూ కడుక్కున్నాడు — భార్యకేసి హూంకరింగా చూస్తూ చేతులూ ముఖమూ తుడుచుకున్నాడు. "ఎందుకలా కంట తడిబెడతావు? నాకేమీ కాదు, ఇట్టే చక్కా వస్తాను — పూలరంగడిలా! ఫిరంగి గుళ్ళూ, తుపాకుల సన్నీలూ ఏడేళ్ల నన్నేమీ చెయ్యలేదు—ఇంత వేగం నేను గుటుక్కుమంటానా! నాకింకా కొంత కాలం రాసుందిలే! నా పేరింకా రిజిస్టరులో నుండి కొట్టేయదులే చిత్రగుప్తుడు! ఇహ చావుమాటా? — కాలం మూడితే అంతా ఒకటే — ఎవ్వడూ చేసేది ఏమీ లేదు: చీమకుట్టిందంటే చాలు, ఈగ వాలిందంటే చాలు — నెంబరు ఫైసలు!"

గూసెవ్ బల్ల దగ్గర కూచుని, ఉడకబెట్టిన బంగాళా దుంప ఒకటి చేత్తో తీసుకుని, తొక్క వొలిచి, దానిని చిదిపి, ఉప్పు అద్దుకున్నాడు.

"చాకలిబట్టలు రేపటికి సిద్ధంచేసి వుంచు — రెండు బనియల్లూ, రెండు డ్రాయర్లూ, రెండు లాల్చీలూ, మేజోళ్లూ. అన్నట్టు సబ్బూ, గిబ్బూ, దిబ్బూ, దిరు గుండం మర్చిపోకేం! అదిగో మళ్లీ ఏడుస్తున్నావా?"

“నాకు భయం వేసింది,” అంది మాష, ముఖం అటు తిప్పి, “ఇందాకా ముసలాడెవడో వచ్చి, నాకేసి వేలు ఝళిపిస్తూ బెదరించాడు. అల్యోషా, నువ్వు వెళ్ళిపోతే నేను భరించలేను, నాదగ్గరే వుండిపో!”

“నన్నెక్కడకీ వెళ్ళొద్దంటావా? వూరూ పేరూ లేని ముసలి తొక్కెవడో నిన్ను జడిపించాడని?”

“అది పాడు శకునం — అతగాడి జడిపింపు.”

“అరరే! నిజంగా నేను వెళ్ళాలి గాని, లేకుంటే ఆ ముసలి గాడిద కొడుక్కి బుద్ధి చెప్పందునే! ఈ మేడలో కాపురం వున్నవాళ్ళని బెదరకొట్టడానికని వెనక ఈ ఇంటివాళ్ల తాలూకు వాడెవడో రాత్రిపూట ఇక్కడికొచ్చి తచ్చాడుతూండాలి.”

“అల్యోషా! నువ్వు మళ్ళీ నా దగ్గరకి వచ్చేస్తావు కాదూ?”

“వచ్చేస్తానని చెప్పానుగా! వచ్చేస్తానూ అంటే వచ్చేస్తానన్నమాటే. మతిపోయిందా ఏమిటి నీకు — ఏమిటీ గాభరా అంతా? అచ్చచ్చ!”

“దూరాభార ప్రయాణమా?”

గూసెవ్ ఈల వేసి, సరంబీ కేసి చూసి, తల పంకించి, పెంకె చూపులు చూస్తూ సాసరులో టీ పోసుకున్నాడు.

“అదిగో ఆ ఆడమనిషి లాగానే — మేఘాలు దాటి వెళ్తున్నా.”

మాష పాపం ముఖం వేలేసుకుంది. గూసెవ్ ఆవలించి, నిద్రపోడానికని దుస్తులు మార్చుకోవడం మొదలెట్టాడు. బల్లమీదున్న గిన్నెల్ని చప్పుడు చేయకుండా మెల్లగా తీసేసి, మేజోళ్లకి రప్పతీసి కుట్టడానికని కూచుంది మాష — కూచుందే గాని తలెత్తి చూడ్డానికి ధైర్యం లేక పోయింది. దుస్తులు మార్చుకుని తానూ పడక చేరే సరికి, గుండెలమీద చేతులు పెట్టుకుని హాయిగా నిద్రాపోతున్నాడు గూసెవ్. మాష తన పెని

మిటి పక్కని పడుకుని అతనికేసి నిదానంగా చూసింది. ఆమె కంటినుండి బొటబొట కారుతూన్న కన్నీళ్లతో ఆమె చెక్కిళ్లు తడిసిపోయాయి: ఆమె తన ప్రేమనంతనూ అతనికి అంకితం చేసేసింది, ప్రశాంతత ఎరగని అతని హృదయాన్ని ఆమె ఎంతగానో అపేక్షించి మథనపడింది: "ఎక్కడకెళ్తున్నాడు? ఎందుకని వెళ్తున్నాడు?"

తెల్లవారుతూనే మాష లేచి, పెనిమిటి దుస్తుల్ని దులిపి, బ్రష్ చేసి, చాకలి బట్టలు మడతపెట్టి, ప్రయాణం కోసం వస్తువులన్నీ సిద్ధం చేసింది. గూసెవ్ నిద్రనుండి లేచాడు. టీ తాగుతూ — మాషతో పరియాచకాలాడుతూ, ఆమె చెక్కిళ్లు నిమురుతూ ఆమెను బుజ్జగించాడు. తరువాత జేబులో నుండి ఒక పెద్ద కట్ట నోట్లు తీసి బల్లమీద వుంచాడు. తన సామాన్ల సంచీ బుజాన వేసుకుని, గదిగుమ్మంలో ఒక క్షణం ఆగి, మాషను ముద్దుపెట్టుకున్నాడు.

అతడెక్కడికి వెళ్తూన్నదీ ఆమెకు తెలియే లేదు.

# ఆరోహణ

లోశ్ కార్ఖానాకి ఆవల వున్న ఖాళీ జాగాలో జనం పోగయారు. నది ఎంబాంక్‌మెంటుపైన వున్నవాళ్లూ, పెత్రోవ్‌స్కి ద్వీపపు మనుషులూ గుంపులు గుంపులుగా పరుగెత్తుకుంటూ వచ్చి, ఒకరినొకరు తోసుకుంటూ తొక్కుకుంటూ అక్కడికి చేరి, వెడల్పాటి కిరణాలతో మేఘాలను ఛేదించుకుంటూ కాస్త కిందగా ప్రకాశిస్తూన్న సూర్యునికేసి నిమిషం నిమిషమూ చూస్తూ ఆ తొడితొక్కిడిలోనే నిలబడ్డారు.

"ఎందుకీ జనం ఇలా పోగడ్డారు? ఏదేనా ఖూనీ జరిగిందా ఏమిటి?"

"అంగారకుడి దగ్గరకి ఎగరబోతున్నారయ్యా!"

"ఆరె, దేవుడా! ఇదేదో కొంపమునక్కే వచ్చినట్టుంది!"

"ఏమిటయ్యా అంటున్నావు? ఎవరయ్యా ఎగురుతూన్నది?"

"ఖైదులో వున్న గుండాల నిద్దరిని తీసుకొచ్చి ఉక్కుగోళంలో పెట్టి సిక్కా వేసి, అంగారక గ్రహానికి పేల్చేస్తున్నారు – ప్రయోగమయ్యా బాబూ!"

"ఇంతకీ – వేళాకోళమేనా?"

"ఆరి దుర్మార్గులు! మనిషి ప్రాణాలంటే వీళ్లకి జాలేలేదు!.."

" 'వీళ్లకి' అని – అని ఎవర్నంటున్నావయ్యా నువ్వు?"

"ఎవరినంటున్నానో మీ కెందుకమ్మా?"

"అవును మరి – రాక్షసితనమే!"

"ఆరె దేవుడా! మనుషులకి మతిపోతూంది!"

"మతి పోవడమేమి? ఎందుకని అంటున్నారు మీరు?"

"అలా అన్నందుకు మిమ్మల్ని పంపించాలయ్యా అక్కడికి."

"గొడవ చెయ్యకండి, కామ్రేడ్స్! నిజంగా చరిత్రాత్మకమైన ఘటనొకటి జరగబోతూంటే – మీరేమిటో గాడిదగుడ్డులాగు తగువులాడుకుంటున్నారు."

"సరే గాని – అంగారకలోకానికి ఎగరడం ఎందుకయ్యా పనిలేక?"

"క్షమించండి, అరటన్ను ప్రచారపు కరపత్రాలు పట్టికెళ్తున్నారటయ్యా – ఇందాకను ఎవరో అన్నారు."

"ఇది అన్వేషణ యాత్రయ్యా!"

"ఎందుకోసమని?"

"బంగారం కోసం."

''నిజమే. మన బంగారపు నిల్వ పెంచుకో వద్దా మరి!''

''బాగా హెచ్చుగానే పట్టుకొస్తారా?''

''బాగా అంటారేమిటి? మోసుకు రాగలిగినంత పట్టుకొస్తారు.''

''ఏమండోయ్? ఇంకా ఇక్కడ చాలా సేపే వుండాలా ఏమిటి?''

''సూర్యాస్తమయం వేళకి బయల్దేరుతారు.''

సంధ్యవేళ వరకూ సంభాషణ ఇలాగు ముందుకీ వెనక్కీ నడిచింది, పడిగాపులు కాసుకుని నిలబడ్డ జనంనుండి ఈ అసాధారణ ఉదంతంపై రకరకాల ప్రశ్నలూ సమాధానాలూ బయల్దేరాయి — తర్కించుకున్నారు. తగవులు పెట్టుకున్నారు — అంతే గాని, జనం మాత్రం అక్కడ నుండి కదల్లేదు.

అస్తమిస్తూన్న సూర్యుడు తన అరుణకాంతులతో సగం ఆకాశాన్ని నింపేశాడు. సరిగ్గా ఆ సమయానికి జనంలోనుండి మెల్లగా సందుచేసుకుంటూ గుబేర్నియా ఎగ్జిక్యూటివ్ కమిటీవారి పెద్దకారు ఒకటి అక్కడకొచ్చింది. కార్ఖానా కిటికీల్లో దీపాలు వెలిగాయి. జనం గోలచేయడం మానేసి, ముందుకు తోసుకొచ్చారు.

రివెట్లు అన్నీ తళతళ మెరుస్తూ అన్నివైపులా తెరచుకొనున్న ఆ అండాకృతి రోదసీనౌక, షెడ్డు నడిమధ్య కాస్త ఏటవాలుగా వున్న సిమెంటు తినెమీద నిలబెట్టి వుంది. రోదసీనౌకకు తెరచి వున్న గుండ్రని గుమ్మంలో నుండి, ప్రకాశమానమైన దీపాలతో వెలుగుతూన్నట్టి, గళ్లకుట్టుతో కుట్టి పసుప్పచ్చని తోలుతో తయారైన నౌక అంతర్భాగం స్పష్టంగా కనబడుతూంది.

లోశ్, గూసెవ్‌లు ఇద్దరూ గొర్రెబొచ్చు తోలుకోట్లు వేసుకుని, ఫెల్ట్‌బూడ్సు తొడుక్కొని, తోలు హెల్మెట్లు పెట్టుకున్నారు. ఎగ్జిక్యూ

టివ్ కమిటీ సభ్యులూ, ఎకడమిూషియన్లూ, ఇంజనీర్లూ, పత్రికలవాళ్లూ రోదసీనౌక చుట్టూ మూగిపోయారు. ఉపన్యాసాలన్నీ పూర్తి అయాయి. ఫోటోలు తీయడం ముగిసింది. తన పట్ల ప్రజలు చూపిన ఆదరాభిమానాలకు లోశ్ తన ధన్యవాదాలు తెలిపాడు. అతని ముఖం బేలగా వుంది, కళ్లు గాజు గోళీల్లా వున్నాయి. హొహ్లోవ్‌నీ, కుజ్మీన్‌నీ అతడు కౌగలించు కున్నాడు. తరువాత తన వాచీ చూసుకున్నాడు.

"ఇక వేళైంది!"

అక్కడ పోగైన జనం అంతా గొడవ చేయకుండా నిశ్శబ్దంగా నిలబడ్డారు. గూసెవ్ ముఖం చిట్లించుకుని, గుండ్రని గుమ్మంలోనుండి నౌక లోపలకి దూరాడు. లోపలికి దిగి, తోలు సీటులో కూచుని, తన హెల్మెట్టు సర్దుకుని కోటు సరిచేసుకున్నాడు.

"మా ఆవిడెను కాస్త కనుక్కుంటూండడం మర్చిపోకండేం!" అని అతడు హొహ్లోవ్‌ని కేకేసి, కనుబొమలు గట్టిగా ముడిపెట్టుకున్నాడు.

లోశ్ ఒక్క క్షణమాత్రం నౌక గుండ్రని గుమ్మం దగ్గర ఆగి, తన పాదాలకేసి తల వంచాడు. తటాలున తల పైకెత్తి బొంగురు గొంతుతో అన్నాడు:

"మరేమీ ప్రమాదంలేకుండా అంగారక గ్రహం మీద దిగుతా మని నాకు ధైర్యం వుంది. మరికొద్ది సంవత్సరాల్లో కొన్ని వందల రోదసీ నౌకలు తారాపథంలో వ్యోమయానం చేస్తూంటాయనే నా నమ్మకం. అన్వేషణా జిజ్ఞాస మనల్ని ఆవహించి మనను నిరంతరమూ ముందుకు తోసుకుపోతూంటుంది — అది మాత్రం తథ్యం. అయినప్పటికీ, ప్రథమ రోదసీ యాత్రికుడను కావాలనే ఇచ్ఛ నాకులేదు. అంతరిక్ష రహస్యాలను శోధించి బయట పెట్టడంలో మొదటివాణ్ణి నేను కాదు. ఇంతకీ అక్కడ

నేను ఆవిష్కరించ బోయేదేమిటి? గాఢాంధకార శూన్యం... మీ దగ్గర నుండి సెలవు తీసుకుంటూన్న ఈ సమయంలో ఇదే నన్ను బాధపెడుతూంది. కామ్రేడ్స్! నేను — ప్రతిభావంతుడనైన నిర్మాతనూ కాను, ధైర్యశాలినీ కాను, స్వాప్నికుడనూ కాను, నేను — పిరికివాణ్ణి — పలాయితుడను..."

తుంచేసినట్టు తటాలున తన మాటలను ఆపేశాడు లోశ్. అక్కడున్న వారికేసి అదో మోస్తరుగా చూశాడు — వారందరూ అతని మాటలను ఆశ్చర్య సంభ్రమాలతో విన్నారు. అతడు తన హెల్మెట్టు అక్షికటకాన్ని ముందుకు లాక్కొన్నాడు.

"అయితే ఏంలెండి — అది ఎవరికి సంబంధించినదీ కాదు — మీకూ సంబంధించినది కాదు, నాకూ సంబంధించినది కాదు — కేవలం వ్యక్తిగతావశేషం... దానిని ఆ షెడ్డులో ఏకాంతంగా వున్న ఆ మంచం మీద వదిలిపెట్టేశాను... ఇక సెలవు, కామ్రేడ్స్! దయచేసి నౌకకి దూరంగా నిలబడండి..."

సరిగ్గా ఈ సమయానికే నౌకకేబిన్ లోనుండి గూసెన్ కేకేశాడు:

"కామ్రేడ్స్! మీ అందరి తరఫున అంగారక గ్రహంలో ఎవరుంటే వాళ్ళకే సోవియట్ రిపబ్లిక్ హృదయపూర్వకాభివందనలను తెలియజేస్తాను, అనుమతిస్తారా?"

జనం గొల్లుమని నవ్వి గట్టిగా చప్పట్లు కొట్టారు.

లోశ్ నౌకవైపు తిరిగి, గుండ్రని గుమ్మంలోనుండి నౌకలోకి దూరి, వెనుకనుండి తలుపు బిగించేసుకున్నాడు. షెడ్డులోపల వున్నవాళ్ళందరూ, ఉద్రిక్తులై ఒకరినొకరు తోసుకుంటూ కుమ్ముకుంటూ తొడితొక్కుడుగా బయటికి వచ్చేసి, ఎదురుగా వున్న ఖాళీ జాగాలో గుమికూడిన జనంతో కలిసిపోయారు. ఎవరో పెద్ద గొంతుతో హెచ్చరికచేస్తూ అరిచారు:

“జాగ్రత్త, దూరంగా వెళ్లి, నేలమీద బోర్లా పడుకోండి!”

వేలాది జనమూ కిక్కురు మనకుండా దీపాలతో వెలుగుతూన్న ఆ షెడ్డు చతురస్రపు కిటీలకేసి చూడసాగారు. షెడ్డులోనూ బయట ఖాళీ జాగాలోనూ అంతా నిశ్శబ్దం. ఇలా కొన్ని క్షణాలు గడిచాయి. చాలా మంది నేలమీద పడుకున్నారు. దూరాన గుర్రం ఒకటి సకిలించింది. ఎవరో కోపంతో మండిపోతూ:

“ఖామోష్!” అని అరిచారు.

సరిగా ఆ క్షణంలోనే షెడ్డులోనుండి చెవులు చిల్లులు పడేటట్టు గర్జన వినబడింది. ఆ వెంటనే ధామ్ ధామ్ అని ఉధృతమైన ప్రేలుడు పరంపర వినబడింది. భూమి దద్దరిల్లిపోయింది. షెడ్డు పైకప్పు విప్పదీసిన భాగంనుండి వత్తుగా వస్తూన్న ధూళి మేఘాల పొగ మబ్బుల నడుమనుండి రోదసీనౌక చప్పిడిముక్కు పైకి లేచింది. దిక్కులు పేలిపోతాయేమో అనిపించింది. షెడ్డు పైకప్పునుండి నల్లని రోదసీనౌక ఊర్ధ్వంగా గాలిలోకి లేచి, ఇక చెంగున ఉరికేందుకు ప్రత్యాలీఢనమై సిద్ధంగా వుందా అన్నట్టు లిప్తపాటు నిశ్చలంగా వుంది. ఒక్కసారి అమాంతమూ వెయ్యి ఉరుములు ఉరిమిన ధ్వనితో బ్రహ్మాండమైన ఆ ఎనిమిది మీటర్ల వ్యాసపు గోళమూ తారాచువ్వలా రెక్కలయ్‌మని ఆ జనం పైనుండి పడమటి దిక్కుగా అగ్నిబాణంలా ఆకాశంలోకి దూసుకుపోయి, మసక మసకగా వెలుగుతూన్న ఎర్రని మేఘాల్లోకి అదృశ్యమైపోయింది.

అంతవరకూ నిశ్శబ్దంగా వున్న జనం ఇక అప్పుడు ఉద్రేకోత్సాహాలతో నోరు తెరచి గొల్లున గొడవచేసి, టోపీలు ఎగరేసుకుంటూ షెడ్డుచుట్టూ మూగారు.



4–161

# నల్లని ఆకాశంలో

లోశ్ నౌకలోకి ప్రవేశించి, గుండ్రని తలుపును స్క్రూతో బిగించి, గూసెవ్‌కి ఎదురుగా కూచుని, అతని కళ్లల్లో కళ్లు పెట్టి చూశాడు. వలలో చిక్కుకున్న పక్షి కళ్లల్లా, కనుపాపలు సూదిమొనల్లా వున్నాయి గూసెవ్ కళ్లు.

''ఏం బయల్దేరుదామా, అలెక్సేయ్ ఇవానొవిచ్?''

''ఊఁ, కానీయండి!''

రియోస్టాట్ మీటను పట్టుకుని లోశ్ మెల్లగా గుంజాడు. మొదట దుబ్బుమని పేలుడు శబ్దం — ఖాళీ జాగాలో పోగడిన వేలాది జనాన్ని బెదరగొట్టిన మొదటి పేలుడు శబ్దం — వినబడింది. తరువాత లోశ్ మరొక రియోస్టాట్ మీటను లాగాడు. వెంటనే వారి కాళ్లకింద నుండి దబదబ మనడం మొదలైంది.ఇక ఆ శబ్దానికి రోదసీనౌక ఎంత జోరుగా అదరడం ప్రారంభించిందంటే, గూసెవ్ తాను కూచున్న సీటును గట్టిగా పట్టుకుని గుడ్లు తేలవెయ్యడం మొదలెట్టాడు. మరో గడియకి లోశ్ రెండు రియోస్టాట్లనీ పూర్తిగా స్విచ్చివేశాడు. ఝొయ్యిమంటూ నౌక పైకిలేవడం ప్రారంభించింది. ప్రేలుళ్లు తగ్గాయి. కుదుపు కుదుట పడింది. లోశ్ కేకేశాడు:

''ఎగురుతున్నాం!''

గూసెవ్ ముఖం తుడుచుకున్నాడు. కేబిన్ వేడెక్కుతూంది. స్పీడా మీటరు ముల్లు సెకనుకు ఏభై మీటర్ల వేగం చూపుతూంది. ముల్లు మాత్రం ఇంకా అలా లేస్తూనే వుంది.

భూభ్రమణానికి ఎదురు దిశగా స్పర్శరేఖలో పయనిస్తూంది రోదసీనౌక. కేంద్రాపసారిత శక్తి రోదసీనౌకను తూర్పు దిశగా లాగుతూంది. లోశ్

కట్టిన లెక్కల ప్రకారం రోదసీనౌక నూరు కిలోమీటర్ల ఉన్నతాంశం చేరుకున్న తరువాత నిట్టనిటారుగా నిల్చి, ఇకప్పుడు కర్ణరేఖలో పయనించాల్సి వుంటుంది.

చలనయంత్రం సాఫీగా పనిచేసింది. లోశ్, గూసెవ్‌లు తాము తొడుక్కున్న బొచ్చు అస్తరు జుబ్బాల గుండీలు విప్పుకుని, హెల్మెట్లను నుదిటి మీదనుండి వెనక్కి తోసుకున్నారు. వెలుగుతూన్న ఎలెక్ట్రిక్ దీపాలను ఆర్పేసి, పర్యవేక్షక రంధ్రాల అద్దాలలో నుండి కేబిన్‌లోకి వస్తూన్న పలుచని సందె వెలుగులో కూచున్నారు.

లోశ్‌కి అతి నీర్సంగానూ తల తిరిగిపోతూన్నట్టుగానూ అనిపించింది. అయినా అతికష్టంతో ఆ భావనను లక్ష్యపెట్టకుండా అధిగమించేందుకు లోలోన గుంజాయించుకుని, మోకాళ్లమీద వంగి, పర్యవేక్షక రంధ్రానికి కన్ను అప్పజెప్పి చూశాడు. అంతకంతకు దూరం అయిపోతూన్న భూగోళం, నీలిచాయ పాంశువర్ణం ధరించి, అంచులేని పుటాకారపు తాంబాళంలా విస్తరించి వుంది. ఆ బింబంమీద అక్కడక్కడ, సముద్రంలో ద్వీపాల్లా, మబ్బుకొండలు అగపడ్డాయి. అవి మబ్బుకొండలు కావు — అట్లాంటిక్ మహాసముద్రమే.

క్రమేణా ఆ తాంబాళం అంతకంతకు చిన్నదైపోయి, కిందకి దిగిపోయింది. పళ్లెం కుడి అంచు వెండిలా ధగధగ ప్రకాశించ నారంభించగా, ఎడమ అంచు కారునలుపు నీడలో కలిసిపోయింది. సరిగా ఈ క్షణంలో ఆ పళ్లెం అంతులేని అగాధంలోకి ఉరుకుతూన్న గోళంలా కనబడింది.

మరొక పర్యవేక్షక రంధ్రానికి కన్ను అంటుకుపోయినట్టు చూస్తూన్న గూసెవ్:

"ఓ భూమాతా, ఇదే నా ఆఖరి నమస్కారం! చాలా రోజులు మనం కలిసే వున్నాం, ఇప్పుడేమో విడిపోతున్నాం. అయినా ఇప్పుడు నువ్వు ఏడ్చి లాభంలేదు, ఏడవకు!" అన్నాడు.

మోకాళ్లమీద కూచున్నవాడల్లా గూసెవ్ లేవడానికి ప్రయత్నించాడు, కాని తటాలున తూలిపోయి తన సీటులో వెళ్లిపడ్డాడు. ఎంతో కష్టంతో కోటుకాలరు వొసిలించుకుని:

"చస్తున్నా, మిస్టర్ స్లావ్ సేర్గేయెవిచ్! ఇక భరించలేను!" అని కేకేశాడు.

లోశ్ గుండె దబదబ కొట్టుకోవడం ప్రారంభించింది. దడ అంతకంతకు మరింత ఉధృతమై, గుండె పేలిపోతుందేమో అన్నంతగా దడ హెచ్చయిపోయి, ఇక ఆ బాధ భరించ లేకపోయాడు లోశ్. కణతలు బాదేస్తున్నాయి. కళ్లు చీకట్లు కమ్మేశాయి.

స్పీడామీటరు దగ్గరకి పాకుకుంటూ వెళ్లాడు లోశ్. స్పీడామీటరు ముల్లు ఇంకా అలా ముందుకు తిరుగుతూనే వుంది — నమ్మశక్యం కానంత వేగం తెలుపుతూంది. గాలి పలచబడిపోతూంది. గురుత్వాకర్షణ బలం తగ్గుముఖం పట్టింది. దిక్సూచిని చూచేసరికి — భూమి సరాసరి వారికింద వున్నట్టు చూపిస్తూంది ముల్లు. నౌక వేగం సెకను సెకనుకీ అధికమవుతూ, ప్రశాంత హిమశీతల విశ్వాంతరాళంలోకి అది ప్రచండ వేగంతో దూసుకుపోతూంది.

లోశ్ తన జుబ్బా మెడగుండీలు విప్పుకోడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో వేలిగోళ్లు వూడొచ్చేశాయి — ఇక సరి, దానితో గుండె ఆగిపోయింది.

రోదసీనౌక వేగం అధికమై అధికమై నియమిత వేగం అందుకునే సరికల్లా, గుండెకాయ క్రియాశీలతలోనూ రక్తప్రసరణలోనూ, సమస్త

శరీర వ్యాపారాలలోనూ స్పష్టమైన మార్పులు కనబడతాయని లోశ్‌కి ఇదివరకే తెలుసు. ఇది అతనికి ముందుగానే తెలిసి వుండడంచేత, రోదసీనౌకలో వున్న గైరాస్కోపు ఒకదానికీ (నౌకలో రెండు గైరాస్కోపులు న్నాయి) ఒక సిలెండరుకీ ఎలెక్ట్రిక్ తీగెలతో సంబంధం కలిపి, నౌక నిర్ణీత వేగం అందుకునే సరికి, సరిగా ఆ క్షణంలో సిలెండరు నుండి ఆక్సిజనీ, అమ్మోనియాలవలణమూ గణనీయమైన పరిమాణంలో విడుదలయేటట్టుగా ఏర్పాటు చేశాడు.

వారిద్దరిలో మొదట లోశ్‌కే స్పృహ వచ్చింది. గుండెల్లో పోటు వస్తూంది. తల తిరిగిపోతూంది. బొంగరంలా గింగురు మంటూంది గుండెకాయ. బుర్రలోకి ఆలోచనలు వస్తున్నాయి. వెళ్ళిపోతున్నాయి — అసాధారణమైన ఆలోచనలు, మెరుపుల్లాంటి ఆలోచనలు, స్పష్టమైన ఆలోచనలు. అతని చలనాలన్నీ అతి తేలికగానూ కచ్చితంగానూ వున్నాయి.

ఆక్సిజన్నూ అమ్మోనియాలవణమూ ఇక అవసరం లేకపోవడంచేత, లోశ్ గొట్టాన్ని బందుచేసేసి, స్పీడామీటరుకేసి చూశాడు. రోదసీనౌక సెకనుకి 500 కిలోమీటర్ల వేగంతో పయనిస్తూంది. కేబిన్ అమిత వెలుగ్గా వుంది. పర్యవేక్ష రంధ్రం ఒకదానిలో నుండి కళ్ళు మిరుమిట్లు గొల్పుతూన్న సూర్యకిరణం కేబిన్‌లోకి వచ్చి, వెల్లకిలా పడి వున్న గూసెవ్ మీద సరాసరిపడుతూందిది అతని పళ్ళు ఇగిలించి వున్నాయి, గాజు వుండల్లా కనబడుతూన్న మిడిగుడ్లు కళ్ళగూళ్ళలో నుండి పైకి పొడుచుకొస్తున్నాయి.

లోశ్ చిట్టెడు స్మెల్లింగ్ సాల్టు తీసుకొచ్చి, గూసెవ్ ముక్కుకి వాసన చూపించాడు. గూసెవ్ తీవ్రంగా ఊపిరి పీల్చాడు. కనురెప్పలు అదిరాయి. అప్పుడు గూసెవ్‌ను చంకలకింద పట్టుకుని పైకి లేవనెత్తాడు లోశ్. కాని గూసెవ్ శరీరం బుడగలా గాలిలో తేలిపోయింది. అప్పుడు లోశ్

తన పట్టు సడలించగా, గూసెవ్ శరీరం నీటిలో కూచుని తేల్తూన్నట్టుగా కాళ్ళు పారచాపి, మోచేతులు పైకెత్తి మెల్లగా నేలమీద వాలింది. గూసెవ్ కళ్ళు తెరిచి నాలుగు వైపులా కలియజూసి:

"మిస్తిస్లావ్ సేర్గేయెవిచ్, మైకంలో వున్నానా ఏమిటి నేను?" అని రొజుకుంటూ అడిగాడు.

అన్ని కిటికీలకంటే బాగా ఎత్తుగా వున్న కిటికీ దగ్గరకెక్కి ఏమిటి కనబడుతూందో చూసి చెప్పమన్నాడు లోశ్. గూసెవ్ ఆదరా బాదరా లేచి నిలబడబోయాడు, కాని తొట్రుటుకుని కిందపడి, అప్పుడు నిటారుగా వున్న కేబిన్‌గోడను ఈగలా అంటిపెట్టుకుని, గోడకు అస్తరువేసిన తోలు కుట్లు పట్టుకుని పాకుకుంటూ కిటికీ చేరుకుని కిటికీలోనుంచి చూసి:

"చీకటి అంధకారం, మిస్తిస్లావ్ సెర్గేయెవిచ్, కళ్ళు పొడుచుకున్నా ఏమీ కనబడ్డం లేదు!" అని ప్రత్యుత్తరమిచ్చాడు.

నౌకలో సూర్యుడికేసి నిగిడించి వున్న అక్షికటకానికి లోశ్ పొగబారించిన అద్దాన్ని అమర్చి, పర్యవేక్షక రంధ్రంనుండి చూశాడు. బ్రహ్మాండమైన పూలుబంతిలా ఆ కారుచీకటి నడుమ సూర్యబింబం నవ్వుతూ స్పష్టంగా కనబడుతూంది. ఆ బింబానికి రెండు పక్కలా రెండు రెక్కల మోస్తరుగా, తెల్లగా వెలిగిపోతూన్న మబ్బుతెరలు రెండు అంటిపెట్టుకున్నాయి. దృఢంగా వున్న ఆ గోళం నుండి కుక్కగొడుగులా అవుపడుతూన్న జలధరం ఒకటి పైకి లేచింది — సూర్యుడిమీద విస్తారంగా మచ్చలు అవుపించే కాలం ఇది. దేదీప్యమానంగా వెలిగిపోతూన్న ఈ సూర్య గోళానికి కాస్త దూరాన, సూర్యునినుండి విడిపోయి వచ్చేసి, ఇంతకంటె కాస్త పేలవంగా ప్రకాశిస్తూ, అండవృత్త పథాలను పోలిన తేజోమహా సముద్రాలు సూర్యుని చుట్టూ భ్రమణం చేస్తున్నాయి.

మహాద్భుతమైన ఈ దృశ్యంనుండి — విశ్వజగత్తులో వున్న సర్వప్రాణి కోటికీ ఆధారమైన ఈ మహాగ్ని దృశ్యం నుండి — లోశ్ అతికష్టంపైన వచ్చేసి, అక్షికటకానికి మూతవేసేశాడు. మళ్ళీ సర్వమూ అంధకారమయమై పోయింది. తరువాత దానిని నిగిడించి అందులోనుండి చూశాడు. ఒక నక్షత్రంనుండి వెడలుతూ తీక్షణంగా ప్రకాశిస్తూన్న పచ్చని కిరణం అతని కంటిమీద పడింది. అలా పడిందో లేనేలేదో, ఆ పచ్చని కిరణం తటాలున నీలివర్ణం ధరించింది. ఇదే సిరియస్ తార — అంతరిక్షంలో వెలుగుతూన్న వజ్రరాజం, ఉత్తరాకాశానికి మకుటాయమానమైన నక్షత్రం.

మూడో పర్యవేక్షక రంధ్రం దగ్గర కెళ్ళాడు లోశ్. అక్కడున్న అక్షి కటకాన్ని నిగిడించి, కటకాన్ని తన చేతిరుమాలుతో శుభ్రంగా తుడిచి, మళ్ళీ కంటితో చూశాడు. గుండె చివుక్కుమంది. తలమీద వెంట్రుకలు నిక్కించుకున్నట్టు అనిపించింది.

ఆ చీకటిలో కాస్త దూరాన మసక మసకగా వున్న మబ్బు చుక్కలు రోదసీనౌకకు పక్కగా చేరువనుండే ఎగురుతూండడం అతనికి కనబడింది.

"ఏమిటో మన పక్కనుంచే ఎగురుతూంది!" అని కేకేశాడు గూసెవ్ భయోద్రేకంతో.

కిందకు దిగుతూన్న ఆ చుక్కలు అంతకంతకు దూరమైపోతూ మరింత స్పష్టంగా ప్రకాశిస్తూ కనబడుతున్నాయి. అక్కడక్కడ తెగిపో యున్న వెండి గీతల్లా వెండి తీగెల్లా మొదట కనబడి, ఆ తరువాత రంపం పళ్ళలా వున్న పర్వతశిలల అంచులు స్వచ్ఛంగా చిత్రించినట్టు అవుపడ్డాయి. తమ రోదసీనౌక ఏదో ఒక నభోమూర్తిని సమీపించినట్టూ, ఆ మూర్తి గురుత్వాకర్షణ క్షేత్రంలోకి నౌక ప్రవేశించినట్టూ, ఆ గోళం చుట్టూ ఒక ఉపగ్రహంలా నౌక పరిభ్రమణం ఆరంభిస్తూన్నట్టూ స్పష్టమైపోయింది.

లోశ్ చేతులు గజగజ వణకిపోతూన్నాయి. అలాగే రియోస్టాటుల మీటలకోసం తడుముకుని, మీటలను ఎంత దూరంవరకూ లాగడానికి వీలవుతుందో, తత్ఫలితంగా సంభవించే అత్యధిక ప్రచండ వేగానికి రోదసీ నౌక పేలిపోయే ప్రమాదం వుందని తెలిసినప్పటికీ, అంతదూరమూ లాగాడు. వారి సీట్లకింద వున్న చలనయంత్రం ఒక్కపాళంగా దద్దరిల్లి పోయి, నిప్పులుకక్కడం మొదలెట్టింది. ఆ చుక్కలూ, అంతరిక్షంలో తళతళ ప్రకాశిస్తూన్న పర్వత శిఖరాలూ వెంటనే దూరమైపోయాయి. తేజోవంతమై మెరుపులు మెరుస్తూన్న ఆ నభోమూర్తి ఉపరితలం అంతకంతకు మరింత పెద్దదవుతూ దగ్గరకు వచ్చేస్తూంది. నిర్జీవమై మోడు వోయిన మైదాన ప్రదేశంపై అడ్డుగా తీర్చిదిద్దిన నల్లని పర్వత పంక్తులు ప్రసరిస్తూన్న సుదీర్ఘ నిశితచ్ఛాయలు వారికి స్పష్టంగా కనబడతూన్నాయి.

ఆ పర్వతాలను సరాసరి ఢీకొనడానికే పయనిస్తూంది రోదసీనౌక — ఒక పార్శ్వమంతా సూర్యకిరణాల్లో వెలిగిపోతూ చేతికి అందుకొనస్తూన్నాయా అన్నంత దగ్గరగా వున్నాయి ఆ పర్వతాలు. లోశ్ అనుకున్నాడు (అతని మనస్సు నిర్మలంగా వుంది, ఆలోచనలు తేటగా వున్నాయి, బుర్ర సరిగ్గా పనిచేస్తూంది.): "ఈ గ్రహంవైపు నౌక తన కంఠాన్ని గిర్రున తిప్పకొనగల్గే వ్యవధిలోపలే — మరు క్షణంలోనే నౌక దీనితో ఢీకొని కూలిపోక తప్పదు, ఇక వచ్చేసింది ఆఖరి గడియ — ఇకంతా సరి!"

సరిగా ఆ క్షణంలోనే — కొండల మధ్య వున్న నేలా, చదునుగా ఏకాండిగా బల్లపరుపుగా వున్న మైదానమూ, ఆ మైదానంపై ఒకదానిపై ఒకటి వరుసులు తీర్చి మెట్లు పెట్టినట్టున్న కోటబురుజుల శిథిలాలూ కనబడ్డాయి లోశ్‌కి... సూదుల్లా వున్న పర్వత శిలలను రోదసీనౌక రాసుకుపోతుందేమో అన్నట్టుగా వాటి పక్కనుండే దూసుకుపోయింది... అవ

తల వైపు — అంతా కారునలుపు, అంధకారం, అగాధం. ములుకుల్లా పొడుచుకొస్తూన్న ఆ పర్వత పార్శ్వాలు లోహపు స్తరాలతో ధగధగ తళుకులు మెరుస్తున్నాయి. ఏ అనామధేయ గ్రహం శిథిలావశేషమో అయిన ఈ ఖండం — అనంతాభిముఖంగా విశ్వాంతరాళంలో తన వ్యోమయానం సాగించుతూన్న ఈ తునుక — మరో గడియకల్లా ఎంతో వెనకబడిపోయి అదృశ్యమైపోయింది. గాఢాంధకార గగన శూన్యంలో రోదసీనౌక ప్రచండ వేగంతో పయనించుతూంది.

తటాలున కేకేశాడు గూసెవ్:

"మన ముందున్నది — చంద్రుడా ఏమిటి?"

అలా గూసెవ్ కేకేసి, వెనక్కి తిరిగి, గోడకు అంటిపెట్టుకునే — నాలుగు కాళ్ళా చాపుకొన్న కప్పలా — గాలిలో తేలిపోతూ, బొంగురు గొంతుతోనే తిట్టుకుంటూ, తన శక్తినంతా ఉపయోగించి గోడను మళ్లీ పట్టుకున్నాడు. అంతవరకూ నిటారుగా నిలబడున్న లోశ్కి కాళ్ల పట్టు సడలినట్టు అనిపించి, ఇక గాలిలో తేలిపోనారంభించాడు. అలా తేలిపోతూన్నప్పటికీ నౌక గోడకు బిగించి వున్న దూరదర్శిని గొట్టాన్ని గట్టిగా పట్టుకుని, అందులోనుంచి చూశాడు — వెండి పళ్లెంలా ప్రకాశిస్తూంది అంగారక బింబం!

# అవరోహణ

అక్కడక్కడ మబ్బులు అలుముకొని, వెండి పళ్లెంలా ప్రకాశిస్తూన్న అంగారక బింబం అంతకంతకు పెద్దదవుతూంది. దక్షిణధ్రువానికి అంటిపెట్టుకున్న హిమబిందువు తళతళా మెరిసిపోతూంది. దానికి దిగువగా పొగమంచు తెర ఒకటి ఉత్తరీయంలా ఆ బింబాన్ని ఆవరించి, తూర్పున

మధ్యరేఖ వరకూ విస్తరించి, ప్రధానోత్తర రేఖ సమీపంలో ఊర్ధ్వంగా లేచి, ఏదో కొద్దిగా మెరుస్తూన్న వస్తువు ఉపరితలాన్ని మెల్లగా చుట్టు ముట్టుచూ, బింబం పడమటంచున రెండవ అగ్రం ఏర్పడేటట్టు రెండు భాగాలుగా చీలిపోయింది.

మధ్యరేఖ సమీపంలో నల్లగా గుండ్రంగా వున్న మచ్చలు ఐదు స్పష్టంగా అవుపడుతున్నాయి. రెండు సమత్రిభుజాలు, మూడోది సన్నని పొడుగాటి త్రిభుజమూ ఏర్పడేటట్టుగా ఈ ఐదు బిందువులనూ రుజు రేఖలు కలుపుతున్నాయి. తూర్పు త్రిభుజ పాదం దగ్గర ఒక చాపం వుంది. ఈ చాపం మధ్యనుంచి, దాని చిట్టచివరను తాకుతూ ఇంకొక అర్ధ వలయం వుంది. మధ్యరేఖ దగ్గర వున్న బిందుసమూహానికి తూర్పు పడ మరలుగా చెదురు మదురుగా వెదజల్లినట్టున్న రేఖలూ, చుక్కలూ, అర్ధ వలయాలూ ఎన్నో వున్నాయి. ఉత్తర ధ్రువం అంధకారంలో అదృశ్యమై పోయింది.

ఈ గీతల అల్లికను లోశ్ ఎంతో సేపు విదానంగా అవేక్షించాడు. నిరంతరమూ మారిపోతూ, ఖగోళశాస్త్రజ్ఞుల మతులను చెడగొట్టుతూ కంగారు పెట్టేస్తూన్న రేఖాగణిత చిత్రాలు, మానవబుద్ధికి అతీతమైన అంగారక గ్రహం కాల్వలు ఇవే కదా అనుకున్నాడు. స్పష్టంగా కానవస్తూన్న ఈ రేఖాచిత్రంలోనే ఇమిడి వుండి, లీలామాత్రంగానూ మసక మసకగానూ కనబడుతూన్న రెండో గీతల అల్లిక కూడా లోశ్‌కి అవుపడింది.

ఈ రేఖాగణిత చిత్రాలకి లోశ్ తన నోటుబుక్కులో జాగ్రత్తగా నకలు రాసుకున్నాడు. తటాలున అంగారక బింబం అమాంతమూ గజ గజ వణకడం ఆరంభించి, అక్షికటకం ఎదుటనుంచి చప్పున దూసుకుని పోయింది. లోశ్ రియోస్టాటుల దగ్గరకు చెంగున దూకి కేకేశాడు:

"అంగారక వాతావరణంలో పడ్డాం మనం, అలెక్సేయ్ ఇవానొవిచ్! మనని లాగేస్తూందది! మనం పడిపోతున్నాం!"

రోదసీనౌక తన కంఠంతో గ్రహంవైపు తిరిగింది. లోశ్ చలన యంత్రం జోరును తగ్గించి, తరువాత స్విచ్చి 'ఆఫ్' చేసేసి దానిని ఏకంగా ఆపుచేసేశాడు. ఫలితంగా వేగంలో సంభవించిన మార్పు వెనుకటంత బాధాకరమని ఇప్పుడు అనిపించలేదు. అయినప్పటికీ ఆ నిశ్శబ్దమే ఒక చిత్రహింసగా తయారై, ఇక దానిని భరింప శక్యంగాక, గూసెవ్ తన తల కాయను రెండు చేతులతోనూ పట్టుకుని, చెవులు గట్టిగా మూసుకున్నాడు.

లోశ్ నౌక నేలపై పడుకుని, క్షణక్షణానికీ మరింత మరింత పెద్ద దిగానూ మరింత మరింత గుండ్రంగానూ పెరిగిపోతూన్న ఆ రజితబింబాన్ని అలా చూస్తున్నాడు. అంధకార శూన్యంలోనుండి అది తమకేసి దూసుకు వస్తూన్నట్టనిపించింది లోశ్‌కి.

లోశ్ రియోస్టాటులకు స్విచ్చ్ వేశాడు. రోదసీనౌక గజగజ వణకి పోయింది — అంగారక గ్రహంయొక్క గురుత్వాకర్షణ బలాన్ని అధిగమిం చేందుకు గుంజుకుంటూనూ. కిందకి దిగిపోతూన్న నౌక జోరు తగ్గుతూ వచ్చింది. ఇక ఇప్పుడు అంగారకుడు ఆకాశాన్నంతనూ కప్పేసి అంతకంతకు మసక మసకగా అయిపోయి, ఆ బింబం అంచులు కంచం అంచులవలె లోప లికి గోడుగా వంగి వున్నట్టు అవుపడింది.

ఈ ఆఖరి నాలుగు గడియలూ అతి ఘోరమనిపించాయి — అవరో హణ జోరుకి వాళ్లతల తిరిగిపోయింది. అంగారక గ్రహం ఆకాశాన్ని కప్పే సింది. దూరదర్శని కటకాలు తేమకి చెమ్మగిలిపోయాయి. పొగమంచు ఆవ రించి వున్న ఒక మైదానంపై ఊర్ధ్వంగా ఎగురుతూన్న మేఘపుంజం లోనుంచి రోదసీనౌక ప్రచండవేగంతో కిందకి పడిపోతూ తుళ్లిపోతూ గర్జిస్తూ — ఇక కొనకి మెల్లగా అవరోహణ ప్రారంభించింది.

"కిందకి దిగుతున్నాం!" అని కేకవేసేందుకు మాత్రమే లోశ్‌కి వేళ చిక్కింది. అలా కేకేసి, చప్పన మోటారు ఆపేశాడు. మోటారుని ఇంకా ఆపేడో లేనేలేదో — ఉత్తరక్షణంలో, చెంగున అంతరు కొట్టినట్టు లోశ్ దుభీమని నౌక గోడను గుద్దుకుని పడ్డాడు. రోదసీనౌక దుబ్బుమని నేలమీద కూలి, ఒక పక్కకు ఒరిగి పడిపోయింది.

. . . . . . . . . . . . . . . . . .

వాళ్ల కాళ్లు గజగజ వణికాయి, చేతులు కంపించిపోయాయి, గుండె పేలిపోతుందేమో అన్నట్టు కొట్టుకుంది. లోశ్, గూసెవ్‌లు మాటా మంతీ లేకుండా ఆదరా బాదరా కేబిన్‌లో వున్న వస్తువులన్నిటినీ ఎక్కడ వుండాల్సిన వాటిని మళ్లీ అక్కడ సర్ది, భూలోకంనుంచి తమతో కూడా తీసుకొచ్చి, ఇప్పుడీ అవరోహణ జోరుకు సగం ప్రాణాలు పోయి, కొనవూపిరితో వున్న చుంచెలుకను పర్యవేక్షక రంధ్రం ఒకదానినుండి వెలుపలకి గిరవాటేసేశారు. అలా విసిరేయగా నేలమీద పడిన చుంచు మెల్లగా కదిలి, ముట్టె పైకెత్తి, మీసాలు కదిపి, నాలుకతో ముఖం నాకుకుంది. ఆ గాలి ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు అనువైనదేనని వాళ్లకి తెలిసిపోయింది.

నౌకాద్వారానికున్న స్క్రూలు విప్పదీసి, ద్వారం తెరచి, లోశ్ తన నాలుకతో పెదవులు తడిచేసుకుని, బొంగుపోయిన గొంతుకతో:

"ఎలాగైతేనేం సాధించామే మనం, అలెక్సేయ్ ఇవానొవిచ్! ఇక బైటకెళ్దాం!" అన్నాడు.

ఇంతవరకూ తొడుక్కొనున్న ఫెల్ట్ బూడ్సులూ, ఫర్ కోట్లూ విప్పేసుకున్నారు. గూసెవ్ తన రివాల్వరును (ఎందుకేనా మంచిదని) పటకాకు తగిలించుకుని, లోలోన నవ్వుకుని పళ్లిగిలించి తలుపు తెరచాడు.

# అంగారకుడు

రోదసీనౌకలోంచి కిందకు దిగీ దిగడంతోనే వారికి మొట్టమొదట అవుపడినది — తుపానుతో కొట్టుకుంటూన్న సముద్రంలా, నీల మేఘచ్ఛాయలతో కళ్లు మిరుమిట్లు కొలుపుతూ అగాధంలా వున్న ఆకాశం.

అగ్నిగోళంలా కిరణాలు విరజల్లుతూన్న సూర్యుడు అంగారక ఆకాశంలో ఊర్ధ్వాన ప్రకాశిస్తున్నాడు. మహా ప్రవాహంలా వెడలుతూన్న స్వచ్ఛమైన నీలవర్ణపు తేజస్సు — స్పష్టంగా కానవస్తూన్న దిగ్మండల రేఖనుంచి ఆకాశమధ్యం వరకూ — శీతలంగా పారదర్శకంగా వుంది...

"వీళ్ల సూర్యుడు నవ్వుతూ చల్లగా భలేగా వున్నాడే," అన్నాడు గూసెవ్ తుమ్ముతూ — అంత ఊర్ధ్వంగా, కనుచూపుకైనా అందకుండా వున్నాయి ఆ శ్యామల వర్ణపు ఆకాశోన్నతాలు. వారికి గుండెలు బిగుసుకున్నట్టనిపించింది; కణతలు దడదడ కొట్టుకుంటున్నాయి. అయినప్పటికీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సులభంగా వున్నాయి — గాలి పలుచగానూ పొడిగానూ వుంది.

బల్లపరపుగా చదునుగా కమలాపండు ఛాయనున్న మైదానంపైన వుంది రోదసీనౌక. దిగ్మండలం మిక్కిలి చేరువగా వుంది — చేయి చాచి అందుకోవచ్చు అన్నట్టుగా. నేల లోతైన నెరియలు కొట్టి వుంది. ఎటు చూసినా కొవ్వొత్తి దీపాల సెమ్మెల్లా శాఖోపశాఖలతో ఎత్తుగా పెరిగిన బ్రహ్మజెముడు చెట్లు గంటంతో గీసినట్టుగా స్పష్టమైన ఊదారంగు నీడలు పరుస్తున్నాయి. పొడిగాలి వీస్తూంది.

లోశ్, గూసెవ్‌లు ఒక గడియ నాలుగు దిక్కులూ పరకాయించి చూసి, ఆ తరువాత ఇక బయల్దేరారు. మెత్తగా పొడిపొడిగా గుల్లబా

బుగ్గిలా వున్న ఆ నేలమీద అడుగు పెట్టేసరికల్లా కాలు కూరుకుపో తూన్నప్పటికీ, నడక మాత్రం అసాధారణంగా సులువుగా వుంది. గుజ్జు కట్టి యేపుగా వున్న పొడుగాటి బ్రహ్మచెముడు చెట్ల పక్కనుండి నడు స్తూ లోశ్ వాటిని చేతితో ముట్టుకున్నాడు. ముట్టుకునీ ముట్టుకోవడంతో, యేదో పెనుగాలి దానిని వంచేసినట్టు అది మొదలంటా వంగిపోయి, కండ కట్టి పొడుగ్గా వేళ్లల్లావున్న మసరురంగు ముళ్లు లోశ్ చేతులకేసి చాచు కున్నాయి. ఆ చెట్టు మొదలును గూసెవ్ కాలితో ఒక్క తాపు తన్నేసరికి — ఇంకేముంది, ఆ వెధవ చెట్టు టప్పుమని విరిగి పడిపోయింది, ముళ్లన్నీ ఆ ఇసుకలో పాతుకుపోయాయి!

ఒక అరగంట సేపు వారు అలా నడిచి వెళ్లారు — ఎంత దూరం వెళ్లినా వారిముందు ఆ బ్రహ్మచెముడులూ, ఆ ఊదారంగు నీడలూ, ఆ నెరియలు కొట్టిన నేలావున్న ఆ కమలాపండు రంగు మైదానం అలా విస్త రించే వుంది. అంతవరకూ సూర్యుని కెదురుగా వెళ్తూన్నవారు, తమకు సూర్యుడు ఒక పక్క వుండేటట్టుగా దక్షిణదిశకు మళ్లేసరికి, నేలలో ఏదో విశేషం వున్నట్టు కనబడింది లోశ్‌కి. నడుస్తూన్న వాడల్లా తటాలున ఆగిపోయి, గొంతుకూచుని మోకాలు చరిచాడు.

"అలెక్సేయ్ ఇవానొవిచ్, నేల దున్నినట్టుందే!"

"అదేమిటి?"

వాళ్లిద్దరూ నేలను జాగ్రత్తగా పరీక్షించారు. అలా పరీక్షించేసరికి, నేలను లోతుగా తవ్వి గట్లు వెడల్పుగా పోసి అక్కడక్కడ ఏర్పాటుచేసిన బ్రహ్మచెముడు మళ్లూ, సరాసరి తిన్నగా వరుసల్లో నాటిన బ్రహ్మచె ముడు చెట్లూ వున్నట్టు స్పష్టంగా కనబడింది. అక్కడనుంచి మరో నాలుగు అడుగులు ముందుకు వేసేసరికి, గూసెవ్ కాలికి ఏదో తగిలింది. అదేమిటి

చెప్మా అని చూసేసరికి — అదొక రాతిపలక, రాతిపలక మధ్యను పెద్ద గుండ్రని కంచు గొళ్లెం. గొళ్లేనికి తాడుముక్క ఒకటి కట్టి వుంది. ఇదంతా చూసి లోశ్ గడ్డం గోక్కున్నాడు, కళ్లు మెరిశాయి.

"అలెక్సేయ్ ఇవానొవిచ్, ఏమిటంటారు ఇదంతా?"

"ఏమిటా? ఇదొక పొలం అని తెలుస్తూందిగా."

"అయితే మరి — ఈ గొండెం ఎందుకిక్కడ?"

"దీని సిగతరగా! ఈ బండకి ఈ గొండెం ఎందుకో?"

"ఎందుకంటే — నీటిలో తేల్తూన్న "బోయ్"లను తగిలించడానికి. అదిగో ఆల్చిప్పలు కనబడుతున్నాయిగా. ఎండిపోయిన కాల్వగర్భం అన్నమాట ఇది."

"అవునుగాని — నీటి బొట్టు అంటూ ఎక్కడా కనబడదే!" అన్నాడు గూసెవ్.

అక్కడనుంచి వాళ్లు పడమట దిక్కుగా తిరిగి, బ్రహ్మచెముడు మళ్లలోనుంచి నడిచారు. సన్నంగా పొడుగ్గా కందిరీగలా కిందకి వాలిపోయున్న శరీరంగల పక్షి ఒకటి గబగబా రెక్కలు ఆడించుకుంటూ ఆ పొలం మీద నుండి ఎగిరి వెళ్లిపోయింది. నడుస్తూన్నవాడల్లా గూసెవ్ టక్కున ఆగిపోయి, తన రివాల్వరు తీయబోయాడు, కాని ఆ క్షణంలో పక్షి శ్యామలవర్ణపు ఆకాశంలోకి శరవేగంతో ఎగిరిపోయి, చేరువనున్న దిగ్మండలంలో అదృశ్యమైపోయింది.

ఇక్కడ బ్రహ్మచెముడులు మరింత పొడుగ్గా, మరింత వలంగా మరింత కండబారి వున్నాయి. ఆ ముళ్లపొదల చిట్టడవిలోనుండి వారు ఎంతో జాగ్రత్తగా నడవాల్సి వచ్చింది. నారింజ పండు వర్ణపు శరీరంపైన ఎర్రని పొలుసులతో మెరుస్తూన్న బల్లుల్లాంటి జంతువులు వాళ్ల కాళ్ల

కిందనుంచీ చరచరా పరుగెత్తుతున్నాయి. ముళ్లబంతుల్లాంటి వింత జంతువులు వారి పక్కనుండి తుప్పుతుప్పుమని పాకుకుంటూ ముళ్లపొదల్లోకి మాయమైపోతున్నాయి. లోశ్, గూసెవ్‌లు జాగ్రత్తగా అడుగులు వేసుకుంటూ ముందుకు సాగారు.

తెల్లగా, సుద్దలా, నిట్టనిటారుగా పైకిలేచిన గట్టు దగ్గర ఆఖరయాయి బ్రహ్మచెముడు చెట్లు. ఏనాడో పురాతన కాలంలో చెక్కిన రాతి బండలతో ఆ గట్టు తాచినట్టు ప్రత్యక్షంగానే కనబడుతూంది. రాళ్ల మధ్యనుండీ, బీటల సందుల్లోనుండీ ఎండిపోయిన నాచుమొక్కలు వేళ్లాడుతున్నాయి. తాచిన రాతిబండ ఒకదానిలో, పొలంలో కనబడిన గొళ్లెంలాంటిదే ఇంకొక గొళ్లెం స్క్రూ కోసి బిగించి వుంది. వెన్నుపూసలు ఎత్తుగా పైకి తోసుకొస్తూన్న బల్లులు హాయిగా ఎండలో కునుకు తీస్తున్నాయి.

లోశ్, గూసెవ్‌లు ఎత్తుగా నిట్టంగా వున్న ఆ గట్టు ఎక్కారు. గట్టుమీదకెక్కి నిలబడి చూస్తే, ఎత్తుపల్లాలతో ఎగుడు దిగుడుగా వున్న మైదానం కనబడింది వారికి. మైదానం కూడా నారింజపండు వర్ణంలోనే వుంది, కాని ఛాయ మాత్రం కొంచెం కగ్గినట్టుంది. పొట్టిగా మరి గుజ్జుల్లా, ఇంచుమించు పర్వత దేవదార్లను పోలిన చెట్లూ, దూరాన వాయవ్యదిశను పర్వత పంక్తి ఒకటి కనబడింది. ఘనీభవించి పోయిన అగ్ని జిహ్వల్లా కొనతేరి వున్నాయి ఆ పర్వత శిఖరాలు. శిఖరాగ్రాలనున్న మంచు ధగధగ మెరుస్తూంది.

"ఇక మనం వెనక్కి మళ్లడం మంచిదేమో?" అన్నాడు గూసెవ్. "ఏదో కాసింత కడుపులో వేసుకుని కాళ్లు చాపుకొంటే నయం. ఇలా మనం తిరగడం మొదలెడితే చిత్తుగా అలసిపోతాం. ఎక్కడా మనిషి జాడేనా కనబడ్డం లేదు."

ఆ గట్టువీూద మరి కాస్సేపు వాళ్లిద్దరూ తచ్చాడారు. మైదానం చూస్తే – గుండె బేజారెత్తి పోయినట్టుగా ఏడుస్తూ దిక్కుమాలినట్టుంది.

"ఎలాంటి చోటకొచ్చాం రా బాబ్బా!" అని నిట్టూర్చాడు గూసెవ్.

గట్టు దిగి, రోదసీనౌక వున్న చోటకి బయల్దేరారు. ఆ బ్రహ్మ చెముడు తుప్పల మధ్య నౌక ఎక్కడుందో తెలుసుకోవడమే వాళ్లకెంతో కష్టమై, ఎంతసేపో పట్టింది. గూసెవ్ తటాలున అన్నాడు – చెవిలో రహస్యం చెబుతూన్నట్టు మెల్లగా అన్నాడు:

"ఇదిగో – ఇక్కడుంది!"

హుటాహుటిని అతడు అలవాటుపడిన చేతితో తన రివాల్వరును ఒరలోనుంచి చట్టన పైకి తీసి గురి పెట్టాడు.

"అరేయ్! ఎవడివిరా నువ్వు మా నౌక దగ్గరకి వెళ్లడానికి, వెధవా? పోతావా, గుండేసి పేల్చేయమన్నావా?"

"ఎవడి మీూదయ్యా ఆ కోపం అంతానూ?"

"నౌక మీూకక్కడ అవుపిస్తూందిగా?"

"ఆ! అవుపిస్తూందే!"

"కుడివైపున దానిమీూద ఎవడో కూచున్నాడయ్యా!"

చివరకి లోశ్‌కి కూడా కనబడింది అక్కడేదో వున్నట్టు. దాంతో ఇద్దరూ, ఇసుకలో కాళ్లు కూరుకుపోతూ రోదసీనౌక దగ్గరకు పరుగెత్తారు. జీవం ఒకటి నౌకకు సమీపంగా కూచునుంది. వీరు రావడం చూసి, ఆ జీవం తప్పుకొని, బ్రహ్మచెముడు చెట్లమధ్యకి దూరిపోయి, చెంగున ఎగిరి, చర్మంతో కప్పిన పొడుగాటి రెక్కలు బారగా విప్పి, కరకరమని శబ్దం చేసుకుంటూ ఠైంయ్‌మని గాలిలోకి లేచి, వాళ్ల నెత్తిమీూదనే కాస్త ఎత్తున గిర్రున ఒక వలయం చుట్టి, రెక్కలు ఆడించుకుంటూ ఆకాశంలోకి ఎగిరి

పోయింది. ఇప్పుడు వారి కళ్ళబడిన ఈ జీవాన్ని ఇదివరకు వారు చూసి, పక్షి అనుకున్నారు. గూసెవ్ రివాల్వరుతో గురి చూశాడు. కాని లోశ్ దానిని అతని చేతిలోనుండి లాగిపారేశాడు.

"ఏమిటీ బుద్ధిలేని పని? వాడు అంగారకవాసి అయ్యా!.." అని లోశ్ గట్టిగా అరిచాడు.

ఆ నీలమేఘచ్ఛాయ ఆకాశాన, నిటారుగా వాళ్లపై చక్కర్లు కొడుతూన్న ఆ వింత మనిషి కేసి గూసెవ్ నోరు వెళ్లబెట్టుకుని చూశాడు. లోశ్ తన చేతిరుమాలు తీసి ఆ వింత పక్షికేసి వూపాడు.

"మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్, జాగ్రత్తయ్యోవ్! వీడెవడో ఆ మీద నుంచి మనని గుండేసి పేల్చేయగలడు," అన్నాడు గూసెవ్.

"చేతిలో రివాల్వరెందుకయ్యా మీకు? దాన్ని అలా పారేయండి!" అని కేకేశాడు లోశ్.

ఆ పెద్దపక్షి కిందకు దిగింది. ఇప్పుడు వాళ్లకి స్పష్టంగా కనబడింది — అదొక విమాన సాధనమనీ, దాని జీనుమీద మనిషిలాంటి వాడొకడు కూచున్నాడనీ. ఆ సాధనానికి చెరోవైపునా అర్ధచంద్రాకారపు రెక్క ఒకటుంది. ఇటూ అటూ వున్న ఈ రెక్కలు రెండూ ఆ మనిషి బుజాల ఎత్తున కిందకీ మీదకీ కొట్టుకుంటున్నాయి. రెక్కలకు కాస్తదిగువగా ఏదో చక్రం లాంటిది ఒకటి గిర్రున తిరుగుతూంది — బహుశ అది ప్రొపెల్లర్ అయి వుంటుంది. జీను వెనకాతల తోకలాంటి పృష్ఠ వుంది. ఈ పృష్ఠనుండి అటువైపూ ఇటువైపూ తీగెలతో లీవర్లు వున్నాయి. ఆ సాధనం అంతా చలనసామర్థ్యం కలిగి మనిషి శరీరంలా ఎక్కడికక్కడకు వంగేందుకు వీలుగా వుంది.

అది గాలిలో కొంతవరకూ కిందకి దిగి, ఒక రెక్క మీదకీ ఒక రెక్క కిందకీ ఏటవాలుగా పెట్టుకుని, ఎగిరి వెళ్లిపోయింది. అంగారకవాసి కోడిగుడ్డు ఆకారపు హెల్మెట్టు పెట్టుకున్నాడు. హెల్మెట్టుకి ముందుకు పొంచి వున్న అంచు వుంది. అతడు కళ్లకి గాగుల్సు పెట్టుకున్నాడు. ముఖం కోలగా వుంది. ఇటుక రంగు. ముఖం ఎండిపోయుంది. కొనతేలిన ముక్కు. అతడు నోరు తెరచి, పక్షిలా కిచకిచమంటూ ఏదో అని, తరువాత టపటప రెక్కలు ఆడించుకుని, కిందకి వాలి, ఆ సాధనం కాస్త దూరం నడచిన తరువాత, జీనుమీదనుండి చెంగున కిందకి గెంతి, వీరిద్దరికీ పాతిక గజాల దూరంలో ఆగాడు.

అంగారకవాసి పొడగరీ కాడూ, పొట్టి టంగణా కాడూ – మామూలు గానే వున్నాడు. పొడుగ్గా, వెడల్పుగా వున్న పసుప్పచ్చని జుబ్బా తొడుక్కున్నాడు. సన్నంగా ఎండిపోయి, పుల్లల్లా వున్న అతడి కాళ్లకు ముణుకులకు ఎగువగా పట్టీలు గట్టిగా చుట్టి వున్నాయి. కింద పడిపోయున్న బ్రహ్మచెముడు చెట్లకేసి కోపంగా తర్జనితో చూపించాడు. కాని అది చూసి లోశ్, గూసెవ్‌లు అతనికేసి ఒక అడుగు ముందుకు వేశారో లేనేలేదో, అతడు చెంగున జీనుమీదకి దుమికి, వారికేసి తర్జని ఝళిపించుతూ, ఇంచుమించు ఏమాత్రమూ ముందుకు సాగకుండానే, సూటిగానే నిటారుగా ఎగిరిపోయి, మళ్లీ నేలమీద వాలి, పక్షికంఠంతో ఏదో కేకలేసుకుంటూ, విరిగి నేలకొరిగిన చెట్లకేసి వేలుపెట్టి చూపించాడు.

"మనమీద మండిపోతున్నాడు, వెధవ!" అంటూ గూసెవ్ అంగారకవాసుని వైపు తిరిగి, కేకేశాడు: "ఏమిట్రలా అరుస్తావ్? ఓరి దిష్టిబొమ్మ వెధవా, ఆ యేడుపేదో మాదగ్గరకొచ్చి ఏడవరా! నిన్నేం మింగేయంరా మేం!"

''వాణ్ణి అలా హడలుగొట్టేయకండి, అలెక్సేయ్ ఇవానొవిచ్! అతగాడికి రష్యన్ అర్థంకాదు. మనం కూచుందాం, లేకుంటే మనదగ్గరకి అసలు రాడు.''

ఎండకి బాగా కాలిన నేలమీద చదికిలబడ్డారు లోశ్, గూసెవు లిద్దరూ. తాము భోజనం చేయబోతున్నామని సంజ్ఞ చేశాడు లోశ్. గూసెవ్ సిగరెట్టు వెలిగించుకుని కాం(డించి వుమ్మాడు. అంగారకవాసి వాళ్ళకేసి నిదానంగా చూసి, కిలకిలమనడం మానివేసినా పెన్సిలులా సన్నంగా పొడుగ్గా వున్న తర్జనిని మరికాస్సేపు ఝళిపించి, ఆ తరువాత తన జీనుకి తగిలించి వున్న సంచిని తీసి, దానిని వారికేసి గిరవాటేసి, తన విమాన సాధనంమీద కెక్కి, ఆకాశంలోకి బాగా ఎత్తుగా ఎగిరి, ఉత్తరదిశగా దిగ్మండలంలోకి అదృశ్యమైపోయాడు.

ఆ సంచిలో బల్లపరపు సీసా ఒకటీ, డబ్బాలూ వున్నాయి. సీసాలో ఏదో (దవం వుంది. గూసెవ్ డబ్బాలు తెరిచాడు. ఒకదానిలో ఘాటువాసన వేస్తూ ఏదో లేహ్యం ముద్దలాంటిదీ, రెండో దాంట్లో హల్వా వుండల్లాంటివి కొన్నీ వున్నాయి. గూసెవ్ వాటిని వాసన చూసి:

''ఛీ! చూడండి, ఎలాంటివి తింటున్నారో వీళ్ళు!'' అన్నాడు.

గూసెవ్ రోదసీనౌకలోకి వెళ్ళి,ఒక బుట్ట తినుబండారాలు తీసుకొచ్చి, ఎండు (బహ్మచెముడు మట్టలు ఏరుకొచ్చి, ఆ చిదుగులకి అగ్గిపుల్ల ముట్టించాడు. చిదుగులు భగ్గున మండకపోయినా, సన్నని పొగ లేచి, సెగ మాత్రం జోరుగా వేసింది. ఆ సెగని ఒక డబ్బా కారన్డ్ బీఫ్ వెచ్చచేసి, నేలమీద శుభ్రమైన రుమాలు పరచి, దానిమీద తినుబడి వస్తువులన్నిటినీ వుంచాడు. ఇద్దరూ భోజనం ఆరంభించారు. తినడం మొదలుపెట్టిన తరువాత, ఇక

ప్పుడు తెలిసింది వాళ్లకి, తమకు ఎంత ఆకలి వేస్తూన్నదీ. తిండికి వాచిపోయి నట్టు ఆబతో తిన్నారు.

సూర్యుడు నడినెత్తినున్నాడు. గాలి పడిపోయింది. తాపం అధికంగా వుంది. వారు కూచున్న చోటకు, నారింజపండు రంగు దిబ్బమీదనుండి రోకలిబండ ఒకటి వారిదగ్గరకు పాకుకుంటూ వచ్చింది... గూసెవ్ దానికేసి ఒక బెడ్డు పెచ్చు విసిరాడు. అది తన ముక్కోణపు కొమ్ము తలకాయ పైకెత్తి, కదలకుండా మెదలకుండా శిలావిగ్రహంలా అలా వుండిపోయింది.

లోశ్ గూసెవ్ సిగరెట్టు ఒకటి అడిగి, నేలను సాగిలబడి, బుగ్గ కింద చెయ్యిపెట్టుకుని, సిగరెట్టు కాల్చుకుంటూ నవ్వాడు.

"మనం ఎన్నాళ్లు ఉపవాసం చేశామని మీ ఉద్దేశం, అలెక్సేయ్ ఇవానొవిచ్?" అని అడిగాడు లోశ్.

"అదేమిటి, మ్సిస్లావ్ సెర్గేయెవిచ్? నిన్న సాయంత్రం భోం చేశానే — బయల్దేరేముందు."

"అబ్బే, నిన్న భోజనమేమిటి, నేస్తంగారూ? మనం భోంచేసి ఈ వాలటికి ఇరవైమూడు రోజులో ఇరవైనాలుగు రోజులో అయిందండి!"

"ఎన్నాళ్లు?"

"మనం పెట్రోగ్రాడ్‌లో బయల్దేరింది నిన్నను — ఆగస్టు 18 న. ఈవేళేమో సెప్టెంబరు 11. ఆశ్చర్యపడతా రెందుకలా?"

"నాకేం బోధపడ్డం లేదు — నా బుర్రకెక్కడం లేదు, మ్సిస్లావ్ సెర్గేయెవిచ్!"

"నాకూ సరిగ్గా బోధపడ్డం లేదు. సాయంకాలం 7 గంటలకి మనం బయల్దేరాం. ఇప్పుడేమో మధ్యాహ్నం 2 గంటలైంది. నా వాచీ ప్రకారం మనం భూమిని విడిచిపెట్టి 19 గంటలైంది — కాని మన కార్ఖానాలో

వున్న గడియారం ప్రకారం మనం భూమిని విడిచిపెట్టి సుమారు నెలరోజులవుతుంది. రైల్లో ప్రయాణం చేస్తూన్నప్పుడు మనకి నిద్రపట్టి పోయి, రైలు ఆగగానే, లేకుంటే మనకి మెలకువ వచ్చినప్పుడు గానీ — స్టేషనులో రైలు ఆగినప్పటికీ మనకి నిద్రపట్టిపోయినప్పుడు గానీ — మనకి అదోమోస్తరుగా వంట్లో ఏదో బాధగా వుండడం మీరెప్పుడేనా గమనిం చారా? రైలు ఆగిపోగానే — మన శరీరం అనుభవించిన ద్రుతిని అది క్రమేణా కోల్పోతుంది. రైలు ఆగిపోయినప్పటికంటె రైలు పరుగెత్తుతూన్నప్పుడు మన గుండెకాయ, మన వాచీ, రెండూ కూడా మరింత త్వరగా కొట్టుకుం టాయి. ఆ భేదం తెలుసుకోవడం మనకి సాధ్యంకాదనే అనుకోండి — ఎందు చేతంటే, నిజంగా రైలు వేగం సాపేక్షంగా తక్కువే. కాని మన వ్యోమ యానపు వేగం అలాంటిది కాదు. మనం సగం దూరం ఇంచుమించు కాంతి వేగంతో పయినించాం. ఈ భేదం ఇంతా అంతా కాదుగా మరి! మనం విశ్వాంతరాళంలో ప్రయాణం చేస్తూన్నంతసేపూ, మన గుండె కొట్టుకో వడమూ, మన వాచీ టిక్ టిక్ అనడమూ, మన శరీరంలో ప్రతి కణము యొక్క చలనమూ, వీటి చలనాలలో సాపేక్షంగా ఎట్టి పరస్పర భేదమూ సంభవించకపోయినప్పటికీ — మనం కూడా నౌకలో ఒక భాగం అయిపోయి, నౌకతో లయమైపోయాం. రోదసీనౌక వేగం ఎంత హెచ్చుగా వుండెనంటే — భూలోకంలో మన శరీరపు మామూలు చలన వేగంకంటె 5 లక్షల రెట్లు అధికంగా వుండెనన్నమాట. అంచేత నా హృదయ స్పందన ద్రుతి కూడా—నౌకలో వున్న గడియారం ప్రకారం సెకనుకి ఒక సారి కొట్టుకోవడం — 5 లక్షల రెట్లు అధికమైందన్నమాట. అనగా—పెట్రోగ్రాడ్‌లో వున్న గడియారం ప్రకా రం, రోదసీయాన సమయంలో నా గుండె కొట్టుకోవడపు ద్రుతి 5 లక్షల సార్లు అధికమైందన్నమాటే కదా. నా హృదయ స్పందన ప్రకారమూ,

నౌకలోని గడియారం టిక్కు టిక్కు మనడం ప్రకారమూ, నా శరీరానికీ నా మనస్సుకీ కలిగిన అనుభూతి ప్రకారమూ మనం ప్రయాణంలో 19 గంటలు గడిపాం. నిజానికి మనం ప్రయాణంలో గడిపినది 19 గంటలే. కాని పీటర్స్‌బర్గులో వున్న మనుషుల గుండెలు కొట్టుకోవడంతోనూ, పెత్రొపావ్లొవ్స్కయ చర్చి గడియారంతోనూ మనం సరిపోల్చిచూస్తే మాత్రం, మనం భూమిని వదిలిపెట్టేసి అప్పుడే మూడు వారాల పైచిలుకు అయిందన్నమాట. ఒక వేళ మనం పెద్ద రోదసీనౌక ఒకదానిని నిర్మించి, అందులో ఏ ఆరునెలలకు సరిపడే ఆహారపదార్థాలూ, ఆక్సిజనీ, అల్ట్రాలిడ్డైటూ సేకరించగలిగి, "ఈ కాలంలో భూప్రపంచంమీద బతకడం మీకు అసహ్యంగా వుందా? నూరేళ్లు బతకాలనుందా మీకు?" అని మనుషులని అడిగి, అలాంటి కొందరి పిచ్చివాళ్లని మనతో కూడా ఆ రోదసీనౌకలో ప్రయాణానికి ఆహ్వానించామనే అనుకోండి. అప్పుడు మనం వాళ్లతో అంటాం: "అలా అయితే ఈ పెట్టెలోకి ఎక్కి, ఒక్క ఆరు నెలలపాటు ఇందులో వుండేందుకు ఓపిక పట్టగల్గుతారా – ఇంకేముంది, నూరేళ్లూ మీరు జీవించడం ఖాయమే – అదేనా ఎటువంటి జీవితం! నూరేళ్లూ ఇట్టే జీవించేస్తారు మీరు!" అప్పుడు వాళ్లను ఆరు నెలలపాటు విశ్వాంతరాళంలోకి కాంతివేగంతో తీసుకుపోతాం – ఆరునెలలపాటు అక్కడ గడిపేస్తారు, గడ్డాలూ మీసాలూ పెంచేస్తారు, భూలోకంమీద మళ్లీ దిగుతారు – స్వర్ణయుగం వారికి ఎదురవుతుంది. నిజంగానే – అచ్చంగా ఇలాగే వుంటుంది, ముమ్మాటికీ ఇలాగే జరుగుతుంది కూడానూ."

గూసెవ్ ఇదంతా వింటూ: "ఆహాహా!" "అలాగేం?" "భలే!" అని అంటూ లొట్టలేస్తూ, ఆశ్చర్యపోయాడు.

"మిస్త్రిస్లావ్ సెర్గేయెవిచ్, దీన్ని మనం తాగొచ్చంటారా?" అని అడిగాడు గూసెవ్.

అంగారకవాసి గిరవాటేసిన జాడీ మూతను గూసెవ్ పళ్లతో పీకి, అందులో వున్న ద్రావకాన్ని రుచిచూసి, తుప్పున వుమ్మాడు: "భలేగా వుంది, తాగొచ్చు!" అన్నాడు. రెండు గుటకలు తాగి, లొట్టవేసి:

"మన మెడియేరా మద్యంలాగే వుంది సుమండీ!" అన్నాడు.

లోశ్ ఒక గుటక తాగాడు. ఆ ద్రావకం చిక్కగా పానకంలా వుండి, అత్తరులా సువాసన వేస్తోంది. మరొక గడియకల్లా సగం జాడీ ఖాళీ అయిపోయింది. హాయిగా వెచ్చగా, ఎంతో తేలికగానూ బలంగానూ వున్నట్టనిపించింది వొంట్లో. మనస్సు మాత్రం నిర్మలంగా వుంది.

లోశ్ లేచి నిట్టనిటారుగా నిలబడ్డాడు. ఎంతో హుషారుగా వున్నట్టనిపించింది. శరీరంలో — ఈ వింత ఆకాశం కింద, అదేమిటో గాని భలేగా, తేలిగ్గా, గాలిలో మేడలు కట్టుతూన్నట్టు అద్భుతంగా వుంది. తారామయమైన వీలాంబుధి కెరటాలలో వొడ్డుకు కొట్టుకొనిపోయి — అపరిచితమైన ఒక నూతన జీవితాన్ని సంశోధించేందుకు పునర్జన్మ ఎత్తినట్టు అనిపించింది.

తినుబడి సామాన్ల బుట్టను గూసెవ్ మళ్లీ నౌకలో వుంచేసి, నౌక తలుపును స్క్రూగడియలతో బిగించేసి, తలపై వున్న టోపీని వెనక్కి తోసి:

"మీతో కూడా వచ్చినందుకు పిసరంతేనా నేను విచారపడడంలేదు, మిస్త్రిస్లావ్ సెర్గేయెవిచ్! మాంచి భలేగా వుంది!" అన్నాడు.

గట్టు దగ్గరకి వెళ్లి, చీకటి పడేవరకూ, కొండగుట్టలు చెదురు మదురుగా వున్న ఆ మైదానాన్ని సావకాశంగా చూద్దామని నిశ్చయించుకు న్నారు.

మంచి హుషారుగా వున్నారేమో, ఇద్దరూ ఆ బ్రహ్మచెముడు డొంకల మధ్యనుండీ, అప్పుడప్పుడు వాటిమీదనుండీ సునాయాసంగా జాంబ వంతుని అంగలు వేసి చెంగు చెంగున దాటేస్తూ నడిచి వెళ్లారు. కాస్సే పటికల్లా బాటమీద పరచి వున్న రాళ్లపలకలు ఆ పాదల్లోనుండి తెల్లగా మెరుస్తూ అవుపడ్డాయి.

నడుస్తూన్నవాడల్లా లోశ్ హఠాత్తుగా ఆగిపోయాడు. అతడికి రోత పుట్టి, వొళ్ళు పులకరించింది. దుబ్బుగా కండబారి వున్న బ్రహ్మచెముడు మట్టల సందులనుండి, ఎదురుగా మూడు గజాల దూరంనుంచి, వాలిపోతూన్న ఎర్రని కనురెప్పలతో గుర్రపు కళ్లంతలేసి వున్న పెద్ద మిడిగుడ్లు రెండు తనకేసి చూస్తూండడం అతడికి కనబడింది. ఆ కళ్లచూపుల్లో అమిత ద్వేషం ద్యోతకమవుతూంది.

''ఏం ఆగిపోయారు?'' అని అడిగాడు గూసెవ్. అడిగాడో ఇంకా లేనేలేదో, అతను కూడా ఆ కళ్లను చూశాడు. వెంటనే తన రివాల్వరుతో కాల్చాడు. తుప్పుమని ధూళి రేగింది. కళ్లు రెండూ మాయమైపోయాయి. ''ఇంకో వెధవ!'' అని కేకేశాడు లోశ్. పక్కకు తిరిగి గూసెవ్ చూసే సరికి, సాలెపురుగు కాళ్లల్లా సన్నవి పొడుగాటి కాళ్లతో చరచరా సాగిపో తూన్న చారల చారల స్థూలకాయం ఒకటి అతనికి కనబడింది. గూసెవ్ మళ్లీ మరొకసారి రివాల్వరుతో కాల్చాడు. భూలోకంలో మహాసముద్రపు నిమ్నాల అట్టడుగున నివసించే రాక్షసి సాలీడులాంటిదే సరిగ్గా ఇది కూడానూ. అది తటాలున ఆ చిట్టడవిలోకి దూరిపోయి పారిపోయింది.

# మనిషివాసన లేని ఇల్లు

కాల్వగట్టుకు చేరువగా వున్న ఒక పాద దగ్గరకు నడిచి వెళ్లారు లోశ్, గూసెప్‌లు ఇద్దరూ. ఎండుకు బాగా కాలి గుల్లబారిన పొడిమట్టిలో, ఎండిపోయిన పిల్లకాల్వలు దాటుతూ, గొడ్డుపోయిన చెరువు గట్లు చుట్టుతూ అలా నడిచి వెళ్లారు. పాదువడిన ఆ కాలువ గర్భాల్లో, తుప్పట్టి తూట్లు పడిన తొల్టెపడవల శిథిలావశేషాలు ఇసుకలో సగం కూరుకుపోయి పైకి తోసుకొస్తూ అక్కడక్కడున్నాయి. ఈసురోమంటూ నిర్మానుష్యంగా నిర్జీవంగా వున్న ఆ మైదానంలో, ఒక మీటరు వ్యాసం కలిగి ఉబ్బెత్తుగా వున్న పెద్ద గుండ్రని రేకులు తళతళ మెరుస్తూ చెల్లా చెదురుగా పడు న్నాయి. శిలామయమైన ఆ పర్వతాలనుంచి, కింద వున్న పాదలూ శిథి లాలవరకూ సరాసరి రుజురేఖలో విస్తరించి వున్నాయి ఈ గుండ్రని రేకులు — తళుకులు విరజిమ్ముతూన్న బిందువుల్లా.

ఎదుగు బొదుగు లేకుండా పొట్టిగా బల్లపరుపుగా విప్పారి వున్న కొమ్మలతో రెమ్మలతో, ముడుతలు పడి నరదలతో నిండిన బోదెలతో, మసరు రంగు చెట్ల గుంపొకటి రెండు కొండల నడుమ ఇరుక్కొనుంది. ఆ చెట్ల కొమ్మలు గరుకుగా గొడుగులా విప్పారి వున్నాయి. ఆకులు నాచు మొక్కల ఆకులను గుర్తుకు తెస్తున్నాయి. అన్నిటికంటే ముందున్న చెట్ల నడుమ ముళ్లతీగ కంచె పెట్టి వుంది.

ఆ చిట్టడవిలోకి వారిద్దరూ ప్రవేశించారు. గూసెప్ వంగి నడు స్తూండగా మెత్తగా వున్న దుమ్ములో అతని కాలుకేదో తగిలింది. అదేమిటి చెప్మా అని చూసేసరికి — మనిషి పుర్రె. అది దుమ్ములోంచి బయటపడి అంత దూరాన దొర్లింది. పుర్రె దంతాలకు తాపించి వున్న లోహం తళుకు

తళుకుమని మెరిసింది. పొదలో మహా ఉక్కపెట్టేస్తూంది. నెత్తి మాడ్చే స్తూన్న ఆ ఎండలో, నీటిపాచిలా వున్న ఆ చెట్ల ఆకులు ఏమాత్రమూ నీడ ఇవ్వడంలేదు. నాలుగు అడుగులు వేసి ముందు కెళ్లేసరికి, ఉబ్బెత్తుగా వున్న గుండ్రని రేకు ఒకటి మళ్లీ వారికి కనబడింది. ఒక చిన్న గుండ్రని లోహపు బావి గర్భానికి ఆ రేకు స్క్రూచేసి వుంది. పొద వెనకాల చూసేసరికి ఏవో శిథిలాలు అవుపడ్డాయక్కడ — తిరగబడిన వెడల్పాటి ఇటుక గోడలూ, గుండపిండైపోయి కుప్పలుగా పడున్న రాళ్లూ రప్పలూ, ఇటుక ముక్కల గుట్టలూ, ఆ కుప్పల్లోనుంచీ గుట్టల్లోనుంచీ పైకి తోసుకొస్తూ అష్టవంకరలుగా చుట్టుకుపోయిన ఇనుప దూలాల కొనలూ వాళ్లకి ఎదురయాయి.

"ఈ ఇళ్లన్నీ మందుపెట్టి పేల్చేసినట్టు నేలమట్టమయాయి, మ్విస్లావ్ సెర్గేయెవిచ్!" అన్నాడు గూసెవ్. "చూడగా ఇక్కడేదో కొంత గ్రంథం జరిగినట్టే వుంది. ఇది మనకి తెలిసిన వ్యవహారమేగా!"

ఆ శిథిలాల కుప్పల్లో ఒకదాని వెనకనుండి రాక్షసి సాలీడొకటి బయటికొచ్చి, ఒక విరిగిన గోడ అంచుమీద పాకుకుంటూ వెళ్లింది. గూసెవ్ రివాల్వరు కాల్చాడు. సాలీడు ఒక్క ఎగురు ఎగిరి, అంతర్ను కొట్టి కింద పడిపోయింది. దాని వెనువెంటే ఆ శిథిలాల గుట్టలనుండి మరొక సాలీడు ధూమ్రవర్ణపు ధూళిమేఘాలు ఎగరగొట్టుతూ బరబరా పరిగెడుతూ వచ్చి, చెట్లల్లోకి పారిపోడానికి ప్రయత్నించి, ముళ్లతీగ కంచెలో కాళ్లు తగుల్కొని అందులో చిక్కడిపోయింది.

గూసెవ్, లోశ్‌లు ఇద్దరూ ఒక కొండఅంచు చేరుకున్నారు. ఆ అంచుమీదనుంచి చూసేసరికి మరొక చిట్టడవి కనబడితే, అటుకేసి కొండ దిగారు. చిట్టడవి మధ్య ఎత్తుగా రాతితో కట్టిన మిద్దె ఇల్లొకటి,

ఆ ఇంటిచుట్టూ ఇటుకతో కట్టిన ఇళ్ళు కొన్నీ వారికి కనబడ్డాయి. ఈ ఇళ్లకీ కొండకీ నడుమ, ఉబ్బెత్తు రేకులు అనేకం పడున్నాయి. రేకులకేసి చూపిస్తూ లోశ్ అన్నాడు:

"ఇవి బహుశా ఏదో ఒక నీటి రిజర్వాయర్‌లో బావుల్లాగానూ, బావులకీ బావులకీ మధ్య న్యూమాటిక్ గొట్టాలూ, ఎలెక్ట్రిక్ తీగలతో సహా సంబంధం కలిపిన ఏర్పాటులా కనబడుతూంది. చూడగా ఇదంతా ఏనాడో పాడు పడినట్టుంది."

ముళ్లకంచె వలలోనుంచి దూరి, చిట్టడవి దాటి వెళ్లే సరికి, పలకరాళ్ళు పరచిన పెద్ద చీకిరి బాకిరి చప్పరం దగ్గరకి వచ్చారు. చప్పరం అవతలి చివర ఒక ఇల్లుంది. ఇంటి వాస్తుశిల్పం అసాధారణంగానూ, మనసుకు అదేమిటో వ్యాకులంగానూ వుంది. నున్నని గచ్చుగోడలు ఏటవాలుగా లేచి ఎరుపు జీరలున్న నలుపు రాతితో కట్టిన లావుపాటి భిత్తిశృంగం కింద కొనతేలాయి. గోడలలో లోతుగా అమర్చిన కిటికీలు పొడుగ్గానూ సన్నంగానూ బీటల్లా వున్నాయి. డోరియాలతో ఆదోకుగా వున్న స్తంభాలు రెండింటిపైన ఆనుకొని వుంది సింహద్వారం. సింహద్వారంమీద కళ్ళు మూసుకొని విశ్రాంతి భంగిమలో వున్న కంచు విగ్రహం ఒకటి లోతుగా చెక్కి వుంది. గృహముఖం ఎదుట వున్న స్థలం పొడుగునా బల్లపరపు మెట్లున్నాయి. మెట్లపైన పొట్టిగా లావుపాటి తలుపుంది. గోడకున్న నల్లని రాతిపలకల సందులనుంచి ఎండిపోయిన తీగచెట్లు కాడలు నారకింద జీర్ణించిపోయి తాళ్లల్లా వేలాడుతున్నాయి. అదొక బ్రహ్మాండమైన సమాధిలా కనబడిందిగాని, ఇల్లులా కనబడలేదు.

లోహపు ద్వారాన్ని భుజంతో గట్టిగా ఒక్క తోపు తోశాడు గూసెవ్. కిర్రుమంటూ తలుపు తెరుచుకుంది. తలుపు తోసుకుని లోపలికి వెళ్లారు.

చీకటి వసారా ఒకటుంది. వసారా చివరకంటా నడిచి వెళ్లేసరికి హాలు ఒకటి కనబడితే ఆ హాలులో ప్రవేశించారు. హాలుకున్న అద్దపు కలశంలో నుంచి వెలుతురు లోపలికి వస్తూంది. హాలంతా ఇంచుమించు ఖాళీగానే వుంది. తలకిందులుగా వున్న కొన్ని మూక్కాలిపీటలూ, నల్లగుడ్డ పరచి దుమ్ముకొట్టుకుపోయిన టేబిలు మాత్రమే వున్నాయి. రాతిగచ్చు నిండా చిందర వందరగా పడున్నాయి విరిగిపోయిన గిన్నెలూ పళ్లేలూ. గుండ్రని రేకుల తోనూ, గోళాలతోనూ, లోహపు తీగ వలతోనూ చేయబడి అదొక విచిత్రా కారం కలిగిన యంత్రం ఒకటి తలుపు దగ్గరుంది. ప్రతి వస్తువూ దుమ్ము తోనూ ధూళితోనూ నిండిపోయుంది.

బంగారపు తునుకలతో మెరసిపోతూన్న పసిమిరంగు గోడలమీద ధూళిరేణువులతో నిండిన వెలుగు బాణాలు పడుతున్నాయి. గోడల పై అంచులమీద, ఏవో చారిత్రక ఘటనలను చిత్రించుతూ వెడల్పాటి పట్టీ మాదిరిగా సంకీర్ణ వస్తు చిత్రం ఒకటుంది — పసిమి వర్ణపు జీవులకూ ఎరుపురంగు జీవులకూ మధ్య యుద్ధాలు; నడుమువరకూ సముద్రంలో నిలబడున్న మానవరూపాన్ని పోలిన జీవి; అదే జీవి ఆకాశంలో నక్షత్రాల మధ్య ఎగురుతూండడం; యుద్ధ దృశ్యాలూ క్రూర వన్యమృగాలతో పోరా టాలు; వింత వింత రూపాల జంతువుల మందలను కాస్తూన్న గొడ్లకా పర్లు; సంసారజీవితపు ఉదంతాలు; వేట దృశ్యాలు; నృత్యాలు; జనన మరణ సంస్కారాలు — ఈ చిత్రాలన్నీ అందులో వున్నాయి. చివరకి ద్వారంపైన విచారపూరితములైన ఈ సంకీర్ణ వస్తు చిత్రపు మైజారు ఒక బృహత్తర వర్తులాకారపు రిజర్వాయర్ు చిత్రనిరూపణగా పరిణమించింది.

''చిత్రంగా వుంది, ఎంతో చిత్రంగా వుంది,'' అంటూ లోశ్ రెండు సార్లు అని, ఆ సంకీర్ణ వస్తు చిత్రాన్ని ఇంకా బాగా చూద్దామని

అక్కడున్న సోఫామీద ఎక్కాడు "తమాషాగా వున్న మానవ శిరస్సు ఒకటి ఈ దృశ్యాలన్నిటిలోనూ పదే పదే తటస్థపడుతూంది. చూశారుకదూ! చాలా చిత్రంగా వుంది..."

ఈలోపుగానే గూసెవ్ హాలులో ఇటూ అటూ తిరుగుతూండగా, అతడికి ఒక తలుపు కనబడింది. తలుపు తీసి చూడగా, లోపల ఒక వరుస మెట్లున్నాయి. విలువంపు పైకప్పు వుండి, వెడల్పుగా వున్న వసారాలోకి ఈ మెట్లు దారితీశాయి. దుమ్ముతో నిండిన వసారా మంచి వెలుగ్గా వుంది. గోడల పొడుగునా, గోడల గూళ్లలోనూ రాతితో చెక్కినవి కొన్నీ, కంచుతో చేసినవి కొన్నీ విగ్రహాలు, శిరస్సులు, శరీరకాండ ప్రతిమలు, కృత్రిమ ముఖాలూ, పూల వాజుల ఖండాలూ వున్నాయి. అభ్యంతర గృహాలకు దారి తీస్తూ, చలువరాతితోనూ కంచుతోనూ లతలు చెక్కిన ద్వారాలు వసారాలోకి వున్నాయి.

ఆ పక్కనున్న గదులను పరీక్షించడానికి నిశ్చయించుకున్నాడు గూసెవ్. గదుల సరంబీ కిందకుంది. గదులు మగ్గు వాసనవేస్తున్నాయి. వాటిలోకి వెలుగు మసక మసకగా వస్తూంది. ఒక గదిలో ఈతకొట్టేందుకు తటాకం వుంది. తటాకం ఎండిపోయుంది. దాని అడుగున చచ్చిపోయిన సాలీడు ఒకటుంది. మరొక గదిలో, గోడ అంతకీ నిలువుటద్దం తాపించి వుంది. నిలువుటద్దం ముక్కచెక్కలైపోయుంది. నేలమీద చీకిచివికిపోయిన గుడ్డల మేటు ఒకటీ, తీన్ తేరాగా తిరగదోసిన కుర్చీలూ బల్లలూ, బీరువాల్లో నలిగిపోయి చిరిగిపోయిన వస్త్రాలూ వున్నాయి.

మూడో గదిలో పైకప్పుకున్న అద్దపు కిటికీకి సరాసరి కిందుగా వున్న వేదికపైన వెడల్పు సోఫా ఒకటుంది. సోఫామీద అంగారకవాసి అస్థిపంజరం ఒకటుంది — అస్థిపంజరం కాళ్లు నేలపై వేళ్లాడుతున్నాయి.

అక్కడ తీవ్రమైన పోరాటం జరిగినట్టు గది చూస్తేనే తెలిసిపోతూంది. గదిలో ఒక మూల నక్కి కూచున్నట్టుంది మరొక అస్థిపంజరం.

గదిలో వున్న చెత్తసామాన్లలో — బహుశా స్త్రీలు ధరించే ఆభరణాలే అయివుండొచ్చు — బరువైన నాణేలూ, రంగురంగుల రాళ్ళనుండి తొలిచిన చిన్నచిన్న గిన్నెలూ కనబడ్డాయి. ఆ అస్థిపంజరాలు సజీవమై వున్నప్పుడు, ఆ మనుషుల్లో ఒకరి జీర్ణవస్త్రాలనుండి ముదురు పసిడివర్ణపు రాళ్ళు రెండున్న సన్నని హారం ఒకటి గూసెవ్‌కి దొరికింది. రాళ్ళు రెండూ లోలోపల మెరుస్తున్నాయి.

"ఇవి మనకి ముందుకు పనికొస్తాయి," అన్నాడు గూసెవ్, "మాషకు ఇవ్వొచ్చు."

వసారాలో వున్న విగ్రహాలను పరీక్షించేందుకని లోశ్ అక్కడ ఆగిపోయాడు. సూదిగా మొనదేలిన అంగారకవాసుల శిరస్సులూ, సముద్రపు రాక్షసుల విగ్రహాలూ, రంగులతో చిత్రించిన కృత్రిమ ముఖాలూ, రెండు చెవుల ఎట్రుస్కన్ జాడీలను చిత్రంగా పోలిన వాజులూ — వీటి నడుమనున్న పెద్ద శరీరోర్ధ్వభాగ స్త్రీవిగ్రహం ఒకటీ అతని దృష్టిని ఆకర్షించింది — చింపిరి జుట్టూ, అస్పష్టమై కిరాతమైన ముఖం, కొనతేలి ఒకదానికొకటి దూరంగా వున్న వక్షోజాలు, నుదిటిపైన సన్నని పరవలయంలా ఏర్పడుతూన్న బంగారపు నక్షత్రాల కిరీటం. కిరీటంలో మణిపూసలు చిన్నవి రెండు పొదిగించి వున్నాయి — ఒకటి కెంపు ఎరుపు, రెండోది ఇటుకరంగు ఎరుపు. అంతులేని విషయలోలత్వాన్నీ అహంకారాన్నీ వ్యక్తపరుస్తూన్న ఆ ముఖం — అదేమిటోగాని ఆదో మోస్తరుగా తనకు సుపరిచితమే అయినట్టూ, తన బుద్ధికి అర్థంకాకుండానే తన మనోవీథిలో తచ్చాడుతూన్నట్టూ అనిపించింది లోశ్‌కి.

గోడలో ఈ విగ్రహం పక్కనే, వలగుడ్డలాంటి తెర వేసి వున్న చిరు చీకటి గూడు ఒకటుంది. తెర మళ్లించుదామని వలలో వేలు దూర్చి లాగాడు లోశ్. కాని వల వొసల్లేదు. అగ్గిపుల్ల వెలిగించి తొంగి చూశాడు. జీర్ణమై పోతూన్న చిన్న బాలీసుపైన బంగారపు ముఖముద్ర ఒకటుంది. ఎత్తైన దవుడ ఎముకలూ, ప్రశాంతంగా మూతపడిన కళ్లూ — అది మానవ ముఖముద్రే. చంద్రవంకను పోలిన పెదవులు చిరునవ్వు నవ్వుతున్నాయి. పక్షి ముక్కులా మొనదేలిన ముక్కు. కనుబొమల నడుమ వున్న బొడిపి పెద్ద తూరీగ కన్నులా కనబడింది. మొదటి హాలులో గోడమీద వున్న సంకీర్ణ వస్తు చిత్రంలో చిత్రించిన శిరస్సే ఇది.

చిత్రవిచిత్రంగా వున్న ఆ ముఖముద్రను పరీక్షిస్తూ, అగ్గిపెట్టెలో సగం పుల్లలు వెలిగించేశాడు లోశ్. అయిపూ జాడా లేకుండా నిగూఢంగా మాయమైపోయిన ఒకానొక మానవజాతిని గుర్తుకు తెచ్చే మృతసంస్కృతీ చిహ్నాలు కనబడిన ఆఫ్రికా ఖండపు భూభాగంలో ఆవిష్కృతమైన నైజర్ నదీ మహత్తర నగరాల శిథిలాలలో దొరికిన ముఖముద్రల ఫోటోగ్రాఫులలో వీటిని పోలిన చిత్రాలనే తాను భూమండలంనుంచి ప్రయాణం కాబోయే ముందు కొద్దిరోజుల క్రితమే లోశ్ చూశాడు.

వసారాలోకి వున్న గదులలో ఒక గదితలుపు ఓరగా తెరిచి వుంది. ఆ తలుపులోంచి లోపలికెళ్లాడు లోశ్. పెద్దగది. ఎత్తుగా వుంది సరంబీ. గోడకి చుట్టూ బాల్కనీ. బాల్కనీకి జాలు చెక్కిన పిట్టగోడ. బాల్కనీ కింద గోడకీ, బాల్కనీ మీదనూ చిన్నచిన్న వలంపటి గ్రంథాలతో నిండి బీరువాలూ అలమారాలూ వున్నాయి. అట్టలమీద గిల్టు నగిషీ వున్న పుస్తకాలు పాంశువర్ణపు గోడల పొడుగునా వరసగా అమర్చున్నాయి. పుస్తకాల అలమారాలు కొన్నిటిలో చిన్న లోహపుగొట్టాలూ, తోలుతోనూ చెక్క

తోనూ బైండుచేసిన గ్రంథాలూ వున్నాయి. గ్రంథాలయపు బీరువాలలోనూ అలమారాలలోనూ, చిరుచీకటిగా వున్న గోడ మూలలనుంచీ, బట్టతల శిరస్సులూ ముడుతలు పడిన ముఖాలూ వున్న అంగారకలోక విజ్ఞాన శాస్త్రజ్ఞుల ప్రతిమలు తమ కళావిహీనములైన రాతికళ్లతో ఆ దృశ్యాన్ని తిలకిస్తున్నాయి. లోతుగా వున్న కుర్చీలూ గుండ్రని పొట్టికాళ్లతో పార్శ్వాలకు వలయాకారపు తెరలు అమర్చి వున్న మేజాబల్లలూ అనేకం వున్నాయి ఆ గదిలో.

బూజుపట్టి మగ్గువాసన కొడుతూన్న ఈ భాండారాన్ని, గ్రంథస్థం గావించి భద్రపరచబడిన వెయ్యేళ్లనాటి ఈ జ్ఞానాన్ని, అంగారక గ్రహానికి ఎగిరి వచ్చి ఇక్కడ విశ్రమించుతూన్నట్టే లోశ్ ఊపిరి బిగబట్టుకుని నివ్వెరపోతూ చూశాడు. అలమారాల దగ్గరకు మునివేళ్లమీద అడుగులు వేస్తూ వెళ్లి, ఒక పుస్తకాన్ని జాగ్రత్తగా తీసి, పుటలు తిరగేశాడు లోశ్. పుస్తకంలో కాగితాలు పసరు వాగుగా వున్నాయి. అక్షరాలు రేఖాగణితపు చిత్రాల్లా వుండి, లేత జేగురు రంగు సిరాతో రాసినట్టున్నాయి. సాంకేతిక చిత్రాలున్న ఒక పుస్తకాన్ని అలమారాలోనుంచి తీసి, తరువాత తీరుబడిగా పరిశీలించే ఉద్దేశంతో తన జేబులో పెట్టుకున్నాడు లోశ్. లోహపు గొట్టాల్లో, పాతకాలపు ఫోనోగ్రాపు రికార్డుల్లాంటి రోలర్లున్నాయి. గోటితో టక్కుటక్కుమని కొట్టి చూస్తే, అవి ఎముకతో చేసినట్టున్నా, వాటి ఉపరితలం మాత్రం గాజులా నున్నగా వుంది. వలయాకారపు తెర వున్న మేజాబల్ల ఒకదానిపైన ఇలాంటి గొట్టమే ఒకటుండడం లోశ్ గమనించాడు. ఆ ఇంటిపై శత్రు దాడి ప్రారంభమైన సమయంలోనే ఆ రోలరును ఎవరో ఉపయోగించడానికి సిద్ధంగా వుండినట్టే కనబడుతూంది.

తరువాత లోశ్ నల్లని బీరువా ఒకదానిని తెరచి, దానిలో తోలు బైండు చేసి పురుగులు కొట్టేసి వున్న పుస్తకాలలో ఒకదానిని తీసి, తన

కోటు చేతులతో దుమ్మును జాగ్రత్తగా తుడిచేశాడు. కాలవశంచే పచ్చబడి పోయిన పుటలు ఒకదాని అడుగున ఒకటి అంటించబడి, ఒకే తావుకాగితంలా పొడుగ్గా వుండి, విసనకర్రలా మడతపెట్టి వుంది. ఒకదానితో ఒకటి కలిసిపోయిన ఆ పుటలనిండా, చిటికినవేలి గోరంతేసి రంగురంగుల ముక్కోణాలుండి, పంక్తులు ఎడమవైపునుండి కుడివైపు నడిచి, అక్కడనుంచి మళ్లీ కుడివైపునుండి ఎడమకు నడుస్తూ, మధ్యమధ్య పంక్తులు విరిగి చెదిరిపోయి ఒండొంటితో కలిసిపోయి కలగాపులగ మైపోతున్నాయి. అక్షరాల్లోనూ, అక్షరాల రంగులలోనూ పంక్తులు విభేదిస్తున్నాయి. కొన్ని పుటలు తిరగేసే సరికి, పుటల అడుగు పంక్తులలోని ముక్కోణాల మధ్య వివిధ ఆకృతులతోనూ రంగులతోనూ వున్న వలయాలు ఒకదానితో ఒకటి కలిసి పోయి రకరకాల చిత్రాలుగా ఏర్పడ్డాయి. పరస్పరమూ మిళితమైపోతూ మారిపోతూ మెరుస్తూన్న ఈ త్రిభుజ, వలయ, చతురస్ర అక్షరరూపాలు పుటనుంచి పుటకు అనంతంగా విస్తరిస్తున్నాయి. ఉన్నట్టుండి లోశ్‌కి అద్భుతమైన మధురగీతం ఒకటి లీలగా వినబడింది.

పుస్తకం మూసేసి, ఆశ్చర్య భయ సంభ్రమాలతో ఉద్విగ్నుడై, ఇదివరకు తానెన్నడూ ఎరుగని ఈ అనుభూతికి మంత్రముగ్ధుడై అలా అలమారాలకు చేరగిలబడి వుండిపోయాడు: అది గానంచేసే గ్రంథం.

"మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్! ఇలా రండి ఇక్కడికి! చప్పున!" అని తన గొంతుక సముద్ర కెరటంలా ఆ హాల్లోనుంచి దొర్లుకొస్తూ వుండగా కేకేశాడు గూసెవ్.

అది విని లోశ్ వసారాలోకి వెళ్లాడు. వసారా ఆవలి చివర వున్న గుమ్మంలో, భయసూచకంగా చిరునవ్వు నవ్వుతూ నిలబడ్డాడు గూసెవ్.

"ఇక్కడేమిటుందో చూడండి!"

పొడుగ్గా చీకటి చీకటిగా వున్న ఒక గదిలోకి అతడు లోశ్‌ని తీసు కెళ్ళాడు. ఆ గది ఆవలి గోడకు వెలిసిపోయిన ఒక పెద్ద చతుర్రసపు గాజు ఫలకం ఒకటుంది. కొన్ని ముక్కాలిపీటలూ, చేతులున్న కుర్చీలూ వున్నాయి.

"ఈ తాడుకి వేలగట్టి వున్న గుబ్బను చూస్తున్నారుగా! బంగారపు గుబ్బ అనుకుని దాన్ని తెంపబోయే సరికి — చూడండి ఏమిటయిందో!"

అలా అంటూ గూసెవ్ ఆ గుబ్బను గుంజాడు. గుంజేసరికల్లా అద్దం తటాలున వెలుగొంది, దానిపై వెలుగు నీడలతో పెద్దపెద్ద భవ నాల ఆకృతులూ, అస్తమిల్లుతూన్న సూర్యుని కిరణాలను ప్రతిబింబిస్తూన్న కిటికీలూ, భవనంపై రెపరెపలాడుతూన్న పతాకాలూ అవుపడ్డాయి. ఎక్కడో దూరాన ధ్వనించుతూన్నట్టుగా చెవికి సోకుతూన్న జనసందోహాల రణగణ ధ్వని ఆ గదిలో వినబడింది. అంతవరకూ ఆ అద్దంమీద కనబడుతూండిన పట్టణాన్ని మరుగు పరచేస్తూ, రెక్కలు కట్టుకుని ఎగిరి వెళ్ళిపోతూన్న ట్టుగా నీడ ఒకటి కనబడింది. తటాలున అద్దం తళుకుమని ప్రకాశించి, వారిద్దరూ నిలబడున్న బల్లకూర్పు నేల కిందనుంచి ఫెళఫెళమని శబ్దం వినబడి, వెంటనే అద్దం వెలవెలబోయింది.

"షెర్టు సర్క్యూటులా వుందే!" అన్నాడు గూసెవ్, "చీకటి పడి పోతూంది కూడా, మనం ఇక వెనక్కి తిరుగుదాం, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్!"

# సూర్యాస్తమయం

సన్నని పొగమంచు రెక్కలను విప్పారించుతూ, అగ్నిగుండలంలా మండిపోతూన్న సూర్యుడు కిందకు కుంగిపోయి అస్తమిస్తున్నాడు.

సంజవేళపు చిరుచీకటిలో వెనుకటికంటె శూన్యంగానూ మరింత

కిరాతకంగానూ కానవచ్చిన ఆ మైదానాన్ని తొందర తొందరగా కాల్వగట్టు దిశగా దాట మొదలెట్టారు లోశ్, గూసెవ్‌లిద్దరూ. పొలాల ఈవలి గట్టు అంచు వెనుక సూర్యుడు త్వరత్వరగా అస్తమించుతూ, తన అస్తమయ చిహ్నంగా అరుణ పరివేషాన్ని ప్రదర్శించుతూ అదృశ్యమైపోతున్నాడు. ములుకుల్లా కానవస్తూన్న కాంతి బాణాలు సగం దిఙ్మండలాన్ని వెలుగుతో నింపేసి, ధూసరవర్ణంగా మారిపోయి — అంతర్ధానమైపోయాయి. ఆకాశం కారుచీకటిలో మునిగిపోయింది.

ఆ బూడిదవర్ణపు అస్తమయంలో అంగారకునిపైన చేరువగా పెద్ద నక్షత్రం ఒకటి ఎర్రగా ప్రకాశిస్తూంది. కోపంతో మండిపోతూన్న కన్నులా కానొచ్చింది ఆ నక్షత్రం. ధుమధుమలాడుతూన్న దాని అరుణ కిరణాలు చిమ్మచీకటిని క్షణమాత్రం మందు వెలుగుతో నింపేశాయి.

ఉత్తరక్షణంలో మహోన్నతమైన ఆకాశ కలశం ఒక్కపాటున నక్షత్రకోటితో వెలిగింది — పచ్చని తేజస్సుతో ప్రకాశిస్తూన్న తారామండలాల హిమకిరణాలు సన్నని సూదులతో పొడిచేస్తూన్నట్టు కళ్లను పొడిచేస్తున్నాయి. హడలుగొట్టేటట్టుగా చిరచిరలాడుతూన్నా, ఆ నక్షత్రం ఉదయించుతూన్నకొద్దీ అంతకంతకు మరింతగా ఎరుపెక్కి మండిపోతూంది.

కాలువగట్టు చేరుకోగానే లోశ్ అక్కడ ఆగి, ఆ నక్షత్రంకేసి వేలెత్తి చూపించి:

"భూలోకం!" అన్నాడు.

గూసెవ్ తన నెత్తినున్న టోపీని తీసి, నుదుట పట్టిన చెమట తుడిచేసుకున్నాడు. తల బాగా వెనక్కి వంచి, ఆ తారామండలాల నడుమ

తేలుతూన్న తన మాతృగ్రహాన్ని చూశాడు. అతని ముఖం విచారంతో నిండి ముడుతలుపడింది.

"భూలోకం!" అని పునశ్చరణ చేశాడు గూసెవ్ కూడా.

ఆ పురాతనపు కాల్వగట్టుపై వారు చాలా సేపు నిలబడ్డారు. కాల్వ గట్టుకింద మైదానం పైనున్న బ్రహ్మచెముడు చెట్ల ఆకృతులు ఆ నక్షత్రపు వెలుగులో మసకమసకగా కనబడుతున్నాయి.

సన్నని గీతలా స్పష్టంగా మలచి వున్న దిగ్మండల రేఖ ఎగువను చంద్రవంక కంటెనూ చిన్నదైన తెల్లని కొడవలి ఒకటి తటాలున ప్రకాశించుతూ, బ్రహ్మచెముడు పొలంపైన ఉదయించింది. తాళపత్రాలను పోలిన కొమ్మలు పొడుగాటి నీడలను నేలపై ప్రసరిస్తున్నాయి.

గూసెవ్ తన మోచేతితో లోశ్‌ను తాకి:

"మన వెనుక ఏమిటుందో చూడండి!" అన్నాడు.

పొదలతోనూ శిథిలాలతోనూ నిండి, ఎత్తు పల్లాలుగా విస్తరించి వున్న ఆ మైదానంపై అంగారకుని రెండో ఉపగ్రహం తళుకులు వెద చల్లుతూంది. చంద్రునికంటెనూ చిన్నదైన ఈ పసిమి గోళం దూరాన విచ్చుకత్తుల్లా కానవస్తూన్న పర్వతశిఖరాల వెనుక కుంగిపోయింది. దాని వెలుగులో కొండవాలులో పడి వున్న ఉబ్బెత్తు రేకులు ధగధగా మెరుస్తున్నాయి.

"రాత్రి ఎలా వుందో! కలలో వున్నట్టే వుంది!" అన్నాడు గూసెవ్ మెల్లగా.

గట్టు దిగి బ్రహ్మచెముడు పొలంలోనుంచి జాగ్రత్తగా నడిచారు. ఏదో నీడ ఒకటి వారి కాళ్లలో పడింది. చంద్రబింబాలు రెండూ పరు

స్తూన్న నీడల మధ్యనుంచి నూలుబంతిలాంటిదే ఏదో ఒకటి దొర్లుతూంది. పటపటమని శబ్దం. తరువాత ఏదో కూత — కీచుగా, దుర్భరంగా, గుండె ఝల్లుమంటూ, కురుచనైన కూత — వినబడింది. మెరుస్తూన్న బ్రహ్మ చెముడు మట్టలు కదిలాయి. జాలరి వలలవలె సాగుతూన్న సాలెపట్లు వారి ముఖానికి తగిలాయి.

హృదయ విదారకమైన కేక ఒకటి తటాలున నిశీధినీ నిశ్శబ్దాన్ని పటా పంచలు చేసివేసింది. కేక చప్పున ఆగిపోయింది. సర్వం నిశ్శబ్దం. వారి వొళ్ళు పులకరించుకుపోయి, ఆ ఘోరాన్ని ఇక భరించలేక గూసెవ్, లోశ్‌లు చెంగున ఒక్క గంతు వేసి, అల్లల్లాడిపోతూన్న చెట్లమీాదనుంచి దుముకుతూ మైదానంలోనుంచి పరుగెత్తారు.

క్షణక్షణానికీ ప్రవర్ధమాన మవుతూన్న ఆ అర్ధచంద్రాకృతి నక్ష త్రపు వెల్తురులో మెరుస్తూన్న వారి రోదసీనౌక లోహపుగోళం చిట్టచివ రకు వారి కంటపడింది. రోజుకుంటూ రొప్పుకుంటూ దాని దగ్గరకు పరు గెత్తుకుని వెళ్ళి, దాని పక్కను నేలమీాద చదికిలబడ్డారు.

"చీకటి పడిన తరువాత ఈ సాలిపట్లు చుట్టేసిన స్థలాల్లో ఇక నేను తారట్లాడితే వొట్టు!" అన్నాడు గూసెవ్. అలా అంటూ నౌక గుండ్రని తలుపు స్క్రూళ్లను వదులుచేసి, తలుపు తెరిచి, నౌకలోకి ఎక్కి పోయాడు.

లోశ్ మాత్రం ఒక్క క్షణం చీకట్లో నిదానంగా చూస్తూ వింటూ బయట నిలబడ్డాడు. తటాలున అవుపడింది అతనికి — రెక్కలు కట్టుకుని నక్షత్రాల మధ్య పయనించుతూన్నట్టి అద్భుతమైన వాయునౌక ఆకారం.

# లోశ్ భూగోళంకేసి చూస్తాడు

వాయునౌక ఛాయ అంతర్ధానమైపోయింది. చెమ్మగా వున్న తన నౌక కేసింగ్‌పైకి ఎక్కాడు లోశ్. పొగగొట్టం ముట్టించి నక్షత్రాల కేసి తేరిచూశాడు. చిరుచలిగా వున్న ఆ గాలి లోశ్‌కి కొద్దిగా వణకు పుట్టించింది. నౌకలోపల గూసెవ్ తాను ఆనాడు సంగ్రహించిన వస్తువులను భద్రపరుస్తూ, ఇవీ అవీ సర్దుతూ, తనలో తాను ఏదో గొణుక్కుంటున్నాడు. ఆ గొణుగుడు అయాక, తల తలుపులోనుంచి పైకిపెట్టి:

"మీరు ఏమంటే అనండి గాని, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్, ఈ వస్తువులు మాత్రం బంగారపు వస్తువులే. ఈ రాళ్ళు అమూల్యములైనవే, అందుకేం సందేహం లేదు. వీటిని చూపించి, ఆ పిచ్చిపిల్ల నా పెళ్ళాన్ని భలేగా ఆడించొచ్చు!" అన్నాడు.

తలకాయను తలుపులోనుంచి లోపలికి తీసేసుకుని, గూసెవ్ మరొక నిమిషానికల్లా ఏమీ మాటాడకుండా నిశ్శబ్దంగా వుండిపోయాడు.

లోశ్‌కి మాత్రం కన్ను మూతపడలేదు. నక్షత్రాలకేసి చూస్తూ, పొగగొట్టం పీల్చుతూ సాగిలబడి అలా ఏమిటో ఆలోచిస్తున్నాడు. తూరీగ కన్నులాంటి మూడో కన్ను వున్న ఈ బంగారపు కృత్రిమ ముఖాలు ఈ అంగారక లోకంమీదకి ఎలా వచ్చాయి? మరి — ఈ సంకీర్ణ వస్తు చిత్రం కూడా ఎలా వచ్చిందిక్కడికి? ఇక పోతే — సముద్రంలో మునిగిపోతూన్న ఈ రాక్షసులు పెద్దపెద్ద నక్షత్రాల మధ్యకి ఎగిరిపోవడమో? ఈ పరవలయ చిహ్నమో — ఇదేమిటి? ఆ కెంపు గుబ్బ — అది భూగోళానికి చిహ్నమా? మరి ఈ ఇటుకరంగు మణిపూస — అంగారక గ్రహమా ఏమిటి? ఈ రెండు లోకాలపై పరిపాలనాధికార చిహ్నాలా ఇవి? ఎంత ఆలోచించినా దీని అంతు తెలియకుండా

వుందే. ఇక — ఆ గానంచేసే గ్రంథం, మబ్బుపట్టిన అద్దపు తెరపై కనబడిన వింత పట్నం — ఇవేమిటి? ఇవన్నీ ఇలా వుండగా — ఈ ప్రదేశం ఇంత నిర్జనంగా ఇంత ఏడుపొస్తూ ఎందుకుంది?

లోశ్ తన పొగాకు గొట్టాన్ని తన బూటుకాలికి టక్కుటక్కుమని కొట్టి చిలుం ఖాళీ చేశాడు. ఇక ఈ రాత్రి తెల్లవారడమంటూ వుండి, సూర్యోదయం అవుతుందా? తమకు ఈవేళ ఇంతకుముందు అవుపడిన అంగారక వైమానికుడు, జనసంకీర్ణమైన ఏ నగరానికో వెళ్లి తమ రాక గురించి తెలియజేసి వుండాలి. తమకోసం అంగారక వాసులు వెతుకుతున్నారా ఏమిటి? ఇందాకటి వాయునౌకను వాళ్లు అందుకోసమే పంపించారామో కూడా?

లోశ్ ఆకాశంకేసి నిదానంగా చూశాడు. ఆ ఎర్రని నక్షత్రం — భూమి — ఉచ్చదశ అందుకుంటూన్నకొద్దీ మరింత వెలవెలబోతూంది. దాని కాంతి రేఖ అతని గుండెల్లో బాణంలా చొచ్చుకుపోయింది.

తాను భూమిమీద వున్నప్పుడు, ఒకనాటి రాత్రిపూట కన్ను మూత పడక తన కార్ఖానా షెడ్డు గుమ్మంలో నిలబడి ఉదయిస్తూన్న అంగారక గ్రహాన్ని చూసినప్పుడు, గుండెలను కరడు కట్టించిన ఇదే బాధ తన్ను వేధించడం తనకిప్పుడు జ్ఞప్తికొచ్చింది. ఇదంతా జరగడం అచ్చంగా రెండు రాత్రిళ్ల కిందటే. ఆ గడియకూ ఈ గడియకూ మధ్య ఒక్క రోజే వ్యవధి — అది జరగడం భూలోకంలో!

భూమి, భూమి — కన్నుల పండువుగా వున్న పచ్చని భూమి, మేఘాల్లో నిమగ్నమై ఇప్పుడు కాంతిమండలంలోకి పయనిస్తూ, సస్యశ్యామలమై జీవనదులు పొంగి పొరలుతూ, తన బిడ్డలయెడ అమిత ఔదార్యమూ, అదే సమయంలో అమిత క్రౌర్యమూ ప్రదర్శించుతూ, తత్రాపి వారి గాఢానురాగాన్ని చూరగొన్న భూమాత...

అతని మెదడు విచారంతో ఘనీభవించిపోయింది. ఈ ఎరుపు గోళం — భూమి — ఇది కూడా ఒక మండుతూన్న హృదయంలాగే వుంది... ఇక మానవుడు, బుద్బుదప్రాయమైన ప్రాణి, క్షణమాత్రపు జీవితానికి మేల్కొంచిన మానవుడు, తాను, లోశ్ అనే మానవుడు — ఏకాకి అయి, పిచ్చెత్తినవాడిలా, యథేచ్ఛగా, తనచేతిలో తానుగా, తన మాతృభూమితో సంబంధం తెంపేసుకుని, ఏ దిక్కుమాలిన పిశాచంలాగానో ఈ కటిక ఎడారిలో వచ్చి కూచున్నావు నువ్వు. ఇదీ ఏకాంతజీవితం అంటే. ఇదా నువ్వు కోరుకున్నది? నీనుండే నువ్వు పలాయనం చిత్తగించాలనుకున్నావే? ఏమైందిప్పుడు?...

లోశ్‌కి చలివేసి గజగజ వణికాడు. పొగగొట్టాన్ని జేబులో పడేసుకుని, నౌకలోకి ఎక్కి, గుర్రుపెట్టి నిద్రపోతూన్న గూసెవ్‌కు పక్కగా పడుకున్నాడు. ఆ అమాయకుడు తన జన్మభూమిపట్ల మాతృద్రోహం తలపెట్టలేదే, కోటానకోటి ఆమడలు అంతరిక్షంలో పయనించి, భువర్లోక సువర్లోకాలు దాటి — ఇప్పుడే ఇంద్రలోకంలో అడుగు పెట్టినా, అతనికి స్వగృహంలో మసలుతూన్నట్టే వుంది... ఏ చీకూ చింతా ఎరగక హాయిగా గుండెలమీద చెయ్యివేసుకుని నిద్దరోతున్నాడు.

నౌక లోపల వెచ్చగా వుండడం చేతనూ, తను అలసిపోయి వుండడం కారణంగానూ లోశ్‌కి నిద్రపట్టింది. నిద్రలో కన్న కల అతనికి ఊరట కలిగించింది. ఆ కలలో భూలోకపు నదీతీరం, గాలిలో రెపరెపలాడుతూన్న బర్చిచెట్లు, మేఘాలు, నీటిలో మెరుపులు ప్రతిబింబించుతూన్న సూర్యకిరణాలు కనబడ్డాయి అతనికి — ఇక ఆవలి గట్టున తెల్లని వలువలు ధరించి, దేదీప్యమాన వదనంతో తనను పిలుస్తూ, తన పేరుపెట్టి సంబోధించుతూ, తనకేసి చేయి వూపుతూన్న ఎవరో ఒకానొక మూర్తి.

గిర్రున తిరుగుతూన్న ప్రొపెల్లర్ల ధ్వని చెవిని పడడంతో లోశ్, గూసెవ్‌లకు నిద్రనుంచి మెలకువ వచ్చింది.

# అంగారక వాసులు

కళ్ళు మిరుమిట్లు గొలిపే చెంగావి మబ్బులు నూలు పోగుల జడల్లా ప్రాతః కాలపు ఆకాశమంతటా అల్లుకున్నాయి. అరుణకాంతుల్లో మునిగి తేలుతూన్న వ్యోమయానపు నౌక ఒకటి, మేఘాల నడుమనున్న నల్లని చిరుగుల అంచులనుండి క్షణం అవుపడుతూ, మరుక్షణం రోజారంగు మబ్బుకొండల చాటున మాయమవుతూ కిందకు దిగుతూంది. ఇరుపక్కలా మొనదేలిన మూడు రెక్కలూ, దాని మూడు ఓడ స్తంభాల చట్రమూ సరిగా ఒక రాక్షసి బొద్దింకలా కానవచ్చింది.

చెమ్మగిలిన వెలుగులో వెండిలా మెరుస్తూన్న ఆ వాయునౌక మేఘాలను దూసుకొనిపోయి బ్రహ్మచెముడు చెట్లకు ఎగువను ఆకాశంలో వేలాడ గట్టినట్టు, గమనరహితంగా ఎగురుతూంది. రెండువైపులా వున్న పొట్టి స్తంభాల చివర నిటారుగా గిరగిర తిరుగుతూన్న గాలి స్క్రూళ్ళు నౌకను నేలనుండి కాస్త ఎత్తున ఎగురుతూనే గాలిలో స్థిరంగా నిలబడేందుకు వీలు కల్గిస్తున్నాయి. ఎత్తున నిలబడుండగా, నౌకకి రెండువైపులనుండీ మేడ మెట్లల్లా మెట్లున్న నిచ్చెనలు దింపగా, అది వీటిమీద నిలబడింది. గాలి స్క్రూళ్ళు ఆగిపోయాయి.

సన్నగా బక్కపలచగా వున్న అంగారకవాసులు మెట్లమీదనుంచి కిందకి పరుగెత్తారు. వారిలో ప్రతీవారూ అండాకృతి హెల్మెట్లు పెట్టుకుని, వెండిలా తెల్లగా మెరిసిపోతూన్న వదులు అంగరకాలు తొడుక్కున్నారు. మెడ, చుబుకమూ దళసరి కాలర్లలో మునిగున్నాయి. ప్రతీవారి చేతుల్లోనూ పొట్టి ఆటోమాటిక్ రైఫిల్ వుంది. రైఫిల్ గొట్టంపై సగం మేరకు పెద్ద రేకు బిళ్ల ఒకటి దూర్చి వుంది.

గూసెవ్ ముఖం చిట్లించుకుంటూ, తన మౌజర్ పిస్టలును సిద్ధంగా పట్టుకుని, వాయునౌకనుంచి దిగిన అంగారకవాసులు తమకిద్దరకూ ఎదురుగా రెండు వరుసలు తీర్చి నిలబడడం చూస్తూ రోదసీనౌక దగ్గరే నిలబడ్డాడు. వారు రైఫిళ్లను మోచేతులమీద అడ్డంగా పెట్టుకునున్నారు.

"ఆడాళ్లు తుపాకులను పట్టుకునేటట్టు పట్టుకుంటున్నారే ఈ దద్దమ్మ వెధవలు!" అని గునిశాడు గూసెవ్.

లోశ్ చేతులు కట్టుకుని నవ్వుతూ నిలబడ్డాడు. వాయునౌకనుండి దిగిన ఆఖరి మనిషి, బుజాలనుంచి కుచ్చెళ్లలా కిందకి పడుతూన్న నల్లని అంగరకా తొడుక్కున్నాడు. శిరస్త్రాణం లేని అతడి తలకాయ పొన్నకాయలా నున్నగా వుండి, బోడిపెలు కట్టినట్టుంది. గడ్డాలు లేని అతడి కోల ముఖం ఇంచుమించు నీలంగా వుంది.

ఇసుకలా వున్న ఆ గుల్ల నేలలోనుంచి ఈ మనిషి అడుగుతీసి అడుగు వేసుకుంటూ నడిచి, జంట వరస తీర్చి నిలబడున్న సోల్జర్లను సమీపించాడు. తేజస్సుతో ప్రకాశించుతూ ఉబ్బెత్తుగా పైకి పొడుచుకొస్తూన్న కళ్లనుండి వెడలుతూన్న హిమశీతల వీక్షణాలతో అతడు మొదట గూసెవ్‌ను చూచి, తరువాత లోశ్‌పైనే తన దృష్టిని కేంద్రీకరించాడు. అతడు వీరిద్దరినీ సమీపించి, వెడల్పాటి చొక్కాచేతిలో వున్న తన చిన్న చేతిని పైకెత్తి, కీచుకీచుమంటూన్న పిట్టగొంతుకతో:

"తల్‌త్సేత్ల్," అన్నాడు.

శీతలోద్రేకాతిశయంతో మెరసిపోతూన్న అతని కళ్లు మరింత పెద్దవయాయి. పక్షుల కలకలారావంలా ధ్వనించిన ఆ మాటను అతడు మళ్లీ మరొకసారి ఉచ్చరించి, వేలెత్తి రాజతీవితో ఆకాశంవైపు చూపించాడు. అతడు అన్నది అర్థంచేసుకుని, లోశ్ ప్రత్యుత్తరమిచ్చాడు:

"భూలోకం."

"భూలోకం," అంటూ ఆ పదాన్ని అమిత కష్టంతో ఆ అంగారక వాసి ఉచ్చరించి, కనుబొమలు ముడిపెట్టుకున్నాడు. అతడి నుదుటి ముడుతలు జేవురించాయి. గూసెవ్ ఒక అడుగు ముందుకేసి, చిన్న దగ్గు దగ్గాడు.

"మేం సోవియట్ రష్యానుంచి వచ్చాం — మేం రష్యన్లం. మిమ్మల్ని చూడ్డానికనే వచ్చాం అన్నమాట. నమస్తే!" అంటూ సెల్యూటు కొట్టి, "మీరేమీ భయపడకండి, మిమ్మల్ని మేమేం చెయ్యం, ఏమీ చెయ్యం... అరె, మన మాటలు వీడికేమీ అర్థం కావడం లేదయ్యా, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్!" అన్నాడు గూసెవ్.

ఆ అంగారకవాసి తెలివైన నీలిరంగు ముఖంలో కనుబొమల నడుమ అంతకంతకు పెద్దదవుతూన్న — మానసిక శ్రమసూచకమైన — ఎర్రని మచ్చ తప్ప మరే చలనమూ కనబడలేదు.

చక్కని నాజూకు అభినయంతో సూర్యునికేసి చూపిస్తూ అతడు ఒక వింత పదం ఉచ్చరించాడు:

"సోఅత్సేర్."

అలా అని, నేలకేసి చూపించి, ఒక పెద్దగోళాన్ని తాను కౌగలించుకుంటూనట్టు సూచించుతూ:

"తూమ," అన్నాడు.

తరువాత తన వెనుక అర్ధవలయాకారంలో నిలబడున్న సోల్జర్లలో ఒకనికేసి చూపించి, తదుపరి గూసెవ్‌నూ తననూ లోశ్‌నీ చూపించుతూ:

"షోహో," అన్నాడు.

అనేక వస్తువులను చూపించి తన భాషలో వాటి పేర్లు చెబుతూ, భూవాసుల భాషలో వాటికేమంటారో వారిచేత చెప్పించాడు. ఆ తరువాత

అతడు లోశ్‌ను సమీపించి, తన అంగుళీయకంతో లోశ్ నుదుటిని కను బొమ్మల నడుమ తాకాడు. లోశ్ నమస్కార పురస్సరంగా తల పంకించాడు. ఆ అంగారకవాసి అదే విధంగా గూసెవ్‌ను కూడా తాకేసరికి:

"మనం అడవిమనుషులమని అనుకుంటున్నారు కాబోలు వీళ్ళు!" అని అంటూ గూసెవ్ తటోపీని నుదుటి కిందకి లాగేసుకున్నాడు.

ఆ అంగారకవాసి రోదసీనౌకను సమీపించి, తనలో పొంగి పొరలు తూన్న ఆశ్చర్యాన్ని అదుపులో వుంచుకుని, నౌకను నిదానంగా పరికించాడు. కాస్సేపయాక నౌకకు మూలాధారమైన శాస్త్రీయ నియమాన్ని అతడు గ్రహించుకుని, మరింత ఉత్సుకతను ప్రదర్శించుతూ, మసి చూరి వున్న ఆ అండాకృతి ఉక్కు గోళాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు. తటాలున అతడు తన చేతులు పైకెత్తి సైనికుల దళం వంక తిరిగి, వారితో ఏమిటో గబగబ మాట్లాడాడు.

"అయియూ," అంటూ వాళ్లు దీర్ఘంతీసుకుంటూ జబాబు చెప్పారు.

అతడు తన అరచేతిని నుదిటిపై వుంచుకుని, నిట్టూర్చి, తన ఆందోళనను అణచుకుని, తన వెనుకటి ముక్తసరు వైఖరిని పూర్తిగా విడిచిపెట్టేసి, కలుపుకోలుతనంగా లోశ్ వంక తిరిగి, చెమ్మగిలిన కళ్లతో గాఢంగా చూసి:

"అయియూ, అయియూ ఉతారా షోహో, దాత్సియ తూమ ర గియో తల్‌త్సేత్ల్," అన్నాడు.

తన చేతితో కన్ను మూసుకుని అతడు వంగి సోల్జరుని ఒకణ్ణి పిలిచి, ఆ సోల్జరునుంచి ఒక సన్నని చాకు అందుకుని, దానితో రోదసీనౌక పైన కోడుగుడ్డు బొమ్మనీ, దాని దగ్గరే ఒక సోల్జరు బొమ్మనీ గీశాడు.

ఆ అంగారకవాసి అలాగు గీస్తూండగా అతని వెనుక నిలబడి అతడి బుజంమీదనుండి చూస్తూ గూసెవ్ అన్నాడు:

"మన నౌకమీద గుడారం వేయించి, చుట్టూ పహరా జవాన్లను పెడతానంటున్నాడు. ఈ జవాన్లే మన వస్తువులను కాజేస్తారో ఏమిటో, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్? నౌక తలుపుకి తాళంలేదు కూడానూ."

"ఎందుకొచ్చిన పిచ్చిమాటలయ్యా, అలెక్సేయ్ ఇవానొవిచ్?"

"మరి — మన పరికరాలూ, గుడ్డముక్కలూ, అన్నీ అందులోనే వున్నాయిగా... మీరేమిటంటే అనండిగాని, నాకు మాత్రం అక్కడున్నాడే ఆ సోల్జరుగాడి వాటం చూస్తే నాకేమిటో అనుమానంగానే వుంది సుమండీ!"

వీరి సంభాషణను అంగారకవాసి మర్యాదగా వింటున్నాడు. అతని సూచన తనకు సమ్మతమేనని లోశ్ సంజ్ఞ చేశాడు. అంగారకవాసి కొన్ని సాంకేతిక సంజ్ఞలు చేశాడు. వాటికి బదులు చెబుతూన్నట్టుగా, వాయు నౌకకున్న మధ్యస్తంభం చివర కొన్ని సన్నని ఆంటెన్నాలు లేచి, వీటి కొనల నుంచి విస్ఫులింగాలు వెడలజొచ్చాయి.

వాయునౌకలో ఎక్కండని అంగారకవాసి లోశ్, గూసెవ్‌లను ఆహ్వా నించాడు. అక్కడున్న సోల్జర్లు వీరిద్దరి దగ్గరకూ వచ్చి, చుట్టూ నిల బడ్డారు. గూసెవ్ వారికేసి పళ్లిగిలిస్తూ ఓరగా చూసి, రోదసీనౌకలోకి ఎక్కి, తమ బట్టలున్న రెండు సంచులనూ తీసుకొచ్చి, నౌకాద్వారాన్ని స్క్రూళ్లతో గట్టిగా బిగించి, సోల్జర్లను ఉద్దేశించుతూ తలుపుకేసి చూపించి, తరువాత తన చేతనున్న మౌజరు పిస్టలును చూపుడువేలితో తట్టి, 'ఖబడ్దార్!' అన్న ట్టుగా తర్జనిని వారికేసి ఝళిపించి, భయంకరంగా ముఖం చిట్లించాడు. ఇతడి చేష్టలన్నిటినీ అంగారకవాసులు ఆశ్చర్యంతో గమనించారు.

''సరే ఇక, అలెక్సేయ్ ఇవానొవిచ్, అతిథులమో, ఖైదీలమో, మనం చేసేదేమీ లేదుకదా. పదండి వెళ్దాం!'' అన్నాడు లోశ్ చిరునవ్వు నవ్వు తూనూ, తన సంచీ బుజాన వేసుకుని. ఇద్దరూ వాయునౌకకేసి అడుగులు వేశారు.

వాయునౌక స్తంభాలపై వున్న నిట్టనిటారు గాలి ప్రొపెల్లర్లు ర్రుయ్మని తిరగనారంభించాయి. రెక్కలు కిందకు వాలిపోయాయి. ప్రొపెల్లర్లు గర్జించి గిర్రున తిరిగాయి. అతిథులో ఖైదీలో మరి ఏమైతేనేం — ముట్టుకుంటేనే ఎక్కడ విరిగిపోతుందో అన్నట్టున్న ఆ సన్నని మెట్లు ఎక్కారు వాళ్లిద్దరూ.

# పర్వత శిఖరాలకు ఆవల

వాయునౌక అంగారకగ్రహంపై కొద్ది ఎత్తునే ఎగురుతూ వాయవ్యంగా పయనించింది. లోశ్, బట్టతల అంగారకవాసి — ఇద్దరూ డెక్కుమీద వుండిపోయారు. గూసెవ్ నౌక కిందిభాగంలోకి సోల్జర్లతోపాటు దిగిపోయాడు.

మంచి వెలుగ్గా వున్న ఆ పసిమిరంగు కేబిన్‌లోకి ప్రవేశించి, బెత్తు కుర్చీలో చదికిలబడి సోల్జర్లను నిదానంగా చూస్తూకూచున్నాడు గూసెవ్. సూదిముక్కులూ వాళ్లూ పొట్టిగా వుండి, పక్షుల్లా ఎర్రని కళ్లు మిటకరిస్తున్నారు. అప్పుడు గూసెవ్ తానెంతో ప్రేమతో చూసుకుంటూన్న తన అమూల్యమైన టిన్ను సిగరెట్టు కేసు (గత ఏడేళ్ల యుద్ధాల్లోనూ దానిని మాత్రం అతడు వదల్లేదు) తన జేబులోనుంచి తీసి, 'ఏం, కామ్రేడ్స్, సిగరెట్టు కాల్చుకుందామా?' అన్నట్టుగా, వేలితో దానిమీద టక్కుటక్కుమని కొట్టి, సిగరెట్లను సోల్జర్ల కివ్వబోయాడు.

అంగారకవాసులు మాత్రం భయపడిపోయి, వొద్దు వొద్దు అనే అర్థంతో తల వూపారు. వారిలో ఒకడు మాత్రం ధైర్యంచేసి సిగరెట్టు అందుకుని, దాన్ని నిదానంగా ధ్యానించి, వాసన చూసి, పంట్లాం జేబులో పడేసుకున్నాడు. గూసెవ్ తన సిగరెట్టు వెలిగించేసరికల్లా, వారంతా భయంతో వెనక్కి తగ్గిపోయి, వారిలో వారు గుసగుసలు మొదలెట్టారు:

"షోహో తావా త్రావా, షోహో-ఒమ్."

ఆ "షోహో" పొగ మింగుతూండడం చూసి, సూది ముక్కులున్న ఆ ఎర్రని ముఖాలన్నీ హడలిపోయాయి. అయినప్పటికీ కాస్సేపటికి వారందరూ మళ్లీ గూసెవ్ చుట్టూచేరారు.

అంగారక భాష తనకు తెలియదే అని రవంతైనా బిడియపడకుండా, గూసెవ్ తన కొత్త స్నేహితులతో రష్యా గురించీ, యుద్ధం గురించీ, విప్లవం గురించీ, తన సాహస కృత్యాల గురించీ చెప్పుకొచ్చాడు.

"నా పేరు గూసెవ్ అంటారు. గూసెవ్ అంటే మా యింటి పేరన్నమాట. గూసెవ్ అనే మాట గూస్ అన్న పదంలోంచి వచ్చింది. గూస్ అంటే — భూలోకంలో వుండే ఒక పెద్ద పక్షి. అలాంటి పక్షి బహుశా మీ లోకంలో వుండదు — మీరు చూసుండరు కూడా. నా పేరు అలెక్సేయ్ ఇవానొవిచ్ నేను యుద్ధంలో వున్నప్పుడు — నా చేతికింద ఒక రెజిమెంటు — ఒక్క రెజిమెంటన్నమాటేమిటి? — ఏకంగా ఒక పూర్తి కేవ్రెలీ స్క్వాడ్రనే — వుండేది. నేను ఒక వీరుణ్ణి — ప్రచండ వీరుణ్ణి. నా పంథా ఎటువంటిదంటే — ఎదుట మెషీన్‌గన్ను వున్నా సరే లేకపోయినా సరే — ఒరలోంచి పట్టాకత్తి తీసి: 'లొంగిపోతారా లొంగరా, లంజకొడుకుల్లారా?' అని అరవడమూ, నరికిపారేయడమూ, అంతే! నా వొళ్ళు కూడా అక్కడక్కడ గంట్లూ నరుకులూ పడిందనుకోండి — అయితే

మాత్రం నేనేం ఖాతరు చేశాననుకున్నారా? అబ్బే, ఖాతరు చెయ్యలేదు! మా మిలిటరీ ఎకాడెమీలో ప్రత్యేకంగా ఒక కోర్స్ వుంది: 'అలెక్సేయ్ గూసెవ్ పట్టాకత్తి ఎత్తుగడలు' అని. — నా మాట నమ్మరేమో మీరు? నాకు ప్రత్యేకంగా ఒక సైనిక విభాగం ఒప్పజెప్పి, దానికి నన్ను అధిపతిగా వుండమని బతిమాలారు," అని గూసెవ్ తన తలమీద టోపీని కాస్త వెనక్కి తోసి, తల గోక్కుని, మళ్లీ సాగించాడు: "కాని 'క్షమించండి, బాబూ, ఈ బాధ కూడా నేనెక్కడ పడను? వొద్దు వొద్దు,' అనేశాను. ఏడేళ్ల ఏకధాటిని యుద్ధం చేసేసరికి ఎలాంటి వాడికేనా మొహం మొత్తుకొస్తుంది. సరి — ఇలా వుండగా, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్ చక్కావచ్చి, తనతో కలిసి రోదసీ ప్రయాణం కట్టితేనే గాని వీల్లేదంటూ బలవంతం చేశాడు: 'అలెక్సేయ్ ఇవానొవిచ్, మీరు నాతో రాకపోతే నేనసలు ప్రయాణమే మానుకుంటాను — ఇహ మీ యిష్టం' అనేశాడు. అతని మాట తోసేయలేక, 'సరే' అన్నాను."

అంగారకవాసులు ఆశ్చర్యంతో విన్నారు అతను చెప్పినదంతా. వాళ్లల్లో ఒకడు, జాజికాయవాసన వేసే గోధుమరంగు ద్రవం వున్న ఒక సీసాను తీసుకొచ్చాడు. గూసెవ్ తన సంచి అంతా కెలికి, అందులోనుంచి ఒక పైంటుసీసా వోద్కా పైకి తీశాడు. ఆ వోద్కాను అంగారకవాసుల సేవించి, ఇక ఉద్రేకంతో అదే వాగుడు వాగడం మొదలెట్టారు. గూసెవ్ వారిని వీపుమీద తట్టి, హుషారు చేసి కావలసినంత రణగణ ధ్వని చేశాడు. తరువాత తన జేబులన్నిటినీ ఖాళీ చేసి, వాటిలోనుంచి నానా చెత్తా పైకితీసి, వారికి చూపించి, ఈ వస్తువులు వాళ్లకిచ్చి, వాళ్ల దగ్గరున్న వస్తువులను మార్పిడి చేసుకుంటానన్నాడు. అందుకు వాళ్ళు ఎగబడి, అతని దగ్గర నుండి పేనాకత్తి, పెన్సిలు ముక్క, మందులేని తూటాగొట్టంతో చేసిన

చిత్రమైన సిగరెట్టు లైటరు తీసుకుని, వాటికి బదులు తమవద్దవున్న బంగారపు వస్తువులను అతనికి ఇచ్చారు.

ఇదంతా జరుగుతూండగా, వాయునౌకకున్న వల్రగాదిపై మోచే తులు అనుకుని, అంతకంతకు వెనక్కి వెళ్లిపోతూన్నట్టి నిర్మానుష్యమైన మిట్టపల్లాల విశాల మైదానాన్ని అవేక్షించాడు. క్రితం రోజు తాము సంశో ధించిన గృహాన్ని అతడు పోలికపట్టాడు. ఎటువైపు చూసినా శిథిలాలు, సముద్రంలో ద్వీపాల్లా అక్కడక్కడ చెట్లపొదలు, పొడుగ్గా పట్టీలు పరచి నట్టు ఎండిపోయిన కాలువలు.

కింద విస్తరించున్న ఎడారిని చూపించి, గొడ్డుబోయిన నేల ఎం దుకిలా ఆమడలకొద్దీ ఆవరించి వుందని లోశ్ ఆశ్చర్యం తెలియజేశాడు అంగారకవాసితో. ఉబ్బెత్తుగా పొడుచుకొస్తూన్న అంగారకవాసి కళ్లు హఠా త్తుగా ఆగ్రహపూరితములయాయి. అతడు ఒక సంజ్ఞ చేసేసరికల్లా, ఆ సంజ్ఞ ప్రకారం వాయునౌక మరింత ఎత్తున ఎగరడం మొదలెట్టి, ధనురాకారం చుట్టి, గండశిలామయమైన పర్వతశిఖరాల దిశగా పయనించింది.

సూర్యుడు ఆకాశాన నడినెత్తి నున్నాడు. మేఘాలు అదృశ్యమై పోయాయి. వాయునౌక ప్రొపెల్లర్లు గర్జించాయి. సునాయాసంగా వంగే రెక్కలు కిర్రుకిర్రుమంటూ కదిలాయి. నౌక మలుపు తిరిగి ఆరోహణ ప్రారంభించింది. నిటారుగా వున్న గాలి ప్రొక్కాళ్లు గిర్రున తిరిగాయి. ప్రొపె ల్లర్ల గర్జన, వాటి నడుమనుండీ రబ్బరు తొడిగిన స్తంభాల నుడుమనుండీ ప్రవహిస్తూన్న గాలి హోరు – ఈ ధ్వనులు తప్ప మరే చప్పుడూ విన బడడం లేదు: చలనయంత్రాలు నిశ్శబ్దంగా పనిచేస్తున్నాయి. ఆమాటకొస్తే చలనయంత్రాలంటూ అసలెక్కడా అగపడే అగపడలేదు. ప్రతీ గాలి ప్రొక్కా

తవ్వమీదనూ తవ్వతో కూడా తిరుగుతూన్నట్టే డైనమో పైకప్పల్లా కాన వస్తూన్న పెట్టెలూ, ముందు వెనుకల వున్న స్తంభాల కొనలకున్నట్టి చిటపట శబ్దంతో విస్ఫులింగాలను విడుస్తూ తెల్లగా వెండిలా అవుపడు తూన్న తీగతో అల్లినట్టి కోడిగుడ్డు ఆకారపు బుట్టలు రెండూ — ఇవే అగపడ్డాయి లోశ్‌కి.

అనేక వస్తువులను చూపెట్టి, వాటి పేర్లు ఏమిటో చెప్పమని లోశ్ అంగారకవాసిని అడిగి, ఆ పదాలను రాసుకున్నాడు. ఇలా రాసుకున్నాక, క్రితం రోజు తాను సంగ్రహించిన రేఖాగణితపు చిత్రణల పుస్తకాన్ని జేబులోనుంచి పైకితీసి, అంగారకవాసుణ్ణి ఆ రేఖాగణితపు అక్షరాలను ఉచ్చరించమని అడిగాడు. అంగారకవాసి ఆ పుస్తకాన్ని ఆశ్చర్యంతో చూశాడు. పదేపదే అతని చూపులు కఠినమయాయి. తిరస్కార భావంతో అతడు తన సన్నని పెదవులు విరిచాడు. ఆ పుస్తకాన్ని అతడు లోశ్ చేతుల్లోనుంచి జాగ్రత్తగా తీసుకుని నౌకలోనుంచి కిందకు గిరవాటేసేశాడు.

గాలి పలుచగా వుండడం కారణాన ఊపిరి తీయడం కష్టమైపోయి, లోశ్ కళ్ల నీళ్లుకారడం మొదలెట్టాయి. దీన్ని చూసి, నౌకను కాస్త కిందుగా నడిపించమని సంజ్ఞచేశాడు అంగారకవాసి. నౌక ఇప్పుడు రక్తవర్ణపు శిలాపర్వతాల ఎగువ ప్రయాణం చేస్తూంది. ఆ వెడల్పాటి పర్వతపంక్తి ఆగ్నేయంనుండి వాయవ్యంగా అష్టవంకర్లగా వ్యాపించి వుంది. ధాతుఖనిజ సిరలతో మెరుస్తూన్న నిట్రపు గండశిలలపై, దట్టంగా నాచు మొలచి వున్న నిటారు కొండ వాలులపై, తుషార మేఘాలతో నిండిన అగాధాలపై, తళుకులు ప్రకాశిస్తూన్న హిమశిఖరాలపై, గాజులా నున్నగా గడ్డకట్టిన సెలయేళ్లపై వాయునౌక ఛాయ పరుగులెత్తుతూంది.

''లిజియజీర,'' అన్నాడు అంగారకవాసి పర్వతాలకేసి చూపెడుతూ, అతడా పదం ఉచ్చరించినప్పుడు, లోహం తాపితంచేసి వున్న అతని సన్నని పళ్ళు తళతళ మెరిశాయి.

వాయునౌకలో నిలబడి పర్వత శిలలవైపు కిందకు చూస్తూండగా, మృత్యువాతబడిన ఈ గ్రహ విభాగపు దృశ్యాన్ని తానిదివరకు చూచినప్పుడు తనకెంత విచారం కలిగిందో లోశ్‌కి ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఆ ప్రకృతి దృశ్యాన్ని వీక్షించుతూండగా, ఒక అగాధం అట్టడుగున రాళ్ల నడుమ చిక్కుకుని తిరగబడిపోయిన నౌక చట్రమూ, దాని చుట్టూ వున్న వెండిలా కానవస్తూన్న లోహపు అవశేషాలూ లోశ్‌కి కనబడ్డాయి. కొండ వరుసకు మరికొంత దూరాన మరొక నౌక తాలూకు విరిగిపోయిన పక్షం ఒకటి రాళ్ల మధ్యాన చిక్కుకుని పైకి పొడుచుకొస్తూంది. కుడిచేతివైపు, గండశిలా శిఖరానికి గుచ్చుకొనిపోయిన మరొక మూడో నౌక శిథిలాలు అవుపడ్డాయి. ఎటుచూసినా పెద్దపెద్ద విమాన పక్షాలూ, విరిగిపోయిన విమాన చట్రాలూ, పైకి తోసుకొస్తూన్న చట్రపు కడ్డీలూ పడున్నాయి. ఒకానొకప్పుడు ఈ స్థలం యుద్ధభూమి అయి వుండినట్టు ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది. ఈ గొడ్డుబోయిన బండరాళ్లపై జరిగిన ఘోర సంగ్రామంలో పిశాచాలే పరాజయం పొందినట్టుంది.

తన పక్కనున్న అంగారకవాసి వంక లోశ్ ఓరగా చూశాడు. అంగారకవాసి తన అంగరకా కాలరు వొసిలించుకుంటూ, ఆకాశాన్ని ప్రశాంతంగా వీక్షిస్తూ కూచున్నాడు. పొడుగాటి రెక్కలు చాపుకొని విన్యాసం తీర్చి వారికి ఎదురు సన్నాహంగా కొన్ని పక్షులు ఆకాశంలో ఎగురుతూ వస్తున్నాయి. అవి తటాలున ఇంకా ఎత్తుగా ఎగిరి, శ్యామలవర్ణపు ఆకాశంలో తమ పసిమి రెక్కలను ప్రకాశింపజేసి, చటుక్కున వెనక్కి తిరిగి వెళ్లిపోయాయి. ఆ

వెళ్లిపోతూన్న వాటిని చూస్తూండగా, ఎత్తుగా వున్న పర్వతశిలల మధ్యను నల్లని నీరున్న గుండ్రని సరస్సు ఒకటి లోశ్‌కి అవుపడింది. సరస్సు గట్టున పొదలు పెరిగున్నాయి. పసిడిరంగు పక్షులు నీటి వొడ్డున వాలాయి.

సరస్సులోని నీరు తటాలున అల్లకల్లోలితమై, కుతకుత మరగడం మొదలెట్టి సరస్సు మధ్యనుంచి జలస్తంభం లేచి తటాలున సమసిపోయింది.

"సాఅమ్," అన్నాడా అంగారకవాసి గంభీరంగా.

నౌక పర్వతపంక్తి కొనను దాటేసింది. తళతళ ప్రకాశించుతూ పెద్దపెద్ద సరస్సులున్న పసిడిరంగు మైదానం ఒకటి వాయవ్యాన విస్తరించి వున్నట్టు సుడిగాలిలా పైకిలేస్తూన్న అర్ధపారదర్శకపు ఉష్ణతరంగాల నడుమ నుంచి కనబడింది. మంత్రబలంచే సృష్టించబడిందేమో అన్నట్టు దూరాన అద్భుతంగా కిందకు దిగి వున్న పొగమంచు తెరకేసి వేలుపెట్టి చూపించుతూ, లీలగా మందహాసం చేస్తూ అంగారకవాసి:

"అజోర," అన్నాడు.

వాయునౌక మరింత ఎత్తున ఆకాశంలోకి ఎగిరింది. లోశ్ ముఖాన్ని చెమ్మగాలి మృదువుగా చుంబించి, అతని చెవిలో మెల్లగా వూదింది. తళుకులు ప్రకాశిస్తూన్నట్టి వెడల్పాటి మైదానంలా విస్తరించి వుంది అజోరా. వలలో పోగుల్లా అల్లుకుని చిన్నచిన్న అలలతో అల్లల్లాడుతూన్న నీటి కాల్వలూ, నారింజపండు వన్నె పొదలూ, నవ్వులు మూటకడుతూన్న పసుపుచాయ పచ్చికబయళ్లూ రత్నకంబళ్లలా విస్తరించి వున్న అజోర, అనగా ఆనందం, — ఏనాడో బాల్యంలో కలలుగన్న వసంత కాలపు చిన్ని పసరిక మైదానంలా కానవచ్చాయి.

కాల్వలలో వెడల్పాటి తొట్టెపడవలు ప్రయాణం చేస్తున్నాయి. ముచ్చటైన బాటలతో రమ్యమైన ఉద్యానవనాల మధ్య కట్టిన తెల్లని ఇళ్లు కాల్వల

గట్టున వరుసలుతీర్చి వున్నాయి. ఎక్కడచూసినా అవుపడుతున్నారు అంగా రకవాసులు — బొమ్మల్లా కనిపిస్తూ. కొందరు తమ ఇళ్ల డాబాల పైనుండి పక్షులవలె ఎగరడానికి సిద్ధమై, కాల్వల మీదనుండి ఆవలనున్న ఉద్యానవనాల్లోకి గబ్బిలాల్లా వాల్తున్నారు. చుట్టూ వున్న పచ్చిక బయళ్ల నడుమ చెరువులూ ఏళ్లూ కాంతులు ప్రతిబింబిస్తున్నాయి. అజోర ప్రాంతం ఎంతో ముచ్చటగా కనబడుతూంది.

మైదానం ఆవలి చివర బ్రహ్మాండమైన తటాకం ఒకటి అద్దంలా మెరుస్తూంది. పాముమెలికల్లా పారుతూన్న కాలువలన్నీ ఈ తటాకంలోకి ప్రవహిస్తున్నాయి. తటాక దిశగా పయనించింది వాయునౌక. వెడల్పుగా సరాసరి ముక్కుసూటిగా పారుతూన్న కెనాలు ఒకటి చిట్టచివరకి లోశ్కి అగపడింది. కెనాలు అవతలి వొడ్డు పొగమంచులో అంతర్ధానమైపోయింది. కెనాలులో పారుతూన్న పసిమివర్ణపు బురదనీరు కొండవాలు పక్కనుండి సావకాశంగా ప్రవహిస్తూంది.

ఎంతో దూరం ఆలాగు పయనించింది ఆ వాయునౌక. ఎలాగై తేనేం చివరకి కెనాలు ఆవలి కొస కనబడింది. నున్నగా వున్న వెడల్పాటి శిలాకుడ్య పార్శ్వం నీటిలోనుండి సరాసరి నిట్రటంగా లేచి, దిగ్మండలాన్ని అటూ ఇటూ తాకింది. ఆ రాతిగోడ అంతకంతకు మరింత పెద్దదిగా కానవచ్చింది. గోడకున్న పెద్దపెద్ద చాపరాళ్లూ, వాటి అంచుల నడుమ వున్న సందులనుండి మొలుస్తూన్న తుప్పలూ, చెట్లూ స్పష్టంగా కనబడ్డాయి. నీటితో సమృద్ధిగా నిండి వున్న ఒక మహాసాగరాన్ని సమీపిస్తూంది వాయు నౌక. నురుగలు కక్కుతూన్న చిన్నచిన్న స్రోతస్సులు నీటి ఉపరితలంనుంచి పైకి లేస్తున్నాయి...

"రో," అన్నాడు ఆ అంగారకవాసి, అర్థవంతంగా వేలు పైకెత్తి చూపిస్తూ.

లోశ్ తన జేబులోనుంచి నోటుబుక్కును చప్పున తీసి, క్రితం దినం అంగారక బింబంపై కనబడిన గీతలనూ చుక్కలనూ చూసి తాను రాసుకున్న చిత్రాన్ని చూసుకున్నాడు. తన పక్కనున్న అంగారకవాసునికి లోశ్ ఆ చిత్రాన్ని చూపించి, కింద కనబడుతూన్న తటాకాన్ని చూపించాడు. లోశ్ అడుగుతూన్నదేమిటో అంగారకవాసి అర్థంచేసుకుని, కనుబొమలు ముడిపెట్టి ఆ చిత్రాన్ని పరిశీలించి, సంతోషంతో తల పంకించి, ఆ చిత్రంలో చుక్క ఒకదానిని తన చిటికినవేలి మొనతేలిన గోటితో చూపించాడు.

నౌకకున్న కంచె గుంజని ఆనుకొని కిందకి చూడగా, విలువంపు ఆకారంలో వున్న కెనాలు ఒకటీ, తిన్నగా సూటిగా వున్న కెనాల్లు రెండూ తటాకం నుండి ప్రవహిస్తూన్నట్టు లోశ్‌కి కనబడింది. "ఓహో, ఇదా రహస్యం!" అనుకున్నాడు లోశ్: అంగారక బింబంపై అవుపడిన గుండ్రని చుక్కలు రిజర్వాయర్లనూ ముక్కోణాలూ అర్ధవలయాలూ కాల్వలనూ తెలియజేస్తున్నాయన్నమాట. అయితే — ఈ బ్రహ్మాండమైన శిలాకుడ్యాలను ఎవరు నిర్మించారు? లోశ్ తనలో తాను ప్రశ్న వేసుకుని, తన సహచరుని కేసి చూశాడు. అంగారకవాసి తన కిందిపెదవి విరిచి, చేతులు రెంటినీ ఆకాశంకేసి చాచి:

"తావో హత్స్హ రో హమగత్సిత్ల్," అన్నాడు.

ఈ సమయంలో వాయునౌక ఒక గొడ్డుపోయి మాడిపోయిన మైదానం మీదుగా పయనించుతూంది. ఆ మైదానం నడిమధ్యనుండి ఎండిపోయిన చెంగావి వర్ణపు వెడల్పాటి కాల్వ, నాల్గవది, విస్తరించి వుంది. కాల్వ గర్భంలో చెట్ల వరుసలు నీటుగా పాతి వున్నాయి. అంగారక బింబంపై

మసక మసకగా కనబడిన రేకు వలయాలపై రెండో కాల్వ అల్లిక గీతలలో ఒక గీత ఈ కాల్వని సూచిస్తూందని ఇప్పుడు స్పష్టంగా తెలుస్తూంది.

ఈ మైదానం క్రమేణా ఎత్తుపల్లాలుగా వున్న కొండగుట్టలుగా పరిణమించింది. ఈ కొండకు ఆవల ఎత్తుగా నిర్మించి వున్న అల్లికబురుజుల నీలిరంగు రేఖాచిత్రాలు కానవచ్చాయి. వాయునౌక నడిమి స్తంభం చివరనున్న ఆంటెన్నాల కొనలనుండి విస్ఫులింగాలు వెడలజొచ్చాయి. కొండ గుట్టల వెనకాల ఇంకా ఎన్నో అల్లికబురుజులూ, భవనాలూ కనబడ్డాయి. చివరకు సూర్యకిరణాలలో తెల్లగా వెలుగుతూన్న పొగమంచు తెరలోనుండి రజితచ్ఛాయల రూపం ధరించిన బ్రహ్మాండమైన మహాపట్నం ఒకటి అవుపడింది.

అంగారకవాసి అన్నాడు:

''సోఅత్సేర.''

# సోఅత్సేర

సోఅత్సేర మహాపట్నంయొక్క శ్వేత నీలివర్ణపు ఆకృతిరేఖలూ, మేడ మెట్లల్లా కనబడుతూన్న ఇళ్ల డాబాల కప్పులూ, పర్ణములు అల్లుకొని పచ్చగా వున్న ఇళ్ల గోడలూ, అద్దాల్లా మెరుస్తూన్న అండాకృతి తటాకాలూ, కొండలకు ఆవల అవుపడుతూన్న పారదర్శకపు బురుజులూ — తుషారావృత దిగ్మండలాన్ని చుంబించుతూన్నట్టుగా ఎంతో దూరం వరకూ వ్యాపించి వున్నాయి. వాయునౌకకు స్వాగతం చెప్పేందుకని నల్లని చుక్కలు ఎన్నో ఎగురుతూ వచ్చాయి.

పూలచెట్లు నాటిన కాల్వ గర్భం ఉత్తరదిశగా విస్తరించి వుంది. పట్నానికి తూర్పుదిశను ఇటుకలూ రాళ్లూ ఇనుపచెత్తా గుట్టలు

గుట్టలుగా పోగుపడి వున్న ఖాళీ స్థలం వుంది. ఈ బీడు జాగాకి ఒక చివర, పగుళ్ళుపడి బీటలువారి శిలీంధ్రాదులు పూతపూసి వున్న శిలావిగ్రహం ఒకటి తన పొడుగాటి కారునలుపు నీడను నేలపై ప్రసరించుతూంది.

అదొక పురుషుని శిలావిగ్రహం. నిటారుగా కాళ్ళు రెండూ దగ్గరగా నిలదొక్కుకుని, సన్నని తుంటిని అదుముకుని చేతులు వేలవేసుకున్నాడు. డోరియాలున్న కాసెకోక అతని విశాల వక్షస్థలానికి ఆధారమిస్తూంది, పెద్ద చెవిదొప్పలూ, చేపతోకను పోలిన మకుటమూ కల్గిన శిరస్త్రాణం సూర్యకిరణాలను తళతళా ప్రతిబింబిస్తూంది. బుగ్గయెముకలు ఎత్తుగా వున్న ఆ ముఖం కళ్ళు మూసుకుని చిరునవ్వు నవ్వుతూంది.

''మగత్సీత్ల్,'' అన్నాడా అంగారకవాసి, ఆకాశాన్ని చూపిస్తూ.

శిలావిగ్రహం వెనుక దూరాన పాడుపడిన ఒక పెద్ద రిజర్వాయరు యొక్కా, శిథిలమైనపోయిన ఆక్విడక్టుయొక్కా రూపరేఖావశేషాలు న్నాయి. ఖాళీ మైదానంమీద వున్న దిబ్బలూ గుట్టలూ — వీటికేసి చూస్తూండగా ఇవన్నీ ఒక పురాతన కాలపు పట్టణం శిథిలాలని అప్పుడు తట్టింది లోశ్‌కి. ఈ శిథిలాలకు పడమరగా తళుకులు విరజల్లుతూన్న తటాకానికి ఆవలగా సోఅత్సేర నూతన పట్టణం మొదలవుతూంది.

వాయునౌకకు దగ్గరపడుతూన్నకొద్దీ, ఆకాశంలో కనబడిన నల్లని చుక్కలు అంతకంతకు మరింత పెద్దవి కాజొచ్చాయి. ఆ నౌకకు ఎదురు సన్నాహంగా వందలాది అంగారకవాసులు తమతమ రెక్కలనావల జీనుల పైనా, తెరచాపలతో చేసిన పక్షి వాహనాలపైనా, గాలిగుమ్మటపు బుట్టల పైనా ఆదరా బాదరా వస్తున్నారు.

బంగారంలా మెరుస్తూ రెండు కొనల్లోను మొనదేలిన పొగచుట్ట మాదిరిగా కానవస్తూ తూరీగ రెక్కల్ని పోలిన నాల్గురెక్కల నౌక ఒకటి

వారిని మొట్టమొదట కలుసుకుంది. అది ఒక మలుపు తిరిగి వాయునౌక మీదుగా ఎగిరింది. ఆ గాలినావలనుండి స్వాగత సూచకంగా చల్లిన పూవులూ, రంగురంగుల కాగితపు పట్టీలూ ఆకాశంలో ఎగురుతూ ఆ వాయు నౌక డెక్కుమీద పడగా, ఆ దృశ్యాన్ని గాలినావలలో వున్న వారు అమితోద్రే కంతో తమ నౌకల కంచెగుంజలను పట్టుకుని కిందకు తొంగి చూస్తున్నారు.

వాయునౌకలో నిలుచున్న లోశ్ నౌకకున్న తాడును గట్టిగా పట్టు కుని, తన శిరస్త్రాణాన్ని తీసేశాడు. అతని పలితవర్ణపు తలవెంట్రుకలు గాలికి రేగుతున్నాయి. గూసెవ్ కేబిన్‌లోనుండి పైకివచ్చి లోశ్ పక్క నిలబడ్డాడు. మీదను ఎగురుతూన్న నావలనుంచి పుష్పగుచ్ఛాలు వారిపై వర్షించాయి. నావలలో వున్న అంగారకవాసుల ముఖాలు కొన్ని నీలవర్ణంగా వున్నాయి, కొన్ని మరికొంత గాఢంగా వున్నాయి, మరికొన్ని ఇటుకరంగు ఎరుపు వాగుగా వున్నాయి. వారి ఉద్రిక్తపూరిత ముఖాలలో ఆశ్చర్య సంభ్రమాలు ద్యోతక మౌతున్నాయి.

ఆకాశంలో **తేలుతూ** మెల్లగా పయనిస్తూన్న ఆ వాయునౌకను వందలాది గాలినావలు ఇక అప్పుడు అన్ని దిక్కులనుండీ చుట్టివేశాయి. వాయునౌక కట్టెదుటనుంచే గాలిగుమ్మటపు బుట్ట ఒకటి ఎగిరి వెళ్లగా, చారల టోపీ పెట్టుకున్న స్థూలకాయుడొకడు అందులోనుండి వారికేసి తన రెండు చేతులూ వూపాడు. దూరదర్శని పట్టుకుని చూస్తూ, బూరిబుగ్గలూ ఎత్తు నుదురూ వున్న ముఖం ఒకటి చటుక్కున వారి ఎదటనుంచి లిప్తపా టులో అదృశ్యమైపోయింది. రెక్కల జీనుమీద కూచుని, వారి విమానం చుట్టూ వలయాలు తిరుగుతూన్న ఒక అంగారకవాసుని సూది ముక్కు ముఖం ఆత్రంతో తొణికిసలాడుతూ వారికి అవుపడింది. జుట్టు గాలిలో ఎగురుతూంది. అతడి చేతిలో గిర్రున తిరుగుతూన్న పెట్టె ఒకటుంది.

అతడా పెట్టెను లోశ్‌కేసి విసరేందుకని గురి చూస్తున్నాడు. తటాలున పువ్వులతో నిండిన గాలిగుమ్మటపు బుట్ట ఒకటి వారి పక్కనుంచి ఎగిరి వెళ్లిపోయింది. ఆ గుమ్మటపు బుట్టలో వెడల్పాటి నీలిరంగు టోపీలు పెట్టుకుని, గాలిలో రెపరెప కొట్టుకుంటూ వదులు చేతులున్న చొక్కాలూ, బంగారు జరీతో అలంకరించిన కండువాలు వేసుకుని చేరడేసి లేత వినీల నయనాలుగల ముగ్గురు స్త్రీలున్నారు.

ప్రొపెల్లర్ల ఝూంకారమూ, రెక్కలమధ్యనుండి దూసుకుపోతూన్న గాలి హోరూ సన్నని ఈలల శబ్దమూ, నీలి ఆకాశంలో కానవచ్చిన మెరుగు జల్తారు దుస్తుల తళకులూ, కిందను నేలపై వున్న ఉద్యానవనాలలోని వృక్షకోటి తొడిగిన తోపు, వెండి, పసిమి వర్ణపు ఆకులూ, మెరుపులు మెరుస్తూన్న ఇళ్లకిటికీల అద్దాలూ – ఇదంతా ఒక కలలా వుంది. దీన్ని చూసి లోశ్, గూసెవ్‌లు నిర్విణ్ణులైపోయారు. గూసెవ్ నాలుగు చెరగులా పరికించి, ఆశ్చర్యంతో నోట మాటరాక, బొంగురుపోయిన గొంతుతో:

"అదుగో చూడండి, చూడండి, ఆరె దేవుడా!" అన్నాడు.

త్రిశంకు స్వర్గంలో వున్నట్టు కానవస్తూన్న ఉద్యానవనాల మీదుగా వాయునౌక పయనించి, గుండ్రంగా వున్న పెద్ద చౌకులో ఎట్టి కుదుపూ లేకుండా మృదువుగా దిగింది. దిగిన ఉత్తరక్షణంలోనే వందలాది చిన్నచిన్న గాలినావలూ, గాలి బుట్టలూ, రెక్కల జీనులూ ఆకాశంనుంచి కిందకి దిగి, చౌకులోని తెల్లని చపటా పలకలమీద వాలాయి. పార్కులోకి దారితీస్తూన్న వీధులనిండా సంతోషంతో కేరింతలు కొడుతూ పరుగెడుతూ, పువ్వులూ కాగితపు ముక్కలూ విరజల్లుతూ, చేతిరుమాళ్లు ఎగరేస్తూన్నారు జనం.

వాయునౌక ఒక పెద్ద భవనం పక్కను వాలింది. ఎత్తుగానూ బ్రహ్మాండంగానూ, పిరమిడ్‌లా భయంకరంగానూ తోపురంగు రాతితో

నిర్మించి వుందా భవనం. మూడింట రెండు పాళ్ళ ఎత్తువరకూ ఆదోకుగా లేచిన నలుచదరపు స్తంభాల మధ్య వున్న ఆ భవనపు వెడల్పు మెట్లపైన అంగారకవాసులు కొందరు గుంపుగా నిలబడ్డారు. వారందరూ నల్లని అంగరకాలు తొడుక్కొని గుండ్రని టోపీలు పెట్టుకున్నారు. వీరందరూ — ఈ విషయం లోశ్‌కి తరువాత తెలిసింది — అంగారక దేశాలన్నిటిపైన సర్వంసహాధికారాలు కల్గిన ఇంజనీర్ల సార్వభౌమసభవారు.

వాయునౌకలోనే ఇంకా మరికొంతసేపు వరకూ వుండమని లోశ్‌తో అతనితో కూడా వున్న అంగారకవాసి సంజ్ఞచేశాడు. నిచ్చెన ఒకదాన్ని దింపగా, దానిమీదనుండి సైనికులు ఒకరివెంట ఒకరు కిందకి దిగి, వాయునౌక చుట్టూ బారులుతీర్చి నిలబడి, తండోపతండాలుగా వస్తూన్న జనాన్ని ఆపి అదుపులో వుంచుతున్నారు. రంగురంగుల దుస్తులు ధరించి ఆనందపరవశులైన జనంతో కిటకిటలాడుతూన్న ఆ చౌకునూ, చౌకుపైన ఎగురుతూన్న చిన్నచిన్న రెక్కల నౌకల గుంపులనూ, ధూసర, రక్త వర్ణపు బ్రహ్మాండ భవన సమూహాలనూ, వీటి పైకప్పుల వెనుక పారదర్శకంగా కనబడుతూన్న బురుజుల రేఖాకృతి చిత్రాలనూ చూసి గూసెవ్ మనస్సు సంతోషంతో పొంగిపోయింది.

"ఆహాహా! ఏమి పట్నమండీ! ఓహోహో! పట్నమంటే ఇలా వుండాలి!" అంటూ అతడు అదే ఆశ్చర్యపడుతూ గంతులేశాడు.

మెట్లపై నిలబడున్న అంగారకవాసులందరిలాగానే నల్లని అంగరకా తొడుక్కొని, ధుమధుమలాడుతూన్న కోల ముఖమూ, సన్నని పొడుగాటి నల్లని గడ్డమూ, ముందుకు వంగిన బుజాలూ వున్న పొడుగరి అంగారకవాసి ఒకడు ఆ మెట్లపైన అగపడగానే, మెట్లమీద వున్న వారందరూ అతనిని

ఆహ్వానిస్తూ, అతనికి దారి చేశారు. అతడు పెట్టుకున్న గుండ్రని టోపీకి చేపతోకలాంటి మకుటం వుంది.

అతడు సగం మెట్లు దిగిన తరువాత, తన చేతికర్రపై ఆనుకుని, భూలోకంనుండి వచ్చిన ఆగంతకులకేసి లోతుపోయిన కళ్ళతో కనుబొమలు ముడిపెట్టుకుని చూశాడు. అతడికేసి లోశ్ కూడా పరిశీలనగానూ జాగ్రత్తగానూ దృష్టి సారించాడు.

"ఏమిటీ దయ్యపు చూపులూ వీడూనూ!" అని గూసెవ్ గొణుగుతూ, ఆ జనసందోహాన్ని ఉద్దేశించి నవ్వుతూ ఇలా అన్నాడు:

"కామ్రేడ్స్, అంగారకవాసులారా! మా సోవియట్ రిపబ్లిక్కుల తరపున మీకందరికీ అభివందనలు... మన మధ్య పరస్పర సత్సంబంధాలు వర్ధిల్లుగాక!..."

జనం అందరూ విస్తుపోయి నిట్టూర్చారు, గొణిగారు, రొద చేశారు, ముందుకు తోసుకొచ్చారు. కనుబొమలు ముడిపెట్టుకొని చూస్తూన్న అంగారకవాసి తన గడ్డాన్ని చేతితో పట్టుకుని, కళావిహీనమైన తన చూపులను చౌకులో వున్న జనంపై సారించాడు. ఉద్రిక్తులై, మహా సముద్రంలా వున్న ఆ జనం అతని దృక్కులను చూసి క్రమంగా స్తిమితపడ్డారు. తనతో కూడా మెట్లపై వున్నవారికేసి అతడు చూసి, వారితో ఏదో చెప్పి, తన చేతికర్రతో వాయునౌక వైపు చూపించాడు.

అంగారకవాసి ఒకడు వాయునౌక దగ్గరకు పరుగెత్తి వెళ్ళి, విమానం నుండి వంగి కిందకి చూస్తూన్న బట్టతల మనిషితో మెల్లగా గబగబా ఏవో నాలుగు మాటలు చెప్పాడు. అలా చెప్పిన ఉత్తరక్షణంలో వాయునౌక లోనుండి సాంకేతికములైన ఈలలు దిక్కులు పిక్కటిల్లేటట్టు వినవచ్చాయి. ఆవెంటనే ఇద్దరు సైనికులు వాయునౌకలోకి ఎక్కారు. విమానం ప్రొపె

ల్లర్లు హోరుమని గర్జించాయి. వాయునౌక గజగజ వణకి, చాకుపై ఎగి రింది. ఆ మహాపట్నం మీదనుండి ఊర్ధ్వంగా లేచి, ఉత్తరదిశగా పయనించడం ప్రారంభించింది వాయునౌక.

# నీలి అడవిలో

కొండల చాటున సోలత్సేర నగరం అదృశ్యమైపోయింది. ఒకమైదానం మీదుగా ఎగురుతూంది వాయునౌక. అక్కడక్కడ ఒకే తీరులో కట్టిన భవనాల వరుసలూ, ఎత్తైన వారధులపై నిర్మించిన రాజమార్గాలకు ఇరుపక్కలా వున్న స్తంభాలూ కేబిల్సూ, నేల నోరుతెరచుకున్నట్టుగా వున్న గనులూ, సరుకులెక్కించుకుని తిరుగుతూన్న రహదారీ పడవలతో ముమ్మరంగా ఉరుకలతో నురుగులతో పారుతూన్న కాల్వలూ, — వీటితో నిండి వుందా మైదానం అంతానూ.

అప్పుడప్పుడు కనబడుతూన్న అడవుల నడుమ పర్వతశిఖరాలు అవుపడజొచ్చాయి. వాయునౌక కిందకు దిగడం ప్రారంభించి, కొండ కనుమ దాటి, సస్యశ్యామలమైన నల్లని అడవి వైపు వాలుగా వున్న పచ్చికబయలు మీద వాలింది.

లోశ్, గూసెవ్‌లు తమ సంచులను తీసుకొని ఆ బట్టతల మనిషి వెంట, వాలుగా వున్న మైదానంమీదనుంచి ఉద్యానవనం కేసి నడిచారు.

ఒక చెట్టు చాటునుండి పడుతూన్న జలపాతంనుండి వస్తూన్న తుషారం, చమ్మగిలి వుంగరాల్లా చుట్టుకొని పోయి వజ్రాల్లా మెరుస్తూన్న గడ్డిపోచల వెనుకనుండి మెరుపులు వెదజల్లుతూంది. పచ్చికబయలుపైన పొట్టికాళ్ళతోనూ పొడుగాటి నలుపు తెలుపు రంగుల రోమంవున్న జంతువుల మంద మేత మేస్తూంది. ఆ దృశ్యం ప్రశాంతంగా చూడ ఎంతో

ముచ్చటగా వుంది. జలజలమని శబ్దం చేస్తూంది నీరు. మృదువుగా మెల్లగా వీస్తూంది పిల్లగాలి.

పొడుగాటి రోమం వున్న ఆ జంతువులు వాటిని సమీపించుతూన్న మనుషులను చూసి, ఎట్టి నదురూ బెదురూ లేకుండా మెల్లగా పక్కకు తప్పుకొని, ఆగంతకులను చూడడానికని బల్లపరపుగా కురుచగా వున్న మూతులు పైకెత్తి, ఎలుగ్గొడ్డు పంజాల్లా వున్న పాదాలతో అవకరంగా అడుగులు వేసుకుంటూ మరుక్షణం పక్కకు వెళ్లిపోయాయి. బంగారు వన్నె పక్షులు పచ్చికబయలుపై వాలి, పంచరంగులతో మెరుస్తూన్న జలపాతం కింద తమ తూలికలను ప్రక్షాళనం చేసుకుంటున్నాయి.

లోశ్, గూసెవ్‌లు వనంలో అడుగుపెట్టారు. వాలుకొమ్మల చెట్లు నీలంగా వున్నాయి. సజ్జాకారపూరితములైన వాటి పత్రాలు, కిందకు వంగిపోయి ఎండిపోయిన కొమ్మలపైన ఊగిసలాడుతూ మర్మరధ్వని కావించుతున్నాయి. ఆవల వున్న సరస్సు జలాలు ఆ చెట్ల మచ్చల బోదెల నడుమనుండి తళతళ మెరుస్తూ కనబడతున్నాయి. వనంలోనుండి వెడలు తూన్న తీయని సంభారపు తాపంతో వారి తల తిరిగిపోయింది.

ఆ వనంలో అనేక బాటలున్నాయి. బాటలపై నారింజరంగు ఇసుక చల్లివుంది. వనంలో బాటలు కలిసే గుండ్రని పోడు స్థలాల్లో పెద్దపెద్ద శిలావిగ్రహాలు నెలకొల్పి వున్నాయి. విగ్రహాలలో కొన్ని విరిగిపోయి, వాటిపై శిలీంధ్రాలు దట్టంగా మొలిచి వున్నాయి. అక్కడక్కడ చెట్ల మధ్యను స్తంభాల మోదులూ, బ్రహ్మాండమైన కుడ్యశిథిలాలూ నిటారుగా లేచి వున్నాయి.

వారు నడుస్తూన్న బాట మలుపులు తిరిగి తటాకం దిశగా వెళ్తూంది. అలా వెళ్లగా కాస్సేపటికి సరస్సు నీలిమేఘచ్ఛాయ తలమూ, దానిలో దూరాన

వున్న శిలా శిఖరాగ్రం ప్రతిబింబమూ, మెల్లగా కదలుతూన్న వాలుకొమ్మల చెట్ల ఆకారాలూ వారికి కనబడ్డాయి. శోభాసమన్వితుడైన సూర్యుడు అద్భుతంగా ప్రకాశిస్తున్నాడు. చెరువుగట్టు మలుపున నాచు అలముకొనున్న మెట్లు నీటి అంచుకు దారి తీస్తున్నాయి. కూచుని వున్న పెద్ద శిలావిగ్రహాలు మెట్లకి ఇరువైపులా వున్నాయి. విగ్రహాలు బీటలువారి, చెట్లతీగెలు అల్లుకొనిపోయున్నాయి.

తటాక సోపానాలపై ఒక యువతి నిలబడుంది. ఆమె మొనదేలిన పసుప్పచ్చని టోపీ పెట్టుకునుంది. దీర్ఘ సుషిప్తిలో శాశ్వతంగా మందహాసం చేస్తూ కూచుని పాకుడు పట్టిపోయిన బ్రహ్మాండమైన మగ త్రీత్ల విగ్రహం ముందు ఆమె సన్నంగా, నిండు యవ్వనంతో, ధవళనీలంగా వున్నట్టు కనబడింది. మెట్లమీద ఆమె కాలు జారగా, తీనె మాదిరిగా పైకి పొంచుకొని వున్న శిల ఒకదానిని ఆమె ఊతగా పట్టుకుని, తలపైకెత్తి చూసింది.

''అయిలీత'' అని, వారితో కూడా వున్న అంగారకవాసి వారి చెవిలో మెల్లగా చెబుతూ, తన చొక్కా చేతితో కళ్లు మూసుకుని లోశ్, గూసెవ్‌లను ఆ బాటనుండి వనంలోకి లాక్కుపోయాడు. కాస్సేపట్లో వారు ఒక విశాలమైన పోదు జాగాలోకి వచ్చారు. ఆ పోదును అంటి వున్న లోయలో దట్టంగా మొలిచి వున్న గడ్డిచెట్లమధ్య నుండి పలితవర్ణపు భవనం ఒకటి అవుపడింది. ఆ భవనపు గోడలు వాలుగా వున్నాయి. ఆ భవనాన్ని చూస్తే మనస్సుకు బాధాకరంగా వుంది. ఆ ఇంటిముందు నక్షత్రాకారంలో వున్న ఇసుకపొలం ఒకటుంది. ఇసుకపొలం నుండి ముక్కుకు సూటిగా వెళ్తూన్న బాటలు పచ్చికబయలును దాటి ఒక తోటలోకి దారితీస్తున్నాయి. ఆ తోటలో పొట్టిగా నలుచదరంగా వున్న భవనాలు అక్కడా అక్కడా చెట్లమధ్య వున్నాయి.

బట్టతల అంగారకవాసి ఈలవేశాడు. వెంటనే చారల అంగరకా తొడుక్కొని పొట్టిగా బొద్దుగా బూరెబుగ్గలున్న అంగారకవాసి ఒడొకడు ఇంటి వెనకనుండి వచ్చి, ప్రత్యక్ష్యమయాడు. బీటుగడ్డ రసం పూసినట్టు ఎర్రగా కెంపూలా వుంది అతడి ముఖం. ఎండలోకి రావడంచేత అతడు కళ్లు సన్నగా చేసుకుని, వారి దగ్గ కొచ్చాడు. ఆ వచ్చినవారెవరో వినగానే అతడు పరుగెత్తి పారిపోబోయాడు. కాని బట్టతల మనిషి దాష్టీకంగా ఏదో చెప్పేసరికి అతడు వాళ్లని ఇంట్లోకి తీసుకెళ్లాడేగాని, అలా తీసుకు వెళ్ళుతూన్నంత సేపూ భయంతో గజగజ వణకిపోతూ, తనవెంట వస్తూన్న ఆగంతకులకేసి పదేపదే ముఖంతిప్పి ఓరగా చూస్తూనే వున్నాడు. అలా చూస్తూన్నప్పుడు అతడి నోటిలోని పసుప్పచ్చ నాలుకా, కేవలం ఒకేఒక పన్నూ వాళ్లకి స్పష్టంగా కనబడింది.

# విశ్రాంతి

ఎరుపు ముఖపు అంగారకవాసి అతిథులనిద్దరినీ చిన్నచిన్న గదుల్లోంచి తీసుకెళ్లాడు. గదులు వెలుగ్గా వున్నాయి. గదుల్లో బల్లలూ కుర్చీలూ ఇంచుమించు లేవన్నమాటే. గది కిటికీలు తోటలోకి తెరిచున్నాయి. భోజనాల గదిలోనూ పడకగదుల్లోనూ గోడలకి తెల్లని చాపలు వున్నాయి. వేలగట్టి గోడ మూలలగోలేలలో వున్న పూలమొక్కలు పువ్వులు తొడిగాయి. ఇల్లు చూసి గూసెవ్ ముగ్ధుడైపోయి: ''ఇమ్ముగా పోపులపెట్టెలా బహు సదుపాయంగా వుందయ్యా!'' అన్నాడు.

చారల అంగారకా తొడుక్కున్న పొట్టిమనిషి — అతిథిగృహం గుమాస్తా — ఏదో గడబడచేస్తూ, తనలో తాను సణుక్కుంటూ, హడావుడి పడుతూ

ఊగుతూ తూగుతూ అడుగులు వేసుకుని ఆగంతకులను గదుల్లోనుంచి తీసుకెళ్ళాడు. పలితవర్ణపు రుమాలతో తన కపాళం మాటిమాటికీ తుడుచుకుంటూ అతడు వుండి వుండి రాతిబొమ్మలా నిశ్శబ్దంగా నిలబడిపోయి, గాజుపూసల్లా వున్న కళ్ళతో అతిథులకేసి తేరిచూస్తూ, శబ్దంలేని కొన్ని మాటలు — భేతాళ మంత్రమో ఏమిటో మరి — గబగబా గుసగుసలాడుతూ గొణిగాడు.

స్నానాలగదుల్లో వున్న నీళ్లతొట్టెల్లో నీళ్ళు తొర్లించి లోశ్, గూసెవ్‌లకు ఇద్దరికీ చెరొక స్నానాలగదీ చూపెట్టాడా మనిషి. నీళ్ల తొట్టెల్లోంచి ఆవిరి పొగర్లు దట్టంగా లేస్తున్నాయి. గడగడమంటూ బుడగలు పైకివస్తూ అపరిమితంగా శమనగా వున్న ఆ వెచ్చని తేలిక నీరు వొంటికి తగలగానే ఎంత హాయిగా వుండెనంటే, ఆ గుమాస్తా లోశ్‌ని చెయ్యిపట్టుకుని లేవదీయకపోయుంటే లోశ్‌కి తొట్టెలో నిద్రపట్టేపోయుండేదే.

స్నానం చేయడం కారణంగా లోశ్‌కి నీర్సమనిపించి, భోజనాల గదిలోకి తూలుతూ వెళ్ళాడు. బల్లనిండా వున్నాయి కూరగాయలూ, మాంసపు బజ్జీలూ, చిన్నచిన్న గుడ్లు, పళ్ళూ ఫలాలూనూ. కరకరమంటూ గోళీకాయలంతేసి వున్న రొట్టె వుండలు నోట్లో వేసుకునీ వేసుకోడంతో వెన్నలా కరిగిపోయాయి. బల్లపైన చాకులూ, ఫోర్కులూ లేవు. చిన్నచిన్న చెమ్చాలు మాత్రం భక్ష్యాల పోగుల్లో గుచ్చి వున్నాయి. తాను వండించి తయారు చేయించిన నాజూకు భక్ష్యాలను భూలోకంనుండి వచ్చిన ఈ అతిథులు దిగమింగడం చూసి ఆ అతిథిగృహం గుమాస్తా విస్తుపోయి నోటమాటరాక అలా చూస్తూ నిలబడిపోయాడు. ఆ భక్ష్యాలను ఆబతో స్వాహాచేస్తున్నాడు గూసెవ్. చెమ్మగిలిన పుష్పాల సువాసనతో పరిమళించుతూన్న మద్యం అతనికి మహబాగా రుచించింది. అది నోట్లోకి వెళ్ళీవెళ్ళ

డంతో తక్షణమే ఇగిరిపోయినట్టే వుండీ, వెచ్చగా రక్తనాళాల్లోకి ప్రవహించి, తనకు నూతన బలం చేకూర్చుతూన్నట్టనిపించింది గూసెవ్‌కి.

అతిథులకు వారివారి పడకగదులు చూపించి, దిండ్లు సర్దుతూ రజాయిలను పరుపులకింద మడుస్తూ అతిథిగృహం గుమాస్తా హడావుడిగా తచ్చాడాడు. ఆ "తెల్ల రాక్షసుల"కు వెంటనే నిద్రపట్టిపోయింది. వారు గుర్రుపెట్టి నిద్రపోతూంటే ఆ గుర్రుకి కిటికీ అద్దాలు దడదడ కదిలిపోయాయి, గోలేల్లో వున్న మొక్కలు అదిరిపోయాయి, ఆ అంగారక లోకేతర శరీరాల భారానికి మంచాలు కిర్రుకిర్రుమని మూలిగాయి.

లోశ్ నిద్రనుండి లేచి. కళ్ళు తెరిచాడు. గది పైకప్పుకి అమర్చి వున్న గాజుకిటికీలోనుండి నీలిరంగు కృత్రిమకాంతి గదిలోకి ప్రవహించుతూంది. పడక వెచ్చగా హాయిగా వుంది. "ఏమిటైంది? ఎక్కడున్నాను నేను?" అని అతడు తనలో తాను ప్రశ్నించుకున్నాడు, కాని అందుకు సమాధానం వెతుక్కునే లోపునే అతడు పరవశుడైపోయి నిద్రలో మునిగిపోయాడు.

అతడి మనోవీధిలో తేజోబిందువులు — నీలివర్ణపు ఆకులపైన నక్షత్రాల్లా ప్రకాశిస్తూన్న మంచుబొట్లల్లా — తేలాడుతున్నాయి. తాను ముందుముందు ఆనందాన్ని అనుభవించబోతూన్నట్టు — ఈ తేజోబిందువులనుండి మహాద్భుతమైనదేదో ఒకటి పైకిలేచి తన స్వప్నాన్ని నింపివేస్తూందన్నట్టు — అనుభూతి కలిగి అనేక విధమైన అవ్యక్త మధురాందోళన ఒకటి అతనిని ఆవరించింది.

అతడు నిద్రలో నవ్వుకున్నాడు, పిల్లకెరటాల్లా పరిగెడుతూన్న తేజోరేణువుల పలుచని తెరలోనుండి ఆవల చూడడానికి ప్రయత్నించుతూ

కనుబొమలు ముడిపెట్టుకున్నాడు. కాని మరింతగా గాఢమైన నిద్ర అతన్ని వశపర్చేసుకుంది.

. . . . . . . . . . . . . . . .

లోక్ లేచి కూచున్నాడు మంచంమీద. నిశ్చేష్టుడై కొంతసేపు అలా కూచుండిపోయాడు. తరువాత పక్కమీదనుండి లేచిపోయి, కిటికీ తెరలను పక్కకి తీసేశాడు. కోలగా సన్నగా వున్న కిటికీలోనుండి చూసే సరికి, కిరాతకంగా వింతగా కొత్త రీతిలో గుంపులుగా కూడి వున్న బ్రహ్మాండమైన నక్షత్రాలు హిమశీతల కాంతులతో ప్రకాశిస్తున్నాయి.

''అవును, అవును. నేను భూలోకంలో లేను. అనంతమైన మంచు ఎడారి, అపరిచితమైన విశ్వాంతరాళం దాటి నేనొక నూతన ప్రపంచంలో అడుగు పెట్టాను. అవును, నిజమే – నేను విగతజీవిని. నా ప్రాణం భూలోకంలో వుండిపోయింది...'' అని మెల్లగా అనుకున్నాడు.

తన వేలిగోళ్ళను తన శరీరంలో గుండెకాయున్నచోట చర్మంలోకి చొప్పించుకున్నాడు.

''ఇది జీవమూ కాదూ, మృత్యువూ కాదూ. నా మస్తిష్కమూ నా దేహమూ సజీవంగా వున్నాయి. కాని నా ప్రాణం మాత్రం భూలోకంలోనే వుండిపోయింది...''

నక్షత్రాలకు ఆవల వున్న లోకంలో జీవించిన తాను గత రెండు రాత్రులనుండీ భూలోకానికై ఎందుకంతగా పరితపించుతూన్నదీ అతడు అర్థం చేసుకో లేకపోయాడు. తనను బంధించివేసిన సజీవతంత్రి ఒకటి పుటుక్కున తెగిపోయి, హిమశీతలంతో నిండిన ఈ కారునలుపు శూన్యంలో తన జీవం ఊపిరాడక ఉక్కిరి బిక్కిరైపోతూన్నట్టే అనిపించిందతనికి. అలా అనుకుని అతడు మళ్లీ పడక చేరుకుని తలగడమీద తూలి పడిపోయాడు.

. . . . . . . . . . . . . . . .

"ఎవరక్కడ?"

లోశ్ చెంగున పక్కమీదనుండి లేచి, ఒక ఉరుకు ఉరికాడు. అరుణోదయ కాంతులు కిటిలోనుండి గదిలోకి ప్రవహిస్తున్నాయి. ఆ చిన్న గది శుభ్రంగా నిష్కళంకంగా వుంది. కిటికీ ఆవల చెట్ల ఆకుల మర్మరధ్వని వినవస్తోంది. పకులు కిలకిలమంటూన్నాయి. లోశ్ చేతితో ముఖం తుడుచుకుని దీర్ఘంగా నిట్టూర్చాడు.

ఎవరో మళ్ళీ తలుపు కొట్టారు. లోశ్ తలుపు తీశాడు. చారల అంగరకా తొడుక్కున్న స్థూలకాయుడు హిమబిందువులు రాలుతూన్న పెద్ద నీలిరంగు పూలగుత్తిని తన బొజ్జకు హత్తుకుంటూ గుమ్మంలో నిలబడ్డాడు.

"అయియు ఊతర అయిలీత" అని మెల్లగా చెప్పి పుష్పగుచ్ఛాన్ని లోశ్‌కి అందిచ్చాడు.

# తుషార గోళం

ఉదయం భోజనం చేస్తూన్నప్పుడు గూసెవ్ అన్నాడు:

"ఇదేం బాగుండలేదు, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్. ఇంతా అంతా దూరమా — ఎంతో అంత దూరం మనం తీరా ఎగిరొచ్చి, దిక్కూ దివాణమూ లేని ఈచోటనా కూచుండిపోవడం? హాయిగా నీళ్ళ తొట్టెలో దొర్లడం — ఇందుకోసమటయ్యా మనం ఎగిరొచ్చినది? మనం వాళ్ల వూళ్ళో వుండడం వాళ్ళకిష్టం లేనట్టుంది చూడగా — ఆ గడ్డం తాత మనకేసి ఎలా ముఖం పెట్టుకుని చూశాడో మీకు జ్ఞాపకం వుందిగా! వాడంటే మనం భలే జాగ్రత్తగా వుండాలి, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్. ఇంతవరకూ మనని బాగా చూస్తున్నారు, బాగా మేపుతున్నారు. బాగానే వుంది — తరువాతేమిటి?"

"తొందరపడకయ్యా, అలెక్సేయ్ ఇవానొవిచ్," అన్నాడు లోశ్, ఆ నీలిరంగు పుష్పాల తిక్తమధుర పరిమళానికి విస్తుపోతూ. "కాస్త ఓపికపట్టి చూదాం. నాల్గు రోజులు మనని చూస్తే వాళ్లకే తెలుస్తుంది మనమేమీ ప్రమాదమైనవాళ్లం కామని. అప్పుడు వాళ్ళే మనని పిలిచి వూళ్ళోకి వెళ్లనిస్తారు."

"మీమాటేమో నేను చెప్పలేనుగాని, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్ – హాయిగా తిని కూచోడానికి మాత్రం నేనిక్కడికి రాలేదు సుమండీ!"

"అయితే – మనం ఏం చెయ్యాలని మీ ఉద్దేశం?"

"మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్, మీరిలా అనడం చూస్తే నా కాశ్చర్యం వేస్తూంది, మీమీద వాళ్ళేమీ మందు చల్లలేదు కద కొంపతీసి?"

"నాతో తగువు పెట్టుకోవాలనుందా మీకు?"

"అబ్బే, అదికాదు. పువ్వులు వాసనచూస్తూ కూచోవాలంటే – మన భూలోకంలోనే వున్నాయి బోలెడు పువ్వులు. నా ఉద్దేశమేమిటంటే – మనమే ఇక్కడ మొట్టమొదట అడుగు పెట్టాం కాబట్టి – ఈ అంగారక గ్రహం మనది, మన సోవియట్ దేశానిది. ఈ వ్యవహారం మాత్రం పకడ్బందీగా జరగాలి."

"మీకు బాగా పిచ్చెక్కిందయ్యా, అలెక్సేయ్ ఇవానొవిచ్!"

"ఎవరికి పిచ్చెక్కిందో తరువాత తెలుస్తుందిగా," అన్నాడు గూసెవ్, పటకా బిగించి, బుజాలు ఎగరేసి, కళ్ళు టక్కరితనంగా సన్నగా చేసుకుని "ఇది చాలా పీకులాట వ్యవహారమే, నాకు తెలుసు – ఇక్కడున్నది మనమిద్దరమే అని. అయితే ఏం–రష్యన్ ఫెడరేటివ్ రిపబ్లిక్‌లో చేరడానికి మాకేమీ అభ్యంతరం లేదని వీళ్లదగ్గరనుంచి కాగితం ముక్క ఒకటి పుచ్చుకోవాలి మనం. ఉత్తపుణ్యానికే వాళ్ళీ ముక్క మనకివ్వరనుకోండి, అసలు

మీరే చూశారుగా — అంగారక గ్రహంమీద సంగతులన్నీ కాస్త తీన్‌తేరాగా వున్నాయన్న విషయం. ఇలాంటివి కనిపెట్టడంలో మన తరువాతే లెండి ఇక ఎవడేనా!''

''విప్లవం లేవదీయడానికా మీ ప్రయత్నం?''

''చూదాం ఎలా వస్తుందో, మ్సిస్లావ్ సెర్గేయెవిచ్. వుత్త చేతుల్తో వెళ్తామా పెట్రోగ్రాడ్‌కి? ఏమిటి తీసుకొచ్చార్రా అంటే — ఎండి పోయిన సాలీడు — ఛీ! మనం వెళ్లి చూపెడతాం ఈ కాగితం: 'దయచేసి అంగారక గ్రహాన్ని రష్యన్ ఫెడరేటివ్ రిపబ్లిక్‌లోకి తీసుకోండి' అని దానిలో వుంటుంది. ఇకప్పుడు చూడండి యూరప్ అంతా గుడ్లు తేలేసి గొల్లుమంటుంది. ఒక్కటి మాత్రం మీరు చూశారో లేదో — ఇక్కడ కావలసినంత బంగారం వుంది — తట్టలతో మోసుకుపోవచ్చు. ఇదీ అసలు సంగతి, మ్సిస్లావ్ సెర్గేయెవిచ్!''

లోశ్ ఆలోచిస్తూ గూసెవ్‌కేసి చూశాడు. గూసెవ్ వెటకారాలా డుతున్నాడా, లేకుంటే తన మనస్సులో మాటే చెబుతున్నాడా? ఇది తెలుసుకుని తీరాలనుకున్నాడు లోశ్. నిష్కపటమైన ఈ గూసెవ్ పెంకె కళ్లు నవ్వుతున్నాయి. అయినా వాటిలో మాత్రం ఏదో రవంత పిచ్చికళ దోబూచులాడుతూంది.

లోశ్ తల పంకించి, ఏదో అలా ఆలోచిస్తూ, మైనపు పూత పూసిన ఆ పెద్ద నీలిరంగు పువ్వుల గాజు రేకులను నిమురుతూ ఇలా అన్నాడు:

''అంగారక గ్రహానికి బయల్దేరడమంటే బయల్దేరేనుగాని, ఎందుకు బయల్దేరేనో ఆ కారణం గురించి మాత్రం నేనెన్నడూ ఆలోచించనైనా ఆలోచించలేదు. ఎగురుదామని బుద్ధిపుట్టింది, ఎగిరి వచ్చేశాను, అంతే. వెనకటి రోజుల్లో గొప్ప నౌకాబలాలు సమకూర్చుకుని కొత్త దేశాలను జయిం

చేందుకని బయల్దేరేవారు విజేతలు. సముద్రంనుండి కనబడుతూ, అంత వరకూ అనావిష్కృతమైన తీరాలు చేరుకుని, సాగరసంగమాలలోనుండి తన నౌకలను నదులలోకి నడిపించుకుని వెళ్ళి, ఆ నౌకా కెప్టెను తన వెడల్పు అంచు టోపీ తీసి ఎగరేసి, ఆ నూతనదేశాలకు తన పేరు పెట్టేవాడు. అవును, మీరు చెప్పింది కూడా నిజమే: వొడ్డున దిగినంత మాత్రాన ఎవరికి వారి గిందీ ఏమీ లేదు — నౌకల నిండా ధనం నింపుకుని రావాలి — అందులో వుంది గొప్పంతా! మనం ఒక కొత్త ప్రపంచాన్ని ఆవిష్కరించడానికి వచ్చాం — ఆ ప్రపంచంలో ఎటువంటి ధనం వుంది! జ్ఞానధనం, జ్ఞానధనం — దీనితో నింపుకోవాలి మన నౌకని, అలెక్సేయ్ ఇవానొవిచ్!''

''మీ ఉద్దేశాలూ నా ఉద్దేశాలూ కలవడంలేదు, మ్స్తిస్లావ్ సెర్గే యెవిచ్. మీతో వేగడం కష్టమే,'' అన్నాడు గూసెవ్.

లోశ్ నవ్వి:

''అబ్బే, నాతోవేగడం నాకే కష్టం. మరేం ఫరవా లేదులెండి, నేస్తంగారూ,'' అన్నాడు.

ఎవరో తలుపు మెల్లిగా తట్టారు. భయంతోనూ భక్తిగౌరవాల తోనూ కాళ్ళు వణకుతూ అతిథిగృహం గుమాస్తా గుమ్మంలో నిలబడి, వారిద్దరినీ తనవెంట రమ్మనమని సంజ్ఞ చేశాడు. లోశ్ తొందరగా లేచి, తన నెరుస్తూన్న జుట్టును చేతితో సరిదిద్దుకున్నాడు. గూసెవ్ తన మీసాలను మరొకసారి తీవిగా మెలివేశాడు. అతిథులిద్దరూ గుమాస్తావెనుక ఒక వసారాగుండా వెళ్ళి, అక్కడ మెట్లు అవుపడితే, ఆ మెట్లవెంట ఇంటి ఆవలి భవంతికి వెళ్ళారు.

నేలలోకి దిగిపోయున్న గుమ్మం ఒకటి అవుపడింది. అతిథిగృహం గుమాస్తా గుమ్మం తలుపు తట్టాడు. పసిపిల్లల కంఠంలాంటి కంఠం

ఒకటి ఆదరా బాదరా లోపలినుండి వినబడింది. లోశ్, గూసెవ్‌లు లోప లికి వెళ్లారు. గది పొడుగ్గా వుంది, గోడలు తెల్లగా వున్నాయి. గది సరం బీకి అమర్చి వున్న అద్దపు కిటికీనుండి గదిలోకి వస్తూ రంగురంగుల గాజు ముక్కలతో గచ్చుచేసిన నేలపై పడుతూన్న సూర్యకిరణాల్లో ధూళి రేణువులు నృత్యం చేస్తున్నాయి. గదిలో పొట్టీ పొడుగూ తేడా లేకుండా సరి సమానంగా వున్న పుస్తకాల వరుసలనూ, బల్లపరపుగా వున్న అలమారాల మధ్య వున్న కంచు విగ్రహాలనూ, మొనతేలిన కోళ్ళుగల చిన్న బల్లలనూ, మడత తెరలకున్న పాలగాజు అద్దాలనూ ప్రతిబింబిస్తూంది గదిగచ్చు.

తలుపుకి కాస్త దూరంగా నిలబడి వుంది ధూసరవర్ణపు శిరోజా లున్న యువతి ఒకామె. మెడను మూసిపెడుతూ, కుచ్చుల చేతులున్న నల్లని అంగీ తొడుక్కొని వుందామె. నిటారుగా వున్న ఆమె కొప్పుముడిపై వాలుగా పడుతూన్న సూర్యకిరణంలో ధూళిరేణువులు నృత్యంచేస్తూ అల మారాలో వున్న పుస్తకాల గిల్టు అట్టలపై పడుతున్నాయి. ఈమెనే నిన్న తటాకందగ్గర వారు చూశారు. ఈమె పేరే అయిలీత అని అంగారకవాసి అప్పుడు చెప్పాడు.

ఆమెను చూసి లోశ్ వంగి నమస్కరించాడు. బ్రహ్మాండమైన కనుపాపలుగల పలితవర్ణపు కనుగుడ్లతో రెప్పవాల్చకుండా లోశ్‌కేసి అయి లీత తేరి చూసింది. కోలనై కొంచెం తెలుపుతో కూడిన ఆమె నీలవర్ణపు ముఖం లిప్తపాటు వణికింది. రవంత మాత్రమే ఎత్తుగా వున్న చిన్న ముక్కూ, కాస్త వెడల్పుగా వున్న నోరూ, చిన్నపిల్లల ముక్కూ నోరూలా కోమలంగా వున్నాయి. క్రితం క్షణమే ఆమె కొండ చరియ ఎక్కినదేమో అన్నట్టుగా ఆమె గట్టిగా వూపిరితీస్తూండడంచేత, మెత్తని మడతల నలుపు అంగీకింద వక్షస్థలం రొజుకుంటూంది.

"యెల్లీయూ ఉతర గెయో," అని పాటపాడుతూన్నట్టుగా కోమల స్వరంతో మెల్లగా అంటూ, ఆమె తన శిరస్సును కిందకి వంచింది — ఎంత కిందుగా వంచిందంటే ఆమె మెడ వెనుక భాగం వారికి కన బడిందన్నమాట.

కేవలం తన రెండు చేతుల వేళ్లనూ మెలివేయడం వల్ల మాత్రమే లోశ్ తన ప్రత్యుత్తరం సూచించగల్గాడు. తన శక్తినంతనూ పుంజుకుని — ఎందుకలా పుంజుకోవాల్సి వచ్చిందో అతనికే తెలిసిందికాదు — గ్రాంథిక శైలిలో జబాబిచ్చాడు లోశ్ ఒక్క క్షణం తరువాత:

"అయిలీత! భూలోకంనుంచి యాత్రార్థం వచ్చిన మేము మా శుభాకాంక్షలను నీకర్పించుచున్నారము."

అలాగు అనగానే అతని ముఖం ఎర్రబారింది. గూసెవ్ మాత్రం హుందాతనంతో:

"మిమ్మల్ని కలుసుకోవడం మాకెంతో సంతోషంగా వుంది. నేను రెజిమెంటల్ కమాండర్ గూసెవ్‌ని. ఇతడు ఇంజనీర్ మ్స్తిస్లావ్ సెర్గే యెవిచ్ లోశ్. మీ ఆతిథ్యానికి మా ధన్యవాదాలు తెలియజేసేందుకని వచ్చాం," అన్నాడు.

మానవ కంఠం తన చెవిని పడగానే అయిలీత తలెత్తింది. ఆమె ముఖం ప్రశాంతంగా వుంది. కనుపాపలు ఇప్పుడు కుంచించుకున్నాయి. ఆమె మాటాడలేదు. కాని చేయెత్తి అరచేతి పైకి చూపించింది. అరచేతిలో చిన్న లేత ఆకుపచ్చని గోళం ఒకటి తమకు కనబడినట్టు లోశ్, గూసెవ్ లకు అనిపించింది. తరువాత అయిలీత తన చేయి గభాలున దించేసి, పుస్త కాల అలమారాల పక్కనుండి పుస్తకభాండారం చివరికంటా వెళ్లిపోయింది. అతిథులు కూడా ఆమెవెంట వెళ్ళారు.

అప్పుడు కనిపెట్టాడు లోశ్, తన బుజాలంత పొడుగు మాత్రమే వుంది అయిలీత అనీ, ఉదయం తనకు ఆమె పంపిన రవంత తిక్తమధుర పరిమళ పుష్పాలలాగానే ఆమె కూడా కోమలంగానూ ఆకాశీయంగానూ వుందనీ. ఆమె నడుస్తూంటే ఆమె తొడుక్కున్న వదులు అంగీ అంచు రంగు రంగుల గాజు తునుకలతో గచ్చుచేసిన నునుపు నేలపైన తేలికగా జారి పోతూంది. ఆమె తన ముఖాన్ని వారికేసి తిప్పి చిరునవ్వు నవ్వింది. కాని ఆమె కళ్లలో మాత్రం ఉద్రేకమూ ఆందోళనా ఇంకా అలాగే వున్నాయి.

గోడలో అర్ధచంద్రాకారంగా తొలిచిన గూడు ఒకటుంది. ఆ గూటిలో వెడల్పాటి బెంచి వుంది. ఆ బెంచికేసి ఆమె చూపించగా లోశ్, గూసెవ్‌లు బెంచిమీద కూచున్నారు. వారికి ఎదురుగా చదువుకుందుకు వున్న బల్ల మీద మోచేతులు ఆనుకుని కూచుని, తన అతిథులకేసి నెమ్మదిగా, వారిని వెలకట్టి పరిశీలిస్తూ, చూసింది అయిలీత.

కాస్సేపు అందరూ మౌనంగా కూచున్నారు. అద్భుతంగానూ చిత్రంగానూ వున్న ఈ యువతిని అలా కూచుని నిదానంగా చూస్తూంటే క్రమక్రమంగా ఒక విధమైన ప్రశాంతత, ఆనందమూ తాను అనుభవించుతూన్నట్టు అనిపించింది లోశ్‌కి. గూసెవ్ నిట్టూర్చి మెల్లగా అన్నాడు:

"పిల్ల బాగుంది, భలే అందంగా వుంది."

అప్పుడు మాట్లాడింది అయిలీత. ఆమె మాట్లాడుతూంటే అచ్చంగా వీణాతంత్రులను మోగించినట్టే వుంది — అంత శ్రావ్యంగా వుంది ఆమె కంఠస్వరం. కృతి పల్లవి ఆలాపన చేస్తూన్నట్టుగా ఏవేవో మాటలను ఆమె పదేపదే పలికింది — ఆ పలకడంలో కూడా పెదవులు కదలుతూన్నట్టు

వుండేదే కాదు. బూడిదె వర్ణపు కనుబొమలు మెల్లగా కిందకి దిగి మీదకి లేస్తూండేవి.

ఆమె మళ్ళీ మరొకసారి చేయి చాచింది. ఆమె అరచేతలో ఆ చిన్న ఆకుపచ్చని గోళం మళ్ళీ కనబడినట్టుంది లోశ్‌కీ, గూసెవ్‌కీ. గోళం ఆపిల్ పండంతే వుంది. గోళంలోపల అంతా పంచరంగులతో మెరిసిపోతూ చలించి పోతూంది.

అప్పుడు అయిలీతతో సహా అతిథులిద్దరూ మబ్బుగా పంచరంగులతో మెరుస్తూ ఆపిల్ పండులా వున్న ఆ గోళంకేసి నిదానంగా చూడడం ఆరంభించారు. ఆ గోళంలో వున్న చలనం తటాలున ఆగిపోయి, దాని ఉపరితలంపైన నల్లని చుక్కలు అవుపడడం మొదలెట్టాయి. ఆ మచ్చలను పరీక్షించుతూన్న లోశ్‌కి నోట మాటరాలేదు: అయిలీత అరచేతిలో వున్నది మరేదీ కాదు — భూగోళం!

"తల్‌స్వేత్ల్," అంది ఆమె, తన అరచేతిలో వున్న భూగోళం కేసి చూపెడుతూనూ.

ఆ గాజుగోళం మెల్లగా తిరగడం ఆరంభించింది. అలా పరిభ్రమణం చేస్తూన్న ఆ గోళంపైన అమెరికా, ఆసియా ఖండలూ పసిఫిక్ తీరమూ క్రమక్రమంగా అవుపడడం మొదలుపెట్టాయి.

"ఇదిగో — ఇది, ఇదీ — మా దేశం — మా రష్యా," అంటూ గూసెవ్ వేలుపెట్టి సైబీరియాకేసి చూపెట్టాడు.

వంపులు తిరిగిన ఛాయల్లా వున్న ఉరల్స్ పర్వత పంక్తులూ, సన్నని దారపు పోగులా వున్న దక్షిణ వోల్గానదీ వారి ఎదుటనుండి పరిభ్రమించాయి. తెల్ల సముద్రపు తీరాలు స్పష్టంగా చిత్రించున్నాయి.

"ఇక్కడ," అంటూ లోశ్ ఫిన్‌లాండ్ అఖాతం చూపెట్టాడు.

ఆశ్చర్యపడుతూ అటుకేసి చూసింది అయిలీత. అంతవరకూ పరి భ్రమణం చేస్తూన్న గోళం తటాలున ఆగిపోయింది. భూగోళ పటంలోని ఆ భాగంపైన తన స్మృతిని కేంద్రీకరించ ప్రయత్నించాడు లోశ్ — ఆ ఉత్తరక్షణంలో, తన మనస్సులో వున్న ఊహ ప్రతిబింబించిందేమో అన్నట్టుగా — పొగమంచు కప్పినట్టున్న ఆ చిన్న గోళం ఉపరితలంపై ఒక నల్లని మచ్చ, ఆ మచ్చనుండి అన్ని దిశలవైపూ వెడలుతూన్న రైల్వే మార్గాలు, ఆకుపచ్చని క్షేత్రంపై "పెట్రోగ్రాడ్," అనే శీర్షిక — స్పష్టంగా చిత్రించి వుండడం లోశ్‌కి అవుపడింది.

అయిలీత ఆ గోళాన్ని పరిశీలించి, దానిని తన చేతితో కప్పేసింది — ఆమె చేతి వేళ్ల సందులనుంచి ఇప్పుడాగోళం కాంతులు ప్రసరిస్తూంది. ఆమె లోశ్‌కేసి తన చూపులు సారించింది. లోశ్ తల పంకించాడు.

"ఒయె ఆయో హొ సువా," అందామె. ఆమె మాటలకు అర్థం 'మనస్సును కేంద్రీకరించి జ్ఞాపకం తెచ్చుకోండి,' అని అతనికి వెంటనే స్ఫురించింది.

పీటర్స్‌బర్గ్ రేఖాచిత్రాన్ని — నల్లసానపు రాతితో కట్టిన నదీతీరం, నెవా నది హిమశీతల జలాలు, ఆ నది కెరటాలలో అల్లాడుతూ పయని స్తూన్న పడవ, పొగమంచులో తేలుతూన్నట్టున్న నికొలాయెవ్‌స్కి వారధి సుదీర్ఘ చాపములు, ఫ్యాక్టరీ గొట్టాలనుండి వెడలుతూన్న చిక్కని పొగ మబ్బులు, లీలగా కనబడుతూన్న సూర్యాస్తమయపు తుషార ధూమం, వర్షంలో తడిసిన ఒక వీధి, ఒక చిన్న దుకాణానికున్న సైన్‌బోర్డు, వీధిలో ఒక మూల నిలబడున్న గుర్రపుబగ్గీ — వీటన్నిటినీ అతడు జ్ఞప్తికి తెచ్చుకున్నాడు.

అరచేతిలో గడ్డం ఆనుకుని అయిలీత ఆ గోళంకేసి ప్రశాంతంగా చూసింది. గోళంపై లోశ్ స్మృతులు ప్రతిబింబించుతున్నాయి — ఒక

క్షణం అతిస్పష్టంగానూ, మరుక్షణం అలుక్కుపోయినట్టూ ఉంటున్నాయి ఆ ప్రతిబింబాలు. మసకమసకగా మెరుస్తూన్న ఇస్సాకియెవ్‌స్కి కెథీడ్రల్ గోపురశిఖరం మొదట అవుపడింది. అది తుడుచుకుపోయి, దాని స్థానే నదీతీరపు పావంచాలు, అర్ధచంద్రాకారపు బెంచి, బెంచిపై లేత గోధుమ వర్ణపు తలకట్టుతో ఒంటరిగా దుఃఖిత వదనంతో కూచున్న యువతి — యువతి ముఖం గజగజ వణకింది, తరువాత ఆ బొమ్మ అదృశ్యమైపోయి, దాని స్థలంలో తురాయి కిరీటాలు ధరించిన స్ఫిన్‌క్స్ బొమ్మలు రెండు అవుపడ్డాయి. అంకెల వరుసలు మెరుపుల్లా పరుగెత్తాయి — తరువాత ఒక టెక్నికల్ డ్రాయింగు, నిప్పుల రవ్వలు వెదజల్లుతూన్న కమ్మరి కొలిమి, మండు బొగ్గులను రాజబెడుతూ చిరచిరలాడుతూన్న హాహాగ్లోవ్.

మేఘావృతమైన ఆ గోళంలో తన కళ్ల ఎదుట జరుగుతూన్నట్టి చిత్రవిచిత్రములైన జీవిత దృశ్యాలకేసి చాలాసేపు అలా చూస్తూ కూచుంది అయిలీత. కాస్సేపటికల్లా ఆ బింబాలు ఒకదానితో ఒకటి కలిసిపోవడం మొదలెట్టాయి: కేవలం మరొక రకం బొమ్మలు — పొగ మేఘాలు, అగ్ని జ్వాలలు, నాల్గుకాళ్ళూ ఎగరేసి పరిగెడుతూన్న గుర్రాలు, పరిగెడుతూ పడిపోతూన్న మనుషులు — ఆ గోళంలో కనపడడం మొదలెట్టింది. మరో నిమిషానికల్లా, రక్తం వోడుతూ పెద్ద గడ్డం వున్న ముఖం ఒకటి అవుపడి, కడమ బొమ్మలేవీ అవుపడకుండా చేసేసింది. గూసెవ్ పెద్దగా నిట్టూర్చాడు. అయిలీత దిగాలుబడి అతనికేసి చూసి, ముఖం తిప్పేసుకుంది. ఆమె అరచేతిలోని గోళం అదృశ్యమైపోయింది.

మరికొద్ది క్షణాలవరకూ అయిలీత తన మోచేతులను బల్లపై ఆనుకుని కళ్లలో వెల్తురు పడకుండా నుదుట చేయి అడ్డంపెట్టుకుని నిశ్శబ్దంగా కూచుంది. తరువాత ఆమె లేచి నిల్చుని, అలమారా ఒకదానినుండి

ఒక గొట్టాన్ని తీసి, అందులోనుండి ఎముకతో చేసిన స్థాపకాన్నొకదానిని పైకిలాగి, దానిని గాజుతెర ఏర్పాటు చేసివున్న రాసుకునే మేజాబల్లలో అమర్చింది. ఆ బల్ల దగ్గరే వేలాడుతూన్న తాడును లాగింది. పుస్తక భాండారపు సరంబీకున్న కిటికీలపై నీలిరంగు తెరలు వాలాయి. అప్పుడామె ఆ బల్లను బెంచీ దగ్గరకు జరిపి, బల్లపైవున్న గుబ్బను తిప్పింది.

గుబ్బ తిప్పగానే తెరపై వెల్తురుపడి, గాజుతెరమీద అంగారక లోకంలో వున్న మనుషులూ, జంతువులూ, ఇళ్ళూ, చెట్లూ, రకరకాల వంట పాత్రలూ అవుపడ్డాయి.

ఒక్కొక్క వస్తువునే అయిలీత చూపించి, దాని పేరు చెప్పింది. ఆ వస్తువుల ప్రతిబింబాలు కదలి ఒకదాని దగ్గరకు ఒకటి చేరగానే వాటిని చూపించి క్రియా శబ్దాల పేర్లు వివరించింది. గానం చేసిన పుస్తకంలో చిత్రించి వున్న సంజ్ఞల్లాంటి రంగురంగుల చిహ్నాలు బొమ్మలతోపాటు తెరపైన అడప దడప అవుపడ్డాయి. ఇవి అవుపడినప్పుడల్లా చిన్న సంగీత స్వరం ఒకటి మెల్లగా వినబడేది. స్వరభావాన్ని తెలియజేసే పదాన్ని అయిలీత అప్పుడప్పుడు పలికేది.

ఆమె మెల్లని గొంతుతో మాట్లాడింది. చిత్రమైన ఈ బాలశిక్ష లోని పదాలూ బొమ్మలూ ఎట్టి తొందరపాటూ లేకుండా తాపీగా తెరమీద పడుతూన్నాయి. పుస్తకభాండారంలో నెలకొనున్న ఆ వినీల సంధ్య ముని చీకటిలో అయిలీత తన బూడిదెరంగు కళ్లతో లోశ్ కేసి చూస్తూండగా, ఆమె కంఠస్వరం అతడిని ప్రబలంగానూ, అదే సమయంలో మృదువుగానూ మంత్రముగ్ధునిచేసివేసి లోబర్చేసుకుంది. అతడి ముఖం ఝుమాలుమంది.

మరికొంత సేపటికి, తన కళ్ళముందున్న మబ్బుతెర విడిపోయిన ట్లుగా, తనకు తిరిగి స్మారక్యం వచ్చినట్లు లోశ్‌కి అనిపించి, తన స్మృతి ఫలకంపై నూతన పదాలూ నూతన భావాలూ చిరాంకితమైనట్టు అతనికి అనిపించింది. ఈ స్థితిలో అతడు చాలా సేపే వున్నాడు. చిట్టచివరకు అయిలీత తన నుదురు తాకి, నిట్టూర్చి, తెరకు అమర్చి వున్న గుబ్బను తిప్పింది. లోశ్, గూసెవ్‌లు ఇద్దరూ మూర్ఛిల్లిపోయారు.

"ఇక మీరిద్దరూ విశ్రాంతి తీసుకోండి," అంది అయిలీత అతిథులనుద్దేశించి. ఆ మాటలు వారికింకా కొత్తగా ధ్వనించినప్పటికీ, అప్పటికప్పుడే వాటి అర్థం వారి చైతన్యఛాయల్లోకి ప్రవేశించేసింది.

# మెట్లమీద

వారం రోజులు గడచిపోయాయి.

ఈ వారం రోజుల గురించి వాటిని తరువాత జ్ఞప్తికి తెచ్చుకున్నప్పుడు, అదొక వినీల సంధ్యారాగంలా, దివ్యమైన పగటికలలను ఒక దాని వెంట ఒకటి కంటూ అనుభవించినట్టి అద్భుతమైన మనశ్శాంతిలా వాటిని చిత్రించుకునేవాడు లోశ్.

లోశ్, గూసెవ్‌లు ప్రతిదినమూ పెందలాడే లేచి, స్నానంచేసుకుని, కొద్దిగా ఫలహారం తీసుకుని గ్రంథాలయంలోకి వెళ్ళేవారు. అక్కడ అయిలీత తన సాదర కోమల వీక్షణాలతో కుశలప్రశ్నవేసి వారికి స్వాగతం చెప్పేది. ఆమె మాటాడుతూంటే ఆమె మాటలు వారికిప్పుడు ఇంచుమించు పూర్తిగా అర్థమయేవి. ఆ గదిలో వున్నంత సేపూ ఆ సంజచీకటి నిశ్శబ్దతలోనూ, అయిలీత మృదుస్వర వాచ్యంలోనూ వారికి అనిర్వచనీయమైన శాంతి అను

భూతి కలిగేది — ఆమె కళ్ళు చెమ్మగిలి మిరుమిట్లు గొలుపుతూండేవి, ఆ చూపులు వారిద్దరినీ స్వప్నలోకానికి తీసుకుపోయేవి. ఆమె మాట్లాడు తూండగా ఆ తెరపైన ఏవేవో ఛాయలు అలముకుని, ఆమె పలికిన మాటలు అప్రయత్నంగా వారి చైతన్యంలోకి చొచ్చుకొనిపోయేవి.

ఈ పదాలు — మొదట కేవలం శబ్దరూపంలోనే వుండి, మబ్బుతెర విడిపోయిన తరువాత స్పష్టంగా కనబడినట్టు, భావనలుగా స్థిరపడిపోయేవి — మెల్లమెల్లగా క్రమక్రమంగా రసవత్తర జీవితంలోని భాగాలుగా పరిప క్వమయేవి. "అయిలీత" అనే పదాన్ని లోశ్ ఉచ్చరించినప్పుడు, ఆ పదం అతనిలో ద్వివిధానుభూతులను కలిగించేది: "కడపటిసారి చూపు" అని అర్థమిచ్చే "అయి" అనే మొదటి రెండు అక్షరాలూ అతనిలో విచారభావం స్ఫురింపజేసేవి; "చుక్కలవెలుగు" అని అర్థమిచ్చే "లీత" అనే కడపటి రెండు అక్షరాలూ అతనిలో రజితకాంతి భావం కలుగజేసేవి. ఈ విధంగా ఆ నూతన ప్రపంచపు భాష అతని చైతన్యంతో సూక్ష్మాతిసూక్ష్మ పదా ర్థంలా మిళితమైపోయింది.

ఈ పాఠాలు ఒక వారం రోజులు సాగాయి. ఈ అధ్యయనం ఉద యమూ, తరువాత సూర్యాస్తమం మొదలు అర్ధరాత్రి వరకూ జరిగేది. చిట్టచివరకు ఈ పాఠాలు చెప్పడం అయిలీతకు బడలిక అనిపించింది. ఇక ఎనిమిదవ రోజు ఉదయాన వారిని నిద్రనుండి లేపనే లేదు. తత్కారణంగా వారు సంజ వేళవరకూ నిద్రపోయారు.

లోశ్ నిద్రనుంచి లేచి చూసే సరికి కిటికీకి ఆవలున్న చెట్ల నీడలు పొడుగ్గా పాకుతున్నాయి. పక్షి ఒకటి నిర్మలకంఠంతో నిర్వేదంగా పాడు తూంది. లోశ్ చప్పున దుస్తులు తొడుక్కొని, గూసెవ్‌ను నిద్రనుండి లేపకుండానే, గ్రంథాలయానికి వెళ్ళి తలుపు తట్టాడు, కాని సమాధానం

రాలేదు. ఇంటిలోనుంచి అప్పుడతడు బయటికి వచ్చేశాడు -- గత వారం రోజులలోనూ అదే మొదటి సారి ఇంట్లోనుండి బయటకు అడుగుపెట్టడం.

పొదుపెట్టిన స్థలం ఉద్యానవనం అంచునున్న పొట్టి ఇల్లు వరకూ కిందకు ఏటవాలుగా వుంది. ఎలుగుగొడ్డుకీ పశువుకీ నడుమ సంకరమైన జంతువులా కనబడుతూ వికృతంగా, పొడుగు బొచ్చున్న హోషి మృగాల మంద దిగులు పుట్టించేటట్టు మెల్లగా అరుస్తూ ఆ దిశగా వస్తూంది. వుంగరాలు చుట్టుకున్న గడ్డిపోచల పైన, అస్తమిస్తూన్న సూర్యుని బంగారు కిరణాలు వాలుతున్నాయి. పచ్చికబయలంతా పోతపోసిన బంగారంలా వెలిగిపోతూంది. తటాకం పైన పచ్చల వన్నె కొంగలు రెక్కలు ఆడించుకుంటూ ఎగురుతున్నాయి. సూర్యాస్తమయపు వెలుగులో కడిగిన హిమశిఖరమొకటి ప్రపంచంసెలవు పుచ్చుకొని నిష్క్రమించుతూన్న సువర్ణదిన జనితమైన శాంతి అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకున్నట్టుంది.

తనకు సుపరిచితమైన ఆ చిన్నబాటవెంట లోశ్ సరస్సు దగ్గరకు వెళ్ళాడు. విచారభారంతో ఇరువైపులా కుంగిపోతూన్న నీలివర్ణపు చెట్ల పక్కనుంచే, ఆ చుక్కల బోద చెట్లకు ఆవలున్న శిథిలాల పక్కనుంచే అతడు వెళ్ళాడు; ఆ చల్లని గాలినే అతడు పీల్చాడు. అయినప్పటికీ ఈ చక్కని ప్రకృతిని తొలిసారి చూస్తూన్నట్టు అనిపించిందతనికి. తన కళ్ళు ఇప్పుడే విడినట్టూ, చెవులు ఇప్పుడే వినబడుతూన్నట్టూ అతడికి అనిపించింది — వస్తువుల పేర్లు అతనికిప్పుడు తెలుస్తున్నాయి.

చెట్లకొమ్మల సందులనుండి మండుతూన్న నిప్పుతునకల్లా కానవచ్చింది ఆ సరస్సు. కాని సరస్సు వొద్దు చేరుకునే సరికి సూర్యుడు అప్పటికప్పుడే అస్తమించి, ఆ కొండ దిగిపోతూన్న సూర్యుని మందు రెక్కల ఎరుపు తూలికలూ, సూర్యుని నోటనుండి దండిగా వెడలుతూన్న మంటల

నాలుకలూ సువర్ణ జ్వాలల రూపంలో ఆకాశం సగం మేరకు వ్యాపించాయి. జ్వాలలు త్వరత్వరగా సమసిపోయి, ఆకాశం నిర్మలమై, శ్యామలవర్ణం తాల్చిందో లేనేలేదో అప్పుడే నక్షత్రాలు ప్రకాశించ నారంభించాయి. నక్షత్రాల చిత్ర విచిత్ర చిత్రీకరణలు తటాకజలాల్లో ప్రతిబింబించాయి. సరస్సు మలుపున వున్న మెట్లకు ఇరుపక్కలా కూచునున్న జాంబవంతుల – నక్షత్రాలకేసి ముఖాలను నిగిడించి అక్కడ ఆసీనులైవున్న అనంతకాల శతాబ్దాల ద్వారపాలకుల – శిలావిగ్రహాల రెండింటి నల్లని రేఖాకృతులు బ్రహ్మాండంగా కానవచ్చాయి.

తటాలున సంజ చీకటి ఆవరించడం వల్ల కళ్లు చీకట్లు కమ్మి లోశ్ తడుముకుంటూ మెట్లదగ్గరకు వెళ్ళాడు; శిలావిగ్రహం ఒకదాని పాదాలకు జేరగిలబడి, చెమ్మగిలిన గాలినీ, పాచిమొక్కల వొగరు తావినీ శ్వాసించాడు. నక్షత్రాల ప్రతిబింబాలు అలికినట్టు అవుపించాయి. నీటిపైన పలుచని పొగమబ్బు తెర పైకి లేస్తూంది. కాని ఆకాశంలో మాత్రం నక్షత్రకూటాలు మరింత తేజోవంతంగా ప్రకాశిస్తున్నాయి. ఆ సందె మునిచీకటికి తన కళ్లు అలవాటు పడడంతో, నిద్రించుతూన్న చెట్ల ఆకులూ, మెరుస్తూన్న గులకరాళ్ళూ, బాసినపట్టు వేసుకుని కూచున్న మగస్త్రీల మందహాసవదనమూ అతనికి స్పష్టంగా కనబడ్డాయి.

ఆ రాత్రి చీకటిలో రాతి విగ్రహంపై చేయి ఆనుకుని అలా చూస్తూ నిలబడి వుండే సరికి అతని చేయి తిమ్మిరెక్కిపోయింది. అప్పుడతడు శిలావిగ్రహంనుండి కాస్త దూరంగా వెళ్ళాడు. అలా వెళ్ళేసరికి సరస్సు అడుగు పావంచాలమీద అయిలీత కనబడింది. నల్లని నీటిలో ప్రతిబింబించుతూన్న నక్షత్రాలను వీక్షించుతూ ఆమె అక్కడ నిశ్చలంగా కూచుంది.

"అయియూ తూ ఇరా హాస్‌హె, అయిలీత," అన్నాడు లోశ్, తన నోటనుండి వెడలుతూన్న చిత్రమైన మాటల శబ్దం తన చెవిని పడి, అందుకు తానే విస్తుపోతూ. తన పెదవులు గడ్డకట్టుకుపోయినట్టుగా ప్రయాస పడుతూనే అతడా మాటలు పలకగల్గాడు. "నేను మీ దగ్గర కూచోవచ్చా, అయిలీత?" అనే తన మనస్సులోని కోర్కె అప్రయత్నంగానే తన నోటనుండి ఈ తమాషా భాషలో పైకొచ్చేసింది.

ఆమె తన ముఖం మెల్లగా అతనికేసి తిప్పి:

"సరే," అంది.

ఆమె పక్కనే మెట్టుమీద కూచున్నాడు లోశ్. అయిలీత తన తలవెంట్రుకలను తాను ధరించిన కేప్* కున్న నల్లని టోపీకింద దోపేసుకుంది. నక్షత్రాల వెలుగులో ఆమె ముఖం అతనికి కనబడడమేమో కనబడింది, కాని ఆమె కళ్ళు మాత్రం అతనికి స్పష్టంగా కనబడలేదు. కనుబొమలకింద వున్న నలుపు నీడలు మాత్రమే అతనికి కనబడ్డాయి.

ఉదాసీనమూ ప్రశాంతమూ ధ్వనించుతూన్న కోమల కంఠంతో ఆమె అతనిని అడిగింది:

"అక్కడ — భూలోకంలో మీకు సుఖంగానే వుండేదా?"

లోశ్ వెంటనే సమాధానమివ్వలేదు. కొంతసేపు ఆలోచించి, తరువాత ఆమె ముఖంకేసి చూశాడు. ముఖం నిశ్చలంగా వుంది. పెదవులు మాత్రం విచారం సూచిస్తున్నాయి.

"సుఖంగానే వుండేది నాకు."

"మీ భూలోకంలో సుఖంగా వుండడమంటే ఏమిటి?"

---

* బుజాలమీద వేసుకుని కప్పుకొనే చేతులులేని పొడుగాటి ఉడుపు. —అనువాదకుడు.

లోశ్ మళ్ళీ మరొకసారి ఆమెవైపు నిదానంగా చూశాడు.

''మా భూలోకంలో సుఖంగా వుండడమంటే — బహుశా తనను తాను మరచిపోవడమన్నమాటే. తన సర్వ జీవమూ సమగ్రతతోనూ సమ్మతితోనూ నింపి, యీ సమగ్రతనూ సమ్మతినీ ఆనందాన్నీ సమకూర్చే వారికోసమే జీవించాలనే కోర్కెతో ఎవడు పరితప్తమై వుంటాడో అట్టివాడు సుఖంగా వుంటాడు.''

అయిలీత అతని వంక తిరిగింది. విస్మయంతో తనకేసి, తెల్లని శిరోజాలతో జాంబవంతునిలా వున్న వ్యక్తికేసి చూస్తూన్న ఆమె విశాల నయనాలను అతడు గమనించాడు.

''ఇట్టి సుఖం స్త్రీని ప్రేమించడంవల్ల కల్గుతుంది,'' అన్నాడు లోశ్.

అయిలీత తన ముఖం తిప్పేసింది. ఆమె తలపై వున్న టోపీకొన గజగజ అదిరింది. ఆమె నవ్వుతూందా ఏమిటి? — లేదు, ఆమె నవ్వడం లేదు. అయితే — దుఃఖిస్తూందా ఏమిటి? — లేదు. ఇలా అనుకుంటూ లోశ్ పాచిమొక్కలు మొల్చిన ఆ పావంచపై గాభరాపడుతూ ఇటూ అటూ కదిలాడు. అయిలీత గాద్గదిక స్వరంతో:

''ఏ కారణంచేత మీరు భూలోకాన్ని విడిచిపెట్టారు?'' అని అడిగింది.

''నేను ప్రేమించిన వ్యక్తి చనిపోయింది. నా నిరాశను అధిగమించేందుకు నాకు బలం లేకపోయింది, జీవితమంటే నాకు హడలెత్తిపోయింది. నేను పరారిని — భీరకుడను.''

ఇంతవరకూ తన కేప్‌లోనే వుంచుకున్న తన చేతిని ఇప్పుడు అయిలీత పైకితీసి, లోశ్ చేతిని తాకి, తన చేతిని తిరిగి కేప్‌లో పెట్టేసుకుంది.

''నా జీవితంలో జరుగుతూన్నదంతా జరగబోతుందని నాకు ముందు

గానే తెలుసును,'' అంటూ ఆమె విచారంగా అంది. ''నేను ఇంకా పసి పిల్లగానే వుండిన రోజుల్లో నాకు ఏమిటోగాని అదొక మోస్తరు కలలు వస్తూం డేవి. పచ్చని మహోన్నతాలైన పర్వతాలు అవుపడేవి కలల్లో — మేఘాలు, మేఘాలు, ఒకటే మేఘాలు — బ్రహ్మాండమైన తెల్లని మేఘాలు — ఇక వర్షం, కుండలతో దిమ్మరించినట్టే ఆ వర్షం. దీనికితోడు — రాక్ష సుల్లాంటి మహామనుషులు. వెర్రెత్తిపోతుందేమో అనిపించేది నాకు. తరు వాత మా గురువుగారు చెప్పారు — నాకు 'అష్హె', దివ్యదృష్టి వుందని. మగత్సీత్ల సంతతివారమైన మాకు వేరొక జన్మస్మరణలు మా స్మృతిపథంలో ఇంకా నిల్చి వున్నాయి — మొలకెత్తని విత్తుల్లా నిద్రాణంగా వున్న 'అష్హె' మాలో గుప్తంగా వుంది. 'అష్హె' ఒక భయంకరమైన శక్తి, సాక్షాత్తూ బ్రహ్మజ్ఞానం. అయినా ఏం కార్యం? — సుఖం అంటే ఏమిటో నేనెరగను!''

అయిలీత తన రెండు చేతులనూ కేప్ లోనుంచి పైకితీసి, చిన్న పిల్లల్లా చేతులు రెండూ చరచింది. ఆమె తలపైవున్న టోపీ మళ్ళీ గజగజ వణికింది.

''అనేక సంవత్సరాలుగా రాత్రిపూట నేనీమెట్ల దగ్గరకు రావడం, నక్షత్రాలను వీక్షించడం నాకు పరిపాటైపోయింది. నాకు అనేక విషయాలు తెలుసు. మీరు ఎన్నడూ తెలుసుకో గూడనివీ, తెలుసుకో నవసరంలేనివీ — నాకు తెలుసును. మేఘాలను గురించీ, కుండపోతగా కురుస్తూన్న వాన గురించీ, ఆకుపచ్చని పర్వతాలను గురించీ, మహామనుషులను గురించీ కలలు కంటూండిన నా చిన్నతనంలోనే నేనెంతో సుఖంగా వుండేదానిని. నేను దుర్మరణం అనుభవించుతాననే మా గురువుగారు చెప్పారు.'' ఆమె అతని వైపు తిరిగి, చిరునవ్వు నవ్వింది.

అయిలీత అసమాన సౌందర్యాన్ని చూసేసరికీ, ఆమె వేసుకున్న కేప్‌నుంచీ, పెట్టుకున్న టోపీనుంచీ, ఆమె చేతులనుంచీ, ఆమె ముఖంనుంచీ, ఆమె శ్వాసనుంచీ వెడలుతూన్న తిక్తమధుర పరిమళాన్ని ఆఘ్రాణించే సరికీ — ఇక లోశ్‌కి భయం వేసుకొచ్చింది.

" 'హావో నిన్ను నాశనం చేసేస్తుంది' అన్నారు మా గురువుగారు. 'హావో' అంటే కిందకి దిగజారిపోవడం అన్నమాట."

అయిలీత ముఖం తిప్పేసుకుని టోపీని నుదుటి కిందకి లాగేసుకుంది.

ఒక్క నిమిషం నిశ్శబ్దంగా వుండి, తరువాత అన్నాడు లోశ్: "అయిలీత, నీకు తెలిసినది నాకు కూడా చెప్పు."

"అది రహస్యం," అంది ఆమె గంభీరంగా. "అయినా మీరు మానవులు, ఆ కారణంచేత మీకు నేను అనేక విషయాలు చెప్పాల్సి వుంటుంది."

ఆమె ముఖంపైకెత్తి ఆకాశాన్ని వీక్షించింది. పాలపుంతకి ఇరుపక్కలా వున్న తారామండలాలు, వాటిలో మండుతూన్న అగ్నిని అనంతకాల వాయువే రగుల్కొల్పినట్టుగా భయంకర ప్రకాశిత్వంతో జ్వలించిపోతున్నాయి. అయిలీత నిట్టూర్చింది.

"వినండి," అందామె "ప్రశాంతగానూ శ్రద్ధగానూ వినండి."

# అయిలీత చెప్పిన తొలి కథ

"ఇరవైవేల సంవత్సరాల కిందట 'తూమ' లో — అనగా అంగారక గ్రహంలో — 'అయోలు' అనగా నారింజ వర్ణపు జాతి, ప్రజలు జీవించుతూండేవారు. మృగప్రాయులైన అయోలు అడవి తెగలు — వీరు రాక్షసి సాలీ

డులను వేటాడి వాటిని భక్షించేవారు — మధ్యరేఖ ప్రాంతపు అరణ్యాలలోనూ చిత్తడినేలలోనూ నివసించేవారు. ఈ తెగల భాషలో ఏవో కొద్ది మాటలే మనకిప్పుడు తెలుసు. అగ్నిపర్వత గుహలూ, ఉప్పనీటి మంచినీటి సరస్సులూ వున్న బృహత్ ఖండపు దక్షిణ సింధు శాఖల తీరాల్లో ఇతర అయోల్ తెగల వారు కూడా నివసించుతూండేవారు. వీరు బెస్తలు. వీరు వేటాడి తెచ్చిన చేపలను ఉప్పనీటి సరస్సుతీరాల్లో గోతులు తీసి, గోతుల్లో పూడ్చిపెట్టి భద్రపరచుకునేవారు. చలికాలపు శీతలంనుంచి రక్షణకోసం వీరు లోతుగా వున్న గుహల్లో తలదాచుకునేవారు. ఈనాటికి కూడా ఈ గుహల్లో ఎముకల దిబ్బలు తటస్థపడుతూనే వుంటాయి.

"మరో మూడో తెగ అయోలులు మధ్యరేఖ ప్రాంతపు పర్వతపాదాల సమీపంలో, మంచినీటి జలంధమములు దగ్గర స్థిరపడ్డారు. ఇళ్ళు కట్టుకోవడం ఎలాగో వీరికితెలుసు. వీరు దీర్ఘ రోమపు హోషి మృగాలను పెంచేవారు, సాలీడు భక్షకులతో యుద్ధాలు చేస్తూండేవారు. రక్తవర్ణపు తల్ స్రేత్ల నక్షత్రాన్ని పూజించేవారు వీరు.

"దివ్యలోకం అజోర దేశంలో నివాసం ఏర్పరచుకొన్న ప్రజలలో అసాధారణుడైన షోహా ఒకడు తటస్థపడ్డాడు. అతడు ఒక గొల్లవాని కొడుకు. అతడు లిజియజీర పర్వతాల్లో పెరిగాడు. అతడికి పదిహేడేళ్ళ వయస్సు వచ్చేటప్పటికి అజోర పర్వతాలనుంచి పర్వతపాద ప్రాంతాలకు దిగివచ్చి, వూరూరా తిరిగి ప్రజలతో ఇలా చెబుతూండేవాడు:

" 'నాకొక కలొచ్చింది. ఆకాశం తెరచుకుని, అందులోనుంచి నక్షత్రం ఒకటి నేల రాలింది. నా హోషి మందలను తోలుకుంటూ నేనక్కడకి వెళ్ళాను. వెళ్ళి చూదునుకదా — ఆకాశపుత్రుడు నేలమీద పడిపోయున్నాడక్కడ. అతడు ఆజానుబాహువు. పర్వత శిఖరాలమీద వుండే మంచులా

తెల్లగా వుందతని ముఖం. కింద పడిపోయున్నవాడల్లా తల పైకెత్తాడు. ఆ కళ్లల్లో తేజస్సూ, ఉన్మాదమూ ఉట్టిపడుతున్నాయి. ఆ ముఖం చూసేసరికి భయకంపితుడనై జీవచ్ఛవంలా నేలమీద కూలిపోయి, చాలాసేపు అలా పడిపోయే వుండిపోయాను. ఆకాశపుత్రుడు నా చేతిలో వున్న కర్రను తీసుకుని నా హోషి మందను అక్కడనుంచి తోలుకుపోయాడు. అతడు నడుస్తూంటే అతడి బరువుకి నేల గజగజ వణికిపోయింది. అప్పుడతడు మేఘాలు ఉరిమినట్టు గర్జించాడు: "నీకు మరణం ఆసన్నమవుతూంది. అది నా ఇచ్ఛ." అతడలా అన్నప్పటికీ నేనతని వెంటే వెళ్ళాను, నా హోషి మందలను వదిలిపెట్టి వెళ్లిపోడానికి నా మనసొప్పిందికాదు. అతడిని సమీపించడానికేమో నాకు భయంవేసింది. అతడి కళ్లనుంచి పాపభూయిష్ఠపు అగ్నిజ్వాలలు వెడలుతున్నాయి. ఆ జ్వాలల్లో పడి నేనెక్కడ దగ్ధమైపోతానో అనే భయంతో ప్రాణాలు దక్కించుకుందుకు నేలమీద బోర్లా పడిపోయేవాడిని. ఈ విధంగా పర్వతాలు వదిలిపెట్టేసి, ఇంకా ఇంకా అలా ఎడారిలోకి వెళ్తూ వెళ్తూ ఎన్నో రోజులు నడిచాం.

"'ఆకాశపుత్రుడు తన చేతిలో వున్న కర్రతో ఒక రాతిమీద టక్కుమని కొట్టాడు. తక్షణమే ఆ రాతిబండనుంచి జలంధమం ఒకటి చర్రున పైకి లేచింది. నా హోషి మృగాలూ నేనూ ఆ నీళ్ళు తాగాం. అప్పుడు ఆకాశపుత్రుడు నాతో అన్నాడు: "నా భృత్యునిగా నువ్వు నాదగ్గర వుండిపో." నేనలాగే అతనిదగ్గరే వుండిపోయి, అతని హోషి గొడ్లను కాస్తూండేవాడిని; తాను తినగా మిగిలిన మెతుకులు నాకు పారేస్తూండేవాడు.'

"ఈ సంగతులన్నిటినీ ఆ గొడ్లకాపరి పట్నవాసులతో చెప్పాడు. వాళ్లతో అతడింకా ఇలా చెప్పాడు:

" 'కల్ల, కపటం ఎరగని పక్షులకి, శాంతజీవులు జంతువులకి, తమకు ఏ నిమిషాన్ని చావు మూడుతుందో వాటికి తెలియదుకదా. కాని దుర్మార్గపు 'ఇహి' తన రెక్కలను కొంగపై చాపుతుంది; సాలీడు తన పట్టు వేస్తుంది; భయానకమైన 'చా' కళ్లనుండి నిప్పుల మంటలు నీలిరంగు పొదరిళ్లను దూసుకొని పైకొస్తాయి. తస్మాత్ జాగ్రత్త, జాగ్రత్త! ఎంతటి దారుణమైన ఖడ్గం మీ దగ్గర వున్నప్పటికీ, అది దుష్టాన్ని సంహరించజాలదు. ఎంతటి బలోపేతములైన కుడ్యాలను నిర్మించుకున్నప్పటికీ కూడా అవి మిమ్మల్ని దాని బారినుండి రక్షించజాలవు. పెద్దపెద్ద అంగలేసుకుంటూ దాని నుండి పరుగెత్తి పారిపోవడానికి మీకాళ్ళు చాలవు. ఆకాశంలో నాకొక చిహ్నం కనబడుతూంది, దుష్టుడైన ఆకాశపుత్రుడు మీ కొంపల్ని నాశనం చేయడానికి రాబోతున్నాడు. అతని కళ్లు తల్ త్సేత్లీ శోణితజ్వాలల్లా మండుతున్నాయి.'

"గొడ్లకాపరి మాటలు విని, శాంతిప్రియులైన అజోర వాసులు హడలుతో తల్లడిల్లిపోయి, నెత్తీనోరూ కొట్టుకుని లబోలబోమన్నారు. గొడ్లకాపరి ఇంకా చెప్పాడు:

" 'రక్తపిపాసి 'చా' పొదల్లోనుంచి మిమ్మల్ని చూసిందంటే మాత్రం, తక్షణమే ఛాయగా మారిపోండి, అప్పుడది మీ రక్తాన్ని పసికట్టలేక పోతుంది. రోజారంగు మేఘాలనుంచి, ఆకాశంలోనుంచి 'ఇహి' ఎగిరి వచ్చి మీపై పడబోయేముందు, నీడగా మాయమైపోండి, అప్పుడది మీకోసం గడ్డిలో వెతుకుతుంది గాని మిమ్మల్ని చూడలేకపోతుంది. రెండు చంద్రబింబాల — ఒల్లో, లీత్‌హ — వెన్నెట్లో, దుష్ట సాలీడు 'త్సిత్లీ' మీ కొంపల చుట్టూ పట్టు వేసినప్పుడు, నీడ రూపం ధరించి మీరు మటుమాయమైపోండి, అప్పుడు 'త్సిత్లీ' మిమ్మల్ని పట్టుకోలేకపోతాయి. ఛాయా రూపం

ధరించు, దురదృష్టవంతుడగు ఓ తూమ పుత్రుడా! దుష్టమే దుష్టాన్ని ఆకర్షించుతుంది. దుష్టాన్ని పోలినదానినంతనీ విస్మరించండి. మీ లోపా లను మీ ఇళ్లల్లోనే దాచివేసుకుని, వాటిని మీ గడపలు దాటనీయకండి. పుణ్య జలంధమం 'సోఅమ్'ను దర్శించి, ఆ జలంధమపు నీటిలో స్నానం చేయండి. అప్పుడు దుష్టుడు ఆకాశపుత్రుని ఎదుట మీరు అదృశ్యులై పోతారు — అతని నెత్తురు చూపులు మీ నీడలను దూసుకుపోయినా మీకెట్టి కీడూ మూడదు.'

''గొడ్లకాపరి మాటలను అజోర వాసులు ఆలకించి, వలయాకారపు సరస్సుకి, మహాజలంధమం సోఅమ్ దర్శనానికి వారందరూ అతనివెంట వెళ్ళారు.

'' 'చెడుపును మా ఇళ్లల్లోనుంచి పైకిరాకుండా ఎలాగు దాచి పెట్టగల్గుతాం?' అని వారిలో కొందరు ఆ గొడ్లకాపరిని నిలదీసి ప్రశ్నిం చారు. మరికొందరు ఆగ్రహపరులై: 'నువ్వు మమ్మల్ని దగా చేస్తున్నావు. మమ్మల్ని ప్రమత్తులను చేసి, మా ఇళ్లనీ వాకళ్లనీ కాజేసే దురుద్దేశంతో పేదలు నిన్ను మాదగ్గరకు పంపించారు,' అని కేకలేశారు. ఇంకా మరి కొందరు ఇలా అన్నారు: 'ఈ పిచ్చి గొడ్లకాపరిని కొండపైకి తీసుకుపోయి, ఆ మరుగు నీళ్ల సరస్సులోకి తోసేద్దాం పదండి, అప్పుడు అతగాడే నీడ అయిపోతాడు.'

''ఇదంతా విని ఆగ్రహపరులై దిగ్భ్రమచెందిన ఆ జనమధ్య కూచుని, ఆ గొడ్లకాపరి తన 'ఉల్లా' — కొనకు ముక్కోణం ఒకటి వుండి, ఆ కోణాలకు తాళ్లతో కట్టిన వెదురు గొట్టం — తీసుకొని, గానం చేయ నారంభించాడు. అతని గానం ఎంత అద్భుతంగా వుండెనంటే, దానిని వినడా నికని పక్షులు తమ కలకలారావం మానేశాయి, గాలి వీచడం మర్చిపోయింది,

గొడ్ల మందలు మేత మేయడం మానేసి నేలమీద కూచున్నాయి, సూర్యుడు ఆకాశంలో ఆగిపోయాడు. ఆ గానం విన్న శ్రోతల్లో ప్రతివాడూ తన లోపాలను తన ఇంటి గడప దాటకుండా దాచేసుకుంటాననే అనుకున్నాడు.

"ఈ విధంగా ఆ గొడ్లకాపరి మూడేళ్ళు బోధించాడు. నాల్గో యేట వేసవిలో సాలీడు భక్షకులు తమ చిత్తడి ప్రదేశాలనుండి దండువెడలి, అజోర ప్రజల పై దాడిచేశారు. గొడ్లకాపరి వూరూరా తిరిగి ప్రజలకు బోధించాడు: 'మీ కొంపల గడపలు దాటి బయటకు రాకండి. మీలో వున్న చెడుపును గురించి జాగ్రత్త వహించండి. మైలపడకుండా జాగ్రత్త పడండి.' అతని బోధలను వారందరూ విన్నారు. వారిలో కొందరు సాలీడు భక్షకులను ప్రతిఘటించడానికి ఇష్టపడలేదు; ఫలితంగా ఆ కిరాతకులు వారిని వారి గడపలలోనే చంపిపారేశారు. అప్పుడు పట్నవాసులలో పెద్దలు తమలో తాము సంప్రతించుకుని, ఆ గొడ్లకాపరిని పట్టుకుని, కాళ్ళూ చేతులూ కలియగట్టేసి, కొండమీదకి ఈడ్చుకుపోయి, అక్కడనుంచి కింద వున్న సరస్సులోకి తోసేశారు.

"ఇదిలా వుండగా, ఈలోపున గొడ్లకాపరి బోధనలు అజోర దాటి ఇతర దేశాలకి వ్యాపించాయి. సముద్రతీరాన నివసిస్తున్న గుహవాసులు సహితమూ అతని విగ్రహాన్ని ఉల్లాగానం చేస్తున్నట్టుగా పర్వతశిలల పై చెక్కి, ఆ విగ్రహాన్ని ఆరాధించడం ప్రారంభించారు. అయినప్పటికీ గొడ్లకాపరి బోధనలు ఉన్మాదకరములనీ ప్రమాదభరితములనీ భావించిన కొందరు ప్రజానాయకులు సహితమూ లేకపోలేదు. వీరు గొడ్లకాపరిని పూజించిన వారిని బంధించి చంపించేసేవారు. ఏమైతేనేమి, గొడ్లకాపరి జోస్యం యథార్థమని తేలిన సమయం ఆసన్నమైంది. ఆ కాలపు చరిత్ర పుటలలో ఇలా రాసి వుంది:

" 'నలభై దినాలు అహోరాత్రాలూ ఎడతెరిపి లేకుండా ఆకాశపుత్రులు తూమ లోకంమీద దిగారు. సందెచీకటి పడిన తరువాత తల్త్సేత్ల్ నక్షత్రం పాపిష్ఠి కన్నులాగున అపూర్వమైన ప్రకాశిత్వంతో జ్వలించింది. ఆకాశపుత్రులలో అనేకులు కిందుకు దిగడంలో మరణించారు, అనేకులు కొండల్లో పడిపోయి చితికిపోయి చచ్చిపోయారు, అనేకులు దక్షిణ మహా సముద్రంలో పడి మునిగిపోయారు. అయినప్పటికీ చాలామందే తూమ గడ్డపై ప్రాణాలతో దిగారు.'

"ఇరవైవేల యేళ్ళ కిందట సంభవించిన మహాప్రళయంలో నాశనమైపోయిన భూలోకవాసుల తెగలలో ఒకానొక మగత్సీత్ల్ ప్రజల మహాప్రస్థానం గురించి ఇతిహాసంలో ఈ విధంగా రాసి వుంది.

"మగత్సీత్ల్ ప్రజలు, పదార్థం విచ్ఛేదనమయేప్పుడు ఉత్పత్తి అయే శక్తివల్ల నడుపబడి కంచుచే నిర్మించబడిన అండాకృతి యంత్రాలపై ఎగిరి వచ్చారు. వరుసగా నలభై రోజులపాటు వారు భూలోకం విడిచిపెడుతూ వలసవచ్చారు.

"బ్రహ్మాండమైన అండములనేకం విశ్వాంతరాళంలో అతీ గతీ లేకుండా దారి తప్పిపోయాయి. అంగారక గ్రహంపై దిగడంలో అనేకం నాశనమైపోయాయి. కొన్ని మాత్రం మధ్యరేఖా ఖండపు మైదానాలపై సురక్షితంగా దిగాయి.

"ఇతిహాసంలో ఇంకా ఇలా వుంది:

" 'ఆజానుబాహులై, నల్లని శిరోజాలున్న ఆకాశపుత్రులు ఆ అండములలోనుంచి బయటికి దిగారు. వారు ఆజానుబాహులు, తలపై నల్లని శిరోజాలు. వారి పసిమివర్ణపు ముఖాలు బల్లపరపుగా వున్నాయి. వారు తమ శరీరాలకూ మోకాళ్లకూ కంచు కవచాలు తొడుక్కున్నారు. శిరస్త్రా

ణాలపై సూది పళ్లున్న దువ్వెనలున్నాయి. శిరస్త్రాణాలకి ముఖంమీదనుండి ముందుకు పొడుచుకొస్తూన్న అంచులున్నాయి. ఎడమ చేతిలో వారు పొట్టి ఖడ్గాలను ధరించి, కుడి చేతిలో కాగితపు చుట్టలు పట్టుకున్నారు. సంకేతాలతో నిండివున్న ఈ కాగితపు చుట్టలే అజ్ఞానులూ దురదృష్టవంతులూ అయిన తూమ ప్రజలను నాశనం చేసివేశాయి.'

"భయంకరులూ శక్తివంతులూ అయిన మగత్సిత్ల్ తెగవారు ఇలా వుండేవారు. భూలోకంలో వారి రాజ్యం మహాసముద్రం అడుగున మునిగిపోయిన ఖండంపైన ఒకప్పుడు వెలసిన శత సువర్ణద్వారా నగరం.

"ఆకాశంనుండి ఎగిరివచ్చిన కంచు అండములలోనుంచి వారు కిందుకు దిగి, అయోల్ ప్రజల నగరాల్లోకి ప్రవేశించి, తమకు చిత్తమొచ్చిన వస్తువులనన్నిటినీ తీసుకుని, తమను ప్రతిఘటించ దలచిన వారినందరినీ వారు చంపేశారు. హోషి మందలనన్నిటినీ వారు మైదాన భూములకు తోలుకుపోయారు. మైదానాలలో నూతులు తీశారు. పొలాలు సాగుచేసి యవలు చల్లారు. కాని నూతులలో నీరు లేకపోయింది. గొడ్డుపోయిన ఆమెట్టు నేలలో యవధాన్యపు మెక్క ఎండిపోయింది. అప్పుడు అయోల్ ప్రజని మైదానపు ప్రదేశాలకు వెళ్లి పంటకాల్వలు తవ్వాల్సిందనీ, పెద్ద పెద్ద నీటి రిజర్వాయర్లు నిర్మించాల్సిందనీ ఆజ్ఞాపించారు.

"వీరి ఆజ్ఞలను కొన్ని తెగలప్రజలు శిరసావహించారు. కొన్ని తెగలవారు: ' వీరి ఆజ్ఞలను మనం పాటించకూడదు. ఈ ఆగంతకులను మనం చంపేయాలి' అన్నారు. దానితో అయోల్ సైన్యాలు మైదానపు ప్రాంతాలకు విజృంభించి, తుపాను మేఘంలా వ్యాపించాయి.

"ఆగంతకులు కొద్దిమందే. అయితేనేమి, ఒక్కొక్కడూ పర్వతంలా బలంగానూ, సముద్ర తరంగాలలా శక్తివంతంగానూ, ఝంఝూవాతంలా భయంక

రంగానూ నిలదొక్కుకుని యుద్ధం చేశారు. వారు అయోల్ సేనలను చీల్చి చెండాడి నాశనం చేసేశారు. నగరాలను నుగ్గునుగ్గు కావించారు. పశువుల మందల్ని చెదరగొట్టేశారు. చిత్తడి ప్రదేశాలలో నివసిస్తూన్న క్రూర 'చా' జనం అయోల్ ప్రజలమీద పడి, స్త్రీలనూ పిల్లలనూ కిరాతకంగా ముక్కముక్కల కింద నరికిపారేశారు. పాడుపడిపోయిన కొంపల చుట్టూ సాలీడులు పట్లు నేసేశాయి. శవాలను భక్షించే 'ఇహి' పక్షుల మందలు ఎంత ఆబతో కంకాళాలను తిని కొవ్వెక్కిపోయాయంటే ఇక అవి ఎగరలేకపోయాయి. ప్రపంచం ఆఖరి గడియలు ఆసన్నమయాయి.

"అప్పుడు అయోల్ ప్రజకు జోస్యం జ్ఞాపకం వచ్చింది: 'ఛాయా రూపం ధరించు, దురదృష్టవంతుడవగు తూమ పుత్రా! అప్పుడు ఆకాశ పుత్రుని నెత్తురుకంటి చూపులు మీ నీడలను దూసుకుపోయినా మీకెట్టి కీడూ మూడదు.' అయోల్ ప్రజలు అనేకులు సోఅమ్ జలంధమం దర్శించడానికి వెళ్ళారు. తుషార మేఘావృతమ్మైన పర్వత సానువుల్లో ధ్వనించుతూ పాపనివృత్తి కల్గించి పవిత్రంచేసే ఉల్లాగానం వినేందుకని అనేకులు కొండల్లోకి వెళ్లారు. తమ ధనధాన్యాదులను వారు సమిష్టిగా వినియోగించుకున్నారు. తమ హృదయాల్లోనూ పరుల హృదయాల్లోనూ మరుగుపడివున్న సత్తును వారు అన్వేషించి, ఆ సత్తును మేళతాళ వాద్యాలతోనూ ఆనంద బాష్పాలతోనూ ఆహ్వానించారు. గొడ్లకాపరిలో నమ్మకమున్నవారు లిజియ జీరా పర్వతాల్లో పవిత్రద్వారం ఒకదానిని నిర్మించారు. ఆ ద్వారం కింద దుష్టం దాగుని వుండిపోయింది. ద్వారం చుట్టూ ఏకేంద్ర వలయాలు మూడింటిలో అజరామరాగ్ని మండుతూ ఆ ద్వారాన్ని రక్షిస్తూండేది.

"అయోల్ సైన్యాలు నాశనమైపోయాయి. సాలీడు భక్షకులు అరణ్యాలలో హతులయారు. బెస్తలందరూ బానిసలైపోయారు. కాని గొడ్ల

కాపరిలో నమ్మకమున్నవారిని మాత్రం మగత్సీత్ను్లు ఏమీ చేయలేదు; పవిత్రద్వారంపై వారు వేలైనా వేయలేదు. సోఅమ్ జలంధమం సమీపానికైనా వారు వెళ్ళలేదు; మధ్యందిన మారుతములచే కొనిరాబడిన గుప్తగానం – ఉల్లా గీతం – వినవచ్చే పర్వత సానువుల్లోకి వారు చొరనే లేదు.

"ఈవిధంగా రక్తసిక్తములై దుఃఖభరితములైన సంవత్సరాలు అనేకం గడిచాయి.

"ఆ కొత్తగా వచ్చినవారిలో స్త్రీలు లేనేలేరు – తమ వంశం అంటూ లేకుండానే మరణించాలని విజేతలకు రాసిపెట్టినట్టే అనిపించింది. అందుచేత, విజేతలు అయోల్ ప్రజలు పారిపోయి తలదాచుకొన్న పర్వతాల్లోకి ఒక దూతను పంపించారు. మగత్సీత్ల్ జాతికి చెందిన ఆ దూత చక్కని రూపురేఖలున్న అందగాడు. అతడు శిరస్త్రాణమూ ధరించలేదు, చేత ఖడ్గమూ పట్టలేదు: కర్ర ఒకటి మాత్రం పట్టుకున్నాడు. ఆ కర్ర చివర ఉన్ని చిలప ఒకటి కట్టి వుంది. పవిత్రద్వారం చుట్టూ మండుతూన్న అగ్నిజ్వాలలను సమీపించి, పర్వత సానువులన్నిటినుండి అక్కడకు వచ్చి చేరిన అయోల్ ప్రజను ఉద్దేశించి ఇలా అన్నాడు:

" 'చూడండి – నా శిరస్సుకు ఏ రక్షణా లేదు, నా గుండెలకు ఏ కవచమూ లేదు. నేను గనుక అబద్ధం పలికితే నన్ను కత్తి పుచ్చుకుని నరికేయండి. మేము బలవంతులం. తల్త్సేత్ల్ నక్షత్రాన్ని మేము మా అధీనంలోకి తెచ్చుకున్నాం. పాలపుంత అని పిలువబడే తారాపథం దాటి ఆవలి దిశకు మేము ఎగిరివెళ్ళాం. తూమ దేశాన్ని జయించివేసి, మమ్మల్ని ప్రతిఘటించిన తెగలను సంహరించేశాం. నీటి రిజర్వాయర్లను నిర్మించాం, జలాధారాల కోసమనీ, తూమ దేశపు గొడ్డు మైదానాలకు నీటి సరఫరా కోసమనీ మహత్తరములైన పంటకాల్వలను కట్టాం. సోఅత్సేర మహా

పట్నమనే నామధేయంతో వెలయు సూర్యపురిని నిర్మించ సంకల్పించాం, బతకాలని కోర్కె వున్నవారందరికీ మేము ప్రాణదానం చేయ నిశ్చయించాం. కాని మాలో స్త్రీలు లేరు. విధాత సంకల్పాన్ని మేము నెరవేర్చకుండానే మరణించాల్సినట్టుంది. మీ కన్యలను మాకు ఇవ్వండి. తూమ ఖండాలను జనసంకీర్ణ మొనరించేందుకు ఒక మహత్తర జాతికి మేము పితృత్వాన్ని స్వీకరిస్తాం. మాదగ్గరకు వచ్చి ఈ నిర్మాణకార్యంలో మాకు సాయపడండి.'

''ఉన్ని చిలుప కట్టి వున్న తన దండాన్ని అగ్ని పక్కనే పడేసి, ద్వారాభిముఖంగా కూచున్నాడు దూత. అతడు కళ్ళు మూసుకున్నాడు. అతడి నుదుట మూడో కన్ను వున్నట్టూ, ఆ కన్ను ఎర్రగా కందిపోయినట్టుగా దానిపై ఒక పొర కప్పి వుండడమూ — అందరికీ అప్పుడు స్పష్టంగా అవుపడింది.

''అయోల్ ప్రజ తమలో తాము సంప్రతించుకుని ఇలా అనుకున్నారు: 'ఈ కొండల్లో మన పశువులకి సరిపోయినంతగా మేత దొరకడంలేదు. నీరు కూడా చాలా తక్కువగానే వుంది. చలికాలంలో ఈ గుహల్లో మనం గడ్డకట్టుకుపోతున్నాం. వడిగాలి మన గుడిసెలను పర్వత సానువుల అగాథాల్లోకి ఎగరగొట్టేస్తూంది. ఈ దూత చెప్పినట్టూ చేద్దాం మనం. అలా చేసినట్టయితే మన పూర్వపు ఇళ్ళల్లోకి మనం తిరిగి వెళ్ళిపోవడానికి అవకాశం చిక్కుతుంది.'

''అయోలులు కొండలను వదిలిపెట్టేసి, తమ హోషి మందలను తోలుకుంటూ అజోర మైదానానికి తిరిగి వచ్చేశారు. అయోలుల కన్యలను మగత్రీత్నులు స్వీకరించి, నీలి పర్వత తెగకు వంశకర్తలయారు. ధ్రువశిఖరాల నుండి వేసవికాలంలో కరిగి ప్రవహించే మంచునీటిని సేకరించేందుకు బ్రహ్మాండమైన పదహారు 'రో' రిజర్వాయర్లను వారప్పుడు నిర్మించ నారం

భించారు. ఆనాటివరకూ గొడ్డుపోయిన మైదానాలను ఛేదించుకుంటూ నీటికాల్వలు ప్రవహించి, భూములకు నీటి వనరులను కల్పించాయి.

"వెనుక బుగ్గికింద దగ్ధమైపోయిన అయోల్ జనవాసాల మట్టిపై అయోల్ ప్రజల నూతన నగరాలు వెలశాయి. సస్యశ్యామలములైన క్షేత్రాలు పుష్కలమైన పంటలను ప్రసాదించాయి.

"తరువాత సోలత్సేర నగర దుర్గప్రాకారాలు నిర్మితమయాయి. ఇందుకు అద్భుతములైన యంత్రాలచే చోదితములైనట్టి బ్రహ్మాండము లైన క్రేనులను మగత్సీత్లులు ఉపయోగించారు. వారికుండిన విజ్ఞానగరిమచే మహత్తరములైన గండశిలలను ఒక చోటనుండి మరొకచోటకు కదలించ గల్గారు, చెట్టుచేమలు అత్యంత త్వరగా పెరిగేటట్టు చేయగల్గారు. రంగు రంగుల చుక్కలతోనూ, నక్షత్రాకృతిగల సంకేతాలతోనూ చిత్రీకరించిన పుస్తకాల నిండా వారు తమ విజ్ఞానాన్ని గ్రంథస్థం చేశారు.

"భూలోకంనుంచి వచ్చినవారిలో కడపటి వ్యక్తి మరణించినప్పుడు, అతనితోపాటు విజ్ఞానం కూడా మరణించింది. కేవలం ఇరవైవేల సంవత్స రాల క్రితం మాత్రమే మేము — పర్వత తెగ వంశజులమైన మేము — అట్లాంటా వాసుల రహస్య గ్రంథాలను చదివి వాటిలో రాసిపెట్టిన విజ్ఞానాన్ని తెలుసుకోగల్గాం."

# యాదృచ్ఛ ఆవిష్కరణ

సాయంకాలపు చిరుచీకటి పడుతూన్న సమయంలో, చేతిలో పని అంటూ ఏదీ లేకపోవడంచేత ఇంట్లో వున్న గదులన్నీ చూదామని బయల్దేరాడు గూసెవ్. శీతకాలపు చలికి తట్టుకునేందుకుగానే ఇల్లు కట్టి వుంది. ఇంట్లో

ఎన్నో వసారాలు, మేడమెట్లు, ఖాళీ హాలులు, గ్యాలరీలు — అన్నీ నిర్జనమై నిశ్శబ్దంలో మునిగి వున్నాయి. ఖాళీగా వున్న వీటినన్నిటినీ చూసుకుంటూ వెళ్ళాడేమో, గూసెవ్‌కి విసుగెత్తి ఆవలింతలు వచ్చేశాయి:

''వీళ్లతస్సాదియ్యా, హాయిగా బతికారు వీళ్లు! కాని, ఏం బతుకు బాబూ, వాళ్ళకి విసుగొచ్చేసే వుండాలి!'' అనుకున్నాడు.

ఇంతట్లో ఇంటి వెనక భాగంనుండి ఎవరివో గొంతుకలూ, తపేలాలూ పెనాలూ గిన్నెలూ గరిటెలూ చెమ్చాల గలగల చప్పుడూ వినబడ్డాయి. పిట్ట కీచుకీచుమంటూన్నట్టుగా, ఆ అతిథిగృహం గుమాస్తా ఏకధాటిని ఎవరినో చివాట్లు పెడుతున్నాడు. గూసెవ్ వంటింటివైపు వెళ్ళాడు. వంట గది పొట్టిగా, సరంబీకి కమాన్లు కట్టి వుంది. ఒక మూల తపేలాలూ గిన్నెలూ మధ్య నూనె మండుతూన్నట్టు అవుపడింది గూసెవ్‌కి. వంటింటి గుమ్మంలో నిలబడి ముక్కుచెరమలు ఎగరేస్తూ వాసనచూశాడు. అతనిని చూడగానే, అంతవరకూ ఒకరితో ఒకరు ఘర్షణ పడుతూన్న గుమాస్తా, వంటలక్క వెంటనే మాటలు ఆపుచేసి, వెనక్కి వెనక్కి తప్పుకొన్నారు.

''ఏమిటిలా పొగబెడుతున్నారు?'' అన్నాడు గూసెవ్, రష్యన్ భాషలో. ''వంటపొయ్యి మీద గూడూ, గొట్టమూ కట్టాలయ్యా! ఆరె, ఏమి అడవి మనుషులయ్యా మీరు! మళ్లీ అంగారకవాసులట కూడానూ, మీ బొడ్డు పొక్క!''

బుజాలు ఎగరేసుకుంటూ గూసెవ్ వెనక వాకిలోనుంచి బయటికి వెళ్ళిపోయి, అక్కడున్న రాతిమెట్లమీద కూర్చుని, జేబులోంచి సిగరెట్టు కేసు తీసి, సిగరెట్టు ముట్టించాడు.

పచ్చికబయటి ఆవలి చివర, చిట్టడవి మొదలయే చోట మెల్లగా ఆరుస్తూన్న పోషిలను ఇటుకలతో కట్టిన సాలలోకి తోలుకొస్తూ గొడ్ల

కాపరి కుర్రాడొకడు కేకలేసుకుంటూ పరిగెడుతున్నాడు. సాలనుండి బయటకు దారితీస్తూన్న గడ్డి మొలచిన బాటవెంట రెండు బాల్చీల పాలు పట్టుకుని ఒక స్త్రీ అవుపడింది. ఆమె తొడుక్కున్న పసుప్పచ్చని బ్లౌజుగాలికి ఉబ్బింది, లేతఎరుపువాగు తలకట్టుపై నవ్వుతెప్పిస్తూ తమాషాగా వున్న ఆ టోపీనుంచి వేలాడుతూన్న కుచ్చులు గాలికి అల్లల్లాడుతున్నాయి. ఆ బాటవెంట సగం దూరం నడచి, తాను చేతబట్టుకున్న పాల బాల్చీలను బాటమీాద వుంచి, తన ముఖం ఎదుట ఎగురుతూన్న పురుగును తోలుకుందుకు ఒక మోచేయి ముఖానికి అడ్డం పెట్టుకుని రెండో చేతితో పురుగును పక్కకు తోలేసింది. గాలికి ఆమె పరికిణీ ఎగిరింది. ఆమె నవ్వుతూ చప్పున చతికిలబడి, తరువాత మళ్ళీ వెంటనే లేచి బాల్చీలను పట్టుకుని సరుగున ఇంట్లోకి వచ్చేసింది. ఆమె గూసెవ్‌ను చూడగానే నవ్వింది. ఆమె నవ్వినప్పుడు చూడ వేడుకగా వున్న తెల్లని పల్వరస పైకికనబడింది.

ఆమె పేరు ఈహ అని గూసెవ్‌కి తెలుసును. అయినా ఆమెను ఈహొష్క అని ముద్దుపేరుపెట్టి పిల్చేవాడు గూసెవ్. ఆమె గుమాస్తా మేనగోడలు — బొద్దుగా ఏపుగా పిల్ల ఎప్పుడూ నవ్వుతూనే వుంటుంది, నీలమేఘచ్ఛాయ వర్ణం.

గూసెవ్ పక్కనుండే పరుగెత్తుకుని వెళ్తూ, అతడిని చూసి ముక్కు ఎగరేసింది. ఆమెను పరియాచకమాడుతూ తుంటిమీాద చిన్న దెబ్బ కొడదామనుకున్నాడు మొదట గూసెవ్, కాని మళ్ళీ ఆపుకొని, లేచినవాడల్లా కూచుని, సిగరెట్టు ఒక దమ్ము పీల్చి, ఆమె మళ్ళీ వస్తుందికదా అని అనుకుని, ఆమెకోసం కూచున్నాడు.

వో బుట్టనీ, కత్తినీ పట్టుకుని నిజంగానే ఈహొష్క మళ్ళీ ప్రత్యక్షమైంది. ఆకాశపుత్రునికి కాస్త దూరంగా కూచుని, బుట్టతో

తెచ్చిన కూరగాయలకు తొక్కలు వొలుస్తోంది. గుబురుగా వున్న ఆమె కనురెప్ప వెంట్రుకలు పూరికే అదురుతున్నాయి. ఆమె సరదా అయిన పిల్ల అని చూడగానే తెలిసిపోతుంది.

"అంగారక స్త్రీలందరూ నీలంగా వుంటూ రెందుకూ?" అని గూసెవ్ అడిగాడామెను. "నువ్వుత్త వెర్రిపిల్లవి. అసలు జీవితమంటే ఏమిటో నీకు తెలియదు."

ఈహ తన భాషలో జబాబు చెప్పింది. అయినా ఆమె ఏమి అంటూందో గూసెవ్‌కి స్పష్టంగా అర్థమైంది.

"బడిలో మేం చరిత్ర చదువుకున్నాం. ఆకాశపుత్రులందరూ చెడ్డ వాళ్ళని అందులో రాసుంది. కాని చూడగా, పుస్తకాల్లో ఒకటి రాసుంటే, అసలు యథార్థం మరొకలా వుంది. ఆకాశపుత్రులు ఏమంత చెడ్డవాళ్లల్లా లేరే!" అందామె.

"అవును, మేం ఎంతో మంచివాళ్లం!" అన్నాడు గూసెవ్ కన్ను గీటుతూ.

ఈహ విరగబడి నవ్వింది. ఆమె వొలుస్తూన్న తొక్కలన్నీ కింద పడిపోయాయి.

"ఆకాశపుత్రులు మీరు మీ కనుచూపుతోనే ఎవరినైనా సరే హతమార్చేస్తారని మా మామయ్య అంటున్నాడు. నేనదేమీ గమనించలేదే."

"ఆహా, అలాగా? అయితే మరి నువ్వు ఏమిటి గమనించావ్?"

"ఇదిగో, ఆ చెప్పేదేదో మా భాషలో చెప్పండి. మీ భాషలో చెబితే నాకేమీ అర్థం కావడంలేదు," అంది ఈహొష్క.

"మీ భాషలో నేను చెబితే దాన్ని నువ్వు అర్థం చేసుకుందుకు మీ తాతలు దిగిరావాలి!"

"ఏమంటున్నారూ?" అంది ఈహా. అలా అంటూ, తన చేతిలో వున్న కత్తిని కిందపడేసి, ఇక పొట్ట చెక్కలయేట్టు నవ్వుతూ కూచుంది. "నన్నడుగుతే — ఎర్ర నక్షత్రంలో వున్న మీకూ, మాకూ ఏమీ భేదం లేదనే అనుకుంటాను నేను."

గూసెవ్ చిన్న దగ్గు దగ్గి ఆమెకు మరికాస్త దగ్గరగా జరిగాడు. ఈహా తన బుట్ట తీసుకుని కొంచెం దూరంగా వసిలింది. గూసెవ్ మళ్ళీ ఒక చిన్న దగ్గు దగ్గి, ఆమెకు దగ్గరగా జరిగాడు.

"మీరు అలా రాతిమెట్టుమీద కూచుని దేకారంటే ఆ పంట్లాం రవంతా చిరిగి వూరుకుంటుంది," అంది ఈహా.

ఆమె అచ్చంగా అలాగే అందో, మరెలా అందో గాని, గూసెవ్‌కి మాత్రం అలా అర్థమైంది మరి.

ఇప్పుడు ఆమె పక్కనే జేరాడు గూసెవ్. ఈహొష్క మెల్లగా నిట్టూర్చింది. ఆమె తలకాయ దించి గట్టిగా నిట్టూర్చింది. గూసెవ్ అప్పుడు చప్పున ఇటూ అటూ చూసి ఈహొష్క బుజంమీద చెయ్యి వేశాడు. ఆమె వెంటనే ముఖం వెనక్కి తిప్పేసుకుని, కళ్ళు చేరెడంత చేసుకుని అతనికేసి చూసింది. అతడు చటుక్కున ఆమె పెదవులను గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు. తన చేతిలో వున్న బుట్టను ఈహా గట్టిగా కౌగలించుకుంది.

"అద్గదీ, ఈహొష్క!" అన్నాడు గూసెవ్. ఆమె చెంగున లేచి పారిపోయింది.

గూసెవ్ అలా కూచునే మీసాలు మెలేసుకుంటూ ఫక్కున నవ్వాడు. సూర్యుడు అస్తమించాడు. నక్షత్రాలు ఉదయించాయి. ఒంటి నిండా బొచ్చున్న చిన్న జంతు వొకటి మెట్లమీద ఎక్కి, ధగధగా మెరు

స్తూన్న కళ్లతో గూసెవ్‌కేసి చూసింది. గూసెవ్ కొద్దిగా చలించాడు. ఆ జంతువు బుస్సుమంటూ చీకట్లో అదృశ్యమైపోయింది.

"ఇక ఇక్కడితో ఈ నాటకం కట్టిపెట్టెయ్యాలి," అనుకున్నాడు గూసెవ్. అలా అనుకుని, లేచి పటకా సర్దుకుని ఇంట్లోకి వెళ్ళాడు. ఇంటి నడవలో తటాలున ఈహ అతనికి ఎదురుపడింది. అతడామెను తన దగ్గరకు రమ్మనమని చేతితో సంజ్ఞచేశాడు. ఆమె అతనివెంట నడవలోకి వెళ్లింది. ఎంతో ప్రయాసపడి, తన ప్రయాసానికి ముఖం చిట్లించుకుని గూసెవ్ ఆమెతో అంగారక భాషలో ఇలా అన్నాడు:

"నిన్ను పెళ్ళాడమని అంటే — పెళ్ళాడతాను, ఈహొష్క. నేను చెప్పినట్టు చెయ్యి." (ఈహ తన ముఖం గోడవైపు తిప్పేసుకుని — మూతి ఇట్టేపెట్టేసింది. అతడామెను తనవైపు తిప్పుకొని — ఆమె చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.) "మూతి సాగతీసుకుంటావెందుకు? నిన్నింకా పెళ్ళాడందే! నామాటలు విను: ఆకాశపుత్రుణ్ణి నేను ఇక్కడకి వుబుసుపోక రాలేదు. మీ లోకంలో నాకు అత్యవసర కార్యం వుండే ఇక్కడికొచ్చాను. కాని నాకిక్కడంతా కొత్త, మీ ఆచారాలూ వ్యవహారాలూ నాకు తెలియవు. అంచేత నీ సాయం నాకవసరం. కాని నాతో అబద్ధాలాడేవు సుమా, అది మాత్రం చూసుకో! ఓ సంగతి నాకు చెప్పు — మీకు పెద్ద ఎవరు?"

"మాకు పెద్ద ఎవరా?" అంటూ ఈహ గూసెవ్ మాటలు అర్థం చేసుకుందుకు ఎంతో తంటాలు పడుతూ, "మాకు పెద్ద — మాకందరికీ యజమాని — తూమ దేశాలన్నిటికీ పాలకుడు," అంది.

"ఓహో, మహబాగా వుందే!" అన్నాడు గూసెవ్ టక్కున ఆగిపోయి. "నిజమే?" (అంటూ బుర్రగోక్కున్నాడు.) "అతన్ని మీరు ఏమంటారు?

అతని బిరుదేమిటి? అతనిని రాజు అని పిలుస్తారా మీరు, లేకుంటే మరేమని పిలుస్తారు? అతడి పనేమిటి?''

''అతడి పేరు తుస్క్రాబ్. అతడు అయిలీత తండ్రి. సార్వభౌమ సభకు అధిపతి.''

''సరే, బోధపడింది.''

గూసెవ్ ఏమీ మాటాడకుండా నాలుగు అడుగులు నడిచాడు.

''ఇదిగో చూడు ఈహౌష్క, ఆ గదిలో మసకమసకగా వున్న గాజు తెర ఒకటి చూశాను. ఆ తెరను చూస్తూంటే మంచి గమ్మత్తుగా వుంటుంది, ఏం? అది ఎలా పనిచేస్తుందో నాకోసారి చూపించు.''

వాళ్ళిద్దరూ పొడుగ్గా చీకటిగా వున్న గదిలోకి వెళ్ళారు. గదిలో పొట్టిగా వున్న కుర్చీలు ఎన్నో వున్నాయి. తెల్లగా మబ్బుమబ్బుగా వున్న గాజుతెర ఒకటి గోడకుంది. ఆ తెరదగ్గర పడకకుర్చీ ఒకటుంటే దానిలో చతికిల బడ్డాడు గూసెవ్.

''ఆకాశపుత్రుడా! మీకేమిటి చూడాలని వుంది?'' అని అడిగింది ఈహ.

''మీ పట్నం చూపించు.''

''ఇప్పుడిప్పుడే చీకటి పడిపోయింది. అందరూ పనులు ముగించుకుని ఇళ్ళకు వెళ్ళిపోతారు. ఫ్యాక్టరీలూ, షాపులూ మూసేసుంటాయి. చౌకుల్లో మనుషులుండరు. పోనీయండి — వూళ్ళో వినోదాలూ విశేషాలూ ఏమైనా చూపించమంటారా?''

''అలాగే. వూళ్ళో వినోదాలు చూపించు.''

అక్కడ ఒక ప్లగ్ వుంటే దానిని ఈహ స్విచ్చిబోర్డులో బిగించి,

పొడుగ్గా వున్న తాడు ఒకదానిని లాగి వెనక్కివచ్చి, ఆకాశపుత్రుడు హాయిగా కాళ్ళు చాపుకొని కూచున్న కుర్చీ పక్క నిలబడింది.

"ఇదిగో ఇక్కడ జనం ఉత్సవం చేసుకుంటున్నారు," అంది ఈహ, తాడు చటుక్కున గుంజి.

గొప్ప రణగణ ధ్వని వినబడింది — జనసందోహంనుండి వస్తూన్న వెయ్యిగొంతులు కలిసిపోయి ఒక్కసారే వినబడ్డాయి. తెరమీద వెల్తురు పడి, గాజుతో నిర్మించబడి, విల్లు ఆకారంలో వంగిన ఇళ్ళ కప్పులు తెరపైన కనబడ్డాయి. పెద్దపెద్ద పోస్టర్లూ శీర్షికపతాకలుపైనా, రంగురంగుల వెడల్పాటి తుషారమేఘాలపైనా దీప్తి కిరణాలు పడుతున్నాయి. నేల యీనినట్టు, కిందను ఎక్కడ చూసినా — ఒకటే జనం. అక్కడక్కడ గబ్బిలాల్లా రెక్కలున్న ఆకారాలు ఏవో ఎగురుతున్నాయి. ఇక గాజు ఆర్చీలూ, పరస్పరం ఖండించుకుంటూన్న తేజోబాణాలూ, సముద్రపు కెరటాల్లా వున్న జనసందోహాలూ క్రమేణా ధూళిరేణువుల మేఘాలలో అదృశ్యమైపోయాయి.

"వీళ్ళందరూ ఏమిటి చేస్తున్నారు?" అని గూసెవ్ కేకేశాడు — ఆ మహా సందడి అంత జోరుగా వుంది.

"ఈ అమూల్య ధూపాలను ఆఘ్రాణించుతున్నారు జనం. ఆ పొగమబ్బులు మీకు కనబడ్డాయిగా? అవి హ్రా ఆకుల పొగ. ఎంతో అమూల్యమైనదీ ధూపం — మృత్యుంజయ ధూపం. ఈ పొగ తాగే వాడికి అద్భుతమైన కలలు వస్తాయి — తనకు అనంత ఆయువున్నట్టే కలగంటాడు, అత్యాశ్చర్యకరమైన విషయాలను చూస్తాడు, అవన్నీ అతనికి అర్థమైపోతాయి. ఉల్లా గానం సహితమూ వినబడితే వినబడవచ్చు కూడానూ. హ్రా ఆకుల పొగను ఎవ్వరూ ఇళ్లల్లో పీల్చకూడదు — అలా పొగతాగినవారికి

ఏకంగా మరణశిక్షే. దానిని కాల్చి పొగతాగడానికి సార్వభౌమ సభవారు ప్రత్యేకంగా అనుమతివ్వాలి. ఈ ఇంట్లో వాళ్ళం మేం మాత్రం ఏడాదికి సరిగ్గా పన్నెండు సార్లు హవ్వా పొగ సేవించొచ్చు."

"ఈ జనంలో కడమవాళ్లు ఏం చేస్తున్నారు?"

"వాళ్ళు లాటరీలో గెలవబోయే నంబర్లను పోల్చుకుందుకు ప్రయత్నిస్తున్నారు. ఈ రోజున ప్రతీవారూ ఒక నంబరు చెప్పొచ్చు. గెలుపు నంబరు ఎవడు చెబుతే వాడు ఇక బతికున్నంత కాలమూ మరి పనిచేయక్కర లేదు. వాడికి సార్వభౌమ సభవారు ఒక మాంచి అందమైన ఇల్లు, పొలం, పది హోషిలు, ఒక రెక్కల పడవ ఇస్తారు. గెలుపు నంబరు పోల్చుకోవడమంటే — అదృష్టమే!"

ఇదంతా గూసెవ్‌కి బోధపరుస్తూ అతడు కూచున్న కుర్చీచేతిమీదే కూచుంది ఈహా. అతడు తన చేతితో ఆమె నడుము చుట్టవేశాడు. అతడి కౌగిటినుండి జారిపోయేందుకు ఆమె ప్రయత్నించి, లాభంలేక ఇక నెమ్మదిగా కూచుంది. ఆ మబ్బుగాజు తెరపైన తాను చూసిన అద్భుతాలన్నిటికీ గూసెవ్ ఆశ్చర్యపడుతూ అన్నాడు: "ఆరె, గడుగ్గాయలు, వీళ్ల తస్సాచెక్క!" తరువాత కాస్సేపయాక, మరిదేనినైనా చూపించమన్నాడు గూసెవ్.

ఈహా కుర్చీమీదనుండి చెంగున లేచిపోయి, స్విచ్చిబోర్డు దగ్గర కెళ్లి ఏదో చక్కబెట్టింది. కాని ఫ్లగ్గులు కన్నాలకు నప్పాయికావు. చివరకి ఆమె గూసెవ్ దగ్గరకి వచ్చేసి, మళ్ళీ అతని కుర్చీచేతిమీద కూచుని, స్విచ్ తాడు కొసనున్న గుబ్బను ఇటూ అటూ తిప్పతూ కూచుంది. ఆమె ముభావాన్ని చూస్తే ఆమె ఏదోకొద్దిగా మైకంలో వున్నట్టు కనబడింది. గూసెవ్ ఆమెవైపు చూసి నవ్వాడు. ఆ నవ్వు ఆమె చెవిని పడగానే ఆమె కళ్లలో భయం ప్రత్యక్షమైంది.

"పిల్లా! నీకు పెళ్లి యీడొచ్చింది. నువ్వింక పెళ్ళాడాలి," అన్నాడు గూసెవ్.

ఈహొష్కా ముఖం దించేసి నిట్టూర్చింది. గూసెవ్ ఆమె వీపు నిమిరాడు — ఆ స్పర్శను ఆమె పిల్లిలా హాయిగా అనుభవించింది.

"నువ్వు చక్కని చుక్కవి, అందాల బరిణవి, సీలంగా ముద్దొస్తు న్నావు."

"ఇదిగో చూడండి, ఈ బొమ్మ ఏంతో ముచ్చటగా వుంటుంది," అంది ఆమె, మెల్లగా గొణిగి, స్విచ్చితాడు గుంజుతూనూ.

తెరమీద వెలుగు పడి, సగం తెర ఆక్రమించుకుంటూ ఒక మనిషి వీపు కనబడింది. మెల్లగా మాట్లాడుతూ పిసరంతైనా ఉత్సాహంలేని ఒక గొంతు వినబడింది. ఆ వీపు ఒక పక్కకు అదృశ్యమైపోగా, ఒక పెద్ద హాలుకు ఆవలి చివర వున్న ఎత్తైన ఆర్చిలో ఒక భాగం తెరపై కనబడింది గూసెవ్‌కి. ఆర్చిని నిలబెడుతూంది ఒక నలుచదరపు స్తంభం. ఒక గోడమీద సగం భాగంనిండా సువర్ణాక్షరాలూ, రేఖాగణిత చిత్రాలూ చెక్కి వున్నాయి. ఆర్చికింద ఒక టేబిలు దగ్గర శిరస్సులు వంచి కూచున్నారు కొందరు అంగా రకవాసులు. తాని గ్రహానికి వచ్చిన కొత్తలో ఆ చీకటింటి మెట్లపైన అవుపడినవారే వీరందరూ.

ఆ హాలులో వున్న టేబిలుమీద జల్తారు బుటా గుడ్డ పరచి వుంది. టేబిలుదగ్గర అగ్రస్థానంలో అయిలీత తండ్రి తుస్కూబ్ నిలబడ్డాడు. అతని పలుచని పెదవులు కదలుతూన్నప్పుడల్లా అతని గడ్డం అతను వేసు కున్న జల్తారు అంగరకాను తాకుతూంది. ఈ ఒక్క చలనమూ మినహా అతడు రాతిలో మలచిన విగ్రహంలా నిలబడ్డాడు. కళావిహీనమై ధుమధుమ లాడుతూన్న అతని చూపులు సరాసరి ముక్కుసూటిగా — తెరకేసి —

చూస్తున్నాయి.తూస్క్యాబ్ ఏదో మాట్లాడుతున్నాడు. అతడు ఏమిటి మాట్లాడుతున్నాడో అర్థంకాకపోయినా, అతని మాటలు కరకుగా భయంకరంగా వున్నాయి. అతని మాటల్లో 'తల్త్సేత్ల్' అనే పదం అనేకసార్లు దొర్లింది. ఆ పదం ఉచ్చరించినప్పుడల్లా అతడు తన చేతిలో వున్న కాగితపు చుట్టతో బల్లపై చరిచేవాడు. వెలవెలబోతూన్నట్టి వెడల్పాటి ముఖం వున్న అంగారకవాసి ఒకడు తుస్క్యాబ్‌కి ఎదురుగా కూచున్నాడు. ఈ మనిషి తటాలున లేచి నిలబడ్డాడు. తన తెల్లని కనుగుడ్లతో తుస్క్యాబ్‌కేసి చూసి:

"వాళ్ళు కాదు, నువ్వే!" అని కేకేశాడు.

ఈహౌష్క తుళ్ళిపడింది. ఆమె తెరవైపు తిరిగే వుంది. కాని ఆకాశపుత్రుని పెద్ద చేతులు తనను నిమురుతూండడం కారణంగా ఆమె తెరకేసీ చూడ లేదు, మాటలూ వినిపించుకో లేదు. కాని తెరమీద కన బడిన అంగారకవాసుని కేక, "వాళ్ళేమిటంటున్నారు?" అని గూసెవ్ వేసిన ప్రశ్న, ఈ రెండూ ఆమె చెవిని పడిన వెంటనే ఆమె ఉలికిపడి, తెరకేసి నోరు వెళ్ళబెట్టుకుని చూసింది. ఆమె కెవ్వుమని కేకవేసి, స్విచ్చితాడును చప్పున గుంజింది.

తెరమీద వెలుగు మాయమైపోయింది.

"నాది పొరపాటైపోయింది... నేను ఒక స్విచ్చి బదులు ఒక స్విచ్చి వేశాను... సార్వభౌమ సభ రహస్యాలు ఎవ్వరూ వినసాహసించరు." ఈహౌష్క గజగజ వణికిపోయింది — పళ్ళు పటపట కొరుక్కున్నాయి. తన ఎర్రని జుట్టును పీక్కొంది ఆమె. అతి నిస్పృహపడిపోయి మెల్లగా అంది: "నాది పొరపాటైపోయింది. నేను చెయ్యాలని చేయలేదు. వారికిది తెలిసిందంటే నన్ను పర్వతగుహల్లోకి — శాశ్వత హిమశీతల రాసుల్లోకి పంపించేస్తారు నన్ను."

"పిల్లా, ఏమిటా పిచ్చిమాటలు! నేనెవ్వరితోనూ చెప్పనులే," అన్నాడు గూసెవ్. అలా అంటూ ఆమెను దగ్గరకు తీసుకుని, అంగోరా పిల్లిలా వున్న పట్టులాంటి ఆమె వెచ్చని తలకట్టును నిమిరాడు. ఈహౌష్క స్తిమితపడి కళ్లు మూసుకుంది.

"ఓసి వెర్రిపిల్లా! నువ్వుత్త పిల్లికూనవి – మనిషివి కానేకావు! నీలిఛాయ పిచ్చిపిల్లవు!"

ఆమె శిరస్సును చెవివెనుక మృదువుగా గోకాడు – ఆమెకది ఎంతో ఇష్టమని తెలుసుకొని. ఈహౌష్క కాళ్లు ముడుచుకుని కూచుంది. ఇందాకలా తాను వెనుకవసారా మెట్లమీద కూచునున్నప్పుడు అవుపడిన జంతువు కళ్లు ఎలాగు మెరిశాయో సరిగ్గా అలాగే – ఆమె కళ్లు కూడా మెరుపులు మెరిశాయనిపించింది గూసెవ్‌కి. అతనికి నిజంగా కాస్త భయమే వేసింది.

సరిగ్గా అదే క్షణంలో లోశ్, అయిలీతలు ఇద్దరూ హాలులోనుంచి వస్తూన్నట్టు అడుగుల చప్పుడు వినబడింది. ఈహౌష్క చప్పున కుర్చీలో నుండి దిగిపోయి, తొట్రుపడుతూ తలుపు దగ్గరకు జారుకుంది.

ఆ రాత్రే గూసెవ్ లోశ్ పడకగదిలోకి వెళ్లి:

"ఇక్కడేదో మనమీద గూడుపుఠాణీ జరుగుతూందయ్యా, మ్స్తిస్లావ్ సేర్గేయెవిచ్! ఇక్కడో అమ్మాయి వుంటే, ఆమెచేత ఆ తెరకి స్విచ్చి వేయించి, ఏమిటి జరుగుతూందో తెరమీద చూసేసరికి, సార్వభౌమ సభ సమావేశం యాదృచ్ఛికంగా అవుపడి, వారి మాటలు మా చెవినిబడ్డాయి. నాకు అంతా అర్థంకాకపోయినా, మన జాగ్రత్త మనం పడాలి – వీళ్లు మనని చంపేస్తారు, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్, నా మాటలు నమ్మండి – దీనితో ఇక మన పని సరి," అన్నాడు.

అతను చెబుతూన్నది లోశ్ వినిపించుకున్నాడో లేదో మరి — లోశ్ గూసెవ్‌కేసి కలగంటూన్నట్టు చూశాడు. రెండు చేతులవేళ్ళూ మెడ వెనుక మెలివేసుకుని:

"చిల్లంగి, అలెక్సేయ్ ఇవానొవిచ్, ఇదంతా చిల్లంగి. దీపం ఆర్పే యండి," అన్నాడు లోశ్.

గూసెవ్ ఒక్క నిమిషం నిలబడి, ముఖం ముడిపెట్టుకుని అన్నాడు:

"సరే, చూదాం!"

అలా అనేసి తన గదిలోకి వెళ్ళిపోయి నిద్రపోయాడు.

# అయిలీత ఉదయ కార్యక్రమం

అయిలీత వేకువజామునే లేచి, మోచేతిమీద ఆనుకుని మంచం మీదే కూచుంది. నాలుగు వైపులా జాలు లేకుండా విశాలంగా వున్న ఆ మంచం, అక్కడి ఆచారం ప్రకారం పడకగది నడిమధ్య వున్న తీనెమీద వుంది. పడకగది సరంబీ ఎత్తైన చలువరాతి చట్రపు ఆకాశ కిటికీ రూపంలో అంతమైంది. ఈ కిటికీలోనుంచి ఉదయకాంతులు గదిలోకి ప్రవహిస్తున్నాయి. గోడకి వున్న సంకీర్ణవస్తు చిత్రం నమూనా, నీడలో మరుగు పడిపోయింది. మంచులా తెల్లగా వున్న దుప్పట్లనూ, దిండుగలేబులనూ, చేతిపై ఆనుకొనున్న అయిలీత ధూసరవర్ణపు శిరస్సునూ గదిలోకి చొచ్చుకొని వస్తూన్న కాంతి బాణం దూసుకుపోతూంది.

ఆమెకు రాత్రి సరిగా నిద్రపట్టలేదు. దిగులు పుట్టించేటట్టి వింతవింత కలలోని భాగాలు కలగాపులగంగా మిళితమైపోయి మూతబడ్డ కళ్ళ ఎదుట తాండవించ నారంభించాయి. తేలికగా పొగమంచు పొరలా పట్టింది

నిద్ర. రాత్రి అంతా కూడా, ఆమెకు నిద్రపట్టినట్టే అనిపించినా, అదే మిటో చికాకైన విషయాలను గురించి కలగన్నట్టూ, అసలు ఇలా కలలు కనడానికి కారణమేమై వుంటుందో అని మళ్ళీ ఆ నిద్రమత్తులోనే ఆశ్చర్య పడుతూన్నట్టూ అనిపించింది.

ఆకాశపు కిటికీలోనుంచి సూర్యకాంతి గదిలోకి ప్రవహించగానే అయిలీత నిట్టూర్చి, నిద్రనుంచి బాగా మేల్కొని నిస్తబ్దంగా అలా పడుకుంది. ఆమె ఆలోచనలన్నీ నిర్మలంగా వున్నాయి, గాని తన రక్తంలో లీలామాత్రంగా దిగులు పరుగెత్తుతూన్నట్టు అనిపించిందామెకు. ఇది ఆమెను చికాకు పరచింది — ఇంతా అంతా చికాకుకాదు — గొప్పగానే చికాకు పరచింది.

''రక్తంలో మిళితమై ప్రవహించుతూన్న దిగులు, మనస్సులో కలవరపాటు — ఏనాడో బహుకాలంనాటి అనుభవాలకే మళ్ళీ అనవసరంగా తిరుగు ముఖం పట్టడం, రక్తంలో మిళితమై ప్రవహించుతూన్న దిగులు — గుహలూ, పశువుల మందలూ, శిబిరపు నెగళ్ళూ, వీటికోసం తిరుగు ముఖం పట్టడం. వసంత గాలి, దిగులు, కాన్పు, మృత్యువు కోసమని ప్రసవించడం, సాకడం, భూస్థాపితం చేయడం, మళ్ళీ మొదలు — దిగులు, మాతృత్వ వేదన. ఎందుకొచ్చినట్టో గుడ్డిగా సంతతి వృద్ధిచేసుకోవడం.''

ఈవిధంగా అయిలీత తలపోసింది. తన ఆలోచనలు వివేకవంతమైనవే. కాని దిగులు మాత్రం పోలేదు. ఆమె మంచంమీదనుండి లేచిపోయి, నారతో అల్లిన చెప్పులు తొడుక్కొని, అంగీ వేసుకుని నీళ్లగదిలోకి వెళ్లింది. నీళ్లగదిలోకి వెళ్లి, బట్టలు విడిచి, కొప్పు బిగువుగా ముడివేసుకుని, చలువ రాతి తటాకంలోకి దిగింది.

ఆమె తటాకపు అట్టడుగు మెట్టుమీద ఆగింది. కిటికీలోనుంచి లోనికి ప్రవహించుతూన్న సూర్యకిరణాలలో అలా నిలబడడం ఎంతో మనో

జ్ఞంగా వుంది. గోడపై పడుతూన్న తేజోకిరణాల ప్రతిబింబాలు నిలచిన చోట నిలవకుండా దోబుచులాడుకుంటున్నాయి. ఆ వినీలజలంలో అయిలీత తన ప్రతిబింబాన్ని చూసుకుంది. సూర్యకిరణం ఒకటి ఆమె ,పొట్టను తాకింది. తన శరీరాన్ని చూసుకుని అసహ్యంతో ఆమె పైపెదవి గజగజ వణికింది. చల్లని తటాకపు నీటిలోకి అయిలీత చెంగున దుమికింది.

స్నానం చేయడంతో ఆమెకు ఎంతో సేద తీరినట్టు అనిపించింది. ఆమె ఆలోచనలు దైనందిన విషయాలపైకి మళ్ళాయి. ప్రతీ ఉదయమూ ఆమె తన తండ్రితో అన్ని సంగతులూ ముచ్చటించేది. ఆయనతో మాట్లేందుకని ఆమెకు తన గదిలో ప్రత్యేకంగా ఒక తెర వుంది.

అయిలీత అద్దం ఎదుట కూచుని, తల దువ్వుకుని, వొంటికి పరిమళ నవనీతం లేపనం చేసుకుని, తరువాత ముఖానికి అత్తరు రాసుకుంది. కొంచెం చికాకు పడుతూ అద్దంలో తనకేసి తాను చూసుకుని, కనుబొమలు ముడిపెట్టుకుని, తెర అమర్చి వున్న బల్లను తనకు దగ్గరగా లాగుకొని, స్విచ్చిబోర్డు మీట నొక్కింది.

ఆ మబ్బు తెరపై తనకు సుపరిచితమైనట్టే, పుస్తకాల అలమారాలతోనూ తిరుగుడు త్రిపార్శ్వకములపై అమర్చిన మ్యాపులూ డ్రాయింగులతోనూ వున్నట్టే తన తండ్రి అధ్యయన మందిరం అవుపడింది. తుస్కూబ్ తన అధ్యయన మందిరంలో ప్రవేశించి, మేజా దగ్గర కూచుని, అందుమీద వున్న కొన్ని లిఖితప్రతులను మోచేతి మొణుకుతో పక్కకు తోసేసి, అయిలీత కేసి తన దృష్టి సారించాడు. దీర్ఘమైన పలుచని పెదవుల కొనలపై నవ్వు తెలాడుతూ, ఆయన:

"రాత్రి బాగా నిద్రపోయావా, అయిలీత?" అని అడిగాడు.

"బాగానే నిద్రపోయాను. ఇంట్లో కూడా అంతా బాగానే వుంది."

''ఆకాశపుత్రులు ఎలా వున్నారు?''

''వారు ప్రశాంతంగా సంతృప్తిపడే వున్నారు. వారింకా నిద్రనుంచి లేవలేదు.''

''నువ్వింకా వారికి పాఠాలు చెబుతున్నావా?''

''లేదు. ఇంజనీరు ఇప్పుడు మన భాషధారాళంగా మాట్లాడుతాడు. అతని సహచరుడు కూడా అంతా అర్థం చేసుకోగల్గుతున్నాడు.''

''వారు ఇంట్లోనుంచి బయటకు వెళ్లేందుకు ఆత్రుతపడుతున్నారా ఏమిటి?''

''లేదు-లేదు-లేదు.''

అయిలీత ఆదరా బాదరా తొందరపడి జబాబు చెప్పేసింది. తుస్కూబ్ ఆశ్చర్యపడుతూ తన కళావిహీనమైన కళ్లను పెద్దవిచేసి ఆమెకేసి చూశాడు. ఆయన చూపులను ఆమె ఎదుర్కొనలేక, తాను కూచునున్న కుర్చీలోనే అయిలీత వెనక్కి జరిగి జరిగి కుర్చీవీపుకి అంటుకుపోయి, ఇక అంతకంటే మరి వెనక్కి జరగలేకపోయి అలా కూచుండిపోయింది.

ఆమె తండ్రి అన్నాడు:

''నువ్వు చెప్పింది నాకేమీ అర్థం కావడంలేదు.''

''ఏమి ఎందుకు అర్థం కావడంలేదు? అసలు సంగతంతా ఏమిటో నాతో చెప్పరేమి, నాన్నా? మీరు వాళ్లని ఏం చెయ్యాలనుకుంటున్నారే మిటి? నేను బతిమాలుకుంటున్నాను, నాతో చెప్పండి...''

అయిలీత ఇంకా పూర్తిగా చెప్పనేలేదు, ఈలోపుగానే తుస్కూబ్ ముఖం కోపంతో నిండిపోతూ వికృతమైపోయింది. తెరమీద వెలుగు పోయింది. అయినా అందుపైన ఏమైనా కనబడుతుందేమో అని అయిలీత దాని

నింకా పరిశీలించగా, ఆయన ముఖం — తనలాగే ప్రాణంతోవున్న సమ స్థానికి భీతావహమైన ఆ ముఖం — ఆమెకింకా అవుపడుతూనే వుంది.

"ఘోరంగా వుంది. ఇదేదో మహా ఘోరంగానే పరిణమించేటట్టుంది," అని ఆమె అనుకుంది. ఆమె గభాలున లేచింది. కాని చేతులు కింద జార్చేసి మళ్ళీ కూచుండిపోయింది.

లీలగా తోచిన దిగులు ఆమెను పట్టుకుని వేధించసాగింది. ఆమె కనుపాపలు వ్యాకోచించుకున్నాయి. ఆమె అద్దంలో తన ముఖం చూసుకుంది. మనస్సులో వున్న దిగులు గజగజ వణకుతూ రణగణధ్వని చేస్తూ రక్తంలో ప్రవహించుతూంది. "ఇదేదో చెడ్డగానూ నిరర్థకంగానూ పరిణమించేట్టే వుంది చూడబోతే!" అనుకుంది ఆమె.

ఆమె మనోవీధిలో ఆకాశపుత్రుని స్వరూపం — సరిగ్గా ఆనాటిరాత్రి కలలో ఆమెకు కనబడినట్టే — బ్రహ్మాండమైన మనిషి, మంచులా తెల్లని జుట్టు, ఆందోళన పడుతూన్న ముఖం, తరుచు బుద్ధికి అందని చపలత్వంతో ఈ క్షణం విచారంగానూ, ఉత్తరక్షణం కోమలంగానూ, భూలోక భాస్కరుని తేజస్సుతో భూజలార్ద్రతతో సంతృప్తమైన నయనాలతో — పొగమంచు ఆవరించిన అగాథాల్లా భయానకమై తుపాను మేఘంలా మనస్సును తునాతునకలు చేసేటట్టి నయనాలతో — ప్రత్యక్షమైంది.

అయిలీత షెల్లీగా తల పంకించింది. ఆమె గుండెలు, చెవులు గడియలు పడేటట్టు కొట్టుకుంటున్నాయి. మేజాకి అమర్చిన స్విచ్చిబోర్డుపై ఆమె వంగి, ప్లగ్గును మళ్ళీ బిగించింది. మబ్బుగా వున్న తెరమీద — బాలీసులు అనేకం అమర్చి వున్న కుర్చీలో ముఖం అంతా ముడుతలు పోయిన పండువృద్ధు ఒకాయన కునుకు తీస్తూండడం కనబడింది. చిన్న కిటికీనుంచి గదిలోకి వస్తూన్న వెల్తురు వొత్తుగా పూలువున్న బూర్నీసుపై పెట్టు

కున్నట్టే ఎండిపోయి బక్కచిక్కి శల్యమైపోయిన చేతులమీద, పడు తూంది. ముసలాయన ఉలికిపడి, సులోచనాలను సవరించుకుని, వాటిపై నుండి సరాసరి ముక్కుసూటిగా చూస్తూ, బోసినోటితో చిరునవ్వు నవ్వాడు.

''అమ్మాయీ, ఏమిటి విశేషం?''

''గురువుగారూ, నాకు మనస్సులో అదేమిటో దిగులుగా వుందండీ!'' అంది అయిలీత, ''నేను ఏ విషయమూ సరిగా ఆలోచించలేకుండా వున్నాను. ఇది నేనేమీ కోరుకున్నదికాదు, నాకు ఏమిటో భయంగా వుంది. కాని నేను ఏమి చేసినా నాకీ దిగులు పోవడంలేదు.''

''ఆకాశపుత్రుని వల్ల నీకేమేనా చికాకు కలుగుతూందా?''

''అవును. నేను అర్థంచేసుకోలేక పోతూన్నది ఏదో అతనిలో వుండ డంచేత నాకు చికాకు కల్గుతూంది. గురువుగారూ, ఇప్పుడే నేను నాన్న గారితో మాట్లాడాను. ఆయన కూడా మనస్తిమితం లేకుండా వున్నారు. సార్వభౌమ సభలో ఏదో ఘర్షణ పడుతూన్నట్టు నాకనిపిస్తూంది. ఏదో ఒక ఘోరనిర్ణయం చేయబోతూన్నట్టున్నారు వారు. మీరు నాకు సాయం చేయాలిసుమండీ!''

''ఆకాశపుత్రునివల్ల నీకు చికాకు కల్గుతూందని నువ్విప్పుడేగా అన్నావు? అలాంటప్పుడు అతడు ఏకంగా అంతర్థానమైతేనే మంచిదిగా మరి?''

''అయ్యో, అయ్యో!'' అంది అయిలీత తటాలున, అమితంగా గాభరా పడుతూ ఉద్రేకంతో.

ముసలాయన ముఖం చిట్లించుకుని, బోసినోటి దవుడలు బిగించు కున్నాడు.

''నీ ఆలోచనల ధోరణి ఏమిటో నాకేమీ అంతు చిక్కడంలేదు, అయిలీత. వాటిలో సత్యమూ, వైరుధ్యమూ రెండూ వున్నాయి.''

''అవునండి, నాకూ అలాగే అనిపిస్తూంది.''

''నీలో తప్పు వుందని చెప్పడానికి ఇంతకంటే మంచి నిదర్శనం ఇక అవసరమే లేదు. ఉదాత్తమైన ఆలోచనలు ఎప్పుడూ నిర్మలంగానూ, నిరుద్రేకంగానూ, వైరుధ్యరహితంగానూ వుంటాయి. అయినా నువ్వు కోరినట్టూ చేస్తానులే. మీ నాన్నగారితో మాట్లాడుతాను. అతడికీ ఉద్రేకం లావు. అందుచేతనే అతడు అవివేకంగానూ అధర్మంగానూ ప్రవర్తించేందుకు అవకాశం లేకపోలేదు.''

''మీరు నాకు కొంత ఆశ అంటూ ఇచ్చారన్నమాటే!''

''నువ్వు కాస్త సంబాళించుకోవాలి, అయిలీత; సంబాళించుకుని ధ్యానావస్థలో వుండాలి. ఆత్మపరీక్ష చేసుకోవాలి నువ్వు. నీ ఆందోళనకి కారణమేమిటి? మరేమీ లేదు — నీ రక్తం అట్టడుగునున్న పురాతన కల్మమే — అరుణాంధకారమే — జీవితాన్ని పొడిగించాలనే కాంక్షే. నీ రక్తమే నీమీద తిరుగబడుతూంది...''

''గురువుగారూ! అతడివల్ల నాకు మరో విధమైన చికాకు కూడా కల్గుతూంది.''

''అతడు నీలో ఎంత ఉదాత్తమైన ఆలోచనలకు కారణభూతుడే అయినప్పటికీ, నీలో వున్న స్త్రీత్వం మేల్కొంచి, నీ వినాశానికే కారణమవుతుంది. కేవలం నిరుద్రేకమైన జ్ఞానమే, సర్వప్రాణులకూ అనివార్యమగు — స్వేదంలోనూ, కామోద్రేకంలోనూ మునిగి తేల్తూన్న పదార్థంయొక్క క్షీణం గురించి, కేవలం తుచ్ఛమైన జీవితానుభవంతో ఇక అవసరం లేకుండా, నీ ఆత్మ — సంపూర్ణ పరిణతి చెందిన నీ ఆత్మ నీ చైతన్య పరిధులను వదిలించేసుకుని ఇక నశించిపోయే తరుణంకోసం నిరీక్షణ గురించి — ప్రశాంతంగా ధ్యానించడమే — అదే, కేవలం అదే ఆనందం. నువ్వేమో ఈ స్థితినుంచి

తిరోగమించి మళ్ళీ మొదటికే రావాలని కోరుకుంటున్నా వాయే! అమ్మాయీ, ఈ దుర్బుద్ధి గురించి నువ్వు జాగ్రత్త వహించాలి సుమా! కిందపడిపోవడం సులభమే, కాని మళ్ళీ త్వరగా లేచి కొండ ఎక్కడం — అది మాత్రం బహు ఆలస్యమూ, బహు ప్రయాసకరమూనూ. నువ్వు వివేకంతో మెలగాలి.''

ఆ మాటలు విని, అయిలీత ముఖం వాలిపోయింది.

''గురువుగారూ,'' అందామె తటాలున, కాంక్షతో నిండిన కళ్ళతో, పెదవులు వణకుతూ. ''హేతువాదంకంటేనూ, జ్ఞానంకంటేనూ, బుద్ధి కంటేనూ ఉన్నతమైనదానిని భూలోకవాసులు తెలుసుకున్నారని ఆకాశపుత్రుడు చెప్పాడు. కాని అదేమిటో నాకర్థంకాలేదు. ఇదే నాకు చికాకు కల్గించుతూంది. మేమిద్దరమూ నిన్న సరస్సులో పడవ షికారు వెళ్ళాం. ఎర్ర నక్షత్రం ఉద యించగానే దానినతడు నాకు చూపెట్టి: 'ఆ నక్షత్రం చుట్టూ ప్రేమ తుషారమేఘం పరివేష్టించి వుంది. ప్రేమను తెలుసుకొన్నవారు మృత్యుంజ యులు' అన్నాడండీ! నా హృదయం దిగులుతో విచ్చిపోయింది!''

ముసలాయన కనుబొమలు ముడిపెట్టుకుని, చాలాసేపు మౌనంగా వుండిపోయాడు. ఎండిపోయి పుల్లల్లా వున్న అతని చేతివేళ్ళు వూరికే అదురు తున్నాయి. ఇదితప్ప అతడు నిశ్చలంగా వున్నాడు.

''మంచిది,'' అన్నాడతడు. ''ఆకాశపుత్రుడు నీకేదో జ్ఞానబోధ చేస్తున్నాడన్నావుగా. సరే, అదేదోకానీ, చూతాం. అదంతా నువ్వు పూర్తిగా తెలుసుకున్న తరువాతనే గాని ఈలోపుగా నన్ను మళ్ళీ పిలవకు. కాని, జాగ్ర త్తగా మాత్రం వుండు సుమా!''

తెరమీద వెల్తురు వెలవెలపోయింది. గదిలో అంతా ప్రశాంతంగా వుంది. చేతిరుమాలుతో అయిలీత ముఖం తుడుచుకుని, తన్నుతాను కఠి నంగా పరిశీలించుకుంది. ఆమె కనుబొమలు విల్లు వంగినట్టు పైకిలేచాయి.

చిన్న పేటిక ఒకదానిని ఆమెతెరచి, దానిపై వంగి, దానిలో వున్న వస్తువులను వేళ్లతో ఆప్యాయంగా తడిమింది. ఆ పెట్టెలో వున్న వస్తువులలో, ఇంద్రి అనే అద్భుతమైన జంతువు ఎండి శల్యమైపోయిన చిన్న పంజాను, అమూల్యమైన లోహపు పతకంలో పొదిగించినట్టి హారాన్ని నిదానంగా ఆమె పైకితీసి, మెళ్ళో వేసుకుంది. మనోవ్యాకులతతో బాధపడుతూన్న స్త్రీలకు అది వరప్రదాయని అని ప్రతీతి.

అయిలీత నిట్టూర్చి గ్రంథాలయంలోకి వెళ్ళింది. కీటికీ దగ్గర కూచుని పుస్తకం చేతబట్టుకుని చదువు కుంటూన్న లోశ్ ఆమెను చూసి, కుర్చీలోంచి లేచాడు. అయిలీత అతనివైపు — ఆజానుబాహువు, దయాళుడు, వ్యాకుల మనస్కునివైపు — చూసింది. ఆమె హృదయంలో కరుణ ఒక మహాతరంగంలా ఉవ్వెత్తున లేచింది. గుండెలపై వేలాడుతూన్న ఆ అద్భుత జంతువు పంజాను తన హృదయానికి హత్తుకుని, ఆమె ఇలా అంది:

"అట్లాంటిస్ ఖండ వాసుల పతనంగురించి చెప్తానని నిన్న మీతో ఖరారు చేశాను. అలాగే చెప్తాను, కూచుని వినండి."

# అయిలీత చెప్పిన రెండో కథ

"రంగుచిత్రాల గ్రంథాల్లో ఈ విధంగా రాసి వుంది," అంటూ అయిలీత ప్రారంభించింది. "ఈనాడు మహాసముద్ర గర్భంలో కలసిపోయిన శతసువర్ణద్వారా నగరం వెనుకటి బహుపురాతన కాలంలో భూప్రపంచాని కంతటికీ కేంద్రంగా వుండేది. విజ్ఞానమూ, శరీరాన్ని మైమరపించే భోగవిలాసాలూ ఆ మహానగరం నుండి ప్రపంచం నలుమూలలా వ్యాపించు తూండేవి. ప్రపంచంలో నివసించుతూండిన కడమ అన్ని తెగలూ ఆ పట్నంచే

ఆకర్షితములై ఆ తెగలలో ప్రాక్తన దురాశ పొడసూపింది. ఇలావుండగా, ఒక కొత్త ప్రజ ఉద్భవించి, ఆ మహాపట్నాన్ని పరిపాలిస్తూన్న వారిపై బడి, దానిని తన కైవసం చేసుకుంది. ఇక దాంతో నాగరికతా జ్యోతి క్షీణింప జొచ్చింది. కాని మరికొంత కాలానికి, విజేతల నూతన రక్తంతో భాగ్యవంతమై ఆ నాగరికతా జ్యోతి ముందటికంటె మరింత దేదీప్యమానంగా ప్రకాశించ నారంభించింది. శతాబ్దులు గడచిపోయాయి. దొమ్మరి తెగ దండుల ప్రమాదం ఆ అజరామర నగరాన్ని కార్చిచ్చులా అలముకొన నారంభించింది.

''శతసువర్ణద్వారా నగరపు అసలు మొట్టమొదటి స్థాపకులు జెమ్‌జె తెగ నీగ్రోలు. ఈనాడు పసిఫిక్ మహాసముద్రం అట్టడుగునున్న గ్వాందాన్ మహాఖండమందు చరిత్ర పూర్వకాలంలో నివసించిన నలుపుజాతి ఆధునిక శాఖవారము తామని వీరు పరిగణించుకునేవారు. ఈ తెగ పతనం చెందిన తరువాత ఇంకా మిగిలినవారు కాలక్రమేణా అనేక తెగలుగా చీలిపోయారు. వీటిలో చాలా తెగలవారు కిరాతకులుగా జీవిస్తూండేవారు. కాని తమ గత కాలపు మహత్తర చరిత్ర స్మృతులను మాత్రం అమూల్యమైన పెన్నిధులుగా ఈ నీగ్రోలు, ఎంచుకుని, తమ హృదయాంతరాళంలో భద్రపరచుకుని స్మరించుకునేవారు.

''జెమ్‌జె ప్రజ మంచి శక్తిమంతులూ, ఆజానుబాహువులూనూ. వారిలో ఒక అద్భుతమైన గుణం వుండేది: ఒక అయస్కాంతం తనకి కాస్త దూరంలో రెండో అయస్కాంతం వుందనే సంగతి ఎలా తెలుసుకోగల్గుతూందో, సరిగ్గా అలాగే వీరు దూరాన వున్న వస్తువుల ఆకృతినీ స్వభావాన్నీ పసికట్టేసేవారు. ఉష్ణప్రాంతపు అరణ్యాలలోని చీకటి గుహలలో వీరు నివసించుతూండిన కాలంలో ఈ ప్రత్యేకపు జ్ఞానేంద్రియం వీరిలో అభివృద్ధి అయింది.

'' 'గోహ్' అనే విషకీటకపు బాధను భరించలేక జెమ్‌జె ప్రజ అర ణ్యాలను వదలిపెట్టేయాల్సొచ్చింది. అడవులను వదలిపెట్టేసి తమకు అనువైన భూములు కనబడేవరకూ పడమటి దిశగా వారు వలసపోయి, చిట్ట చివరకు రెండువైపులా మహానదులు ప్రవహిస్తూన్న పర్వత పీఠభూమిని చేరుకుని అక్కడ స్థిరపడిపోయారు. ఆ ప్రాంతంలో పళ్ళూ ఫలాలూ, వేటకి జంతువులూ పుష్కలంగా లభించేవి. పర్వతాల్లో బంగారం, తగరం, రాగి దొరికేవి. అడవులు, కొండలు, నెమ్మదిగా పారుతూన్న నదులు ఎంతో రమ్యంగా వుండేవి. ప్రాణాంతకమైన జ్వరాలన్నమాటే లేదు.

''వన్యమృగాలనుండి రక్షణకోసమని ప్రజలు తమ జనావాసం చుట్టూ ప్రాకారం కట్టుకున్నారు. తామక్కడ స్థిరవాసం ఏర్పరచుకున్నామని తెలియ జేసేందుకు ఒక ఎత్తైన పిరమిడును నిర్మించారు.

''ఆ పిరమిడ్ పైన ఒక స్తంభం పాతి, పడమటి దిశగా తాము సాగించిన మహాప్రస్థానంలో 'గోహ్' కీటకంనుంచి తమను రక్షించినట్టి, తమ తెగ ఇష్టదేవత అయిన 'క్లిట్లీ' పక్షి తూలికా గుచ్ఛాన్ని ఆ స్తంభం చివర మకుటంగా అలంకరించారు. జెమ్‌జె తెగ నాయకులు తమ శిరస్సులను పక్షి యీకలతో సింగారించుకునేవారు, తాము పక్షులపేర్లు పెట్టుకొనేవారు.

''ఈ పీఠభూమికి పశ్చిమాన ఎరుపు చర్మపు తెగలు వుంటూండేవి. ఈ తెగలపై జెమ్‌జె ప్రజలు దండువెడలి, వారిని పట్టుకుని, వాళ్లచేత నేలను దున్నించి, ఇళ్ళు కట్టించి, లోహపు ఖనులలోనూ బంగారపు గనుల లోనూ పనిచేయించేవారు. ఈ మహాపట్నం కీర్తి పశ్చిమాన మారుమూలలకు పాకింది. దానితో పాపం ఎరుపు తెగలవారు మరీ భయపడి పోయారు. ఎందుచేతంటే, జెమ్‌జె ప్రజలు మంచి బలవంతులూ, తెలివైనవారూ అవడంచేత, తమ దగ్గరున్న వంపుతేలిన చెక్కతునకలను ఉపయో

గించి, ఎంత దూరాన్నున్న శత్రువులనైనా సరే సంహరించడం ఎలాగో వారికి తెలుసు. తమ నావలతో వారు మహానదులపై ప్రయాణాలు ముమ్మరంగా సాగించి, ఎరుపు తెగలనుంచి కప్పం వసూలు చేస్తూండేవారు.

''జెమ్‌జె ప్రజల వంశస్థులు తమ పట్టణానికి అలంకారంగా రెల్లుతో నేసిన గుండ్రని రాతి భవనాలు కట్టేవారు. వారు శ్రేష్ఠమైన ఉన్నివస్త్రాలు నేసేవారు. తమ భావాలను చిత్రణల రూపంలో ఎలా గ్రంథస్థం చేయడమో వారికి తెలుసు — ఈ కళ పురాతనకాలంనుంచీ వారి స్మృతిఫలకంపై చిరాంకితమై నిల్చిపోయింది.

''వేలాది సంవత్సరాలు గడచిపోయాయి. ఎరుపుతెగలలో శక్తివంతుడైన నాయకుడొకడు అవతరించాడు. అతడి పేరు ఉరు. అతడు ఆ మహాపట్నంలోనే పుట్టినప్పటికీ, తన చిన్నతనంలోనే పట్నం వదిలేసి, స్టెప్ ప్రదేశాల్లో నివసించుతూన్న దేశద్రిమ్మరులతోనూ వేటగాళ్లతోనూ సహవాసం చేయడానికని వెళ్లిపోయాడు. అలా కొన్నాళ్లయాక అతడు మహాయోధులనందరనీ తన చుట్టూ కూడగట్టుకుని, బ్రహ్మాండమైన సంఖ్యలో మందినీ మార్బలాన్నీ సమీకరించుకుని, వారికి నాయకత్వం వహించి ఆ మహాపట్నంమీద పడ్డాడు.

''జెమ్‌జె వంశస్థులు తమ పట్టణాన్ని రక్షించుకుందుకని తమ విజ్ఞానాన్నంతనీ వినియోగించారు: అగ్ని జ్వాలలను శత్రువుపై ప్రయోగించారు, వెర్రి ఎనుపోతులను శత్రువుపై తోలారు, బూమిరాంగులను వదిలారు. అయితేనేంగాక, ఎర్రతెగలవారు దురాశాప్రేరితులవడంచేత వారికి ఎక్కడలేని బలమూ చేకూరింది. అంతేకాకుండా సంఖ్యలో కూడా వారిదే పైచేయి అయింది. ఆ మహానగరాన్ని వశపరచుకుని, దానిని కొల్లగొట్టి ధ్వంసం చేసేశారు. తాను భూలోకచక్రవర్తినని ప్రకటించుకున్నాడు ఉరు. జెమ్‌జె

కన్యలను పెళ్ళాడాల్సిందని అతడు ఎర్ర తెగల యోధులను ఆజ్ఞాపించాడు. పరాజితులైన జెమ్‌జె ప్రజలలో ప్రాణాలు దక్కించుకుని అడవుల్లోకి పారిపోయి తలదాచుకున్నవారు పట్నానికి తిరిగివచ్చేసి, విజేతలకింద బానిసలుగా ఊడిగం చేయసాగారు.

"ఎరుపు చర్మపు తెగలవారు జెమ్‌జె ప్రజల విజ్ఞానాన్నీ, ఆచారాలనూ, కళలనూ నేర్చుకుని, వాటిలో ప్రవీణులయారు. ఒకరి తరువాత ఒకరు సుదీర్ఘ పరంపరలుగా అనేకమంది రాజనీతి ధురంధరులూ, విజేతలూ వారిలో ఉద్భవించారు. కాగా, వస్తువుల స్వభావాన్ని దూరంనుంచే తెలుసుకోగల్గే నిగూఢజ్ఞానాన్ని తమ తరువాతి తరాలకి వంశపారంపర్యంగా అందజేశారు.

"ఉరు వంశపు యుద్ధసేనాపతులు తమ రాజ్యాన్ని విస్తరింపజేసి, పశ్చిమాన్నున్న దేశద్రిమ్మరులను నిశ్శేషం చేసివేసి, పసిఫిక్ మహాసముద్ర తీరాన మట్టితోనూ రాతితోనూ పిరమిడులను నిర్మించారు. వారు నీగ్రోలను తూర్పుదిశగా మరింత వెనక్కి పారదోలి నైజర్, కాంగో నదీతీరాల పైన, నేడు సహారా ఎడారి వున్న ప్రాంతంవరకూ ఆనాడు విస్తరించి వుండిన మధ్యధరా సముద్రపు శిలామయతీరంపైన, బలిష్ఠములైన అనేక దుర్గాలను స్థాపించారు. అది సంగ్రామ, నిర్మాణకార్యాల శకం. జెమ్‌జె ప్రజల దేశాన్ని హమగాన్ అని పిలచేవారు.

"పట్నం చుట్టూ కొత్త ప్రాకారం నిర్మించారు. ఈ ప్రాకారానికి బంగారపు రేకు తాపరించిన నూరు దర్వాజాలుండేవి. సమస్త ప్రపంచ ప్రజలూ దురాశతోనూ జిజ్ఞాసతోనూ ప్రేరితులై ఆ మహాపట్నంలో పోగయేవారు. పట్టణపు బజార్లలో తిరిగేటట్టీ, పట్టణపు దుర్గప్రాకార ఛ్ఛాయల్లో తమ గుడారాలు వేసుకుని జీవించేటట్టీ లెక్కకుమించిన తెగలలో

ఒక కొత్త జాతి మనుషులు తటస్థపడ్డారు. వారి దేహచ్ఛాయ గాఢమైన ఆకుపసరు రంగు, సన్నగా చింతనిప్పుల్లాంటి కళ్ళు, చిలకముక్కుల్లా వంపు తేలిన ముక్కులు. వారు పట్నంలోకి ఎలా ప్రవేశించారో ఎవ్వరూ ఎరగరు. కాని ఒక కొత్త తరం పెరిగి పెద్దదయేసరికల్లా, శతసువర్ణ ద్వారా నగరం విజ్ఞానమూ, వాణిజ్యమూ అంతా కూడా స్వల్పసంఖ్యలో వున్న ఈ తెగ చేతుల్లోకి వెళ్ళిపోయింది. తాము ఆమ్ పుత్రులమని చెప్పుకునేవారు వీరు.

''ఆమ్ పుత్రులలోని ధీమంతులందరూ జెమ్‌జె ప్రజల పురాతన శాసనాల లిపిని చదివి తెలుసుకుని, వస్తువుల స్వభావాలను పసికట్టే విధానాన్ని అభ్యసించగల్గారు. భూగర్భ దేవాలయం ఒకదానిని నిర్మించి, అందులో నిద్రాణుడైన నీగ్రో శిరస్సును ప్రతిష్ఠించి, తమ చుట్టూ అనుయాయులను పోగుచేసుకుని, రోగులకు స్వస్థత కల్గించుతూ, ఎరుక చెబుతూ, తమ మతంలో నమ్మకం వున్నవారికి, చనిపోయినవారి ఛాయారూపాలను చూపిస్తూండేవారు.

''వీరు భాగ్యవంతులూ విద్యావంతులూ కావడంచేత, ఆ దేశపరిపాలనలో స్థానం సంపాదించుకున్నారు. అనేక తెగలను తమ పక్షం తిప్పుకొని, ఈ కొత్త మతం పేరుచెప్పి, పట్నంలోనేకాకుండా పట్నం పరిధులకు ఆవల వున్న సుదూరప్రాంతాలలో నివసిస్తూన్న ఈ తెగలవారు కూడా తిరుగుబాటు లేవనెత్తేటట్టుగా వారిని ప్రోత్సహించారు. ఈ తిరుగుబాటుతో ఉరు వంశం పతనమైపోయింది. ఆ మహాపట్టణాన్ని ఆమ్ పుత్రులు పరిపాలించసాగారు.

''ప్రథమ బృహత్తర భూకంపం సంభవించిన కాలమది. పర్వతాలలో అక్కడా అక్కడా పలుచోట్ల అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లి, ఆకాశాన్ని

భస్మంతో కప్పివేశాయి. మహాసముద్రం పొంగి భయంకరమైన ఉప్పెన లేచి, అట్లాంటిస్ ఖండంలో దక్షిణాన అనేక ప్రాంతాలను పొట్టబెట్టుకుంది. ఉత్తరాన సముద్రగర్భంనుంచి అనేక శిలాద్వీపాలు పైకిలేచి, ప్రధానభూభాగంతో కలిసిపోయి, యూరపియన్ మైదానప్రదేశంగా రూపొందింది.

''ఉరు వంశంచేతిలో ఓడిపోయి దేశంనుంచి వెళ్ళగొట్టబడిన అనేక తెగలవారికి ఆమ్ పుత్రులు తమ శక్తివంచనలేకుండా సంస్కృతిని ప్రదానం చేశారు. అంతేకాకుండా వారు యుద్ధానికి దిగేవారుకారు. యుద్ధం చేయడం బదులు వారు నౌకలు నిర్మించి, నౌకలను నిద్రాణుడైన నీగ్రో శిరస్సు విగ్రహంతో అలంకరించి, వాటిని సుగంధ ద్రవ్యాలతోనూ, వస్త్రాలతోనూ, బంగారంతోనూ, దంతంతోనూ నింపి, వర్తకులుగానూ వైద్యులుగానూ ప్రచ్ఛన్న వేషంలో వున్న స్వమతావలంబులకు ఈ నౌకలనిచ్చి దూరదేశాలకు పంపించారు. వీరు ఆ దేశాలకు వెళ్ళి వర్తకం చేసి, మంత్రతంత్రాల వల్ల అక్కడి రోగులనూ వికలాంగులనూ బాగుచేసేవారు. వారు వెళ్ళిన ప్రతి దేశంలోనూ తమ వర్తకపు సరుకుల రక్షణకోసం పిరమిడులను పోలిన పెద్దపెద్ద భవనాలు నిర్మించి, వాటిపైన నిద్రాణుడైన నీగ్రోశిరస్సు విగ్రహాన్ని నెలకొల్పేవారు. ఈ విధంగా వారు తమ మతాన్ని ప్రచారం చేశారు. కాని ఈ అన్యదేశాల ప్రజలు ఆగంతకుల రాకకు ఇష్టపడక ప్రతిఘటించిన పక్షంలో, కంచు కవచాలనూ, పొడుగాటి శిరస్త్రాణాలనూ ధరించి, పక్షి ఈకలతో అలంకరించిన డాలులు చేతబూనిన ఎరుపు రంగు జాతుల సైనికులు తండోపతండాలుగా నౌకలనుండి దిగి, ఆ దేశస్థులమీద పడి, వారిని భయవిహ్వలులను కావించేవారు.

''ఈ విధంగా పూర్వకాలపు జెమ్‌జె దేశం మళ్ళీ మరొకసారి తన రాజ్యాన్ని విస్తరించుకుని మరింత బలం సంపాదించుకుంది. అప్పటినుండి

ఆ దేశానికి అట్లాంటిస్ అనే పేరొచ్చింది. పశ్చిమాన ఎంతో దూరంగా వున్న ఎరుపు జాతివారి ప్రాంతంలో ప్తిత్లిగూవ అనే మరో రెండవ మహా పట్నాన్ని కూడా వారు నిర్మించారు. అట్లాంటియన్ వర్తకులు, తూర్పున నల్లజాతి ఇంకా రాజ్యమేలుతూన్న ఇండియా దేశంతో వర్తకం చేయడాని కని ఓడలమీద పయనమై అక్కడకు వెళ్తూండేవారు. వారు ఆసియా తూర్పుతీరానికి కూడా వెళ్ళారు. అక్కడున్న పసిమి ముఖాల రాక్షసులు వీరి ఓడలపై రాతిబండల వర్షం కురిపించేవారు.

"నిద్రాణ శిరస్సు మతంలోకి అందరినీ వీరు చేర్చుకునేవారు — రాజాధికారం చలాయించడానికి అదొక ప్రధాన ఆయుధంగా తయారైంది. కాని ఆ మతం మూలభావమూ, దాని అంతస్సారమూ మాత్రం అందరికీ తెలియనివ్వకుండా రహస్యంగానే వుంచేవారు. అట్లాంటియన్లు జెమ్‌జె జ్ఞానబీజాలను నాటి వృద్ధి చేశారు; నిజానికి సర్వజాతి వినాశానికీ దారి తీసిన మార్గారంభాన కాలుపెట్టడం మాత్రమే వారు చేసినదంతాసూ.

"వారు ఇలా చెప్పేవారు:

" 'వాస్తవ ప్రపంచం దృష్టికీ, స్పర్శకూ, శ్రవణానికీ అతీతం. అది రుచిరహితం, నిర్గంధనం. అది హేతుజ్ఞానంయొక్క చలనం. ఈ చలనంయొక్క ఆద్యంతమ ప్రయోజనాలు అనిర్వచనీయములు. హేతుజ్ఞానం శిల కంటెనూ కఠినమైనట్టీ, కాంతి కంటెనూ త్వరితమైనట్టీ పదార్థం. సర్వపదార్థమువలెనే హేతుజ్ఞానం కూడా శాంతి అన్వేషణలో నిద్రావస్థలో పడిపోతుంది; దాని చలనం మందగించిపోతుంది. ఈ ఫలితానికి, హేతుజ్ఞానం యొక్క ద్రవ్యరూప పునరావతార మని పేరు. ఈ జడస్థితియొక్క ఒకానొక ప్రత్యేకావస్థలో అగ్ని, వాయువు, అప్పు, పృథ్వి రూపాలలోకి హేతుజ్ఞానం మారిపోతుంది. ఈ నాల్గు భూతములనుంచే జ్ఞేయప్రపంచం రూపొం

దుతూంది. హేతుజ్ఞానంయొక్క తాత్కాలిక సంహననమే ద్రవ్యం. ఏ విధం గానైతే అగ్నిగోళం ఝంఝానిలయ వాయువుయొక్క కేంద్రకమే అవుతూందో, అదే విధంగా సంహనన హేతుజ్ఞాన గోళంయొక్క కేంద్రకమే ద్రవ్యం.

" 'స్ఫటికంలో హేతుజ్ఞానం సర్వసంపూర్ణమైన నిస్తబ్ధ స్థితిలో వుంటుంది. అంతర్గ్రహ ప్రదేశంలో అది సర్వసంపూర్ణమైన చలనంలో వుంటుంది. హేతుజ్ఞానంయొక్క ఈ రెండు స్థితుల మధ్యనూ వారధి మానవుడు. మానవుని ద్వారానే హేతుజ్ఞానం జ్ఞేయప్రపంచంలోకి ప్రవహించు తూంది. స్ఫటికంలోనుంచి ఉద్భవిస్తున్నాయి మానవుని పాదాలు. మాన వుని ఉదరం సూర్యుడు, మానవుని నేత్రాలు నక్షత్రాలు, ఇక మానవుని శిరస్సు — విశ్వజగత్తులోకి వ్యాపించుతూన్నట్టి విశాలమైన అంచులు గల్గిన తాంబాళం.

" 'మానవుడు ప్రపంచ పాలకుడు. చతుర్భూతములకూ, సర్వ చలనములకూ అతడు అధిపతి. బీటవారిన మృణ్మయపాత్ర నుంచి సూర్య కిరణం ఏ విధంగానైతే పైకి విజృంభించుతూందో, ఆ విధంగానే తన హేతుజ్ఞానంనుంచి వెడలుతూన్న శక్తిచేతనే మానవుడు ప్రపంచాన్ని పరి పాలిస్తున్నాడు.'

"ఇదీ అట్లాంటియన్లు బోధించినది. వీరి బోధనలను సామాన్య జనులు ఆకళింపు చేసుకోలేకపోయారు. కొందరు జంతుపూజ ప్రారంభిం చారు; కొందరు విగతజీవుల ఛాయలను ఆరాధించడం మొదలుపెట్టారు; మరికొందరు విగ్రహాలను, నిశీధినీ నిగూఢ మర్మరధ్వనులను, ఉరుములనూ మెరుపులనూ, చివరకు భూమిలోని బిలాలను సహితమూ పూజించడం ప్రారంభించారు. వివిధ రూపాలు ధరించిన ఈ మూఢనమ్మకాలను ప్రతి ఘటించడం దుస్సాధ్య మవడమేకాకుండా ప్రమాదభరితంగా కూడా పరిణమించింది.

"అందరికీ సులభంగానూ స్పష్టంగానూ అర్థమయేటట్టి ఒకేఒక మతం వుండడం ఎంత అవసరమో, అట్లాంటియన్లలో అగ్రకులజులైన పురోహితులు అప్పుడు తెలుసుకున్నారు. బ్రహ్మాండమైనట్టి సువర్ణ దేవాలయాలను నిర్మించి, సర్వప్రాణానికీ సృష్టికర్త, పరిపాలకుడూ అయినట్టీ, మరణించుతూ వునర్జీవించుతూ ఉగ్రమూర్తీ, ప్రాణదాతా అయినట్టీ సూర్యుని విగ్రహాన్ని వాటిలో ప్రతిష్ఠించారు.

"సూర్యమతం ప్రపంచమంతటా వ్యాపించింది. ఈ మతస్థులు మానవరక్తాన్ని ఎంతగానో బలిగొన్నారు. పశ్చిమాన నివసించుతూన్న ఎర్ర తెగలవారు తూలికలు ధరించిన సర్పరూపంలో సూర్యుని చిత్రించేవారు. దూరప్రాచ్యంలో సూర్యుని — మృతజీవుల ఛాయల రాజుని — పక్షిశిరస్సు కల్గిన మానవునిగా చిత్రీకరించేవారు.

"ప్రపంచానికంతటికీ గుండెకాయ అయిన శతసువర్ణద్వారా నగరంలో — ఆకాశాన విహరించుతూన్న మేఘాలను చుంబించేంతటి మహోన్నతమైన పిరమిడును నిర్మించి, దాని శిఖరాన నిద్రాణ శిరస్సును నెలకొల్పారు. పట్టణపు చౌకులో, మనిషిముఖాన్నీ సింహపాదాలనూ కల్గి రెక్కలున్న బంగారు వృషభ విగ్రహాన్ని పతిష్ఠించి, ఆ విగ్రహంకింద శాశ్వతాగ్నిహోత్రం వెలిగించారు.

"విషువత్తు కాలాల్లో తండోపతండాలుగా గుమికూడిన ప్రజలందరి సమక్షంలో, అండాకృతినున్న మృదంగాలు ధ్వనించుతూండగా, వివస్త్రలైన స్త్రీలు నృత్యం చేస్తూండగా, సూర్యపుత్రుడూ, మహాప్రభువూ అయిన ప్రధాన పురోహితుడు నగరంలో వున్న యువకులందరిలోనూ మిక్కిలి చక్కని యువకునిని ఆ విగ్రహానికి బలియిచ్చి, మృతకళేబరాన్ని వృషభోదరంకింద దహనం చేసేవాడు.

"ఆ మహాపట్నానికీ, ఆ రాజ్యానికంతకూ సూర్యపుత్రుడే సార్వభౌముడు. అతడు ఎన్నో ఆనకట్టలు కట్టించి, భూములకు నీటివసతి కల్పించాడు. ప్రజలకు అన్నవస్త్రాదులు పంచిపెట్టేవాడు, ప్రతివ్యక్తికీ ఎంత భూమి ఇవ్వాలో ఎన్ని పశువులనివ్వాలో నిర్ణయించేవాడు. అతడి ఆజ్ఞలను అమలు పరచేందుకు పెద్ద ఉద్యోగిబృందం ఒకటి పనిచేస్తూండేది. లోకంలో వున్న సమస్త వస్తువులూ సూర్యునికే చెందినవి కావడంచేత, 'ఇది నాది' అని దేనినీ ఎవ్వడూ అనలేకపోయేవాడు. కష్టించి పనిచేయడాన్ని ఒక పవిత్ర విధిగా ఎంచేవారు. సోమరిపోతులకు మరణశిక్షే. వసంతకాలంలో సూర్యపుత్రుడే స్వయంగా పొలంలోకి వెళ్లి, తన వృషభాలను నాగటికి పూసి, ఏరువాక సాగించి, మొదటి మొక్కజొన్న విత్తు నాటేవాడు.

"దేవాలయాల భాండారాలన్నీ ధాన్యాలతోనూ, వస్త్రాలతోనూ, సుగంధద్రవ్యాలతోనూ పుష్కలంగా నిండి వుండేవి. తన దంతాలతో సూర్యబింబాన్ని నోట కరిచి పట్టుకున్న సర్పచిహ్నం చిత్రించి వున్న ఎర్రని తెరచాపలు కట్టిన అట్లాంటియన్ నావలు ప్రపంచ సముద్రాలనూ నదులనూ చుట్టివస్తూండేవి. సర్వప్రపంచంలోనూ శాశ్వతశాంతి నెలకొంది. కత్తి కటార్లంటే ఏమిటో మానవులు మరచిపోసాగారు.

"ఇలా వుంటూండగా, తూర్పుదిశనుంచి వచ్చిన కారుమబ్బు ఒకటి అట్లాంటిస్ ఖండాన్ని ముసురుకుంది.

"ఆసియా తూర్పు పీఠభూములలో, వాలుకళ్ళూ పసుప్పచ్చని ముఖాలూ కల్గినట్టి శక్తివంతమైన ఉచ్‌కుర్ తెగ నివసించుతూండేది. ఆ తెగను ఒక స్త్రీ పరిపాలించుతూండేది. ఆమె పేరు సు-హూతమ్-లు, అనగా, 'చంద్రునితో సంభాషించే స్త్రీ'. ఆ స్త్రీని ఒక దేవత పూనింది.

"సు-హూతమ్-లు ఉచ్‌కుర్లతో ఇలా అంది:

" 'కొండ కనుమల్లో సూర్యుడు అస్తమించే ఒకకొత్త దేశానికి నేను మిమ్మల్ని తీసుకువెళ్తాను. నక్షత్రాలకంటెనూ అసంఖ్యాకములైన గొర్రెల మందలు అక్కడ పచ్చిక మేస్తూంటాయి, ఆ దేశంలో అశ్వక్షీరములు నదులై ప్రవహించుతూంటాయి. అక్కడి గుడారాలు ఎంతటి విశాలమైనవంటే, ఒక్కొక్క గుడారంలో ఏకంగా ఒక మంద ఒంటెలు ఇమిడిపోతాయన్నమాట. మీ గుర్రాలింకా ఆ దేశపు గడ్డపై అడుగిడలేదు, మీ శిరస్త్రాణాలింకా ఆ నదీజలాలలో తడవలేదు.'

"ఉచ్‌కుర్లు పుట్టలు పుట్టలుగా పీఠభూములనుంచి దిగి, బహుళ సంఖ్యాకులూ దేశద్రిమ్మరులూ అయిన పసుప్పచ్చ తెగలవారి పైబడి, వారిని జయించి, వారిపై సైనిక నాయకత్వం వహించి, వారితో: 'సుహుతమ్-లు వర్ణించిన సూర్యభూమికి మేంవెళ్తున్నాం, మీరు కూడా మాతో రండి' అన్నారు.

"నక్షత్ర ఆరాధకులైన దేశద్రిమ్మరులు నిర్భయులైన స్వాప్నికులు. వారు తమ మకాములను ఎత్తివేసి, తమ మందలను పడమటి దిశగా తోలుకొని వెళ్ళారు. వారి పురోగమనం మిక్కిలి మెల్లగా సాగి, కొన్ని సంవత్సరాలు పట్టింది. వీరికి నాయకత్వం వహించుతూ, వీరి శ్రేణులకు అగ్రస్థానమందు నిలబడిన ఉచ్‌కుర్ రౌతులు దాడి జరుపుతూ, యుద్ధాలు చేస్తూ, తమ దారిలో కనబడిన పట్టణాలన్నిటినీ నాశనం చేసేశారు. ఈ శ్రేణుల వెనుక పసుల మందలూ, స్త్రీలూ పిల్లలూ వున్న బళ్ళూ నడిచాయి. ఈ దేశద్రిమ్మరులు హిందూదేశాన్ని ఒక పక్కగా వదలిపెట్టేసి, యూరప్ మైదానపు తూర్పుభాగంలోకి ప్రళయ ప్రవాహంలా చొరబడ్డారు.

"అనేకమంది ఆ ప్రాంతపు సరస్సుల తీరాన స్థిరవాసరాలు ఏర్పరచుకుని అక్కడే వుండిపోయారు. అయినప్పటికీ వారిలో బలవంతులు అక్కడ

ఆగిపోడానికి ఇష్టపడక, పశ్చిమదిశగా పురోగమించారు. మధ్యధరా సముద్ర తీరాన వారికి తటస్థపడిన అంట్లాంటియన్ల మొట్టమొదటి వలసను వీరు కొల్లగొట్టి, ఖైదీలుగా పట్టుకొన్న అట్లాంటియన్లనుండి పూర్వభూమి ఎక్కడ వుందో తెలుసుకున్నారు. ఈలోపుగా సు-హుతమ్-లు మరణించింది. ఆమె కపాళ చర్మాన్ని ఒక పొడుగాటి కోలకు తగిలించి, దీనిని తమ పతాకగా స్వీకరించి, సముద్రతీరం వెంబడే యూరవ్ ఆవలి చివరవరకూ పురోగమించి, అక్కడున్న పర్వతశిఖరంనుండి వాగ్దానభూమిని వీక్షించారు. ఉచ్‌కుర్లు తమ పీఠభూములను వదలిపెట్టి అప్పటికప్పుడే నూరేళ్లు గడచిపోయాయి.

''ఈ సంచారకులు అడవులలో చెట్లను కొట్టేసి, వాటితోబల్ల కట్లు కట్టి, వెచ్చని ఉప్పునీటి నదిని దాటి, వాగ్దానభూమి అట్లాంటిస్‌పై అడుగిడి, పవిత్రనగరమైన తూలె పట్నంపై దాడిచేశారు. కాని ఎత్తుగా వున్న ఆ నగర ప్రాకారాలను ఎక్కేసరికి, నగరంలో మోగుతూన్న గంటలు ఎంత మధురంగా వినబడ్డాయంటే, ఇక ఆ పసుపురంగు ముఖాలవారు నగరాన్ని ధ్వంసం చేదామనే ఉద్దేశాన్ని విరమించుకుని, ఆ నగరవాసులపైన గానీ ఆ నగర దేవాలయాలపైనగానీ వేలువేసైనా ముట్టలేదు. వారు కేవలమూ తమ నిల్వలను భర్తీ చేసుకుని, తమకు అవసరమైన వస్త్రాలను తీసుకుని, నైరుతిదిక్కుగా వెళ్లిపోయారు. వారు వెళ్లిపోతూన్నప్పుడు వారి పశువుల మందలూ, బళ్ళూ మార్గంపై రేపిన ధూళికి పట్టపగలే చీకటి కమ్మేసింది.

''చిట్టచివరకి ఈ సంచారకుల పురోగమనాన్ని ఎరుపు జాతులు అడ్డుకున్నాయి. స్ఫురద్రూపులైన అట్లాంటియన్లు బంగారపు దుస్తులు ధరించి, రంగురంగుల పక్షి ఈకలతో అలంకరించుకుని ఎంతో అందంగా

అవుపడ్డారు. ఎరుపు తెగలవారిని ఆశ్వికులు చంపేశారు, కడమవారిని చెదరగొట్టేశారు. ఎప్పుడైతే పసుప్పచ్చ సంచారకులు అట్లాంటియన్ల రక్తాన్ని కళ్ల చూచారో ఇక వారిలో దయదాక్షిణ్యాలు మాయమై పోయాయి.

''శతసువర్ణద్వారా నగరంనుంచి పశ్చిమాన్నున్న ఎరుపు తెగలవారికీ, దక్షిణాన్నున్న నీగ్రోలకూ, తూర్పునున్న ఆమ్ తెగలవారికీ, ఉత్తరాన్నున్న సైక్లోపియన్లకూ కబురువెళ్లింది. నరమేధ యాగాలు జరిగాయి, దేవాలయాల గోపురాలపై అహోరాత్రాలు అగ్నిహోత్రాలు వెలిగాయి. ఈ నరబలులను చూడడానికైతేనేమి, ఈ ఉన్మాదపూరితములైన నృత్యతాండవాలలో పాల్గొనేందుకైతేనేమి నగరవాసులు చీమలపుట్టల్లా పోగయారు. మద్యపానంలో మునిగిపోయి డబ్బంతా దుబారా చేసుకున్నారు జనమంతా.

''పురోహితులూ, మహావిద్వాంసులూ రానున్న కష్టసమయాన్ని ఎదుర్కొందుకు ఆయత్తపడ్డారు. తమ మహత్తర విజ్ఞాన గ్రంథాలను రక్షించుకోడానికని వాటిని పర్వతగుహల్లోకి తరలించుకుపోయి, వాటినక్కడ పాతిపెట్టేశారు.

''యుద్ధం మొదలైంది. కాని యుద్ధం పర్యవసానం అసలు ముందుగానే తేలిపోయింది. భోగభాగ్యాలతో సుఖజీవనం మరగిన అట్లాంటియన్లు తమ ధనాన్ని రక్షించుకుందుకు మనస్ఫూర్తిగా ప్రయత్నించనేలేదు. తత్భిన్నంగా దేశద్రిమ్మరులు ప్రాక్తన దురాశతోనూ, విధాత తమకు వాగ్దానం చేసిన సుఖజీవనంపై సంపూర్ణ విశ్వాసంతోనూ యుద్ధంచేశారు. అయినప్పటికీ రక్తపాత యుద్ధం బహుకాలమే సాగింది. దేశద్రిమ్మరులు నగరాన్నీ రాజ్యాన్నీ కొల్లపెట్టి ధ్వంసం చేశారు. ఆకలి, రోగమూ దేశంలో విలయ తాండవం చేశాయి. దేశమంతటా విజృంభించి స్వైరవిహారం చేశాయి శత్రు

సైన్యాలు. శతసువర్ణద్వారా నగరాన్ని శత్రువులు ముట్టడించి, నగర ప్రాకారాలను పడగొట్టి నగరాన్ని తమ వశం చేసుకున్నాయి. సూర్యపుత్రుడు పిరమిడ్ పైకెక్కి శిఖరంనుంచి కిందకు దుమికి ఆత్మహత్య చేసుకున్నాడు. దేవాలయ గోపురాల్లో మండుతూన్న అగ్నిని ఆర్పేశారు. ఇంకా బతికున్న పట్టెడుమంది విద్వాంసులూ కొండగుహల్లోకి పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు. నాగరికతకు పతనావస్థ ప్రాప్తించింది..."

"ఇకప్పుడు పట్నంలో పాడుపడిన మహాసౌధాల నడుమ వున్న చౌకులన్నిటిలోనూ గడ్డిగాదం మొలిచి గొర్రెల మందలు మేసే పచ్చికబయళ్లుగా మారిపోయాయి. స్తెప్ మైదానాల్లో తమ కళ్లకు కనబడిన ఎండమావులను పోలినట్లుగా వినీలవర్ణపు భూమితోనూ సువర్ణచ్ఛాయల ఆకాశంతోనూ విరాజిల్లుతూన్న వాగ్దాన భూమి గురించి పసిమి తెగల గొర్రెల కాపరులు వ్యాకులచిత్తులై గానం చేయదొడగారు.

"సంచారకులు 'ఇక ఇక్కడనుంచి మనం ఎక్కడకెళ్తాం?' అని తమ నాయకులను ప్రశ్నించారు. అందుకు సమాధానంగా: 'వాగ్దాన భూమికి మిమ్మల్ని తీసుకువచ్చామే. ఇక ఇక్కడ మీరు స్థిరపడిపోయి, హాయిగా ప్రశాంతంగా జీవించండి' అన్నారు. కాని సంచారక తెగలలో అనేక తెగలు అందుకు ఇష్టపడక, పశ్చిమదిశగా వెళ్లి, తూలికామయ సర్వదేశం అనే ప్రాంతం చేరుకున్నాయి. అక్కడ వారు ప్తిత్లిగూవ చక్రవర్తి చేతిలో ఓడిపోయారు. మరికొన్ని సంచారక తెగలు భూమధ్యరేఖా ప్రదేశం చేరుకున్నాయి. కాని అక్కడున్న నీగ్రోలతో పోరాడుతూనూ, ఏనుగుల మందల బారినుండి తప్పించుకోలేకనూ, చిత్తడి జ్వరాలకు ఆహుతి అయిపోతూనూ అతీ గతీ లేకుండా నాశనమైపోయాయి.

''ఉచ్‌కుర్ పసిమి తెగల నాయకులు తమలోకల్లా ధీమంతుడైన వ్యక్తిని, తాము నూతనంగా జయించిన దేశానికి రాజుగా ఎన్నుకున్నారు. అతని పేరు తుబాల్. ఇతడు శిథిలమైపోయిన నగరప్రాకారాలను తిరిగి నిర్మించాడు. ఇళ్ళు కట్టించాడు. గడ్డిగాదం పెరిగిపోయిన ఉద్యానవనాలను బాగుచేయించాడు. బీడుపడిపోయిన భూములను దున్నించాడు. ఇంతేకాకుండా ఎన్నో ఉత్తమములైనట్టీ సులభగ్రాహ్యములైనట్టీ పద్ధతులను ప్రకటించాడు. పర్వతగుహల్లోకి పారిపోయిన పురోహితులనూ విద్వాంసులనూ తిరిగి రప్పించి, వారితో 'నా నయన కర్ణ ద్వారాలు జ్ఞానాన్ని ఆహ్వానించడానికై ఎల్లప్పుడూ తెరచుకునే వుంటాయి' అన్నాడు. వారినతడు తన సలహాదారులుగా నియమించాడు. తమ దేవాలయాలను తెరచుకుందుకు అనుమతించాడు. తాను శాంతిని వాంఛించుతున్నానని తెలుపుతూ అన్ని దేశాలకూ దూతలను పంపించాడు.

''ఈ విధంగా అట్లాంటియన్ నాగరికతయొక్క అత్యున్నతమైన మూడో దశ ప్రారంభమైంది. వివిధ — నలుపు, ఎరుపు, పసరు, తెలుపు — వర్ణాల అట్లాంటియన్ తెగల రక్తం, స్వాప్నికులూ ఉద్రిక్తులూ అయిన ఆసియా సంచారకుల రక్తంతో — నక్షత్రారాధకులైన, ఆవేశితి సు-హుతమ్-లు సంతతివారి రక్తంతో — మిళితమైంది.

''పరాయి తెగలతో సంచారకులు పూర్తిగా సమ్మిశ్రమమైపోయారు. వారి గుడారాలూ, పసులమందలూ, ఆటవిక ఆచారాలూ అన్నీ కాలగర్భంలో కలిసిపోయి, కేవలం పాటలూ గాథలూ రూపంలో మాత్రమే మిగిలాయి. బలమైన శరీరాలూ, నల్లని జుట్లూ, గాఢమైన పసిమివర్ణపు చర్మమూ గల ఒక కొత్త తెగ ఉద్భవించింది. ఆశ్విక యుద్ధనేతల సంతతివారైన ఉచ్‌కుర్లు ప్రభువర్గంగా ఏర్పడ్డారు. విజ్ఞానమూ, కళలూ, భోగవిలాసాలూ అంటే వీరికెంతో ప్రీతి. వీరు తమ నగరం చుట్టూ అష్టాస్రమ బురుజు

లుగల నూతన ప్రాకారం నిర్మించారు. బ్రహ్మాండమైన పిరమిడుకున్న ఇరవై వొక్క సోపానానికీ బంగారం తాపరం చేయించారు. నీటికాల్వలు తవ్వించారు. శిల్పశాస్త్రరంగంలో తొలిసారిగా వీరు స్తంభాలు నిర్మించారు.

"వారి రాజ్యంనుంచి చీలిపోయిన వివిధ దేశాలనూ, పట్టణాలనూ బహుకాలం సాగిన యుద్ధాల్లో వారు తిరిగి జయించుకున్నారు. ఉత్తరాన సైక్లాప్స్ తెగలతో — ఇతర జాతులతో మిళితంకాకుండా వుండిపోయిన జెమ్‌జె తెగల వంశస్థులతో — యుద్ధం చేశారు. మహావిజేత అయిన రామా సుదూరాన్నున్న ఇండియాకి కూడా వెళ్ళాడు. ఆర్య మహాజాతికి చెందిన ఇటీవలి తెగలను అతడు 'రా' మహారాజ్యంగా సంఘటిత పరిచాడు. ఈ విధంగా అట్లాంటిస్ సరిహద్దులు ఇటువైపు, వెనుక ఒకనాడు అట్లాంటియన్ నౌకలపై పసిమి ముఖాలుగల రాక్షస తెగలు రాతిబండలు విసరిన పసిఫిక్ మహాసముద్రపు ఆసియా తీరం వరకూ, అటువైపు తూలికామయ సర్వదేశ ప్రాంతాలవరకూ ఇదివరకెన్నడూ కనివిని ఎరుగనంతగా విస్తృతమై దృఢతరమయాయి.

"నిరంతరాన్వేషణా పిపాసులైన విజేతల మనస్సు, జ్ఞాన సముపార్జనకై కాంక్షించుతూండేది. జెమ్‌జెల పురాతన గ్రంథాలనూ, ఆమ్ పుత్రుల వైజ్ఞానిక కృతులనూ వారు అధ్యయనం చేశారు. ఈ విధంగా ఒక మహాయుగం గడచింది. మరొక మహాయుగం ఆరంభమైంది. 'నిద్రితుని పప్పైరస్ సప్తపతుల' అవశేషాలు పర్వతగుహల్లో వారికి లభ్యమయాయి. ఈ ఆవిష్కరణలు సత్వర విజ్ఞానాభివృద్ధికి దారితీశాయి. ఆమ్ పుత్రులలో సృజనాత్మకదీక్ష లోపించింది. జెమ్‌జెలలో నిశిత సూక్ష్ములైన హేతువాదం మృగ్యమైంది. ఈ రెండు గుణాలూ జిజ్ఞాసాపరులై ఉద్రిక్తులైన ఉచ్‌కుర్లలో పరాకాష్ఠ నందుకుంది.

"ఈ నూతన విజ్ఞానానికి మౌలికములైన భావాలు ఇలా వుండేవి:

" 'సర్వశక్తులలోనూ శక్తివంతమైన శక్తి, కేవల హేతుపదార్ధం మానవుని సొత్తు. కాని అది అతనిలో నిద్రాణంగా వుంది. నేర్పరైన విలు కాని చేతి విల్లునుంచి వెడలిన బాణం ఎలాగైతే దాని లక్ష్యాన్ని చేరుకుం టుందో, అలాగే విజ్ఞానమనే చేయి, సంకల్పమనే విల్లునుంచి, నిద్రాణమైన హేతుపదార్థాన్ని వెలువరింపజేస్తుంది. లక్ష్యాన్ని కలిగిన జ్ఞానంయొక్క శక్తి అపారం.'

"జ్ఞానసాధన శాస్త్రం రెండు భాగాలు: శరీరము, సంకల్పము, మనస్సు వీటి అభివృద్ధిని గురించి తెలిపే ప్రాథమిక భాగమూ; ప్రకృతి, ప్రపంచం, ఏసాంకేతికాల వినియుక్తం వల్లనైతే లక్ష్యసహితమైన విజ్ఞాన పదార్థం ప్రకృతిని నియంత్రించగలిగిందో అట్టి సాంకేతికములు — వీటిని గురించిన ప్రాతిపదిక భాగమూ.

"ఇంతవరకూ ప్రపంచంలో అపూర్వమైన విజ్ఞాన, సాంస్కృతికా భ్యుదయాలయొక్క ఈ సమ్మేళన, జలప్రళయాత్పూర్వపు 450 వ సం వత్సరంనుంచి 300 సంవత్సరం వరకూ అనగా అట్లాంటిస్ ఖండం అంత ర్ధానానికి ముందు, ఒక శతాబ్దిపాటు సాగింది.

"ప్రపంచమంతటా శాంతి రాజ్యం చేసింది. విజ్ఞానంవల్ల ప్రాదు ర్భవించిన భూతల శక్తులు మానవునికి బహు ఉదారంగా వినియోగపడ్డాయి. తోటలూ పొలాలూ సమృద్ధిగా పండాయి. పసులమందలు వృద్ధిపొందాయి. కాయకష్టం బహుసునాయాస మనిపించింది. తమ పురాతన ఆచారాలనూ పండుగలనూ ప్రజలు జ్ఞప్తికి తెచ్చుకున్నారు. సుఖజీవనానికీ, ప్రేమకూ, ప్రజననానికీ, జీవిత సౌఖ్యాలను ఆనందించడానికీ వారికి ఎట్టి అడ్డంకులూ

తటస్థించలేదు. ఈ శకానికి ఇతిహాసకారులు 'స్వర్ణ' యుగం అని పేరు పెట్టారు.

"చతుర్భూతాలూ ఒకే దేహంలో ఇమిడి వున్నట్టుగా మలచిన స్ఫింక్స్ విగ్రహాన్ని — నిద్రాణమై వున్న హేతుజ్ఞానం నిగూఢ చిహ్నాన్ని — భూతలం తూర్పు సరిహద్దున నెలకొల్పారు. అటుతరువాత, ప్రపంచం లోని సప్త మహాద్భుతాలను — భూగర్భంలోని సారంగ వ్యూహం, మధ్యధరా సముద్రంలోని బ్రహ్మాండ విగ్రహం, జిబ్రాల్టర్‌కు పశ్చిమాన స్తంభాలు, పాసైడన్‌లో నక్షత్రవేధి గోపురం, ఆసీనుడై వున్న తుబాల్ శిలా విగ్రహం, పసిఫిక్ మహాసముద్రంలో ఒకానొక ద్వీపనివాసులు లెముత్ స్థాపించిన నగరం — మానవుడు నిర్మించాడు.

"ఉష్ణమండలపు చిత్తడులలోకి తరిమివేయబడిన నల్లతెగల ప్రాంతాలకు కూడా ఈ విజ్ఞాన కిరణాలు వ్యాపించాయి. నాగరికత చెందిన నీగ్రోలు మధ్య ఆఫ్రికాలో బ్రహ్మాండమైన నగరాలను నిర్మించారు.

"జెమ్‌జె తెగలు నాటిన జ్ఞానబీజం అద్భుత ఫలితాలను ఉద్భవింపజేసింది. కాని మూలపాపంయొక్క వేళ్ళు నాగరికతలోనే వున్నాయన్న సంగతి బుద్ధిమంతులలో అగ్రగణ్యులు ఆనాటికే గ్రహించారు. విజ్ఞానాన్ని ఇంత కంటెనూ ఇక అభివృద్ధి చేసినట్టయితే, అది వినాశానికే దారితీస్తుంది. పాము తన తోకనే కాటువేసినట్టు, మానవజాతి తనను తానే సంహరించుకుంటుంది.

"మూలపాపం ఎందులో వుందంటే, అస్తిత్వాన్ని — భూతలంయొక్క, దానిపై జీవించుతూన్న సమస్త ప్రాణులయొక్క జీవాన్ని — మానవ హేతుజ్ఞానం అవగతం చేసుకున్నట్టుగా భావించడంలోనే వుంది. ప్రపంచాన్ని అధ్యయనం చేయడంలో మానవుడు తనను మాత్రమే అధ్యయనం చేసుకు

న్నాడు. హేతుజ్ఞానం ఒక్కటే అతనికి వాస్తవంగా కనబడింది. ఈ ప్రపంచం అతడు కల్పించుకున్నదే, కేవలం అతని స్వప్నమే. అస్తిత్వంయొక్క ఈ విధమైన అవగాహన — మానవులందరిలోనూ తానొక్కడే అస్తిత్వాన్ని కలిగివున్నాడనీ, కడమ ప్రపంచమంతా తన ఊహ కల్పించిన మిథ్య తప్ప వేరేమీ కాదనే భావనకే — ప్రతి మనిషిలోనూ తప్పని సరిగా దారి తీసి తీరుతుంది. తన ఏకైక వ్యక్తిత్వానికై ప్రతి వ్యక్తీ సలిపే పోరాటం — అందరికూ వ్యతిరేకంగా అందరూ సలిపే పోరాటాన్ని కలగన్న మనిషికే వ్యతిరేకంగా అడ్డం తిరిగిన తన కలనే పోలినట్టి మానవ జాతి నిర్మూలన — దీని వెనువెంట సంభవించడం కేవలం తర్కబద్ధమే. అస్తిత్వం పట్ల — అదొక పీడకల, గుండెలమీద కుంపటి అయినట్లుగా, — తిరస్కారమూ, ఏహ్యమూ, దానిని అనుసరించడం సహజమే.

''ఇదీ జెమ్‌జె విజ్ఞానం చేసిన అసలు దోషం.

''విజ్ఞానం రెండుగా చీలిపోయింది. పాపబీజాన్ని తొలగించడం ఎలాగో కొందరు తెలుసుకోలేక, అస్తిత్వాన్ని ప్రాదుర్భవింపజేసే శక్తి కేవలమూ దుష్టం అన్నారు. తమ విజ్ఞానం నలుపు తెగలవారినుంచి ఉద్భవించిన కారణాన తాము కృష్ణ పంథీయులమని వీరు చెప్పుకొన్నారు.

''ఇతరులు, ప్రకృతికి బాహ్యంగానే దుష్టం వున్నదనీ, ప్రకృతి సిద్ధమైనదానికి పెడమార్గం అవలంబించడమే దుష్టము అనీ, దుష్టాన్ని ఓడించేందుకుగాను ప్రతిఘటనాశీలమైన శక్తి కోసం అన్వేషించసాగారు.

''వీరు ఇలా అన్నారు: 'సూర్యకిరణం భూమిపై పడి, నశించి, భూమినుండి ఉద్భవించే ఫలముల రూపంగా పునః జన్మిస్తూంది. ఇది జీవంయొక్క మూలసూత్రం.' హేతుజ్ఞానాన్ని వీరు సూర్యకిరణంతో పోల్చి చెప్పారు. అవరోహణం, త్యాగరూపంలో మృత్యువు, శరీరరూపంలో పునరు

త్థానం — ఇదీ దాని చలనం. హేతుజ్ఞానం నిస్సంగత్వమై వేరుపడిపోవడమే మూలపాపం. ఈ మూలపాపాన్ని శారీరక పాపంచే నశింపజేయవచ్చు. శరీర మార్గం ద్వారా హేతుజ్ఞానం కిందపడి, మృత్యురూపమైన సజీవద్వారాలను అధిగమించాలి. స్త్రీ పురుష లైంగిక భేదమే ఈ ద్వారాలు. లైంగిక వాంఛ వలన, మారుని వలన, హేతుజ్ఞానం నశింపజేయబడుతూంది.

"ఈ సిద్ధాంతాన్ని ప్రవచించినవారు, మారుని చిహ్నములైన ధవళాంబర పరివేష్టనములు తాము ధరించడం కారణంగా, తాము శ్వేత పంథీయులమని పేరుపెట్టుకున్నారు. వారు వసంతోత్సవాన్ని ప్రకటించి, పురాతన సూర్య దేవాలయపు చక్కని తోటలో, పాపమును గురించి రచించబడిన నిగూఢ నాటకాన్ని ప్రదర్శించారు. యువ బ్రహ్మచారి ఒకడు హేతుజ్ఞాన పాత్ర ధరించాడు; కామ పదార్థ ద్వారం పాత్రను ఒక స్త్రీ ధరించింది; సర్పవేషం మారుని పాత్రకు చిహ్నమైంది. నాటకం చూడ్డానికి దూర దేశాలనుండి సహితం ప్రజ గుంపులు గుంపులుగా వచ్చిపడ్డారు.

"వైజ్ఞానిక పంథాలు రెండింటికీ నడుమనున్న అగాధం బాగా పెద్దదే. ఫలితంగా సంఘర్షణ సంభవించింది. ఆ కాలంలో మహాద్భుతమైన ఆవిష్కరణ ఒకటి తటస్థించింది. చెట్ల విత్తులలో నిద్రాణంగా వున్న జీవశక్తిని మేల్కొల్పి విడుదల చేయడం ఎలాగో మానవుడు తెలుసుకున్నాడు. విదారణ పూరితమై హిమజ్వలితమైన భౌతిక శక్తి విడుదల కాబడిన తక్షణమే ప్రదేశంలోకి ఎగిరిపోతుంది. కృష్ణపంథీయులు దీనిని విధ్వంసన ఆయుధంగా ఉపయోగించారు. తమ శత్రువులను భయవిహ్వాలులను కావించేటట్టి బ్రహ్మాండములైన వాయునౌకలను వీరు నిర్మించారు. ఆటవిక తెగలవారు ఈ రెక్కల రాక్షసులను దేవతలుగా పూజించుతూండేవారు.

"ప్రపంచం ఆఖరి గడియలు ఇక సమీపించనున్నాయని శ్వేత పంథీయులు గ్రహించుకుని, అందుకు సన్నద్ధులు కాసాగారు. సామాన్య ప్రజలం దరిలోనూ నిష్కళంకులూ బలాఢ్యులూ అయిన వారిని ఎన్నికచేసి, ప్రాక్తన మానవులుగా జీవించేందుకు వీరికి అవకాశం వుండేందుకై తూర్పు ఉత్తర దిశలనున్న పర్వతప్రాంతపు పచ్చికబయళ్లను వీరికి ఇచ్చి, వీరినక్కడకు పంపించేశారు.

"శ్వేత పంథీయులు భయపడినట్టే సంభవించింది. స్వర్ణయుగ పతనావస్థకు నాంది ప్రారంభమైంది; అట్లాంటిస్ నగరాలలో ఆత్మ సంతృప్తి భావం ప్రవేశించింది. విశృంఖల ఊహాగానం, వక్రబుద్ధి, దుర్నీతి పట్టపగ్గాలు లేకుండా విచ్చలవిడిగా విహరించాయి. మానవుడు తన అధీనంలో వుంచుకున్న శక్తులే అతనిపై తిరుగబడ్డాయి. అనివార్యమైన మహాప్రళయం తమ కట్టెదుట నిలబడబోతూందని తెలుసుకుని, కుపిత మనస్కులై, క్రోధచిత్తులై, నిర్దయులై ప్రవర్తించసాగారు ప్రజలు.

"ఇకప్పుడు ప్రపంచం కడపటి దినాలు ఆసన్నమయాయి. ఆ రోజుల్లో మహోపద్రవం ఒకటి సంభవించింది: శత సువర్ణద్వారా నగరం మధ్య ప్రదేశంలో భూకంపం తటస్థించింది: ఒక పెద్ద ప్రాంతం మహాసముద్రంలో మునిగిపోయింది. దానితో అట్లాంటిక్ మహాసముద్రం తూలికామయ సర్వదేశంలోనికి చొచ్చుకొనొచ్చి, ఆ దేశాన్ని రెండు ముక్కలకింద చీల్చి వేసింది.

"అంతవరకూ మానవుల చెప్పుచేతల్లో వుండిన పృథ్వి, అగ్ని భూతాలకు తమ మంత్రోచ్చాటన ఫలితంగానే విశృంఖలత లభించిందని శ్వేత పంథీయులను కృష్ణ పంథీయులు నిందించారు. ప్రజలు ఆగ్రహావేశులయారు. కృష్ణ పంథీయులు ఈ అదను చూసుకుని ప్రజలను ఉసికొల్పేసరికి, ప్రజలు

రెచ్చిపోయి, తెల్లపాగాలు ధరించిన వారిలో సగం మందిని పైగానే ఊచ కోత కోసేశారు. ప్రాణాలతో బయటపడ్డవారు అట్లాంటియస్ దేశంనుంచి పారిపోయారు.

"కృష్ణ పంథీయులలో ధనికవర్గంవారు — వీరికి మగత్సీత్సులు అని పేరు — అనగా పాషాణ హృదయులని అర్థం — శతసువర్ణద్వారా నగరంలోని పరిపాలనాధికారాన్ని కైవసం చేసుకున్నారు. అప్పుడు వారిలా అన్నారు:

" 'హేతుజ్ఞానంయొక్క దుష్టసంతతే మానవాళి, అందుచేత మానవాళిని మనం సంహారం చేయాల్సిందే.'

"మృత్యు దృశ్యాన్ని కళ్ళారా చూసి తనవితీరా ఆనందించేందుకని, వారు ఉత్సవాలూ క్రీడలూ ప్రకటించారు, ప్రభుత్వ ఖజానానీ అంగళ్లనీ తెరచిపెట్టి, ఎవరికి కావలసినదానిని వారు తీసుకోవచ్చు అన్నారు, తెల్లజాతి యువతులను ఉత్తరాదినుంచి తీసుకొచ్చి ముక్కుడిమూకలకు అప్పగించేశారు, దుష్ట సుఖాలను వాంఛించుతూన్న వారందరకీ దేవాలయాల ద్వారాలను బాహాటంగా తెరచిపెట్టారు, నగరంలోని ఔత్యానాలను మద్యంతో నింపేశారు, చౌకులనిండా మాంస భక్ష్యాలను రాసులుగా పోసేశారు. ప్రజలలో ఉన్మాదం పెచ్చరిల్లింది. అది సరిగ్గా ద్రాక్ష పంట కాలం.

"రాత్రిపూట, ఉన్మత్తులై వున్న ప్రజ మృష్టాన్నంతోనూ మద్యంతోనూ కడుపులు నింపుకొని, స్త్రీలోలురై, బోగిమంటల వెలుగులో నృత్యం చేస్తూ వాళ్ల మైమరచి వున్న సమయంలో మగత్సీత్సుల్లు నగరంలోని చౌకుల్లోకి వచ్చారు. సూది దువ్వెనపళ్లన్న పొడుగాటి శిరస్త్రాణాలనూ కవచపు పటకాలను ధరించారే కాని, వారు డాలులు మాత్రం చేత పట్టుకోలేదు. తమ కుడి చేతిలో వున్న కంచు బొంబులను జనంపై విసరే సరికి,

అవి పేలి, శీతల విధ్వంసకర జ్వాలలు ప్రజ్వరిల్లాయి. తమ ఎడమ చేతిలో వున్న ఖడ్గాలతో, తప్పతాగి ఉన్మత్తులై వున్న ఆ జనాన్ని నరికిపారేశారు.

"రక్తసిక్తమై సాగుతూన్న ఈ మారణోత్సవానికి అవాంతరం కల్పిం చుతూ ఘోరమైన భూకంపం సంభవించింది. తుబాల్ శిలావిగ్రహం కింద పడిపోయి ముక్కముక్కలైపోయింది, దుర్గప్రాకారాలు శిథిలమైపోయాయి. ఆనకట్ట స్తంభాలు కూలిపోయాయి, నేల బీటలువారి, నెరియల్లోనుంచి మంటలు బయల్దేరి ఆకాశమంతా బూడిదెతో కమ్ముకుపోయింది.

"మరునాటి ఉదయం, నగర శిథిలాలపైనా, నిప్పులు రగుల్తూన్న ఉద్యానవనాలపైనా, పీకలమొయ్యా తిని బతుకుతో అలసటచెంది పిచ్చెత్తి పోయిన ప్రజలపైనా, కుప్పతెప్పలుగా పడున్న శవాలపైనా, ఎర్రని బొగ్గులా మండుతూన్న సూర్యుడు తన కళావిహీనమైన కిరణాలు ప్రసరించాడు. మగత్రీ త్నులు తమ అండాకృతి వాయునౌకలు ఎక్కి, తారామండలాలతో మెరసి పోతూన్న విశ్వాంతరాళంలో వున్న శుద్ధహేతుజ్ఞాన భూమికి ఎగిరి వెళ్లిపోయారు.

"ఇలాగ కొన్ని వేల వాయునౌకలు ఎగిరి వెళ్లిపోయాయి. తరువాత మళ్ళీ నాల్గవ తడవ మరొకసారి భూగోళం దద్దరిల్లి భయానకంగా గర్జించి ఒక్కకుదుపు కుదిపింది. ఉత్తరదిశను కమ్ముకున్న బూడిద వర్ణపు అంధ కారంలోనుంచి ప్రళయ బీభత్స సహితమై బ్రహ్మాండమైనట్టి ఉప్పెన ఉవ్వెత్తున లేచి భూమండలంపై విరుచుకుపడి, తన దారిలో వున్న సమస్త ప్రాణికోటినీ పొట్టబెట్టుకుంది.

"ఇక ఇది చాలనట్టు పెద్దతుపాను చెలరేగి, ఇళ్లపైనా ఇళ్ళ పరిసర ప్రదేశంపైనా పిడుగులు పడి, సర్వమూ ధ్వంసమైపోయింది. కుంభవృష్టిగా వర్షం కురిసింది. అగ్నిపర్వత శిలలు తూలికల్లా గాలిలో ఎగిరాయి.

"ఆ మహాపట్టణ కుడ్యాల శరణ్యం చూసుకుని, సువర్ణ తాపిత

మైన పిరమిడ్ శిఖరంనుంచి మగత్రీత్ములు పుట్టలు పుట్టలుగా పట్నాని వదలిపెట్టేసి వాయునౌకల్లో వెళ్ళిపోతూనే వున్నారు. తెరలు తెరలుగా కురుస్తూన్న వాన, దట్టంగా గుబురుగా లేస్తూన్న పొగలు, బూడిదె మబ్బులను తమ వాయునౌకలతో దూసుకుపోతూ, నక్షత్రాలతో ప్రకాశిస్తూన్న ఆకాశంలోకి వారు అదృశ్యమైపోయారు. ఒకదాని వెంట ఒకటిగా వచ్చిన మూడు భూకంపాలు ఆ అట్లాంటిక్ ఖండాన్ని తునాతునకలుగా చేరేసింది. శత సువర్ణద్వారా నగరం సంక్షోభితమైన మహాసముద్రంలో మునిగిపోయింది.

# గూసెప్ పట్టణాన్ని అపేక్షిస్తాడు

ఈహ వాళ్ళపై తెలియకుండా మోహంలో పడిపోయింది. గూసెప్ ఏమి చెయ్యమంటే దాన్నల్లా మారుమాటాడకుండా చేస్తూంది. మోహ పరవశమైన ఆమె కళ్లన్నీ అతని మీదే వున్నాయి. ఇదంతా చూస్తూంటే నవ్వూ వచ్చేది, జాలీ వేసేది. గూసెప్ ఆమెతో కఠినంగానే వుండేవాడు, కాని అలా అనిచెప్పి, అధర్మంగా మాత్రం ప్రవర్తించేవాడుకాదు. ఆమె తన మనస్సులో వున్న మోహావేశాన్ని అదుపులో వుంచుకోలేక, ఆపసోపాలు పడిపోతూన్నప్పుడు, ఆమెనతడు తన మోకాళ్లమీద కూచోపెట్టుకుని, ఆమె తల నిమిరి, చెవి వెనకాల మెల్లగా గిలిగింతలు పెడుతూ, ఏవేవో నవ్వులాటాలు కథలు చెబుతూండేవాడు. ఆమె పరవశురాలై వింటూండేది.

ఏమైనా సరే పట్నంలోకి పారిపోయేందుకే నిశ్చయించుకున్నాడు గూసెప్. ఆ ఇంట్లో వుండడమంటే ఎలుకల బోనులో వున్నట్టే అని పించిందతనికి. ఆ యింట్లోనే గనుక వుండిపోతే ఎటుంచి ఏమి జరిగినా తన్ను

తాను రక్షించుకునే మార్గంగానీ, బయటకు తప్పించుకుని పారిపోయే దారి గానీ అతనికేదీ కనబడలేదు. లోశ్కూ, తానూ తామిద్దరూ కూడా ఏదో మహోపద్రవంలో వున్నట్టు మాత్రం అతనికి గట్టిగా తోచింది. తాను ఎంత చెప్పినా లోశ్ కేవలం ముఖం చిట్లించుకోడంతప్ప తన మాట విని పించుకున్నాడు కాదు. ఆ తుస్కూబ్ పిల్లముందు ప్రపంచమే కనబడక పోయె అతగాడికి.

"అంత అనవసరపు గాబరా ఎందుకంటూ?" అన్నాడు లోశ్. "వీళ్లు మనని చంపేస్తారంటారా? పోనీ చంపేసీయండి! చావంటే మీకు భయమా, నాకు భయమా? అంత భయం అవుతే హాయిగా కాలుమీద కాలేసుకుని పెట్రోగ్రాడ్‌లోనే వుండిపోయుందుమే."

వాయునౌకాశాల తాలూకు తాళాలు తీసుకొచ్చి తనకిమ్మని గూసెవ్ ఈహొష్కని పురమాయించగా ఆమె తాళాలు తీసుకొచ్చి అతనికిచ్చింది. చీకటిపడిన తరువాత టార్చిలైటు వేసుకుని అక్కడకు వెళ్లి, నౌకాశాలలో చిన్న రెండురెక్కల హైస్పీడ్ వాయునావ ఒకదానిని ఎంచి, దాని సంగతి కుణ్ణంగా తెలుసుకుందామని ఆ రాత్రంతా ఈ మరలూ ఆ మరలూ తిప్పుతూ దానిని పరిశీలించాడు. దాని ఇంజను సరళంగానే వుంది. దానికున్న చిన్న మోటారు తెల్లని లోహపు రజ్జు ఇంధనంమీద పనిచేస్తుంది. ఈ రజ్జు కణాలను విద్యుత్ విస్ఫులింగాలు బ్రహ్మాండమైన శక్తితో విచ్ఛిన్నం చేస్తాయి. దానికి కావాల్సిన ఎలెక్ట్రిక్ చార్జిని వాతావరణంనుంచే మోటారు సంగ్ర హించుకుంటుంది. అంగారక గ్రహంయొక్క రెండు ధ్రువాల దగ్గరా నిర్మించ బడిన విద్యుదుత్పాదక కేంద్రాలు ఉత్పత్తిచేస్తూన్న హైటెన్షన్ విద్యుచ్ఛక్తి, ఆ గ్రహంచుట్టూ ఒక వాతావరణపు పొరగా ఏర్పడుతూ న్నట్టు అయిలీత ఇదివరకు వారితో ఒకసారి చెప్పింది.

ఆ వ్యాయునావను గూసెవ్ నౌకాశాల తలుపుల దగ్గరకు ఈడ్చు కొచ్చి, తలుపులు మూసేసి, తాళం వేసి, తాళాలు ఈహకి ఇచ్చేశాడు. అవ సరం వచ్చినప్పుడు తాళంకప్ప విరగ్గొట్టేసి వాయునావను బయటికి తీసే య్యొచ్చుకదా అనుకున్నాడు.

అప్పుడిక నిశ్చయించుకున్నాడు గూసెవ్ సోలత్స్రా పట్టణాన్ని కైవసం చేసుకుందామని. ఆ మబ్బుగాజు తెరను ఎలా ఉపయోగించాలో ఆ విధానం అతనికి తెలియజెప్పింది ఈహ. ఏమిటి జరుగుతూందో చూడ్డా నికనీ వినడానికనీ, అదే సమయంలో ఆ ఉపకరణాన్ని ఉపయోగించుతూన్నవారు ఇతరులకి కనబడకుండానూ వినబడకుండానూ వుండేలాగున ఏకపథ విధానంలో ఎలా స్విచ్చివేసి ఆ తెరను ఎలా పనిచేయించడమో అతనికి చూపించిందామె.

గూసెవ్ ఆ నగరాన్నంతనీ — పట్టణంలోని చౌకులూ, షాపులూ, బజార్లూ వున్న వీధులూ, ఫ్యాక్టరీలూ, కార్మిక పేటలు — తాను స్వయంగా అన్వేషణ యాత్ర చేసి తెలుసుకున్నట్టుగా క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. ఆ మబ్బుతెరను చూస్తూంటే, దానిపైన ఒక చిత్రమైన జీవితం తన కట్టె దుట ప్రత్యక్షమైంది.

ఇటుకలతో కట్టిన ఫ్యాక్టరీ భవనాలు పొట్టిగా వుండి, ధూళీ దుమ్మూ కమ్ముకుపోయిన కిటికీలనుంచి లోనికి వస్తూన్న వెల్తురులో ఆ భవనాల లోపల అంతా మసక మసకగా వుంది. కార్మికుల ముఖాలు ఎండిపోయి, కళ్ళు గుం టలు పడి నిస్పృహలను ప్రతిబింబిస్తున్నాయి. చకచక పనిచేస్తూన్న లేతులూ, గిర్రున తిరుగుతూన్న మెషీన్లూ, దించిన మెడలు ఎత్తకుండా పనిచేస్తూన్న మనుషుల శరీరాలూ, వారి నిశితమైన చలనాలూ — ఎక్కడ చూసినా ఇదే దృశ్యం కదా. పుట్టలో జీవించుతూన్న చీమ జన్మలాంటి జన్మ — అంధ కారమయం, ఆశారహితం.

ఏకరీతిలో ఒకే తరహాలో విసుగెత్తించేలా వున్న కార్మిక వీధుల వరుసలూ, ముఖాలు వేలేసుకుని అలా నడుచుకు పోతూన్నట్టి విచారగ్రస్తులైన ఆ వెనకటి రకం మనుషులే ఎక్కడ చూసినా మళ్ళీనీ. అచ్చంగా ఒకదానిని పోలి, శుభ్రంగా తుడిచిన ఇటుక వసారాలనుంచి, వేలాది సంవత్సరాల ఫలితమైన విసుగుదల పిల్లగాలిలా మెల్లగా వెడలుతూంది. ఆ ఇళ్ళల్లో నివసిస్తూన్న జనాన్ని నిరాశ ఆవరించనట్టు స్పష్టంగా కన బడుతూనే వుంది.

మరి కాస్సేపయాక పట్టణం మధ్య వున్న చౌకులు అవుపడ్డాయి తెరమీద — పిరమిడ్ల సోపానాల్లా ఒకదానిపైన ఒకటి లేస్తూన్న భవనాలు, భవనాలను అంటిపెట్టుకుని పాకుతూన్న ముదర ఆకుపచ్చని లతలు, ఎండలో తళుకులు మెరుస్తూన్న కిటికీ అద్దాలు, చక్కగా ముస్తాబైన స్త్రీలు, వీధుల నడిమధ్యను పువ్వులతో నిండిన సన్నిని నాజూకు పువ్వుల వాజులు, చిన్నచిన్న టేబిలు బల్లలు, జరీ దుస్తులు వేసుకుని తయారై సముద్రపు కెరటాల్లా ముందుకు సాగిపోతూన్న జనం, నల్లని అంగరకాలు తొడుక్కున్న మనుషులు, భవన ముఖప్రాంగణాలు — వీటన్నిటినీ ఆకుపచ్చని రంగులో చపటా చేసిన రోడ్డు ప్రతిబింబించుతూంది. పరుగెత్తుతూ పారిపోతూన్న నీడలను ప్రసరించుతూన్న బంగారపు ఛాయల వాయునావలు పట్టణపు ఆకాశవీధుల్లో కిందగా ఎగురుతున్నాయి. వాటికేసి చూస్తూ నవ్వుతూన్న ముఖాలూ, గాఢమైన రంగులతో పొగమంచు తెరలా సన్నని రుమాళ్ళనూ చూశాడు గూసెవ్.

ద్వంద్వ జీవితం సాగిస్తూంది పట్టణం. ఈ విషయాన్ని గూసెవ్ గుర్తుంచుకున్నాడు. ఈ రెండు రకాల జీవనమే కాకుండా, తన స్వానుభవాన్ను సరించి మూడో రకం జీవితం కూడా ఒకటి ఉండి తీరుతుందనే

గూసెవ్ నిశ్చయించుకున్నాడు. నిర్లక్ష్యంగా దుస్తులు వేసుకుని అనేకమంది యువ అంగారకవాసులు బేఫికరుగా ఫాషనబుల్ వీధుల్లో తిరుగుతున్నారు. జేబుల్లో చేతులు పెట్టుకుని తమ చుట్టుపట్ల జరుగుతూన్నదాని నంతటినీ ఒక కంట కనిపెడుతూ, పనీ పాటూ లేకుండా నక్కి నక్కి నడుస్తున్నారు వీరు. "మీలాంటి వాళ్లని ఎరుగుదునయ్యా నేను," అనుకున్నాడు గూసెవ్.

ఈహొష్క వివరణలతో సహా అన్నీ తెలియజేసిందతనికి. కాని ఇంజనీర్ల సార్వభౌమ సభా భవనంతో ఆ పరికరాన్ని కనెక్టు చేయడానికి మాత్రం ససేమిరా నిరాకరించిందామె.

ఆమె తన ఎరుపువాగు శిరోజాలను వూపుకొంటూ భయకంపితురాలై చేతులు జోడించి అంది:

"ఆకాశపుత్రా! అది మాత్రం నన్నడక్కు. అంతకంటే నన్ను చంపేయడమే నయం, ప్రియతమా, ఆకాశపుత్రా!"

వారు అంగారక గ్రహం చేరుకున్న పధ్నాల్గవ దినం ఉదయాన, తన అలవాటు చొప్పున గూసెవ్ చేతులున్న కుర్చీలో కూచుని, తన మోకాళ్లమీద స్విచ్చిబోర్డు పెట్టుకుని, స్విచ్చితాడు గుంజాడు.

తెరపైన చిత్రమైన దృశ్యం కనబడింది. నగరం నడిమధ్య వున్న చౌకులో, దిగాలుపడిన ముఖాలతో మనుషులు గుంపులు గుంపులుగా కూడి గుసగుసలాడుకుంటున్నారు. వీధుల మధ్య వున్న బల్లలూ, పువ్వులు నిండిన వాజులూ, రంగురంగుల గొడుగులూ — అన్నీ మాయమైపోయాయి. భయానకమైన కృత్రిమముఖాలు తగిలించిన తోలుబొమ్మల్లా, ముక్కోణపు వ్యూహంగా ఏర్పడిన సైనిక దళం ఒకటి కవాతు చేసుకుంటూ అక్కడకు చేరుకుంది. సైనికులు వచ్చేసరికి మనుషుల గుంపొకటి షాపులున్న

ఒక వీధిలోంచి పరుగెత్తింది. ఈ జనానికీ సైనిక దళానికీ జరిగిన కుమ్ము లాటలోంచి అంగారకవాసి ఒకడు తప్పించుకొని రెక్కల యంత్రం మీద ఎక్కి, ఎగిరి పారిపోయాడు. ఈ గుంపు మోస్తరుగానే, ఏదో ప్రమాదం సంభవించిదని దిగులుపడి చెవులు కొరుక్కుంటూన్న జనం పార్కులో తండో పతండాలుగా పోగడింది. ఒక ఫ్యాక్టరీలో పనిచేస్తూన్న కార్మికులు ఆ ఫ్యాక్టరీ దగ్గర గుమికూడి, ఉద్రిక్తులై, ముఖాలు జేవురించుకుని, కనుబొమలు ముడిపెట్టుకుని భయంకరంగా కళ్ళెర్ర చేసి చూస్తూ నిలబడ్డారు.

అసాధరణ ఘటనలు పట్టణంలో జరగబోతున్నాయన్న విషయం స్పష్టంగా కనబడుతూనే వుంది. ఈహొష్క బుజాలు పట్టుకుని గూసెవ్ అమెను కుదుపుతూ: "ఏమిటీ గ్రంథమంతా?" అని అడిగాడు. ఆమె అతని ప్రశ్న విని, చెమ్మగిలిన ప్రేమపూరిత నయనాలతో అతనిని నిదానంగా చూసిందేగాని, ప్రత్యుత్తరమివ్వకుండా మౌనంగా వూరుకుంది.

# తుస్కూబ్

పట్నంలో అంతా అశాంతిగా వుంది. గాజుతెర-టెలిఫోనులు అదే పనిగా మోగుతున్నాయి, తళుకు తళుకు మంటున్నాయి. వీధుల్లోనూ, చౌకు ల్లోనూ, పార్కుల్లోనూ అంగారకవాసులు గుంపులు కూడి గుసగుసలాడు కుంటూన్నారు. ఏదో తప్పకుండా జరగబోతుందని ఆత్రతతో ఆకాశంకేసి మెడలు చాచి ఆలా చూస్తూ నిల్చున్నారు జనం. ఎండుబొమ్మచెము డులు నిల్వచేసిన గిడ్డంగులు ఎక్కడో తగలబడుతున్నాయని ఎవరో ఒక పుకారు బయల్దేరదీశారు. పట్నంలో మధ్యాన్నప్పూట నీళ్ళకొళాయిలన్నీ ఎవరో తెరిచేశారు, దాంతో నీళ్లన్నీ అయిపోయి కొళాయిలు ఆగిపోయాయి —

అయితే కాస్సేపే, తరువాత మళ్ళీ యథాప్రకారంగా నీళ్ళు వచ్చాయి. పట్నపు నైరుతి భాగం పేటల్లో ఏదో పేలుడు జరిగింది. దాంతో పట్నంలో వాళ్ళందరూ ఇళ్ళకున్న కిటికీ అద్దాలకి అడ్డంగా కాగితపు పట్టీలు అంటించేశారు.

ఈ అలజడి పట్నం నడిమధ్య వున్న ఇంజనీర్ల సార్వభౌమ సభా భవనంనుంచే బయల్దేరి పట్టణమంతా పాకిపోయింది.

తుస్కాబ్ అధికారం ఇక ఎంతో సేపు నిలవదనీ, అది పడిపోయి తీరుతుందనీ, దాంతో కూడా మార్పులు జరుగుతాయనీ అందరూ చెప్పుకోవడం మొదలెట్టారు.

''ఈ రాత్రి దీపాలు ఆరిపోతాయట'' అని ఒక గాలికబురు.

అగ్గిమీద గుగ్గిలం చల్లినట్టు, ఇలాంటి గాలికబుర్లతో, అసలే తీవ్రంగా వున్న ఉద్రిక్తత మరింత పెచ్చరిల్లింది.

''ధ్రువాల దగ్గరున్న విద్యుత్ కేంద్రాలన్నీ మూసేస్తారట.''

''అయస్కాంత క్షేత్రం అంతమైపోతుందట.''

''అనుమానస్థులను పట్టుకుని సార్వభౌమసభా భవనపు నేలమాళిగ కొట్లల్లో పెట్టారట.''

ఈవదంతుల ఫలితం పట్నంలో ఒక విధంగా వుండగా, పట్నపు సివార్లలోనూ, ఫ్యాక్టరీల్లోనూ, కార్మిక పేటల్లోనూ, పబ్లిక్ గోదాముల్లోనూ వేరొక విధంగా వుంది. అసలు ఏమిటి జరుగుతూందో ఇక్కడ వాళ్ళకి సరిగ్గా తెలుస్తూన్నట్టు కనబడుతూంది. ఇటు కావేషంతో కూడిన సంతోషమూ, అటు చిత్తాన్ని పీకుతూన్న ఆందోళన, రెండూ మిళితమైన మనస్సుతో, బ్రహ్మండమైన పదకొండవ రిజర్వాయరును, పారంగాల్లో పనిచేస్తూన్న కార్మికులు మందుగుండు పెట్టి పేల్చే శారనీ, రహస్యంగా

నిల్వచేసిన ఆయుధాల పోగులకోసం ప్రభుత్వపు గూఢచారులు పట్టణం గాలిస్తున్నారనీ, తుస్సూబ్ తన సేనలను సోలత్సేర నగరంలో మోహరించాడనీ వీళ్ళు చెప్పడం మొదలెట్టారు.

మధ్యాన్నానికల్లా ఎక్కడవాళ్ళక్కడ పనులు మానేసుకుని కూచున్నారు. ఏదో జరగబోతుందని జనం పడిగాపులు కాస్తూ మూకలు మూకలుగా వీధుల్లో తిరగబడ్డారు. నేల యీనినట్టు ఎక్కడనుంచో ప్రత్యక్షమై, కొట్టొచ్చినట్టుగా దుస్తులు వేసుకుని, నిర్లక్ష్యంగా జేబుల్లో చేతులు పెట్టుకుని వీధుల్లో తచ్చాడుతూన్న యువ అంగారకవాసులను ప్రజంతా అనుమానంతో కనిపెడుతున్నారు.

మధ్యాహ్నం తిరిగిన కాస్సేపటికల్లా పట్టణపు ఆకాశ వీధుల్లో ప్రభుత్వ వాయునావలు చక్కర్లు కొట్టడం మొదలెట్టాయి. దూదిపింజెల్లా తెల్లని కరపత్రాలు ఆకాశంలో ఎగురుతూ కిందుకు రాల్తున్నాయి.

ప్రభుత్వంపై గిట్టనివాళ్ళు దుర్బుద్ధితో లేవదీస్తున్న నీలివార్తలను ప్రజలు నమ్మకూడదనీ, ఈనాడు దేశమంతా ఇదివరకెన్నడూ లేనంతగా ప్రభుత్వం చేతిలో స్థిరంగా వుందనీ ప్రజలకు ప్రభుత్వం పిలుపునిస్తూ, ఆ పిలుపుతో సహా తన పరిపాలనను సాగించడానికి తాను వెనుకటి కంటె మరింతగా కృతనిశ్చయంతో వుందని కూడా కరపత్రాలలో ప్రభుత్వం తెలియజేసింది.

ఈ కరపత్రాలు చదువుకున్న తరవాత ప్రజలో అలజడి కాస్త తగ్గింది, కాని మరికాస్సేపటికల్లా, వెనుకటికంటె మరింత ఘోరమైన కొత్త పుకార్లు లేచాయి. ఈ వదంతులన్నిటిలోనూ ఒకటి మాత్రం నిశ్చయమని తేలింది. ఆ సాయంకాలం ఇన్‌జనీర్ల సార్వభౌమ సభా భవనంలో తుస్సూబ్‌కీ, సోలత్సేరా కార్మికుల నాయకుడు ఇంజనీరు గోర్‌కీ మధ్య వాగ్యుద్ధం తప్పదనీ,

వారు సరాసరి తలపడతారనీ, సిగపట్లగోత్రం వరకూ కూడా రావచ్చుననీ అందరికీ తెలిసిపోయింది.

చీకటి పడిన తరువాత, సార్వభౌమ సభా భవనం ఎదుట వున్న బ్రహ్మాండమైన చౌకు అంతా ఇసుక వేస్తే రాలకుండా జనంతో నిండిపోయింది. భవనం మెట్లపైనా, ద్వారాల్లోనూ, పైకప్పుమీదా సైనికులు కాపలా కాస్తున్నారు. శీతగాలి వెంటవచ్చిన పొగమంచు గుబురుగా కమ్ముకుంది. ఆ పొగమంచు తెరలో వీధుల్లోని దీపాలు మిణుకు మిణుకుమంటూ కొడి కట్టిన వొత్తిలా ఎర్రగా వెలుగుతున్నాయి. ఊర్ధ్వంగా లేస్తూన్న నల్లని ఆ భవనపు గోడలు చీకటిలో కలిసిపోయాయి. భవనంలో దీపాలన్నీ వెలుగుతున్నాయి.

బ్రహ్మాండమైన గోడలతో నిర్మించిన గుండ్రని సభామందిరపు ఉపన్యాసరంగంలోని బెంచీలపై సార్వభౌమ సభాసదులు కూచున్నారు. వారి ముఖాల్లో మెలకువ, అప్రమత్తత గోచరిస్తున్నాయి. జనసందోహాలతో కిట కిటలాడుతున్న పట్నంలో జరుగుతూన్న విషయాలన్నీ, గోడమీద ఎత్తుగా అమర్చిన తెరపైన — ఫ్యాక్టరీల లోపలా, చౌరస్తాల దగ్గరా దృశ్యాలూ, పొగ మంచులో ఇటూ అటూ పరుగెత్తుతూ ఛాయల్లా తెరమీద కనబడుతూన్న మనుషుల ఆకారాలూ, రిజర్వాయర్ల ఆకృతులూ, ఆయస్కాంతిక విద్యుత్ గోపురాలూ, భారీ ఆయుధాలు ధరించిన సైనికులు కావలికాస్తూన్నట్టి నిర్మానుష్యంగా వున్న గోదాముల వరుసలూ — సభికులకు కనబడుతూన్నాయి. ఆ తెర వూళ్ళో ఏర్పాటుచేయబడిన అన్ని కంట్రోలు దర్పణాలతోనూ ఒకదాని తరువాత ఒకటిగా సంబంధం ఏర్పరచుకుంది. తెరపైన ఆఖరున కనబడిన దృశ్యం, సార్వభౌమ సభాభవనానికి ఆవల వున్న చౌకు — పొగమంచు మబ్బు

ల్లోనుంచి అశుభసూచకంగా కనబడుతూన్న మనిషి తలకాయలూ, అలు క్కుపోయినట్టున్న దీపాల వెలుగూనూ. వెలుపల ఆ చౌకులో జనం చేస్తూన్న కోలాహలంతో ఉపన్యాసమందిరం అంతా మారుమోగుతూంది.

సభాకార్యకలాపం క్రమపద్ధతిలో జరగాలని హెచ్చరిక చేస్తూ కీచు స్వరం ఈల వినబడింది. తెరమీద వెల్తురు వెలిసిపోయింది. తుస్కూబ్ వేదికపైకి వచ్చాడు. బంగారు కింకాబు కుట్టిన నల్లని వస్త్రం వేదికమీద పరచి వుంది. మనిషి ముఖం పాలిపోయుంది. కాని ప్రశాంతతనూ, స్థిరచి త్తాన్నీ ప్రతిబింబిస్తూంది ఆ ముఖం.

''పట్టణంలో అల్లర్లు జరుగుతున్నాయి. ఈ రోజున నాకు వ్యతి రేకంగా ప్రతిఘటన తప్పకుండా జరుగుతుందనే వదంతే ఈ అల్లర్లకి కార ణం. మన రాజ్యాన్ని ఒక ఊపు ఊపడానికి ఈ వదంతి ఒక్కటీ సరిపోయింది. నా అభిప్రాయంలో ఇలాంటి పరిస్థితి అనారోగ్యకరమేకాకుండా, అరిష్ట సూచకం కూడానూ. ఈ ఉద్రిక్తత అంతకూ కారణాలేమిటో తెలుసుకుని, వాటిని మనం మొగ్గలోనే తుంచేయాలి. నేనిక్కడ వివరించబోయే సంగతు లన్నిటినీ విని, వీటిని మీలో కొందరు ఈరాత్రే పట్నంలో నాలుగు మూలలా చాటుతారని నాకు తెలుసు. ఈ విషయం నేను ఏ మూతముప్పిడీ లేకుండా గట్టిగానే చెబుతున్నాను. పట్టణంలో అరాజకం విలయతాడవం చేస్తూంది. ఈ అరాజకాన్ని ప్రతిఘటించేందుకు దేశంలో తగినంతగా మందీ మార్బ లం లేదని నా వేగులవారు చెబుతున్నారు. ప్రపంచం అంతిమ గడియలు మనమిప్పుడు వీక్షించబోతున్నాం.''

ఆక్షేపణ సూచకంగా సగం ఉపన్యాసరంగం గొల్లుమంది. తుస్కూబ్ మాత్రం తృణీకారంతో మందహాసం చేశాడు.

''అరాజకం, ప్రపంచ వ్యవస్థను నాశనం చేస్తూన్న ఈ శక్తి, పట్నం

నుంచే వ్యాపించుతూంది. ఆధ్యాత్మిక ప్రశాంతత, ప్రాకృతికమైన జీవితేచ్ఛ, మానవుని చిత్తవికార శక్తులు — ఇవన్నీ నగరంలో జరుగుతూన్నట్టే అనుమానాస్పదములైన వినోదాలలోనూ, నిరర్థకములైన విలాసాలలోనూ వృథా అయిపోతూన్నాయి. హవ్రా ధూమమే ఈ మహాపట్నానికున్న ఆత్మ బలం. కళకళలాడుతూన్న వీధులు, రణగణ కోలాహల ధ్వని, భోగవిలాసాదులతో తులతూగుతూన్న బంగారు వాయునావలు — వీటన్నిటినీ సారంగాల్లో పనిచేస్తూ కిందనుండి చూసేవారికి అసూయ కలిగిస్తాయి. వీపులూ పొట్టలూ నలుగురు కళ్ల బడేటట్టు నగ్నంగా చూపుతూ, మతిభ్రమ కల్గించే పరిమళాన్ని లేపనం చేసుకునే స్త్రీలూ; వేశ్యాగృహాల ఎదుట కళ్లు మిరుమిట్లు కొలిపేట్టుగా ఆడంబరంగా వెలిగే దీపాలూ; వీధులపై ఆకాశమార్గాన ఎగురుతూన్న నౌకాఫలహారశాలలూ — ఇలా వుంది పట్టణం! మనశ్శాంతి మంటగలిసి పోతూంది... భోగలాలసుల కోర్కె ఎంతసేపూ ఒక్కటే — తృష్ణ — ఉన్మాద తృష్ణ... కాని ఇక వాళ్లకి ఉన్మాదం కల్గించబోయేది రక్తం ఒక్కటే.''

ఇలా అని, తుస్కాబ్ తన చూపుడువేలుతో గాలిని పొడిచాడు... ఉపన్యాసరంగంలో వున్న వారంతా అప్రమత్తులై మరొకసారి ఇటూ అటూ కదిలారు. తుస్కాబ్ తన ఉపన్యాసం సాగించాడు:

''పట్టణం అరాజక వ్యక్తిత్వానికి మార్గం సుగమం చేస్తూంది. ఈ అరాజక వ్యక్తిత్వానికి జీవిత పరమార్థమూ పరమధ్యేయమూ విధ్వంసనమే. అరాజకమంటే స్వేచ్ఛే అనుకుని భ్రమపడుతున్నారు ప్రజలు. కాని వారు పొరపాటు చేస్తున్నారు. అరాజకానికి తృష్ణ తీరదు — అరాజకాన్నే ఇంకా కావాలంటుంది. క్రమాన్ని భగ్నపరచేవారిని అణచివేయడం ప్రభుత్వ విధి — అదే న్యాయమూ, పద్ధతినీ! క్రమాన్ని రక్షించేందుకై మనకున్న దృఢ

సంకల్పంతో మనం అరాజకాన్ని ప్రతిఘటించితీరాలి. దేశంలో వున్న సక్రమ శక్తులనన్నింటినీ మనం సమీకరించి, కనీసపు నష్టంతో జయం సాధించేందుకు అరాజకంతో పోరాడడానికి వాటిని తరలించాల్సి వుంటుంది. అరాజకంపై మనం యుద్ధం ప్రకటించాలి. ఇంతవరకూ తీసుకున్న భద్రతా చర్యలు కేవలం తాత్కాలికమైనవే, కాని ఈ అరాజకం బలహీన స్థానాన్ని మన పోలీసులు బట్టబయలుచేసే తరుణం త్వరలోనే ఆసన్నమవుతుంది. మన పోలీసు గూఢచారుల సంఖ్య రెట్టింపు పెంచే సరికి, అరాజకవాదుల సంఖ్య నాల్గింతలు పెరుగుతుంది. మనమే ముందుగా దాడిచేసి, కఠినమే అయినప్పటికీ అనివార్యమైన చర్యను మనం తీసుకుని తీరాలి: పట్టణాన్ని మనం ధ్వంసం చేయడమే మన విధి.''

ఉపన్యాసరంగంలో సగంమంది తమ ప్రతిఘటనను తెల్పేందుకని పెద్దగా అరుపులు అరచి, బెంచీలనుంచి చెంగున లేచిపోయారు. వారి ముఖాల్లో రక్తంలేదు. కళ్లు చింతనిప్పల్లా మండుతున్నాయి. కాని తుస్కూబ్ ఒక్కసారి వారికేసి చూసేసరికి సద్దు అంతా మణగిపోయింది.

''పట్టణం ధ్వంసంకాక తప్పదు — ఏది ఏమైనా సరే అది మాత్రం అనివార్యం. అందుచేత ఆ కార్యం మనం చేయడమే ఉత్తమం. పట్టణవాసుల్లో క్రమబద్ధమైన విభాగాలకు పల్లెపట్టుల్లో పునరావాసం కల్పించేందుకు పథకాన్నొకదానిని నేను తరువాత ప్రతిపాదిస్తాను. అంతర్యుద్ధానంతరం నేడు నిర్జనమైయున్న లిజియజీరా పర్వతాలకు ఆవలి ఫలవంతమైన భూమిని మనం ఉపయోగించుకోవాలి. మనం చెయ్యాల్సింది ఎంతో వుంటుంది. కాని మన కార్యం ఉదాత్తమైనది. మనం పట్టణాన్ని ధ్వంసం కావించినంత మాత్రాన నాగరికతను రక్షించలేకపోతాం. అంతేకాదు, నాగరికత పతనాన్ని మనం వాయిదా అయినా వేయలేం. కాని అంగారక ప్రపంచం

తన అంత్యాన్ని హుందాతనంతోనూ ప్రశాంతతతోనూ ఎదుర్కొందుకు మనం దానికి తప్పక సహాయపడే తీరుతాం.''

''ఏమిటంటున్నాడు?'' అంటూ భయకంపితులైన శ్రోతలు పెద్దగా అరిచారు.

''ఇదేమిటి? మనం ఎందుకు చావాలేమిటి?''

''ఇతగాడికి మతిపోయింది!''

''తుస్కూబ్ ముర్దాబాద్!''

ఈ గల్లంతు అంతా చూసి తుస్కూబ్ ఒక్కసారి ముఖం గంటు పెట్టుకునే సరికల్లా మళ్ళీ అంతా నిశ్శబ్దమైపోయింది.

''అంగారకలోక చరిత్ర సమాప్తమవుతూంది. మన గ్రహంమీద జీవితం అస్తమించుతూంది. మన గ్రహంలో ఈనాడున్న జననమరణ సంఖ్యలు మీకు తెలుసు. మరికొద్ది శతాబ్దాలలో అంగారకవాసులలో కడపటి వారు సూర్యాస్తమాన్ని ఆఖరిసారి చూడడం తటస్థించుతుంది. ఈ క్షీణింపును ఆపుచేయడం మన తరంకాదు. మనం బుద్ధిమంతులమై ప్రపంచపు కడపటి దినాలను భోగవిలాసాలతోనూ ఆనందాతిశయంతోనూ ఉచితరీతిని ఆహ్వానించేందుకు గట్టి చర్యలు అవలంబించాల్సి వుంటుంది. పట్టణాన్ని నాశనం చేయడం మన ప్రథమ కర్తవ్యం. నాగరికత పట్ల తన కర్తవ్యాన్ని అది నెరవేర్చింది. ఈనాడది నాగరికతను పెడదారిని పట్టించి చెడగొట్టుతూండడం కారణంగా అది నశించి తీరాల్సిందే.''

ఇంతకుముందు గూసెవ్ గాజుతెరపై చూసినట్టి వెడల్పు ముఖపు అంగారకవాసి గోర్, ఉపన్యాసరంగంలో నడిమధ్య వున్న తన స్థానంలోంచి లేచి నిల్చున్నాడు.

అతడిది ఖైంయ్ ఖైంయ్ మంటూ చిన్న గొంతు. తన చేతిని తుస్కూబ్‌వైపు చాచి అతడు మాట్లాడాడు.

''ఇతడు చెప్పినదంతా కేవలం అబద్ధం! తన అధికారం నిలబెట్టుకుందుకు మనకందరికీ మరణశిక్ష విధిస్తున్నాడు. లక్షలాది ప్రజలను నాశనం చేస్తేనేగాని తన అధికారం నిలవదని అతనికి తెలుసు. బంగారు నౌకల్లో కూచుని ఆకాశవిహారం చేయలేనివారందరూ, భూపొరంగాలలో నిర్మించిన ఫ్యాక్టరీ నగరాల్లోనే పుట్టి అక్కడే గిట్టాల్సిన వారందరూ, నిరాశానిస్పృహలకు లోనై, జీవితంతో విసుగెత్తి, సెలవు దినాల్లో సహితమూ ధూళిధూసర మయమైన ఫ్యాక్టరీ వసారాల్లోనే తిరుగుతూ గడపాల్సిన వారూ, ఆ దౌర్భాగ్యపు హ్రావాపాగ తాగుడులో పడిపోయి ఉన్మాదపూరిత అంధకారాన్నే వాంఛించుతూన్నట్టివారూ తనను ఎంతగా ద్వేషించుతున్నదీ అతనికి తెలియకపోలేదు, అతనికి తెలుసును. మనకోసమని మరణ శయ్య సిద్ధం చేశాడు తుస్కూబ్. ఆ శయ్యపై అతనినే శయనించమనండి. మనం మాత్రం చావడానికి సిద్ధంగాలేం. మనం పుట్టినది జీవించడానికే. అంగారక గ్రహం క్షీణించిపోతూందని మనకి తెలుసు – అది విధికృతం. కాని మనకు మోక్షం లభించకపోదు – ఆ మోక్షం భూలోకంనుండే, భూలోకవాసులనుండే – శారీరకంగా, మానసికంగా, దేహంలో ఆరోగ్యవంతమైన ఉడుకు రక్తం ప్రవహిస్తూన్న యువజాతినుండే – మనకు లభించుతుంది. వారంటే ఇతనికి సింహస్వప్నం. భూలోకంనుంచి వచ్చిన ఇద్దరు వ్యక్తులను నీ ఇంట్లో పెట్టి దాచేశావ్ నువ్వు, తుస్కూబ్! ఆకాశపుత్రులంటే నీకు హడలు. బలహీనులలోనే, హ్రావా తాగుముచ్చుల్లోనే నువ్వు బలవంతుడివి. తమ హృదయనాళాల్లో వేడి రక్తం ప్రవహిస్తూన్న వాళ్ళూ, బలవంతులూ ఇక్కడకు వచ్చారంటే నువ్వు వుత్త ఛాయవైపోతావు – పీడకల మాయమై

పోయినట్టు మాయమైపోతావు, ఏ భూతమో, దయ్యమో ఎగిరిపోయినట్టు ఎగిరిపోతావు. ఈ గతి నీకెక్కడ పడుతుందో అనే నీ భయం అంతానూ. అరాజకం గురించి నువ్వు చేసిన సిద్ధాంతమంతా నువ్వు కావాలని చేసిన అభూతకల్పన తప్ప మరేమీకాదు. పట్టణాన్ని నాశనం చేసేద్దామనే ఘోర మైన దుర్బుద్ధి అప్పుడు ఆ నిమిషానికి నీకు తట్టింది. రక్తదాహం వున్నది నీకే. ప్రజల దృష్టిని ఏదో ఒక విధంగా ఇతర విషయాల మీదకి మళ్లిం చేస్తే, మనని రక్షించేందుకని భూలోకంనుంచి వచ్చిన ఇద్దరు సాహసిక లనూ అప్పుడు చల్లచల్లగా కడతేర్చవచ్చును కదా అని నువ్వు ఒక ఎత్తు వేస్తున్నావు. నాకు తెలుసు, నువ్వప్పుడే ఫర్మానా జారీ చేయనే చేశావు, వీళ్లని...''

గోర్ చటుక్కున ఒక్క నిమిషం ఆగాడు. ఆయాసంతోనూ ఉద్రే కంతోనూ అతడి ముఖం నల్లబడిపోయింది. తుస్కూబ్ అతనికేసి కనుబొమలు ముడిపెట్టుకుని కోరచూపులు చూశాడు.

''...నేను మాటాడి తీరుతాను – నువ్వు నన్ను ఆపలేవు!'' అంటూ బొంగురుపోయిన గొంతుతో గోర్ పెద్దగా అరిచాడు. ''నువ్వు పూర్వ కాలపు చిల్లంగి, చేతబడులు ప్రయోగిస్తావని నాకు తెలుసు... అయినా నీ చూపులకు నేను భయపడనులే...''

తన నుదుట పట్టిన చెమటను ఎంతో గట్టి ప్రయత్నంతో తన వెడల్పాటి అరచేతితో తుడుచుకో గల్గాడు గోర్. అలా తుడుచుకుని దీర్ఘంగా శ్వాసపీల్చి, తన స్థానంలో చతికిలబడగా, ఉపన్యాసరంగంలో ఉన్నవారంతా ఊపిరి బిగబట్టుకుని అతనికేసే చూస్తూ కూచున్నారు. అతడు అలా చతి కిలబడే సరికి అతని మెడ బుజాలమీద వాలిపోయింది. అతడు పటపట పళ్లు కొరకడం. అందరకీ వినబడింది.

తుస్కూబ్ కనుబొమలు పైకెత్తి, చెక్కుచెదరకుండా, తొణుకూ బెణుకూ లేకుండా తన ఉపన్యాసం కానిచ్చాడు:

"భూలోకంనుంచి వచ్చిన ఆగంతకులపై మనం ఆశపెట్టుకోవాలా? మనలో కొత్త రక్తం ప్రవహింపజేసుకోవాలా? అందుకు అప్పుడే చాలా ఆలస్యమైపోయింది. ఏం లాభం లేదు! అంతేకాకుండా, చాలా క్రూరమైన విషయం కూడానూ. మనమాలాచేస్తే గ్రహం అవసాన వేదనమరింత పొడిగించినవారమే అవుతాం, ఎందుచేతనంటే ఈ విజేతలకింద మనం బానిసలమవడం తప్పనిసరి అవుతుంది. మన బాధలను మనమే అధికం చేసుకొన్నవార మవుతాం. మన అవసానదశను మనమే హుందాతనంతో ఎదుర్కొనడం బదులు, శతాబ్దుల వలయంలో తగుల్కొని సతమత మవుతూంటాం. ఎందుకిదంతా? నాజూకు శరీరాలూ ధీశక్తీ కల్గిన మన జాతి విజేతలకింద ఊడిగం చెయ్యాలా? ఎందుకని? జీవిత పిపాసులైన ఈ కిరాతకుల చేత మన భవనాలనుంచీ మన ఉద్యానవనాలనుంచీ మనం తరిమివేయబడి, వారికింద చాకిరీ చేస్తూ, వారికోసం కొత్త రిజర్వాయర్లు మనం కట్టడంకోసమూ, వారికోసం గనులలోకి దిగి ఖనిజాలు తవ్వడం కోసమూనా? అంగారకగ్రహ మైదానాలు యుద్ధనినాదాలతో మళ్ళీ మరొకసారి మార్మోగడానికీ, మళ్ళీ మరొకసారి మన నగరాలు వక్రబుద్ధులనూ అపసంతులనూ కనడానికనా? అబ్బే, ఇదేమీ పనికిరాదు. మన ఇళ్ళల్లో మనం ప్రశాంతంగా మరణించాలి. తన అరుణకిరణాలను తల్ త్సేత్ల్ సుదూరంనుంచే ప్రసరించనీయండి. మనం మాత్రం విదేశీయులను మనగ్రహంపై అడుగు పెట్టనీయం. ధ్రువాల దగ్గర కొత్త కేంద్రాలను కట్టుకుందాం, మన గ్రహం చుట్టూ దుర్భేద్యమగు కవచాన్ని నిర్మించుకుందాం. సోఅత్సేర — అరాజకమూ, ఉన్మత్త ప్రలాపాల సహితమైన స్వప్నాలూ గూడుకట్టుకున్నట్టి

సోఅత్సేర — నగరాన్ని మనం నాశనం చేసితీరుదాం. భూలోకంతో సంబంధాలు ఏర్పరచుకుందామనే కిరాతక దుర్బుద్ధి, ఇక్కడ ఈ సోఅత్సేరా నగరంలో తలెత్తింది. మన చాకులను తుడిచిపెట్టేసి వాటిని నాగళ్లతో దున్నేద్దాం. కేవలం మన ప్రాణం నిలబెట్టుకుందుకే అవసరమైన సంస్థలనే తప్ప కడమవాటినన్నిటినీ నేలమట్టం చేసేద్దాం. ఆ మిగిలిన స్థలాల్లో గజదొంగల చేతనూ, తాగుముచ్చులచేతనూ, పిచ్చివాళ్లచేతనూ పనిచేయించుదాం. వాళ్లకి అరదండాలు విధించుదాం. వారు తృష్ణతో తహతహ పడుతూన్నట్టి జీవితేచ్ఛను వారికి మనం తప్పకుండా అనుగ్రహించుదాంలెండి. మన ఆజ్ఞలను శిరసావహించినవారికి, ఫల్లెపట్టుల్లో మడిచెక్కలూ ఇద్దాం, జీవనోపాధీ సౌఖ్యమూ కలుగజేద్దాం. ఇరవై సహస్రాబ్దుల కఠినశ్రమ ఫలితంగా, హాయిగా ప్రశాంతంగా ధ్యానంలో గడపుతూ జీవించే హక్కును మనం సంపాదించుకున్నాం. నాగరికత అంతిమ దశకి స్వర్ణయుగం మకుటాయమానంగా వుండబోతూంది. ఆ అంతిమ దినాలను కీర్తించేందుకు పర్వదినాలను ప్రకటించుదాం, పండుగలు చేసుకుందాం, అద్భుతములైన వేడుకలను ఏర్పటుచేద్దాం. మున్ముందు ప్రశాంతంగా జీవించబోతున్నాం కాబట్టి, ఆ విధంగా మరోకొద్ది శతాబ్దులపాటు మన కాలపరిమితిని బహుశా పొడిగించుకో గల్గుతామేమో కూడా."

ఉపన్యాసరంగం అంతా మంత్రముగ్ధమై నిశ్శబ్దంగా వింటూంది. తుస్యూబ్ ముఖం ఎర్రబడి పోయింది. భవిష్యత్తులోకి తన దృష్టిని సారించుతున్నాడేమో అన్నట్టుగా, అతడు కళ్ళు మూసుకున్నాడు. ఉపన్యాసం చేస్తూ, నడిమధ్య తటాలున ఆగిపోయాడు...

...భవనం వెలుపల వున్న వేలాది ప్రజల కోలాహలపు హోరు బ్రహ్మాండమైన గోడల మధ్యనున్న ఆ గదిలోకి మెల్లగా వినబడుతూంది. గోర్ లేచి

నిలబడ్డాడు. అతని ముఖం వికృతంగా వంకర్లుపోయుంది. నెత్తిమీద వున్న టోపీని తీసి పక్కకు విసిరేశాడు. చేతులు ముందుకు చాచి, రంగం నడిమధ్య వున్న మార్గాన తుస్కూబ్ వున్న స్థలానికి వెళ్లి, బంగారుజల్తారు వస్త్రం పరచిన వేదికనుండి తుస్కూబ్‌ను మెడపట్టుకుని గెంటేశాడు. అలా గెంటేసి, ఉపన్యాసరంగంవైపు తిరిగి, చేతులు చాచి, ఉక్కిరి బిక్కిరి అవుతూన్న గొంతుకతో:

"మంచిదేలే! మృత్యువట, మృత్యువు! సరే, ఆ మృత్యువు నీకే! మాకా? మాకు ఆ మృత్యువుతో యుద్ధమే!.."

బెంచీలపై కూచున్నవారందరూ పెద్దగా గల్లంతు చేస్తూ చెంగున లేచారు. కిందను బోర్లా పడున్న తుస్కూబ్ దగ్గరకు కొందరు పరుగెత్తారు.

ఒక్క దాటు వేసి, ద్వారం చేరుకున్నాడు గోర్. ద్వారం దగ్గర కాపలా వున్న జవానుని మోచేతితో పక్కకు తోసేసి, బయటకు వెళ్లిపోయాడు. చౌకులోకి దారితీసే ద్వారంలోంచి అతడు వెళ్లుతూండగా అతడి నలుపు అంగరకా అంచు తళుకు తళుకుమంటూ మెరుపులు మెరిసింది. అతడి గొంతూ, అతడి గొంతును ప్రతిధ్వనించుతూ దిక్కు బద్దలయేటట్టుగా పెచ్చరిల్లుతూన్న జనసందోహపు అరపులూ దూరాన మార్మోగాయి.

# లోశ్ ఏకాకి అయిపోయాడు

"విప్లవం ప్రారంభమైందయ్యా మిస్త్రస్లావ్ సెర్గేయెవిచ్! పట్నమంతా అట్టుడికినట్టు ఉడికిపోతూంది! భలే!"

గూసెవ్ గ్రంథాలయంలో వున్నాడు. అతడి కళ్లల్లో అపరిమితానందం తొణికిసలాడుతూంది. వెనకటి నిద్రమత్తు చూపులు మాయమై

పోయాయి. ముక్కుచెరమలు ఎగిరాయి. ములుకుల్లా లేచింది మీసం. లేచి నుంచుని చేతులు రెండూ వెడల్పాటి పటకాలో దోపుకున్నాడు.

"మనకి అవసరమయే వస్తువులన్నిటినీ — తినడానికి తిండీ, చేతి బాంబులూ — వాయునౌకలో నేనిదివరకే చేరవేశాను. వాళ్ల తుపాకి ఒక దానిని కూడా సంగ్రహించాను. ఆ పుస్తకాలని అలా గిరవాటేసి ఇలా రండి — ఇంకా చూస్తారేమిటి మీరు! రండి బయల్దేరుదాం!" అన్నాడు గూసెవ్ లోశ్‌తో.

సోఫాలో ఒక మూల నక్కి కూచుని లోశ్, గూసెవ్‌కేసి చూపులు చూడని కళ్లతో చూశాడు, ఏమిటో పరధ్యానంగా. అయిలీత రాకకోసం రెండు గంటలైే కనిపెట్టుకుని కూచున్నాడు. ఆమె గదితలుపు దగ్గరకు వెళ్లి, ఏమైన చప్పుడవుతూందేమో అని విన్నాడు లోశ్. కాని ఆమె గదిలోంచి ఏ చప్పుడూ అతనికి వినబడలేదు. సరే అని చెప్పి, తాను కూచున్న చోటకే మళ్ళీ వచ్చేసి, హాలులో ఆమె అడుగుల చప్పుడుకోసమని అమిత ఆత్రం పడిపోతూ చెవులు అప్పగించేసి గ్రంథాలయంలో కూచున్నాడు. గాలిలో నడుస్తూన్నట్టే ఆమె వేసే అడుగుల చప్పుడు తన హృదయాన్ని పులకరించి వేస్తుందని అతనికి తెలుసు. తాను తన మనస్సులో ఊహించుకున్న కంటేనూ ఎన్నో రెట్లు అందంగానూ వాంఛనీయంగానూ అవుపడుతూ ఆమె అడుగిడి, అద్దంలా నిగినిగలాడుతూన్న గచ్చును తన నల్లని గౌను తాకుతూండగా, సూర్యకిరణాలను గదిలోకి చొనిపించుతూన్న ఎత్తు సరంబీ కిటికీ కిందనుంచి నడుస్తూ వస్తుంది ఆమె. ఇదంతా తాను కళ్ళారా చూసి, తన శరీరం ఝల్లు మంటుంది. తన యావదాత్మ ఒక్కపెట్టున కంపించిపోయి, తుపాను ముందలి వాతావరణంలా బిగుసుకుపోతుంది.

"ఏమిటి? మీకు జ్వరం తగిలిందా ఏమిటి, మిస్త్లావ్ సెర్గేయె విచ్? లేవండి, మరి. మనం బయల్దేరాలి — అంతా సిద్ధంగా వుంది. మిమ్మల్ని అంగారక గ్రహానికి కమిస్సారుగా నేను ప్రకటిస్తాను. ఒక్క చిటికెలో వ్యవహారమంతా తేలిపోతుంది," అన్నాడు గూసెవ్.

గూసెవ్ చూపులు తప్పించుకుందుకు లోశ్ తన ముఖం దించేసి, మెల్లగా అన్నాడు:

"ఏమిటి జరుగుతూంది పట్నంలో?"

"ఏమిటి జరుగుతూందో నాకు మాత్రం తెలిసి ఏడిశిందా ఏమిటి! వీధుల్లో జనం కిటకిట్లాడుతున్నారు. బ్రహ్మాండం బద్దలైనట్టు రణగణ ధ్వని, కిటికీ తలుపుల అద్దాలు ఫెళఫెళ బద్దలగొడుతున్నారు."

"మీరొక్కరే వెళ్లండి, వాయునావ మీద, అలెక్సేయ్ ఇవానొవిచ్. వెళ్లండిగాని, ఏమైనా సరే, రాత్రికి మాత్రం వచ్చేయండి. నా సాయం తప్పకుండా వుంటుంది — ఆ మాట నేను వేరే చెప్పక్కర్లేదుగా. విప్లవం లేవదీయండి — నన్ను కమిస్సార్ చేయండి — మీ కవసరమని తోస్తే నన్ను గుండేసి పేల్చేయండి. యివాళ్టికి మాత్రం — మీ పుణ్యముండేను — నన్ను వదలిపెట్టేయండి, బాబ్బాబు! ఇందుకు మాత్రం ఒప్పుకోండి, నాయనా!"

"సరేలెండి," అన్నాడు గూసెవ్. "ఈ ఆడవాళ్లతో నానా అల్లరీనీ — భూలోకం వదిలేసి ఈ ఊర్ధ్వలోకంలోకి వచ్చినా ఇక్కడా ఈ అచ్చమ్మలూ బుచ్చమ్మలూ మనకోసం తయారు! ఆరె, వీళ్లిల్లు బంగారంగానూ, ఛీ! నేను అర్ధరాత్రికి వచ్చేస్తానయ్యా. నా జాడ ఎవ్వరికీ — పిట్టకీ మనిషికీ కూడా తెలియదు — అదంతా ఈహొష్క చూసుకుంటుంది లెండి."

గూసెవ్ వెళ్లిపోయాడు. లోశ్ మళ్ళీ పుస్తకం పట్టుకున్నాడు.

"ఈ కథ ఎలా అంతమౌతుందో కదా?" అని లోకేశ్ తనలో తాను అనుకున్నాడు. "ఈ ప్రేమ తుఫాను అణగిపోతుందా? అబ్బే, ఒక్క నాటికీ అణగిపోదు. ఏదో మరొక అపరజ్యోతి వచ్చి తనను సంహరించే వరకూ ఇలా మనోవ్యథతో ఈ నిరీక్షణా బాధను తాను ఆనందంతోనే అనుభవి స్తూంటాడా? లేదు, లేదు — ఆనందమూ లేదు, విచారమూ లేదు, స్వప్నమూ కాదు, తృష్ణా లేదు, సంతృప్తీ లేదు... అదేమిటోగాని, అయిలీత తన పక్కను కూచున్నంత సేపూ — చలితో గడ్డకట్టుకుపోయి ఏకాంతజీవి అయి పోయిన తన శరీరంలో వెచ్చని ప్రాణం ఉరకలతో పరుగులతో ప్రవహించు తూన్నట్టే అనిపించుతుంది. వెలుగుతో ప్రకాశిస్తూన్న కిటికీ కిందనుంచి, గాలిలో నడుస్తూన్నట్టుగా ప్రాణం తేలిపోతూ ప్రవేశించుతుంది. అబ్బే, అదీ ఒక స్వప్నమే. తన వాంఛ ఫలప్రదమవాలి, పరిణతి చెందాలి. ఇక అప్పుడు అయిలీతలో కూడా జీవం ప్రవహించుతుంది. ఆమె పరిణతి చెందుతుంది. ఇక తానో — తాను మళ్ళీ మరొకసారి కోర్కెతో ఉవ్విళ్ళూరుతూ, ఏకాం తంగా నిస్త్రాణచెంది అలా అపేక్షించుతూనే వుండిపోతాడు."

తీవ్రమైన మోహం ఎంత నిరర్థకమో ఇదివరకు తానెన్నడూ అను కోనంతగా ఇప్పుడు స్పష్టంగా లోకేశ్‌కి తెలిసివొచ్చింది. తన వ్యక్తిత్వాన్నే స్త్రీకోసం ఘోరంగా బలిదాన మిచ్చేయడం — మనిషి వినాశానికే మూల కారణం — ఈ మోహం ఎంతటి భ్రమో ఎంతటి భ్రాంతో అతనికిప్పుడు బాగా అర్థమైంది. స్త్రీకోసం నిరీక్షించుతూ చేతులు బారుగా — ఈ తార నుండి ఆ తారకు — చాపావు. స్త్రీ ప్రత్యక్షమైంది. నిన్ను స్వీకరించింది, తాను ప్రాణం పోసుకుంది. ఇక నువ్వో — ప్రేమికుడవు, తండ్రివి — గుజ్జు ఖాళీ అయిపోయిన గుల్లలా — ఈ తారనుండి ఆ తారకు చేతులు బారుగా చాపుకొని త్రిశంకుస్వర్గంలో వేల్లాడుతూండడమే.

అయిలీత అన్నది నిజమే. తాను మరీ అంతగా విజ్ఞానాన్ని సముపా ర్జించి వుండకూడదు — తాను అనవసరంగా హెచ్చుగా చదువుకున్నాడు. తన శరీరంతో భూలోకపుత్రుడైన తాను తన శరీరంలో — ఉడుకు రక్తం పట్టపగ్గాలు లేకుండా పరుగెత్తుతూనే వుంది; ప్రశాంతతకు భంగకరమైన జీవబీజాలు తనలో ఇంకా మొలకలెత్తుతూనే వున్నాయి. కాని తన మనస్సు వేలాది లక్షలాది సంవత్సరాలు వెనకబడిపోయిన — ఆ భూప్రపంచంలోనే వుండిపోయింది; తన మనస్సు — దానికి అనవసరమైన దానినెంతనో అది తెలుసుకొనడంచేత, అంధకారబంధురమై, అగాధంలా వుంది. ఇంతకీ తన హేతుజ్ఞానం ఆవిష్కరించినది ఏమిటి? అంతులేని అగాధమూ, దాని కావల వున్న నూతన రహస్యాలూనూ.

వెచ్చని సూర్యకిరణాల్లో హాయిగా ఎగురుతూ పాడుకుంటూన్న పక్షిని కళ్ళు మూసుకోమని ఆజ్ఞాపించి, మానవ బుద్ధిలో అణుమాత్రపు భాగాన్ని అర్థం చేసుకుందుకు దానిని ప్రయత్నించమనండి — ఆ ప్రయాస కది వెంటనే చచ్చి వూరుకుంటుంది.

వాయునావ ఎగురుతూన్నట్టుగా హుస్‌మన్న చప్పుదు అతని చెవిని పడింది. గ్రంథాలయం తలుపు ఓరగా తెరచుకుని, అందులోంచి ఈహ తొంగి చూసి:

"ఆకాశపుత్రా! భోజనానికి దయచేయండి," అంది.

భోజనాల గదిలోకి — తాను అయిలీతతో కలిసి ఎల్లప్పుడూ భోజనం చేసేటట్టి సుపరిచితమైన తెల్లని గుండ్రని గదిలోకి — తొందరగా వెళ్ళాడు లోశ్. గదిలో ఉక్కగా వుంది. స్తంభాల నడుమ పొడుగాటి వాజుల్లోని పూలు వెచ్చని సువాసనలు వెదచల్లుతున్నాయి. కన్నీటితో తడసిన తన

ముఖం లోశ్‌కి కంటపడకుండా వుండేందుకని, ఈహ తన ముఖం అటువైపు తిప్పుకొని:

"ఈరోజు మీరు ఒక్కరే భోజనం చెయ్యాలి, ఆకాశపుత్రా!" అంది. అలా అంటూ అయిలీత కోసం వేసిన పళ్ళేన్ని తెల్లని పువ్వులతో నింపింది.

లోశ్ కళ్ళల్లో కారుమబ్బులు కమ్ముకున్నాయి. విచారగ్రస్తుడై కూచున్నాడు భోజనానికి. వడ్డించిన వస్తువులను వేలువేసైనా ముట్టలేదు — బల్లపైన వున్న బ్రెడ్డును కాస్త అలా తడిమి, ఎన్నో గ్లాసులు ద్రాక్ష సారాయి తాగాడు. బల్లపై దర్పణంతో తాపితమై వున్న కలశంలోనుంచి లీలగా సంగీతం వినవచ్చింది. లోశ్ దవడలు బిగించాడు.

గాజు కలశంలోంచి తంత్రీనాదం ఒకటీ, ఇత్తడి వాద్యస్వరం ఒకటీ — రెండు రాగాలు ఒకదానితో ఒకటి కలిసిపోతూ, మళ్ళీ విడిపోతూ, మళ్ళీ రెండూ అల్లుకొనిపోతూ, ఎన్నటికీ యథార్థాలుగా మూర్తీభవించని స్వప్నాలగురించి గానం చేస్తూ — వినబడ్డాయి. ఆశాపూరితమై నమాధి లోనుంచి పిలుస్తూ, తన చెంత రమ్మనమని వేడుకుంటూ, పునస్సంయోగాన్ని గురించి గానం చేస్తూ, ఒండొంటితో విలీనమైపోతూ, ఒండొంటి చుట్టూ గిర్రున తిరుగుతూ, పాతకాలంనాటి, పురాతన కాలపు వాల్జ్ సంగీతంలా, తారస్థాయిలో అవి విచారపూరితమై వేర్వేరుగా విడిపోయి, మళ్ళీ క్షణంలో అవి మంద్రంలో ప్రత్యక్షమవుతున్నాయి.

సన్నని కాండమున్న మద్యపు గ్లాసును లోశ్ గట్టిగా పట్టుకు న్నాడు. ఈహ స్తంభం చాటుకు వెళ్ళిపోయి, పావడ కొంగులో ముఖం పెట్టుకుని ఏడుస్తూంది. ఆమె బుజాలు గజగజ వణకుతున్నాయి. చేతిలో వున్న తువాలును కింద పడేసి, బల్ల దగ్గరనుంచి లేచాడు లోశ్. మనస్సును

వ్యాకులపరుస్తూన్న ఆ సంగీతమూ, ఘాటుగా పరిమళిస్తూన్న పువ్వులూ, మద్యరసమూ — ఇదంతా వుత్త నిరర్థకమనిపించింది.

ఊహని అడిగాడు లోశ్:

"అయిలీతని చూడ్డానికి వీలవుతుందా?"

పావడ అంచుతో మూసుకున్న ముఖం పైకెత్తకుండానే ఆమె తన ఎరుపువాగు శిరోజాలను పంకించింది. లోశ్ ఆమె బుజాలు పట్టుకుని కుదుపుతూ:

"ఏమిటి? ఏంజరిగింది? ఆమెకి జబ్బుగా వుందా ఏమిటి? ఆమెను చూసి తీరాలి నేను!" అన్నాడు.

అతని పట్టు వదిలించేసుకుని, ఆమె పరుగెత్తి పారిపోయింది. ఆ పారిపోవడంలో ఆమె చేతిలోంచి ఫోటో ఒకటి కిందకి జారి పడిపోయింది. లోశ్ దాన్ని తీసి చూశాడు — పూర్తి మిలిటరీ దుస్తుల్లో, గుడ్డటోపీ, బుజాన తోలుపట్టీ, నడుముకు పటకా, ఒక చేతితో పట్టాకత్తి పిడి, రెండో చేతితో పిస్తోలూ పట్టుకునున్న గూసెవ్ ఫోటో అది. అతని వెనకాల గ్రెనేడ్లు పేలుతున్నాయి. ఆ ఫోటో కార్డుపైన "చిన్ని ఊహాష్కకి — శాశ్వత ప్రేమతో," అని రాసి దాని కింద సంతకం వుంది.

ఆ ఫోటోని లోశ్ అక్కడ పడేసి, ఇంట్లోనుంచి బయటికి వెళ్లి, పచ్చిక బయలుమీద అడ్డుగా నడచి వెళ్ళాడు. అతడు అప్రయత్నంగా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ, తనలో తానే మాట్లాడుకుంటూ నడచాడు.

"నన్ను చూడడం ఆమెకు ఇష్టంలేకపోతే, పోనీ అలాగే ఆయెరి. మరోకొత్త ప్రపంచానికి పయనించి వెళ్లడం — ఎంతైనా ఒక అపూర్వ యత్నం కదా — పయనించి వెళ్లి సోఫాలో చతికిలబడి, ఒక స్త్రీ రాకకోసం, ఆ స్త్రీ చిరునవ్వుకోసం, అలా పడిగాపులు పడి నిరీక్షిస్తూ కూచోవడం! ఛీ,

ఎంత పనికిమాలిన పని! ఎంత పిచ్చి పని! అవును, గూసెవ్ వూరికినే అన్నాడా మరి? నిజమే. నాకు ఉన్మాదజ్వరమే తగిలింది. 'తియ్యని మందు తిని మతిపోయినవాడిలా' — ఒక మరులు చూపుకోసం నిరీక్షణా? దాని తస్సా గోసిరి, ఛీ!..''

తనలో మెదలుతూన్న ఆలోచనలు ములుకుల్లా గుచ్చుకొని బాధ పెట్టాయి. తనకేదో పన్ను సలుపుతూన్నట్టు మూలిగాడు. తన బల శక్తులను ఆలోచించుకోకుండానే, అతడు గాలిలోకి ఎత్తుగా లేచిపోయి, నేలను చేరుకున్నప్పుడు సరిగా నిలబడడమే అతనికెంతో కష్టమైపోయింది. పాంశు వర్ణపు జుట్టు గాలికి ఎగిరింది. తనమీద తనకే చెప్పడానికి వీల్లేనంతగా అసహ్యం వేసిపోయింది.

సరస్సు దిశగా పరుగెత్తి వెళ్ళాడు లోశ్; అద్దంలా నునుపుగా వుంది సరస్సు. దాని శ్యామలోపరితలంపై సూర్యకిరణ పుంజాలు ప్రతిబింబిస్తు న్నాయి. గాలి ఉక్కగా ఉంది. లోశ్ అక్కడున్న ఒక రాతిబండమీద రెండు చేతుల్తోనూ తలకాయ పట్టుకుని కూచున్నాడు.

పొడుగ్గా సూదుల్లాంటి మొనలను ఆడించుకుంటూ, వాటితో నీళ్లనూ చరుచుకుంటూ, నీళ్ళోడుతూన్న కళ్ళతో లోశ్‌కేసి చూస్తూ, గుండ్రని రక్తపు చేపలు అర్ధపారదర్శకపు అఖాతాల్లోనుంచి బద్ధకంగా నెమ్మదిగా పైకి తేలుకుంటూ వస్తున్నాయి.

''మిడిగుడ్లు మింగుతూన్న ఓ పిచ్చి చేపల్లారా! నా మాటలు వింటు న్నారా?'' అంటూ లోశ్ గొణిగాడు. ''నేను ప్రశాంతంగానే వున్నాను — నా పంచేంద్రియాలూ పూర్తిగా నా వశంలోనే వున్నాయి గనుకనే నేనిలా అంటున్నాను సుమండీ. నాలో వున్న జిజ్ఞాస నన్నుకొరుక్కు తినేస్తూంది — నల్లని గౌను వేసుకుని ఆమె నా ఎదుట పడేసరికల్లా ఆమెను నా చేతు

ల్లోకి తీసుకుని కౌగలించుకుందామనే వుంటుంది నాకు... ఆమె హృదయ స్పందనాలను చెవులారా విందామనుంటుంది... ఎన్నడూలేని కొత్త మోస్తరుగా ఎంతో బిడియపడుతూ నా చెంతకు వస్తుందిప్పుడు... ఆమె కళ్ళు అదేమిటో ఆటవికంగా మారిపోతాయి... ఓ చేపల్లారా! నా మాటలు వింటూన్నారు కదూ? నే చెప్పేదంతా ఇంతే — ఇక ఇక్కడతో ఆగిపోతా. నేనిక్కడనుంచి పారిపోతా — నా కసలు ఆలోచించాలనే లేదు. ఇక ఇది చాలు. ఈ సూత్రం ఇక్కడితో పుటుక్కుమని తెగిపోయింది — ఇక సరి. రేపే వెళ్తాను పట్నానికి. పోరాటమా? భేష్! చావా? మరీ మంచిది! సరే కాని — సంగీతం మాత్రం వద్దు, బాబోయ్! — సంగీతమూ వద్దు, పువ్వులూ వద్దు, ఏ దుర్బుద్ధులూ వద్దు. ఈ ఉష్ణగృహ వాతావరణానికో నమస్కారం. ఆమె చేతిలో వున్న ఇంద్రజాలపు గోళానికి — దానికో నమస్కారం. దాని తస్సాదియ్యా! అంతా మోసమూ, మిథ్యానూ!''

లోశ్ లేచి, అక్కడున్న రాళ్ళల్లో ఒక పెద్ద రాయి ఏరి, సరస్సులో వున్న చేపల మందలోకి విసిరాడు. కణతలు పేలిపోతాయేమో అన్నంతగా తల పోటుపెట్ట నారంభించింది. వెల్తురికి కళ్ళు మండుతున్నాయి. చిట్ట డవికి ఆవలగా వున్న పర్వతపంక్తుల్లోని శిఖరం ఒకటి ఆకాశాన్ని అందుకుం టూంది. ''చల్లని గాలి పీల్చగల్గితే బాగుణ్ను, ప్రాణం లేచొస్తుంది బాబూ!'' అనుకున్నాడు లోశ్. ధగధగమని వెలుగుతూన్న ఆ పర్వతశిఖరంకేసి కళ్ళు చికిరించి చూసి, ఆ కొండకొనకేసి ఆ వినీలవనంగుండా బయల్దేరాడు.

కొంత దూరం నడవగా, వనంలోంచి బయట కొచ్చేసరికి, కొండ పైన పీఠభూమిని చేరుకున్నాడు లోశ్. భయానకంగా దిక్కుమాలినట్టుందా ప్రదేశం. పీఠభూమి ఆవలి అంచున వుంది తళ్కులు విరజిమ్ముతూన్న ఆ పర్వతశిఖరం. ఏమైనా సరే ఆ శిఖరం చేరుకొని తీరాలనే పట్టుదలతో,

రాళ్లనూ ఇటుక బెడ్డల పోగులనూ, చిట్టెపు గుట్టలనూ కాళ్లతో తన్ను కుంటూ అలా నడిచి వెళ్ళాడు. చుట్టుపక్కల ఎక్కడ చూసినా పాడుపడిన గనుల సొరంగాలు బావురు బావురుమంటూ నోళ్లు తెరచుకునున్నాయి. ఎంతదూరం నడచైనా సరే వజ్రంలా మెరుస్తూన్న ఆ హిమరాశిని చేరు కుని తీరాలనుకున్నాడు లోశ్.

ఎక్కడో దూరంగా వున్న లోయలోనుంచి గోధుమవర్ణపు ధూళి మేఘం ఆకాశంలోకి లేస్తూంది. ఉడకపోస్తూన్న గాలిలో అనేక కంఠాలు మిళిత మైన ధ్వని వినబడుతూంది. ఒక కొండ ఎక్కి చూసేసరికి, అంగారక వాసుల పెద్ద గుంపొకటి ఎండిపోయున్న కాల్వగర్భం వెంట అలా నడుస్తూండ డం కనబడింది లోశ్‌కి. వాళ్లు పిక్కాసులూ, సుత్తులూ, పొడుగాటి కోలలూ పట్టుకుని నడుస్తున్నారు. ఆ కోలలకు చివర కత్తులు బిగించి వున్నాయి. చేత వున్న పరికరాలను వూపుతూ భయంకరంగా అరుస్తూ తొక్కుటు కుంటూ నడుస్తున్నారు వాళ్ళు. వాళ్లు అలా ముందుకు సాగుతూండగా వాళ్ల వెనుక లేచిన ధూళిమేఘాలపైన వలయాలు తిరుగుతున్నాయి పెద్ద పెద్ద రాబందులు.

పట్నంలో అల్లర్లుగా వున్నాయంటూ గూసెవ్ చెప్పిన సంగతులు ఇప్పుడు లోశ్‌కి గుర్తుకొచ్చాయి. ''జీవించు, యుద్ధం చేయి, జయించు, నశించు — కాని సుఖసౌఖ్యాలు ఎరగని నీ వైరిమొగ్గరి హృదయానికి మాత్రం కళ్లెం తగిలించే వుంచు.''

కొండల వెనకాతల ఆ అంగారకవాసులు అదృశ్యులైపోయారు. మనస్సులో మెదలుతూ కొట్టుమిట్టాడుతూన్న ఆలోచనలవల్ల ఆందోళన పడుతూ లోశ్ ఇంకా అలా నడిచివెళ్ళాడు. నడుస్తూన్నవాడల్లా తటాలున ఆగి, తలకాయ వెనక్కి తిప్పి చూశాడు. వినీల ఆకాశంనుంచి గాలిపడవ

ఒకటి దిగుతూంది. ఎత్తుగా ఎండలో మెరుస్తూ, నాలుగు చక్కర్లు కొట్టి, అంతకంతకు మరింత కిందుగా దిగి, చద్రున తనవిూదనుంచే వెళ్ళి నేలపై వాలింది.

మంచులా తెల్లగా వున్న బొచ్చుకోటు తొడుక్కున్న వ్యక్తి ఎవరోగాని ఆ గాలివోడలో నిలబడి వుండడం లోశ్ చూశాడు. శిరస్త్రాణపు బొచ్చు అంచులనుంచి తొంగిచూస్తూ, ఆందోళనతో నిండిన కళ్లను చూసి, ఆ వ్యక్తి అయిలీత అని లోశ్ వెంటనే పోల్చుకున్నాడు. లోశ్ గుండెలు సమ్మెట బాదుల్లా కొట్టుకొంటూ, శరీరంలో వేడి కెరటాలను పరుగెత్తించింది. లోశ్ నౌకను సమీపించగా, చెమ్మగిలిన బొచ్చు హెల్మెట్టును అయిలీత తన నుదిటి నుండి వెనక్కి తోసుకుంది. తన కళ్లలో కోర్కెలు ఉట్టిపడుతూండగా, తన చూపులను ఆమెపై సారించాడు లోశ్.

"నీ కోసమే వచ్చాను నేను. పట్నంనుంచి వస్తున్నాను. మనం వున్నపాటుగా తప్పించుకుని పారిపోవాలి. నీ కోసం నేనెంతో బెంగ పెట్టుకున్నాను — ఆ బెంగతో బతుకుతాననుకో లేదు."

లోశ్ గాలిపడవ పార్శ్వాన్ని పట్టుకుని దీర్ఘంగా నిట్టూర్చాడు.

# వశీకరణం

అయిలీత వెనుకను కూచున్నాడు లోశ్. గాలిపడవ పైలట్ — కుర్రాడు, ఎర్రని ముఖం — నౌకను సాఫుగా ఆరోహణం చేయించాడు ఆకాశంలోకి.

శీతలవాయువు ఎముకలను కొరికేస్తూంది. అయిలీత తొడుక్కున్న తెల్లని బొచ్చుకోటు మంచు వాసనవేస్తూ, పర్వతపు పెనుగాలుల పరిమ

శాన్ని విరజిమ్ముతూంది. ఆమె లోశ్ వైపు చూసింది. ఆమె చెక్కిళ్ళు ఎర్రగా నిగనిగలాడుతూ మెరుస్తున్నాయి.

"నాన్నగారిని చూశాను. నిన్నూ నీ మిత్రుడినీ విషం పెట్టి చంపేయమని ఆయన నన్ను ఆజ్ఞాపించారు," అందామె. ఆమె మాటల సందున ఆమె పల్వరుస మెరుపులు మెరుస్తూంది. అంతవరకూ బిగించిన పిడికిలిని ఆమె విప్పుకోగా, వేలి వుంగరానికున్న సన్నని గొలుసు చివర చిన్న సీసా ఒకటి వేలాడుతూండడం అతడు చూశాడు. " 'వాళ్ళని ప్రశాంతంగానే చచ్చిపోనిద్దాం — పాపం వాళ్ళు అనాయాస మరణానికి పాత్రులే,' అన్నారు నాన్నగారు," అందామె.

అయిలీత బూడిదరంగు కళ్ళు కన్నీటితో నిండిపోయాయి. కాని నవ్వుతూనే, తన వేలికున్న వుంగరాన్ని తీసేసింది. లోశ్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"దాన్ని పారేయకు," అంటూ, ఆమె చేతిలోంచి ఆ చిన్న సీసాను తీసుకుని, తన జేబులో పెట్టుకున్నాడు లోశ్. "ఇది నీ కానుక, అయిలీత. నల్లని చుక్క ఒక్కటి చాలు — నిద్ర, శాంతి. ఇప్పుడు — నువ్వే నా జీవమూ, నా మరణమూనూ." తన ముఖం ఆమె ముఖానికి దగ్గరగా పెట్టి అన్నాడు: "భయానకమైన ఆ ఏకాంత క్షణం ఆసన్నమయేటప్పుడు, ఈ బిందువులో నీ దర్శనం నాకు లభించుతుంది."

ఆ మాటలు అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తూ అయిలీత కళ్ళు మూసుకుని అతన్ని ఆనుకుని కూచుంది. కాని ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది — ఆమెకేమీ అర్థమైందికాదు. హోరుమని రొద చేస్తూన్న గాలీ, ఆమె వీపును తాకుతూన్న అతని వేడి వక్షస్థలమూ, బొచ్చుకోటుకింద ఆమె భుజంపై ఆనుకొనున్న అతని చేయీ — వారిద్దరి

శరీరాల్లోనూ వున్న రక్తం ఏకనాళంలోనుంచే ప్రవహించుతూన్నట్టే అనిపించింది వారిద్దరికీనీ. విద్యుల్లతలా మెరుస్తూన్న ఏదో ఆదిమమైన స్మృతిదిశగా సమిష్టి శరీరంతో ఆకాశంలో విహరించుతూ, సమిష్టి ఆనందాను భూతిని చవిచూచారు వారిద్దరూ. అయినప్పటికీ, ఏమీ లాభం లేక పోయింది — అతని మాటల అర్థం ఆమె గ్రహించుకో లేకపోయింది!

నిమిషం పైచిలుకు గడచింది. గాలిపడవ తుస్కాబ్ జమీని సమీపించింది. పైలట్ కుర్రాడు వెనక్కి తిరిగి చూశాడు: అయిలీత, ఆకాశపుత్రుడు — ఇద్దరూ అదేమిటో చిత్రంగా అవుపడ్డారు. వారి కంటిపాపలలో చిన్నచిన్న సూర్యబింబపు తునుకలు ప్రకాశిస్తున్నాయి. అయిలీత తొడుక్కున్న తెల్లని మంచుతెలుపు కోటు బొచ్చు గాలికి రేగుతూంది. చుట్టూ ఆవరించి వున్న ఆకాశాంబుధిని ఆనందపారవశ్యంతో వీక్షించుతూంది అయిలీత.

పైలట్ కుర్రాడు తన సూదిముక్కును తన కోటుకాలరులోకి చొనుపుకొని, నిశ్శబ్దంగా నవ్వుకున్నాడు. అతడు గాలిపడవను ఎడమ రెక్కపై ఆనించి వాలుగా మలుపు తిప్పించి, సరాసరి కిందుగా దిగి, గాలిపడవ ఇంటి పక్కనే వాలేటట్టు దానిని నేలమీద దింపాడు.

అయిలీత వశీకరణ స్వప్నంలోంచి మేల్కొంది. తన కోటుకున్న పక్షిశిరస్సు బొత్తాములను విప్పుకొందుకు ప్రయత్నించడంలో ఆమె చేతి వేళ్లు తడబడ్డాయి. లోశ్ ఆమెను తన చేతుల్లో ఎత్తుకుని గాలిపడవలో నుంచి పచ్చిక నేలపై దింపి, ఆమెకు వెనుకగా ఆమెపై వంగి నిలబడ్డాడు. ఆ పైలట్ కుర్రాడితో:

''టాపు వేసిన గాలిపడవను సిద్ధంగా వుంచు,'' అంది అయిలీత.

ఏడ్చి ఏడ్చి ఎర్రగా వాచిపోయున్న ఈహొష్క కళ్లనుగానీ, హడిలి పోతూన్న ఆ అతిథిగృహపు గుమాస్తా పసిమివర్ణపు ముఖాన్నిగానీ అయిలీత

చూడనే లేదు. ఇంట్లోకి వెళ్తూ, దారిలో మందహాస వదనంతో పరధ్యానంగా, ఇంటి వెనుక భాగంలో వున్న తన గదుల్లోకి ఆమె తీసుకెళ్ళింది లోశ్‌ను.

అదే మొదటిసారి అయిలీత గదుల్లోకి అతడు అడుగు పెట్టడం. గదుల సరంబీలు ఎత్తుగా విలువంపుగా బంగారంతో మలామాచేసి వున్నాయి. చైనీయులు తమ గొడుగులపై చిత్రీకరించే ఛాయాచిత్రాల్లాంటి చిత్రాలు గోడలనిండా వున్నాయి. సువాసన ద్రవ్యాలతో ఘాటుగా పరిమళించుతూన్న వెచ్చని గాలికి తల తిరిగినట్టయింది అతనికి.

అయిలీత మెల్లగా అంది:

"ఇలా కూచో."

ఆమె మాట ప్రకారం లోశ్ కూచున్నాడు. అతని పాదాలదగ్గర ఆమె చతికిలబడి, అతని మోకాళ్లపై తన తలపెట్టుకుని నిశ్చలంగా కూచుందామె.

ఎత్తుగా కొప్పుముడి పెట్టుకున్న ఆమె తెల్లని తలకట్టుపై లోశ్ తన చూపును సారించి, తన చేతిని ఆమె చేతిపై వుంచాడు. ఆమె మెడ గజగజ వణకింది. లోశ్ ఆమెపై వంగాడు. అతనితో ఆమె ఇలా అంది:

"నేనంటే నీకు విసుగ్గా వుంది కాబోలు? నన్ను క్షమించు. ప్రేమించ డమెలాగో నాకింకా తెలియడంలేదు. అదంతా ఏమిటో నాకు అవ్యక్తంగానే వుంది. 'అతను భోజనాల గదిలో వున్నప్పుడు, గదిలో పువ్వులు మామూలు కంటె హెచ్చుగానే వుంచి, ఉల్లా వాద్య సంగీతం అతనికి వినబడేటట్టు చూడు' అని చెప్పాను ఈహతో."

అతని మోకాళ్లపై తన మోచేతులను ఆనుకుంది అయిలీత. కలలు కంటూన్నట్టుంది ఆమె ముఖం.

"ఆ గానం నీకు వినబడిందా? నీకది అర్థమైందా? అప్పుడు నువ్వు నన్ను తల్చుకున్నావా?" అని అడిగిందామె.

"నువ్వు అవుపడకపోతే నీకేమి ప్రమాదం సంభవించిందో అని దిగులుతో నాకు పిచ్చెత్తినట్టే వుంటుందన్న సంగతి నువ్వీపాటికి తప్పకుండా గ్రహించే వుంటావు. ఇక నిన్ను చూడగానే మరింత దిగులు పట్టుకుంటుంది నాకు. నీమీద నాకున్న కోర్కె నక్షత్రాలు దాటించి నన్నిక్కడికి తరుముకొని వచ్చినట్టు అనిపించుతూంది నాకు," అన్నాడు లోశ్.

అయిలీత నిట్టూర్చింది. ఆమె ముఖంలో ఆనందం ఉట్టిపడుతూంది.

"నీకు విషం పెట్టమని నాన్నగారు నన్ను ఆజ్ఞాపించారు. ఆజ్ఞాపించారే గాని, నా మీద ఆయనకి నమ్మకం లేకపోయింది. 'మిమ్మల్నిద్దరినీ చంపేస్తాను' అన్నారాయన. మనకిక ఎన్నో గడియలు లేవు. అయినా, మనకి మిగిలి వున్న ఈ నాల్గు గడియలూ అనంతకాలాన్ని ఆనందభరితంగా ఆహ్వానిస్తూ ఆవిష్కరించుతూన్నట్టు లేదూ నీకు?" అని అడిగింది ఆమె.

లోశ్ కళ్లలో నిర్దాక్షిణ్యమైన నిర్ణయం ఒకటి మెరుపులా మెరవడం ఆమె గమనించి, మౌనంగా వుండిపోయింది.

"సరే," అన్నాడు లోశ్. "నేను పోరాటానికే నిశ్చయించుకున్నాను."

అయిలీత అతనికి మరింత దగ్గరగా జరిగి, అతని చెవిలో చెప్పింది:

"నా చిన్ననాటి కలల్లో అవుపడిన మహామనీషివి నువ్వే. నువ్వు దివ్యసుందరమూర్తివి, బలశాలివి, పరాక్రమశాలివి, దయాళుడవు. నీ చేతులు ఉక్కుచేతులు. నీ ముంగాళ్ళు రాతికంబాల్లాంటివి. నీ కళ్ళల్లోనే వుంది మారణశక్తి. నీ చూపు తాకితేనే చాలు హృదయం భారంగా తోస్తుంది స్త్రీలకి."

అయిలీత తన తలను అతని బుజాలపై తేలిగ్గా వాల్చింది. ఆమె మాట్లాడుతూంటే ఆమె మాటలు అంతకంతకు అదొక మర్మరధ్వనిలా అవ్యక్తంగా అస్పష్టంగా మారిపోతున్నాయి. ఆమె ముఖంపై పడుతూన్న ముంగురులను లోశ్ వెనక్కి నిమిరాడు.

"ఏం, నీ వంట్లో బాగులేదా?" అని అడిగాడు లోశ్.

అతని ప్రశ్న విని ఆమె తీవ్రోద్వేగంతో, చిన్నపిల్లలకు మల్లేనే తన చేతులు రెండింటితోనూ అతని మెడచుట్టూ పెనవేసుకుంది. ఆమె కంటి నుండి కన్నీరు పొంగి కట్టుతెంచుకుని పొరలి, పెద్ద కన్నీటిబొట్లు ఆ చిన్ని కోలముఖంనుంచి ధారాపాతగా ప్రవహించి నేల రాలాయి.

"ప్రేమించడం ఎలాగో నాకు తెలియడంలేదు," అందామె. "ప్రేమ అంటే ఏమిటో నేన్నడూ ఎరుగను... నాపై కరుణించు. నన్ను వదిలిపెట్టి వెళ్లిపోకు. నీకు ఎన్నో విషయాలు చెబుతాను. భయానకమైన ధూమకేతువుల గురించి, వాయునావల యుద్ధం గురించి, పర్వతాల కావల వుండిన సుందరభూమి అంతర్థానం గురించి నీకు చెబుతాను. ఇవి వింటూంటే నన్ను ప్రేమించడం నీ కెంత మాత్రం విసుగ్గా వుండదు. ఈనాటివరకూ నన్నెవ్వరూ ముద్దాడలేదు. నిన్ను తొలిసారి చూసినప్పుడే అనుకున్నాను: 'ఇతడే నా కలల్లో కనబడిన మహామనీషి!' అని. నీ చేతుల్లో నన్నెత్తుకుని నీతో కూడా నన్ను తీసుకుపోతే బాగుణ్ణు అనుకున్నాను. ఇక్కడంతా అంధకారమయం, నిరాశాపూరితం — అచ్చంగా మృత్యువులాగానే. సూర్యునికి వెచ్చదనమే లేదు. ధ్రువశిఖరాల మంచు కరగడమంటూ మానేసింది. సముద్రాలు హరించుకుపోతున్నాయి. ఎక్కడ చూసినా అనంతమైన ఎడారి తప్ప మరొకటి కనబడ్డంలేదు. తూమ ఖండాన్ని రాగి ధూళి కప్పేస్తూంది... భూలోకం, భూలోకం... ఓ మహామనీషీ, నన్ను భూలోకానికి తీసుకుపో! పచ్చని

కొండలను, జలపాతాలను, మేఘాలను, మహామృగాలను, మహామనీషులను నాకు చూడాలని వుంది... నాకు చచ్చిపోవాలని లేదు, ముమ్మాటికీ లేదు..."

అయిలీత భోరున ఏడ్చేసింది. 'మహామనీషుల' గురించి ఆమె చిన్న పిల్లలా చేతులు తట్టుతూ అన్నప్పుడు అతనికి నవ్వూ వచ్చింది, సానుభూతీ కల్గింది.

కన్నీటితో చెమ్మగిలిన ఆమె కళ్లను అతడు ముద్దుపెట్టుకున్నాడు. ఆమె సంబాళించుకుంది. తన చిన్ని మూతిని ముందుకు పొడుచుకుంది. ముఖం పైకెత్తి తన స్వాప్నిక మహామనీషికేసి, ఆకాశపుత్రునికేసి, ప్రేమ నయనాలతో వీక్షించింది.

తటాలున మెల్లని ఈల శబ్దం ఒకటి ఆ గది మునిచీకటిని దూసుకుపోయింది. దానితో తన డ్రెస్సింగ్ టేబిలు మీద వున్న అండాకృతి తెరపై వెలుగు పడింది. తెరపైన తుస్కాబ్ ముఖం ఆమెకేసి నిదానంగా చూస్తోంది.

"అక్కడే వున్నావా నువ్వు?" అని అడిగాడతడు.

చెంగున పిల్లిలా తివాసీ మీదకి గంతేసి, అయిలీత తెరదగ్గరకి పరుగెత్తింది.

"నేనిక్కడే వున్నాను, నాన్నా," అందామె.

"ఆకాశపుత్రులు ఇంకా ప్రాణాలతోనే వున్నారా ఏమిటి?"

"లేదు, నాన్నా. వారికి విషంపెట్టేశానే. వారు చచ్చిపోయారు."

కఠినంగానూ నిర్దయగానూ ధ్వనించింది అయిలీత కంఠం తండ్రికి లోశ్ కనబడకుండా వుండేందుకని, తన వీపు లోశ్‌కేసి తిప్పి, తండ్రితో మాట్లాడింది ఆమె.

"నేను చెయ్యాల్సింది ఇంకేదేనా వుందా, నాన్నా?" అని అడిగిందామె.

తుస్కాబ్ ప్రత్యుత్తర మివ్వలేదు. ఆమె బుజాలు కల్లోలితమైన మహాసముద్రంలా కిందకీ మీదకీ లేస్తున్నాయి. మెడ వెనక్కి వాలిపోయింది. భీషణకంఠంతో అతడు చర్రుమన్నాడు:

"నువ్వు అబద్ధాలాడుతున్నావు. ఆకాశపుత్రుడు నగరంలో వున్నాడు. తిరుగుబాటుకు అతడు నాయకత్వం వహిస్తున్నాడు!"

అయిలీత స్పృహ తప్పిపోయినట్టు జోగిపోయి తూలిపోయింది. తెర మీదనుంచి తండ్రి ముఖం మాయమైపోయింది.

# పురాతన గీతం

అయిలీత, ఈహొష్క, లోశ్ – ముగ్గురూ నాల్గు రెక్కల గాలి పడవలో బయల్దేరి లిజియజీర పర్వతాలకి వెళ్ళారు.

విద్యుదయస్కాంత తరంగ సంగ్రాహకం – పడవస్తంభపు కొనను పైకి విప్పారుకున్న తీగెల కుచ్చు – ఎడతెరిపి లేకుండా పనిచేస్తూనే వుంది. అయిలీత ఆ సంగ్రాహకంపై వంగి, దానినుండి వస్తూన్న ధ్వనులనూ మాటలనూ ఆలా వింటూ, ఏమిటి జరుగుతూందో తెలుసుకుంటూంది.

అంగారకగ్రహపు ఆయస్కాంతిక క్షేత్రాలలో కలగా పులగంగా గిర్రున పరుగెత్తుతూన్నట్టి ఉద్రేకభరితములైన టెలిఫోను వార్తాలూ, పిలుపులూ, కేరింతలూ, ఆందోళనాపూరితములైన ప్రశ్నల గందరగోళంలో ఏదీ స్పష్టంగా అర్థంచేసుకుందుకూ ఆమెకి వీలైందికాదు. అయినప్పటికీ ఆ రణగణ ధ్వనిని మించిపోయిన కంఠంతో మారుమోగుతూన్న

తుస్క్యాబ్ కఠోర కంఠం ఆ అల్లకల్లోలాన్ని చీల్చుకొని బయటికి వచ్చి, ఒక మోస్తరుగా స్పష్టంగానే వినబడుతూంది. కల్లోలిత ప్రపంచానికి చెందిన ఆకారాలు గాజుతెరమీద, తుర్రుతుర్రున పరిగెత్తుతున్నాయి.

బొంయ్‌మంటూ బొబ్బరించుతూన్న కొత్త గొంతు ఒకటి అయి లీత చెవిని పడింది:

"కామ్రేడ్స్! గాలికబుర్లు మోసుకొచ్చేవారి మాటలు వినకండి... మనకి రాయితీలు అసలు అక్కర్లేదు... ఆయుధాలు ధరించండి, కామ్రేడ్స్! సమయం ఆసన్నమైంది — సర్వాధికారమూ... సోవి... సోవి... సోవి..."

ఈహౌష్కవైపు తిరిగి అయిలీత అంది:

"నీ స్నేహితుడు మంచి ధైర్యశాలే, నిజమైన ఆకాశపుత్రుడు! అతడంటే నీకే భయమూ అక్కర్లేదు."

మేకలాగున ఈహౌష్క కాలు నేల కొట్టి, తన ఎర్రజుట్టు తల కాయ పంకించింది. తాము గాలిపడవ యానం ఇంకా రహస్యంగానే వుందనీ, ఆ సంగతి ఇంకా ఎవ్వరూ పోల్చుకోలేదనీ అయిలీతకు స్పష్టమైంది. చెవులకు తగిలించుకున్న శ్రవణ సాధనాన్ని ఆమె తీసివేసి, చెమ్మగిలి మబ్బు పట్టిన కిటికీ అద్దాన్ని తన అరచేతితో తుడిచేసింది.

"చూడు!" అంది అయిలీత లోశ్‌తో, "ఇహి పక్షులు మనవెంట పడుతున్నాయి."

అంగారక గ్రహాకాశంలో ఎత్తున ఎగురుతూంది గాలిపడవ. గోధుమ రంగు రోమంతో పలుచని చర్మం వుండి గబ్బిలపు రెక్కల్లాంటి అల్లిక రెక్కలు విప్పారించుకున్న జంతువులు రెండు గాలిపడవకు ఇరువైపులా ఎగురుతూన్నట్టు ఆ తీక్ష్ణమైన వెల్తురులో వారికి కనబడింది. కొమ్ముతో నిర్మితమైన వాటి బల్లపరుపు ముక్కులను అవి నౌక కిటికీలకేసి తిప్పి ఎగు

రుతున్నాయి. లోశ్‌ను చూసి, ఆ రెంటిలో ఒకటి కిటికీ అద్దాన్ని చటుక్కున ముక్కుతో ఒక్క పోటు పొడిచింది. లోశ్ చప్పున ముఖం తిప్పేసుకున్నాడు. అయిలీత ఫక్కున నవ్వింది.

మరికాస్సేపటికల్లా అజోరా వెనకబడిపోయింది. కిందనున్న లిబియజీర శిఖరాలు అవుపడ్డాయి. గాలిపడవ కాస్త కిందుగా సోఅమ్ సరస్సుపై ఎగిరి, అగాధం మీదకి పొంచి వున్న విశాల పర్వత సానువుపై వాలింది.

లోశ్, పైలట్ కుర్రాడూ — ఇద్దరూ కలిసి గాలిపడవను ఒక గుహలోకి లాక్కొని వెళ్ళి, దానిలో తెచ్చిన సామాను బుట్టలను దింపి, వాటిని బుజంమీద మోసుకొచ్చి, కాలగమనంవల్ల అరిగిపోయి ఇంచుమించు కనబడకుండా వున్న మెట్లమీదనుంచి, ఆడంగులు ఇద్దరి వెంట లోయలోకి దిగారు. అయిలీత చిన్నచిన్న అడుగులు వేసుకుంటూ సునాయాసంగా ముందు నడుస్తోంది. మెట్ల పక్కలంట పొడుచుకొస్తోన్న రాళ్ళ అంచులు పట్టుకుని దిగుతూ ఆమె లోశ్‌కేసి నిదానంగా చూసింది. అతడి జాంబవంతుని అంగల కిందనుండి రాళ్ళ తప్పున తూలుతున్నాయి, ఆ అడుగుల చప్పుడు లోయలో బోలుగా మారుమోగుతూంది.

"ఉన్ని చిలప వేలగట్టిన తన కర్రను చేతబుచ్చుకుని మగత్రీత్ల్ ఇక్కడికే వచ్చాడు," అంది అయిలీత. "పవిత్రాగ్ని వలయం నీకిప్పుడు అవుపడుతుంది, చూస్తోండు."

కొండచరియ సగం దిగేసరికి ఆ మెట్లు కొండలో వున్న ఇరుకాటి సొరంగంలోకి దారితీశాయి. సొరంగంలో వున్న సందులు చెమ్మవాసన కొడుతున్నాయి. రాతి అంచులను బుజాలతో రాసుకుంటూ, వీపు వంచి, నున్నగా గచ్చుచేసిన సొరంగపు గోడల మధ్యనుండి లోశ్ అమిత కష్టంతో ముందుకు నడిచాడు. అతడు తడుముకుంటూ అయిలీత బుజాలను పట్టుకున్నాడు.

తక్షణమే ఆమె శ్వాస అతని పెదవులను తాకింది. అతడు రష్యన్ భాషలో ఆమె చెవిలో అన్నాడు: "హృదయేశ్వరీ!"

సొరంగంలోంచి ఒక గుహలోకి వెళ్ళారు. చిరుచీకటిగా వుంది గుహ. చుట్టుపక్కలంతా బసాల్ట్ శిలాస్తంభాలు మెరుస్తున్నాయి. గుహ ఆవలి చివరనుంచి వలుచని ఆవిరి మబ్బులు లేస్తున్నాయి. ఎక్కడో జలజలమంటూ నీటి చప్పుడు వినబడుతూంది. చీకట్లో ఆ సరంబీ కప్పులనుండి టప్పు టప్పుమని నేలరాలుతూన్న నీటిచుక్కల ఏకస్వర నాదం ఎక్కడనుంచో వినబడుతూంది.

అయిలీత ముందు నడుస్తూ దారితీస్తూంది. ఆమె నల్లని కేప్, మొనతేలిన టోపీ, సరస్సుపై తేలుతూన్నట్టు కనబడుతూ, ఆవిరి మబ్బుల్లో పదేపదే అదృశ్యమైపోతున్నాయి. ఆ అంధకారంలోంచి ఆమె గొంతు లోశ్ చెవినిబడింది: "జాగ్రత్త!" మరి కాస్సేపటికి ఆమె మూర్తి ఒక పురాతన వారధి నిటారు కమానుకింద అవుపడింది. లోశ్ అడుగులు వేసేసరికి, ఆ అడుగుల భారంకింద ఆ వారధి కమాను పైకప్పు గజగజ వణకింది. కాని ఆ చీకటిలో ఆమె కేప్ తేలిపోతూండడం తప్ప అతనికి మరేమీ అవుపడ లేదు.

అలా వెళ్తూండే సరికి వెలుగు అవుపడింది. సొరంగం పైకప్పునుండి వేలాడుతూన్న స్ఫటికాలు తళతళ మెరుస్తున్నాయి. గుహ ఆఖరై, గుహ చివర పొట్టి రాతిస్తంభాల ప్రాంగణం కనబడింది. ఈ ప్రాంగణం ఆవల, సందె సూర్యుని కిరణాలలో ప్రక్షాళన మవుతూన్న లిజియజీరా పర్వత శిఖరాగ్రాలూ, కొండల్లోవున్న నీటి రిజర్వాయర్ల దృశ్యమూ ప్రత్యక్షమయాయి.

ఆ స్తంభాల ప్రాంగణం ఆవల వుంది ఎర్రని పాకుడు పెరిగిన విశాల చప్పరం. చప్పరం అంచుకింద అంతులేని అగాధం. ఇంచుమించు

పైకి అవుపడీ అవుపడని మెట్లూ, బాటలతో పాతాళగుహల్లో కట్టిన నగరం ఒకటి బయల్పడింది. చప్పరం నడిమధ్య వుంది, నేలలో సగం దిగబడిపోయి, నాచు మొక్కలు దట్టంగా మొలచిన పవిత్ర ద్వారం. అది బంగారపు శిలలతో నిర్మించిన పెద్ద శవపేటిక. దానిమీద నాల్గువైపులా పక్షుల చిత్రాలూ మృగాల చిత్రాలూ మొరటుగా చెక్కి వున్నాయి. పేటికపైన — నిద్రిస్తూ వున్న అంగారకవాసి శిలా విగ్రహం — ఒక చేయి తల కిందనూ, రెండో చేతితో ఉల్కా వాద్యాన్ని తన గుండెలకు హత్తుకుంటూ వున్నట్టూ — చెక్కి వుంది. ఈ చిత్రమైన శిల్పం చుట్టూ స్తంభ ప్రాంగణ శిథిలాలున్నాయి.

పవిత్ర ద్వారం ఎదుట అయిలీత మోకాళ్లపై పడి మోకరించి, నిద్రించుతూన్న అంగారకవాసి హృదయాన్ని ముద్దుపెట్టుకుంది. ఆమె మళ్ళీ లేచేసరికి ఆమె ముఖం విచారగ్రస్తమై శాంతంగా వుంది. ఈహ కూడా నిద్రించుతూన్న అంగారకవాసి పాదాలను కౌగలించుకుని తన కంటికి అద్దుకుంది.

ఎడమచేతివైపు ఒక పర్వతశిలా కుడ్యం వుంది. ఆ కుడ్యంపైన అంతా సగం చెరిగిపోయిన శిలాశాసనాలు చెక్కి వున్నాయి. బంగారంతో మలచిన ముక్కోణపు ద్వారం ఒకటి ఆ రాతిగోడలో అమర్చి వుంది. ఆ ద్వారం చుట్టూ మొల్చి వున్న నాచుపెళ్లలను లాగిపారేసి, ఎంతో ప్రయాసంతో లోశ్ ఆ ద్వారం తలుపు తెరిచాడు. లోపల వుంది ద్వారపాలకుని పురాతన గృహం — రాతి బెంచీలూ, నిప్పుల పొయ్యీ, నల్లసానపు రాతిలో చెక్కిన మంచమూ వున్న చీకటి గుహ. గుహ నేలపై ఈహ చాప పరచి, అయిలీత కోసం పక్కవేసి, గుహ సరంబీనుంచి వేలాడుతూన్న దీపపు ప్రమిదలో

నూనె పోసి దీపం వెలిగించింది. గాలిపడవ దగ్గర కాపలా వుండేందుకని పైలట్ కుర్రాడు పడవ దగ్గరకు వెళ్లిపోయాడు.

అయిలీత, లోశ్‌లు ఇద్దరూ అగాధపు అంచున కూచున్నారు. శిలాగ్రాల వెనుక సూర్యుడు అస్తమిస్తున్నాడు. భయానకమైన కారు నీడలు అక్కడక్కడ వెడల్పాటి బీటలువారిన కొండలవెంట విస్తరించి వున్నాయి. ఆ ప్రదేశం గొడ్డుపోయి, హృదయ విదారకంగా, కిరాతకంగా వుంది. భూలోకంనుంచి దిగివచ్చిన మానవుల బారినుండి తప్పించుకుందుకు పురాతన కాలపు అయోల్ తెగలు తలదాచుకున్న పర్వతాలు ఇవి.

"ఎన్నో శతాబ్దుల కిందట ఈ పర్వతాల నిండా వృక్షకోటి విలసిల్లేది," అంటూ చెప్పకొచ్చింది అయిలీత. "లెక్కకు మించిన హోషి మందలు ఇక్కడ మేతమేస్తూండేవి. లోయల్లో జలపాతాలు ప్రవహించుతూండేవి. ఇప్పుడు తూమ మరణావస్థలో వుంది. శతసహస్రాబ్దుల వలయం అంతకంతకు కుంచించుకుంటూంది. బహుశ మేమే కడపటి అంగారకవాసుల మేమో — మా తరువాత తూమ శూన్యమైపోతుంది."

అయిలీత మౌనంగా వూరుకుంది. మొసలి వీపుమీద రంపపు పళ్లలాంటి మొటికలను పోలిన పర్వత శిలాగ్రాల చాటున సూర్యుడు అంతర్థానమైపోయాడు, అంతర్థానమైపోతూ ఆకాశాన్ని నింపిన రక్తకాంతులు తోపువర్ణపు సంజ చీకటితో మిళితమైపోతున్నాయి.

"కాని, ఇలా జరగదనే నా హృదయం చెబుతూంది." అలా అంటూ అయిలీత అక్కడనుంచి లేచిపోయి, ఎండిపోయిన నాచు మొక్కలనూ చిదుగులనూ ఏరుతూ, కొండ చరియ అంచు వెంటే నడిచింది. ఏరిన చిదుగుల పోగును తన కేప్ వొడిలో పెట్టుకుని, లోశ్ దగ్గరకు వచ్చి, మంట వెలిగించేందుకని వాటిని పేర్చింది. తరువాత ఆమె గుహలోకి వెళ్లి, దీపం తెచ్చి,

మోకాళ్లమీద కూచుని, చిదుగులనూ ఎండు నాచునూ రాజబెట్టింది. మరోనిమిషానికల్లా ఫెళఫెళమంటూ భోగిమంట వెలిగింది.

అప్పుడు అయిలీత అక్కడ కూచుని, తన కేప్‌లోంచి ఉల్లా వాద్యాన్ని తీసి, మోకాళ్లపైన చేతులు ఆనుకుని, తీగలు మీటించింది. వాద్యనుంచి మధురస్వరం ఝూంకారం చేస్తూ ధ్వనించింది. నిశీధినీ ఆకాశంలో మిణుగురు మంటూ ప్రకాశిస్తూన్న నక్షత్రాలకేసి శిరస్సు పైకెత్తి విషాదభరితమైన మెల్లని గొంతుతో అయిలీత గానం చేసింది:

ఎండు గడ్డిని, పసుల పేడను, చిరుత చిదుగుల నేరుకో.
ఏర్చి తెచ్చీ, నేర్పున పేర్చుకో.
రాతిని రాతితొ రాపాడించూ, నాతివి నీవు ఆత్మలు రెండింటినీ.
నిప్పుల రవ్వల రప్పించూ, అగ్ని జ్వాలల నాహ్వానించూ.
వెచ్చని సెగ చెంతనె కూచుని, కాచుకొనుము చేతులు రెంటిని.
నీ కెదురుగ చేరును మగడు, నిప్పుల నాల్కల చేరువను.
తారల చేరెడు పొగలను చీల్చెడి చూపులతో వీక్షించును
నీమగడు — నీ హృదయాంతరాళపు లోతులను,
నీ ఆత్మ అగాధపు అట్టడుగులను.
అతని నయనాల ప్రకాశము నక్షత్రాలను మించును.
అతని చూపుల వేడిమి మండు నిప్పులు మింగును.
అతని దృక్కుల ధైర్యము 'ఛా' తీక్ష్ణ వీక్షణాల నతిశయించును.
నాతివి నీవు తెలుసుకొనుమీ —
సూర్యుడు చల్లని బొగ్గుగ చల్లారినవేళ
తారలు నింగిని విలువక రాలినవేళ

పాపవు తల్ట్సేత్స్ ప్రపంచముపై జ్వలించని వేళ —
నాతివి నీవు మాత్రము — ఆకర్ణింతువు
అజరామరాగ్ని చెంత చలి కాచుకొనుచు కూచుని,
భావి జన్మకు తహతహలాడెడు వారల కంఠస్వరమును —
నీ గర్భకుహరాంధకారమున ధ్వనించెడు కంఠస్వరమును.

భోగిమంట ఆరిపోతూంది. ఉల్లాను తన మోకాళ్లమీద పడేసుకుని, నివురు గప్పిన నిప్పులకేసి అలా చూస్తూ కూచుంది అయిలీత — వాటి వెచ్చని వెలుగులో ఆమె ముఖం ధగధగ మెరసిపోతూంది.

"మాలో వున్న సనాతనా చారం ప్రకారం, ఏ పురుషుని ఎదుటైతే స్త్రీ ఉల్లా గీతం గానం చేస్తుందో, ఆ పురుషుని ఆమె తన భర్తగా స్వీకరించాలి," అంది ఆమె కఠినంగా.

# గూసెవ్ సహాయార్థం లోశ్ వాయుయానం

అర్ధరాత్రప్పుడు లోశ్ గాలిపడవ లోంచి దిగి తుస్కూబ్ ఎస్టేటు ప్రాంగణంలో అడుగుపెట్టాడు. ఇంట్లో దీపాలు లేవు. గూసెవ్ పట్నంనుంచి ఇంకా వచ్చినట్టు లేదు. ఆదోకుగా వున్న గోడమీద నక్షత్రాల వెలుగు పడుతూంది. చీకటిలో నల్లగా అవుపడుతూన్న కిటికీ అద్దాల్లో తారామండలాల వినీలప్రతిబింబాలు తళతళ లాడుతున్నాయి. ఇంటికప్పు బురుజుల వెనకాల చిత్రమైన సన్నని పొడుగాటి నీడ ఒకటి కనబడింది. ఆ నీడ దేనిదై వుంటుందో అని ఆశ్చర్యపడుతూ లోశ్ దానికేసి నిదానంగా చూశాడు.

పైలట్ కుర్రాడు ఆందోళన పడుతూ నౌకలోనుంచి కిందకి వంగి లోశ్ చెవిలో:

''అక్కడకి వెళ్లకండి!'' అని మెల్లగా చెప్పాడు.

లోశ్ పిస్తోలు సంచిలోంచి పిస్తోలును చప్పున పైకితీశాడు. ఆ చల్లని గాలి పీల్చేసరికి అతని ముక్కుచరములు అదిరాయి. అగాధపు టంచున బోగిమంట, ఎండు పాచిమొక్కల పొగవాసన, అయిలీత మెరుపు చూపులు — ఇవన్నీ అతని మనోవీధిలో నిల్చాయి. బోగిమంట దగ్గర నిల్చుని: ''నువ్వు మళ్ళీ వస్తావు కదూ?'' అని అడిగిందామె. ''నీ విధి నెరవేర్చు — యుద్ధం చెయ్యి, విజయం సాధించు. కాని — ఇదంతా ఒక స్వప్నం, ఒక నీడ తప్ప మరేదీ కాదని మాత్రం మర్చిపోకు. ఇదిగో ఈ అగ్ని సమక్షాన చెబుతున్నాను — నీకు ప్రాణభయం లేదు — సజీవుడవై తిరిగివస్తావు. కాని నా దగ్గరకు తిరిగిరావడం మాత్రం మర్చిపోకు సుమా!'' అంది. అతని పక్కనే చేరిందామె. అతని పక్కనే వున్న ఆమె కళ్ళు — నక్షత్ర ధూళి మయమైన ఆ అంతులేని నిశిరాత్రిలోకి చీల్చుకొని పోతున్నాయా అన్నట్టున్నాయి. ''ఓ ఆకాశపుత్రా, నా దగ్గరకు వచ్చేయి సుమా — నా దగ్గరకు వచ్చేయి!'' అందామె.

ఆ స్మృతి తనను చురకలు పెట్టినట్టు అనిపించి, తన మనోవీధి నుంచి మరుక్షణం మళ్ళీ మాయమైపోయింది — తన పిస్తోలును సంచి లోంచి తీస్తూన్న ఆ లిప్తమాత్రంలోనే. ఇంటికప్పు వెనకతట్టునుండి పడుతూన్న చిత్రమైన ఆ నీడను నిదానంగా చూస్తూండగా, తన శరీరంలోని కండరాలు బిగుసుకున్నట్టూ, యుద్ధం చెయ్యి, యుద్ధం చెయ్యి అని ఉడుకు రక్తం గుండెకాయలో దబాదబా బాదుతూన్నట్టూ అనిపించింది లోశ్‌కి.

చప్పుడు చేయకుండా అతడు ఇంటివైపు పరుగెత్తి, ఏదైనా చప్పుడు వినబడుతుందేమో అని ఒక్క నిమిషం ఆగి, పక్క గోడని అంటిపెట్టుకునే

వెళ్లి, మలుపు దగ్గర తొంగి చూశాడు. ఇంటి గుమ్మంలో వాయునౌక ఒకటి కూలిపోయి, ధ్వంసమైపోయుంది. నౌక తాలూకు ఒక రెక్క ఇంటి కప్పు మీదుగా చొచ్చుకొనుంది. బస్తాల్లా కనబడుతూన్నవేవో నేలపైన గడ్డిలో పడి వుండడం చూశాడు లోశ్. ఇల్లంతా అంధకారంగా నిశ్శబ్దంగా వుంది.

గడ్డిలో అలా చచ్చి పడున్న వారిలో గూసెవ్ కూడా వున్నాడా ఏమిటి చెప్మా అని లోశ్ అనుమానపడి, ఆ కళేబరాలను పరిశీలించాడు. కాదు, అవన్నీ అంగారకవాసుల శవాలు. ఒకటి ఇంటి మెట్లమీద బోర్లా పడుంది. మరొకటి నౌకాశిథిలాల్లో చిక్కుకుంది. చూడగా, ఇంటి లోపలినుంచే పేల్చిన తుపాకిగుళ్లకే వీళ్లు ఆహుతి అయినట్టు ప్రత్యక్షంగానే తెలుస్తోంది.

లోశ్ చరచరా మెట్లు ఎక్కాడు. తలుపు ఓరగా వుంది. ఇంట్లోకి వెళ్లాడు లోశ్.

"అలెక్సేయ్ ఇవానొవిచ్!" అని కేకేశాడు.

ప్రత్యుత్తరం లేదు. దీపాలకు స్విచ్చివేశాడు. భళ్లున దీపాలన్నీ వెలిగాయి. "దీపాలు వెలిగించడం తెలివితక్కువ పని," అనుకున్నాడు. కాని మళ్ళీ మరుక్షణమే ఆ సంగతి మర్చిపోయాడు. ఇంటి విలువంపు గోడకింద, కాలికి అంటుకొస్తూ ఏదో మడుగులో అడుగు వేసేసరికి, కాలు జారింది.

"అలెక్సేయ్ ఇవానొవిచ్!" అని మళ్ళీ పిల్చాడు.

జబాబు లేదు. మబ్బుగాజు తెర వున్న కోలని గదిలోకి వెళ్లి, చేతులున్న కుర్చీలో కూచుని, అరచేతిలో గడ్డం ఆనుకుని తీవ్రంగా ఆలోచించాడు. గూసెవ్‌కోసం తానిక్కడే కాసుకొని వుండాలా? లేకుంటే అతని సహాయార్థం తాను వాయునౌకపై వెళ్ళాలా? కాని ఎక్కడకని ఎగిరివెళ్ళాలి? ఇక్కడ శిథిలమై పడున్న నౌక ఎవరిదై వుంటుంది? ఆ చచ్చిపడున్నవాళ్లు సైని

కుల్లా లేరే! చూడ్డానికి వాళ్ళు కార్మికుల్లా వున్నారు. ఈ యుద్ధం ఎందుకు జరుగుతూన్నట్టు? ఇందులో గూసెవ్ కూడా వున్నాడా? తుస్యాక్ మనుషులు పాల్గొంటున్నారా? ఏమైనా సరే, ఇక ఆలస్యం చేయకూడ దనుకున్నాడు లోశ్.

స్విచ్చిబోర్డు తీసి, "ఇంజనీర్ల సార్వభౌమసభా భవనం చౌకు," అని వున్న చోట కనెక్షన్ చేసి తాడు లాగాడు. తాడు లాగేసరికి, ఆ తెరనుంచి బయల్దేరిన గగ్గోలుకి గదంతా దద్దరిల్లి, ఆ శబ్దం జోరుకి లోశ్ తుప్పున తుళ్ళిపడ్డాడు. తెరమీద కనబడ్డాయి — ఎర్రగా వెలుగుతూన్న వీధిదీపాల వెలుగులో: పొగ మేఘాలు, అగ్నిజ్వాలలు, నిప్పుల రవ్వలు, మంటల్లోంచి లేచి పైకి ఎగురుతూన్న మందు తునకలు. ఎవరి శరీరమో తటాలున చేతులు వూపుకొంటూ, రక్తం వోడుతూన్న ముఖంతో గాలిలోకి గుప్పున ఎగిరింది.

లోశ్ తాడు మళ్ళీ గుంజి, తెరనుంచి ముఖం తిప్పేసుకున్నాడు.

"ఈ గందరగోళంలో తాను ఎక్కడుంటాడో అధమం ఆ సంగతేనా అతడు నాతో చెప్పివుండాల్సింది," అనుకున్నాడు.

చేతులు వెనక్కి విరుచుకుని, వేళ్ళు మెలేసుకుని, ఆ పొట్టిసరంబీ గదిలో అటూ ఇటూ పచారు చేయడం మొదలెట్టాడు లోశ్. పచారు చేస్తూన్నవాడల్లా తటాలున ఆగిపోయి, గిర్రున వెనక్కి తిరిగి, పిస్తోలు బారుచేశాడు. తలుపు ఓరగా తెరుచుకుని, తలుపు సందులోంచి గది నేల మట్టంతో సమానంగా గదిలోకి తొంగి చూస్తూన్న తలకాయ కనబడింది — ఎరుపు జుట్టు, రాగిరంగు వొళ్ళు, బిర్రబిగుసుకున్న చిన్న తలకాయ.

లోశ్ చెంగున తలుపు దగ్గరకి వెళ్ళాడు. వసారాలో రక్తపు మడుగులో పడున్నాడు ఒక అంగారకవాసి. అలా పడున్న మనిషిని లేవదీసి, కుర్చీలో కూచోబెట్టాడు. ఆ మనిషి పొట్ట చీలిపోయుంది.

పెదవులు తడి చేసుకుంటూ ఆ మనిషి మెల్లగా గొణిగాడు: "తొందరగా రండి, మేం నాశనమైపోతున్నాం, ఓ ఆకాశపుత్రా! మమ్మల్ని రక్షించండి! ఇదిగో నా చేతిలో వున్న..."

కొన ప్రాణంతో వున్న అతడి చేతిలోని చీటి తీసుకున్నాడు లోశ్. దానిలో రాసినదంతా గజిబిజిగా వుంది, చదవడమే కష్టమైపోయింది.

"మీకోసం ఒక సైనికనౌకనీ, ఏడుగురు కార్మికులనూ పంపిస్తున్నా. వీళ్లు నమ్మకస్థులు. ఇంజనీర్ల సార్వభౌమసభా భవనంపై తుపానుదాడి జరిపిస్తున్నా. గోపురానికి చేరువగా వున్న చౌకులో దిగండి. గూసెవ్."

ఏమిటి జరిగిందో చెప్పమని ఆ క్షతగాత్రునిపై వంగి అడిగాడు లోశ్. కాని ఆ మనిషి గొంతులోంచి గురక బయల్దేరింది. అంతే – దానితో ఆ మనిషి మెడవాల్చేశాడు.

ఆ మనిషి తలకాయను లోశ్ తన చేతులతో పట్టుకున్నాడు. ఆ మనిషి గొంతుకలోంచి వస్తూన్న గురక ఆగిపోయింది. కళ్లుపైకి వచ్చేశాయి, వాటిలో వున్న భయానకమైన చూపు ఆగిపోయి, దానిస్థానే పరమానందం నెలకొంది: "సాయం చెయ్యండి..." అంతే. గుడ్లు తెల్లబడిపోయాయి, నోరు వికృతంగా తెరుచుకుంది.

లోశ్ కోటుగుండీలు పెట్టుకొని, మెడకి రుమాలు చుట్టుకున్నాడు. ఇంటి గుమ్మం తలుపు తీశాడు. శిథిలమై పడున్న నౌకవెనుకనుంచి వినీల జ్వాలలు బుసకొడుతూ పైకి వస్తున్నాయి. ఝూంకారం చేసుకుంటూ వచ్చిన తుపాకి తూటా ఒకటి అతని శిరస్త్రాణాన్ని ఎగరగొట్టేసింది.

పళ్లు పటపట కొరుకుతూ, లోశ్ నౌక దగ్గరకెళ్లి, తన బలమంతా ఉపయోగించి, బుజంతో దానిని ఒక్క తోపు తోసేసరికి, అది దొర్లి, దాని వెనకాల పొంచి వున్న వాళ్లమీద తిరగబడింది.

అష్టవంకర్లుగా మెలితిరిగి వున్న ఆ నౌకచట్రం, దభీమని నేలమీద కుప్పకూలిపోయింది. దాని మాటునున్న అంగారకవాసులు హడిలిపోయి మొర్రో కుంయ్యో మంటూ కేకలేశారు. బ్రహ్మాండమైన రెక్క భయంకరంగా ఇటూ అటూ ఊగిసలాడి, శిథిలాల్లోంచి బయటకు పాకుకుని వచ్చేందుకు ప్రయత్నిస్తూన్న మనుషులమీద పడింది. పొగమంచు తెర వెనుక వున్న పచ్చిక బయలుమీద వంగి వంగి ఇటూ అటూ పరుగెత్తుతూన్న మనుషులు లోశ్‌కి లీలగా అవుపడ్డారు. లోశ్ ముందుకు ఒక్క గంతేసి, పిస్తోలు పేల్చాడు. ఆ శబ్దానికి దిక్కులు ప్రతిధ్వనించాయి. లోశ్‌కి దగ్గరగా వున్న మనిషి గడ్డిలోకి దూరిపోయాడు. మరొకడు తన చేతనున్న తుపాకిని విసిరేసి, నేలమీద చతికిలబడి, చేతులతో ముఖం మూసేసుకున్నాడు.

ఆ మనిషి తొడుక్కొన్న వెండికోటు కాలరు పట్టుకుని లోశ్, కుక్కపిల్లను పైకెత్తినట్టుగా పైకెత్తాడు. అతగాడు సైనికుడు. లోశ్ అడిగాడు:

"నిన్ను తుస్కూబ్ పంపించాడా?"

"అవును, ఆకాశపుత్రుడా!"

"నిన్ను చంపిపారేస్తాను."

"చిత్తం, ఆకాశపుత్రుడా!"

"నువ్వెలా వచ్చావిక్కడికి? నీ వాయునౌక ఎక్కడుంది?"

ఆకాశపుత్రుని భయంకర వదనం ఎదుట ఇటూ అటూ తూలిపోతూ మిడిగుడ్లు మిటకరించుతూన్న ఆ అంగారకవాసి వేలుపెట్టి చెట్ల వైపు చూపించాడు; చిన్న సైనిక గాలిపడవ ఒకటి చెట్లనీడను అవుపడింది.

"ఆకాశపుత్రుడిని నువ్వు నగరంలో చూశావా? అతడెక్కడున్నదీ నాకు చూపించగలవా?"

"ఆ, చూపించగలను."

"సరే, బయల్దేరి వెళ్దాం!"

లోశ్ గాలిపడవలోకి ఎగిరి కూచున్నాడు. అంగారకవాసి చోదక చక్రం వెనుక కూర్చున్నాడు. ప్రొపెల్లర్లు గర్జించాయి. నిసి గాలి వాళ్ల ముఖాన కొరడాలతో కొట్టినట్టు బాదింది. బ్రహ్మాండంగా కిరాతకంగా అవుపడుతూన్న నక్షత్రాలు అంధకారపు ఉన్నతాలనుంచి ఊగిసలాడుతు న్నాయి.

# క్రితం రోజు గూసెవ్ క్రియాకలాపం

తుస్కూబ్ ఎస్టేటునుంచి ఉదయం పది గంటలకు గాలిపడవమీద సోఅత్సేరలో బయల్దేరాడు గూసెవ్. బయల్దేరేముందే, ఆ ప్రాంతపు విమాన సర్వే మ్యాపు ఒకటీ, రైఫిల్ ఒకటీ, కొంత ఆహారపు సామానూ, లోశ్ కి తెలియకుండానే తాను పెట్రోగ్రాడ్‌నుంచి బయల్దేరేటప్పుడే తనతో తెచ్చిన ఆరు చేతిబాంబులూ — ఇవన్నీ సిద్ధం చేసుకుని, వీటిని పడవలో వేసుకు న్నాడు.

మధ్యాహ్నానికల్లా అతనికి సోఅత్సేరా కనబడింది. నగరం నడిమధ్య వీధులన్నీ ఖాళీగా వున్నాయి. మిలిటరీ వాయునౌకలనూ సైనికులనూ ఇంజనీర్ల సభాభవనం ఎదుట నక్షత్రా కృతిలో వున్న పెద్దచౌకులో మూడు ఏకకేంద్ర అర్ధవృత్తాకారంలో సిద్ధంగా మోహరించి వుంచారు.

గూసెవ్ అవరోహణ ప్రారంభించగానే, గూసెవ్ నౌకను కిందనున్న వారు గుర్తించి, తెల్లగా మెరుస్తూన్న ఆరు రెక్కల నౌక ఒకటి చౌకునుంచి

ఝూంకారం చేసుకుంటూ ఆకాశంలోకి లేచింది. అది ఎండలో వేయి తళు కులు వెదజల్లుతూంటే చూడ ఎంతో ముచ్చటగా వుంది. నౌక డెక్కుల మీద వెండి దుస్తులు వేసుకున్న మనుషులు కొందరు బారలు తీర్చి నిల బడున్నారు. గూసెవ్ ఈ నౌక వెంటే ఎత్తుగా ఎగురుతూ, దాని మీద ఒక చక్కరు కొడుతూ, తన సంచీలోంచి ఒక చేతిబాంబును జాగ్రత్తగా తీశాడు.

అతనికి కిందుగా ఆ నౌక రంగుల ప్రొప్కాళ్లు గిర్రున తిరుగుతు న్నాయి, స్తంభం చివర వున్న తీగెకుచ్చులు ముళ్లల్లా నిక్కబొడుచుకుని కదులుతున్నాయి.

గూసెవ్ తన నౌకాపార్శ్వంనుంచి కిందకి వంగి, కింద వున్న నౌకకేసి తన పిడికిలి ఝళిపించాడు. దీనికి జబాబుగా మెల్లని కేక వినబడింది. వెండి దుస్తులు తొడుక్కున్న మనుషులు వాళ్ళ చేతుల్లో వున్న పొట్టిగొట్టాల తుపాకులను గూసెవ్‌మీద పేల్చారు. పసుప్పచ్చని చిన్నచిన్న పొగల్లోంచి తుపాకిగుళ్లు చరచరా అతనికేసి దూసుకుంటూ వచ్చాయి. అతని వాయునౌక పార్శ్వంనుండి ఒక తునుక ఏగిరిపోయింది.

గూసెవ్ నోటినిండా ఒక తిట్టు తిట్టి, ఒక లీవరు లాగి, రెప్పాయ్ మని కిందకు దిగుతూ శత్రునౌకపై విరుచుకుపడ్డాడు. ఆ లంఘించుకో వడంలో తన చేతిబాంబును శత్రునౌకమీద విసిరాడు. చెవులు బద్దలయే శబ్దంతో బాంబు పేలింది. తన నౌకను మళ్ళీ ముక్కుకు సూటిగా చోదిం చుకుని, ఏమిటి జరిగిందో చూదామని వెనక్కి తిరిగాడు. శత్రునౌక తల తిరిగిపోయేటట్టు అంతర్లు కొడుతూ ఆకాశం నడిమధ్య తునాతునకలై కిందకి పడిపోతూ, కింద వున్న ఇళ్లకప్పులమీద కుప్పకూలిపోయింది.

ఇక అప్పుడు మొదలైంది అసలు వ్యవహారం అంతాసూ.

గూసెవ్ పట్నంమీద ఎగురుతూ, తానిదివరకు గాజుతెరమీద చూసిన చౌకులూ, ప్రభుత్వ భవనాలూ, ఆయుధశాలా, కార్మికుల ఇళ్ళూ — వీటినన్నిటినీ పోల్చుకున్నాడు. పుట్ట కెలికితే పుట్టలోంచి పైకొచ్చిన చీమల్లా వేలాది అంగారకవాస కార్మికులు ఒక ఫ్యాక్టరీ గోడ దగ్గర గుమికూడారు. గూసెవ్ నౌక నేలను సమీపించడం చూసి, అక్కడ పోగడిన జనం నాలుగు చెరగులా పారిపోయారు. ఈ విధంగా ఖాళీ అయిన జాగాలో గూసెవ్ దిగాడు. దిగి పళ్ళికిలించి నవ్వాడు.

అంగారకవాసులు అతనిని పోల్చుకున్నారు. అతనిని చూసి వేలాది కార్మికులు చేతులు వూపుతూ అతనికి స్వాగతం చెప్పారు. "మగత్సీత్ల్! మగత్సీత్ల్!" అని మంత్ర పఠనం చేస్తూన్నట్టు నినదం చెయ్యడం మొదలెట్టారు. భయపడుతూ భయపడుతూనే జాగ్రత్తగా అతనికి దగ్గర దగ్గరగా వచ్చి చేరారు. గజగజ వణకుతూన్నట్టి వారి ముఖాలూ, సహాయం అర్థించుతూన్న వారి కళ్ళూ, కుంకుమవర్ణపు బట్టతలయీ అతడు కనిపెట్టాడు. దారిద్ర్యంతో సతమతమౌతూన్న ముక్కుడిమూక, అలగా జనం — వీళ్ళూ ఇక్కడి కార్మికులు అనుకున్నాడు గూసెవ్.

గూసెవ్ తన సంచిని బుజాన వేసుకుని నౌకలోంచి దిగి, వాళ్ళని చూసి చేయి వూపాడు.

"కామ్రేడ్స్, మీకు శుభాకాంక్షలు!" అని కేకేశాడు గూసెవ్. అతని మాటలు విన్నతరువాత ప్రజలో నెలకొన్న నిశ్శబ్దం అవాస్తవికమే అనిపించింది. నాజూకుగా, పొట్టిగా, అర్భకులుగా, వామనమూర్తుల్లా వున్న ఆ అంగారకవాసుల మధ్య గూసెవ్ మహామనీషిలా, రాక్షసిలా అవుపడ్డాడు. "కామ్రేడ్స్! మీరిక్కడ ఎందుకు పోగడ్డారు? నాతో కబుర్లు చెప్పుకొందుకా? లేకుంటే యుద్ధం చేదామనా? కబుర్లు చెప్పుకొందుకే

అయితే, నాకు వేళలేదు — మీకో నమస్కారం, నే వెళ్ళిపోతున్నా,'' అన్నాడు.

ఆ మూకలో వున్న జనం అందరూ నిట్టూర్చారు. అంగారకవాసులు కొందరు నిరాశతో ఈల వేశారు. కడమవాళ్ళు ముక్తకంఠంతో మొర పెట్టారు:

''ఆకాశపుత్రా! మమ్మల్ని రక్షించు బాబోయ్, మమ్మల్ని రక్షించు!''

''ఐతే మీరు యుద్ధం చేస్తామనే అంటున్నారన్న మాట?'' అని అడిగాడు గూసెవ్. అలా అడిగి, ఇంకా ఇలా అన్నాడు, బొంగురు గొంతుతో: ''యుద్ధం అప్పుడే మొదలైంది. మిలిటరీ వాయునౌక ఒకటి ఇప్పుడే నా మీద దాడిచేసింది. దాన్ని తుక్కు తుక్కుకింద రేగ్గొట్టేశాను. ఆయుధాలు చేతబుచ్చుకోండి! రండి, నా వెంట రండి!''

ఆ మూకలోంచి తోసుకుంటూ ముందుకొచ్చాడు గోర్ (ఇతడిని గూసెవ్ వెంటనే గుర్తుపట్టాడు). ఉద్రేకపడిపోతూన్న ఆ మనిషి ముఖంలో రక్తంలేదు. పెదవులు వూరికే వణకిపోతున్నాయి. గూసెవ్ చొక్కాను ఛాతి దగ్గర గభాలున లంకించుకుని:

''ఏమిటయ్యా మీరంటూన్నది? మీతో కూడా మమ్మల్ని ఎక్కడకి రమ్మనమంటారు? దోమని నలిపేసినట్టు నలిపేస్తారయ్యా మనని. ఆయుధాలు అంటున్నారు మీరు! కత్తులూ కటార్లూ మాకు లేవే! ఇంకేదేనా మార్గం వుందేమో చూడాలి మనం...'' అన్నాడు.

''మార్గంలేదు, గీర్గంలేదు. నిర్ణయం తీసుకోవడం — అదే పెద్ద ఆయుధం! ఎవడు నిర్ణయం తీసుకోగలడో — వాడిదే శక్తి అంతా. మీతో సొళ్ళు కబుర్లు చెబుతూ కూచుందుకు నేను రాలేదయ్యా భూలోకంనుంచి... నిర్ణయం తీసుకోవడం అంటే ఏమిటో మీకు చేతలతో చెప్పేందుకు వచ్చా

భూలోకంనుంచి నేను. అంగారకవాసులు మీరందరూ బూజుపట్టిపో యున్నారు. కామ్రేడ్స్! చావంటే లక్ష్యం లేనివాళ్ళందరూ రండి నా వెంట! వీళ్ల ఆయుధశాల ఎక్కడుంది? రండి! ఆయుధాలు చేతబుచ్చుకోండి! రండి, ఆయుధశాలకి రండి!'' అని కేకేశాడు గూసెవ్.

''అయ్-యాయ్!'' అంటూ అరిచారు అంగారకవాసులు.

మూక అంతా తోసుకుంటూ, కుమ్ముకుంటూ తొంబకి తొంబా ముందుకు తిరగబడ్డారు.

గోర్ నిరాశ చెందిపోయి, చేతులు చాచేశాడు.

దీనితో మొదలైంది పితూరీ. పితూరీకి మొనగాడు దొరికాడు. తల కాయల ప్రవాహం ముందుకు సాగిపోతూంది. అసాధ్యమనుకున్నది సాధ్యమయే టట్టే కనబడుతూంది. తిరుగుబాటును క్రమక్రమంగా మెల్లమెల్లగా తయారుచేస్తూన్న గోర్, క్రితం దినం జరిగిన ఘటనల తరువాత కూడా ఇంకా మీనమేషాలు 'లెక్కపెడుతూ ఏ నిర్ణయం తీసుకుందుకూ తట పటాయించి వెనక్కి జంకేశాడు. అటువంటి గోర్‌కి తటాలున ఇప్పుడు ప్రాణాలు లేచొచ్చాయి. కార్చిచ్చుల్లాంటి ఉపన్యాసాలు ఒకడజను దంచాడు. ఉపన్యాసాలన్నీ కార్మిక పేటలకి ప్రసారమై గాజుతెరలమీద ప్రతిబింబించి అక్కడివాళ్లు వినేటట్టు ఏర్పాటు చేయించాడు. సరిగ్గా 'నలభై వేలమంది అంగారకవాసులు ఆయుధశాల దగ్గర పోగడ్డారు. పితూరీదార్లను గూసెవ్ చిన్నచిన్న దళాలుగా ఏర్పరచి భవనాలూ, శిలావిగ్రహాలూ, చెట్లూ – వీటి మాటున స్థానాలు ఏర్పరచుకుని వుండమన్నాడు. వూళ్లో జరుగుతూన్న ఉదంతాలన్నిటినీ తెలుసుకుందుకని ప్రభుత్వం వీధుల్లో నెలకొల్పిన కంట్రోల్ తెరలన్నిటి ఎదుట ఆడవాళ్ళనీ పిల్లల్నీ నిలబడి తుస్కూబ్‌ని తిడుతూ

గౌణగమన్నాడు. ఆసియా వాసులకు స్వాభావికమైన ఈ ఎత్తుగడ ప్రభుత్వాన్ని కొంతసేపు వరకూ మోసపుచ్చింది.

మిలిటరీ వాయునౌకలతో ఎక్కడ ప్రభుత్వం దాడిచేసిపోతుందో అని మాత్రం గూసెవ్ భయపడ్డాడు. అందుచేత, ప్రభుత్వం దృష్టి మళ్లించేందుకనీ, ఆ విధంగా కొంత వ్యవధి చేజిక్కించేందుకనీ నిరాయుధులైన ఐదువేలమందిని నగరపు నడిమధ్యకు వెళ్లి, వెచ్చని గుడ్డలూ, తిండీ, హావ్రా కావలని కోరుతూ గట్టిగా మొరపెట్టమన్నాడు. వాళ్లతో గూసెవ్ ఇలా అన్నాడు:

"మీరెవ్వరూ మళ్ళీ ప్రాణాలతో ఇంటికిరారు సుమండీ. అది మాత్రం మర్చిపోకండి. ఇక వెళ్లండక్కడికి!"

ఐదువేలమంది అంగారకవాసులు"అయ్-యాయ్!" అని ఐక్యకంఠంతో కేకేసి, నినాదాలు చిత్రీకరించిన పెద్దపెద్ద గొడుగులు వేసుకుని, ప్రభుత్వం నిషేధించిన ఒక పాతకాలపు పాట పాడుతూ, చావుకి సిద్ధమై, నడచుకుంటూ వెళ్ళారు:

అద్దాల మేడల ఇంటి కప్పులనుంచి,
ఇనుప గోడల కొట్లనుంచి,
రాతిజాడి అట్టడుగునుంచి
మింట కెగయును హావ్రాధూమం.
హాయ్! భలే హాయిగ వుంది మాకూ
ఇవ్వండయ్యా, ఆ హావ్రాజాడి మాకూ!
అయ్-యాయ్! అది లేనిదె మేమూ
ఖనులకు గనులకు వెళ్ళేది లేదూ

భయానక మృత్యుసారంగాలకు
యంత్రాగారాలకు పొయ్యేది లేదూ
బతుకు తీపి మాకూ
అయ్-యాయ్! బతుకుతాము మేమూ.
ఇవ్వండయ్యా, ఆ హ్రావాజాడి మాకూ!

వారు బ్రహ్మాండమైన గొడుగులు వూపుకొంటూ, పెద్దగా కేకలు వేసుకుంటూ పట్నం ఇరుకు వీధుల్లోంచి వారు బయల్దేరి వెళ్లిపోయారు.

పట్నం పాతపేటలో వుంది ఆయుధశాల. పొట్టిగా నలుచదరంగా వుంటుంది కట్టడం. చిన్న సైనికదళం దానిని కావలి కాస్తూంది. ఎదుట వున్న చౌకులో, ఒక కంచు గేటుముందు అర్ధచంద్రాకారంలో వ్యూహం తీర్చి నిలబడున్నారు సైనికులు. వారి వెనకాల తీగె చుట్టలూ, రేకు వలయాలూ, గోళాలూ – వీటితో నిర్మించిన చిత్రమైన యంత్రాలు రెండున్నాయి. (ఇలాంటిదే ఒకదానిని నిర్మానుష్యంగా వున్న గృహంలో వెనుక తాను చూసినట్టు ఇప్పుడు గుర్తుకొచ్చింది గూసెవ్‌కి.) చిన్నచిన్న పాము మెలికల్లాంటి సందు గొందెల్లోంచి తిరుగుబాటుదార్లు ఆయుధశాలను సమీపించి, దానిని చుట్టుముట్టేశారు. ఆయుధశాల గోడలు నిటారుగా మంచి బలంగా వున్నాయి.

అక్కడున్న చెట్ల వెనుక మాటు చూసుకుంటూ, ఆ చెట్టువెనుక నుంచి ఈ చెట్టు వెనుక్కి పరుగెత్తుకుంటూ ఇటూ అటూ చూసుకుంటూ, ఆయుధశాలనీ దాని చుట్టూ వున్న ప్రదేశాన్నీ జాగ్రత్తగా కనిపెట్టుతూ, ఆయుధశాలను ఆక్రమించుకుందుకు గేటుమీద దాడి చేయడమే ఉత్తమ మార్గమని నిశ్చయించుకున్నాడు గూసెవ్. గేటుకి వున్న కంచుతలుపును

వూడపీకేయమని తన మనుషులని ఆజ్ఞాపించాడు. వూడపీకేసిన గేటుకి ఇటూ అటూ తాళ్లు కట్టమన్నాడు. ఈ పని వాళ్లు చేసిన తరువాత, ''అయ్-యాయ్'' అని గోలపెడుతూ ఆయుధశాలమీద పడమన్నాడు.

గేటు దగ్గర కాపలా కాస్తూన్న సైనికులు చూస్తూనే వున్నారు జనం సందు గొందెల్లోంచి పోగవడం. కాని తలుపు వూడబెరకడం చూసి, ఆ యంత్రాలను కాస్త ముందుకు తోసుకొచ్చారు. ఆ తీగచుట్టల్లోంచి ఎర్రని వెలుగు మెరిసింది. గూసెవ్‌కి ఆ యంత్రాలను చూపెడుతూ జనం: ''అవి మహా ప్రమాదమైనవి, జాగ్రత్తయ్యా, ఆకాశపుత్రా!'' అని కీచు మంటూ కేకేశారు.

ఇక కాలయాపనకి వీల్లేకపోయింది.

రెండు కాళ్లూ ఎడంగా పెట్టుకుని, కాళ్లు రెండింటితోనూ దృఢంగా నిలదొక్కుకుని కంచు తలుపుకు కట్టిన తాళ్లతో దానిని ఎత్తి పట్టుకున్నాడు గూసెవ్. అది బలువుగానే వుంది, గాని దాన్ని పట్టుకుని మోసుకుంటూ నడవగలనని అనుకున్నాడు. సరే, అలాగే దానిని పట్టుకుని గోడ వెంటే నడుచుకుని వెళ్ళాడు. ఇక నాలుగు అడుగులు దాటితే ఆయుధశాల గేటు. ''తయార్!'' అని మెల్లగా ఆజ్ఞ ఇచ్చి, ''అరె, దీని తస్సాదియ్యా! నాకు కోపమంటూ రాకుండా వుందే, నాకు నిజంగా కోపం వస్తే బాగుండునే!'' అనుకుని, నుదుట పట్టిన చెమటను చొక్కాచేతితో తుడుచుకుని, ఆ కంచు తలుపును ఒక డాలు మాదిరిగా తను ముఖం ముందు ఎత్తి పట్టుకున్నాడు.

''రండిరా, అబ్బాయిలూ!'' అని బొంగురు పోయిన గొంతుతో తిట్లు తిడుతూ కేకేసుకుంటూ, చౌకు నడిమధ్యగా ముందుకు సాగాడు గూసెవ్.

తాను తాత్కాలికంగా ఉపయోగిస్తూ వున్న డాలుకి తుపాకిగుళ్లు

చాలానే తగిలాయి. వాటి ధాకకు గూసెవ్ కొద్దిగా తొట్రుటుకున్నాడు. దానితో అతడికి నిజంగా కోపం వేసుకొచ్చింది. ఇక ఆ కోపావేశంలో కేకలేసుకుంటూ తిట్టుకుంటూ అతడు చరచరా ముందుకు వెళ్లాడు. అతడి వెంట పడ్డారు జనం అంతా చీమల బారల్లా సందులనుంచీ, గోడల వెనుకనుంచీ, చెట్ల చాటునుంచీ అలగోడూ బాలగోడూ పెడుతూనూ. దిక్కులు పిక్కటిల్లినట్టు పెద్ద పేలుడు వినబడింది. కాని కొండవాగులా అప్రతిహతంగా ముందుకు తోసుకుపోతూన్న ఆ మూక దేనినీ లక్ష్యం చేయకుండా, ఆ సైనికులమీదనుంచీ, అంతవరకూ ప్రజను హడలగొట్టేసిన ఆ యంత్రాల మీదనుంచీ నడచి ముందుకు సాగిపోయింది.

నోటినిండా తిట్టుకుంటూ గూసెవ్ గేటు వరకూ పరుగెత్తి, చేత వున్న కంచు తలుపు కోణంతో గేటుకున్న తాళాన్ని నాలుగు బాదులు బాది, తాళాన్ని చితకొట్టేసరికి, గేటు తలుపు తెరుచుకుంది. గేటులోంచి చౌకులోకి అడుగు పెట్టాడు గూసెవ్. చౌకులో రెక్కల నౌకలు వున్నాయి.

జనం ఆయుధశాలను ఆక్రమించుకున్నారు. నలభై వేలమంది అంగారకవాసులు ఆయుధాలు చేతబుచ్చుకున్నారు. ఆయుధశాలలో వున్న గాజుతెర-టెలిఫోనుతో ఇంజనీర్ల సార్వభౌమ సభా భవనాన్ని పిలిచి, తుస్కూబ్ లొంగిపోవాల్సిందని ఆజ్ఞాపించాడు గూసెవ్.

ఈ డిమాండు వినగానే, అందుకు ప్రత్యుత్తరంగా ప్రభుత్వం, ఆయుధశాలపై దాడి చేయాల్సిందిగా ఒక స్క్వాడ్రన్ వాయునౌకలను పంపించింది... ఆయుధశాల ఆవరణలో వున్న నౌకలతోనూ ఈ దాడిని ఎదుర్కొన్నాడు గూసెవ్. ఈ విధంగా గూసెవ్ ఎదురుదాడి ప్రారంభించడం చూసి ప్రభుత్వం పంపిన నౌకాస్క్వాడ్రన్ తోక ముడుచుకుని పారిపోయింది. ప్రభుత్వపు నౌకలు ఎప్పుడైతే వెన్ను చూపించాయో, అప్పుడు గూసెవ్

తన నౌకాసమూహంతో వాటిని వెన్నాడి, ధ్వంసం చేసేశాడు. అవి ముక్కముక్కలైపోయి పురాతన సోఅత్సేర పట్నంలో, కళ్ళు మూసుకుని కూచున్న బ్రహ్మాండమైన మగత్సీత్ల్ శిలావిగ్రహ పాదల దగ్గర కూలిపోయాయి. అస్తమిల్లుతూన్న సూర్యుని కిరణాలు మగత్సీత్ల్ శిరస్సుపై వున్న శల్యాశిరస్త్రాణాన్ని తాకి మెరుపులు ప్రతిబింబించాయి.

ఆకాశ పథాల్లో తిరుగుబాటుదార్లదే పైచేయి అయింది. సార్వభౌమ సభా భవనం చుట్టూ ప్రభుత్వం పోలీసు బలగాన్ని మోహరించింది. పిడుగుపాటును విడుదలచేసే గోళాకారపు యంత్రాలను భవనంమీద నెలకొల్పింది. వీటిని ప్రయోగించడం ఫలితంగా, తిరుగుబాటుదార్ల నౌకల్లో కొన్ని కూలిపోయాయి. కాని చీకటిపడే వేళకల్లా, గూసెవ్ సార్వభౌమ సభా భవనంపై దాడి జరిపి, నక్షత్రంనుండి వెడలుతూన్న కిరణాల్లా చౌకు నుండి వెడలుతూన్న వీధుల్లో బారికేడ్లు నిర్మించాడు. ''ఓరి, ఇటుకరంగు ముఖం దయ్యాల్లారా! ఉండడ్రా, మీకు నేర్పుతాను, విప్లవం ఎలా లేవదీయాలోనూ!'' అని గొణుగుతూ, పేవ్‌మెంట్లనుంచి చపటా రాళ్లను ఎలా పెల్లగించాలో, చెట్లను కొట్టి రోడ్లకి ఎలా అడ్డంగా పడేయ్యాలో, దర్వాజా బందాల్లోంచి తలుపులు ఎలా వూడబెరకాలో, జుబ్బాలనిండా ఇసక ఎలా నింపుకోవాలో — ఈ కిటుకులన్నీ వాళ్లకి నేర్పాడు.

ఆయుధశాల ఆవరణలో వున్న రెండు పిడుగు యంత్రాలనూ సార్వభౌమ సభా భవన దిశగా నిగిడ్చి, మంటలు కక్కుతూన్న గోళాలతో ప్రభుత్వ సేనలను మర్దించాడు గూసెవ్. దీనికిప్రతిగా ప్రభుత్వం, విద్యుదయస్కాంత క్షేత్రంతో చౌకను విద్యుచ్ఛక్తితో నింపేసింది.

ఇక అప్పుడు గూసెవ్ ఆ రోజుకు తాను చేసిన ఉపన్యాసాల్లో ఆఖరు ఉపన్యాసం — అతి ముక్తసరి ఉపన్యాసమూ, అమిత భావగర్భితమైన ఉప

న్యాసమూ – చేశాడు. ఒక బారికేడు మీాదెక్కి మూడు చేతిబాంబులు విసిరాడు – అదే అతడి ఉపన్యాసం. ఆ పేలుడు జోరు ఎంత ఘోరాతిఘో రంగా వుండెనో చెప్పవీల్లేదు: మూడు మంటలు లేచి ఆకాశాన్నందుకు న్నాయి. ధూళి మేఘాలతోనూ, ఘాటు పొగర్లతోనూ చౌకు అంతా నిండి పోయింది. పెద్దపెట్టున రణగణ ధ్వని చేసుకుంటూ అరుపులు అరుస్తూ అంగారకవాసులు ముందుకు తోసుకుని వెళ్ళారు. (ఈ దృశ్యాన్నే తెరమీాద చూశాడు ళోశ్, తుస్కూబ్ ఇంట్లో వున్నప్పుడు.)

ప్రభుత్వం ఆయస్కాంత క్షేత్రాన్ని తొలగించేసి, మంటలు మండుతున్న గుళ్ళు ప్రయోగించింది. ఈ గుళ్ళు చౌకుమీాదుగా ఆకాశంలోకి ఎగిరి, గగనసీమలో పేలి ఆకాశాన్ని నీలిరంగు మంటల తళుకులతో నింపేశాయి. ఆ పిడుగుల్లాంటి పేలుడులకి పిరమిడు ఆకారపు ఇళ్ళు గజగజ కదిలి పోయాయి.

యుద్ధం అట్టేసేపు సాగలేదు. కొంతమంది మనుషలను తీసుకుని గూసెవ్, కంకాళాలతో నిండిపోయిన చౌకును దాటి, సార్వభౌమ నభా భవ నంలోకి చొరబడ్డాడు. భవనం అంతా ఖాళీగా వుంది. తుస్కూబూ, ఇంజనీర్లూ, తప్పించుకుని ఎక్కడికో పారిపోయారు.

# కథ కొత్త మలుపు

పట్టణంలో కీలకస్థానాలు అని గోర్ తెలియజేసినవాటి నన్నిటినీ పితూరీదార్లు వశపరచుకున్నారు. రాత్రి చలిగా వుండడంచేత కీలక స్థానాల్లో వహరా కాస్తూన్న అంగారకవాసులందరూ చలికి తమ స్థానాల్లో కొరడుబారిపోయారు. అన్ని చోట్లా భోగిమంటలు పెట్టించాల్సిందని

గూసెవ్ ఆజ్ఞ జారీ చేశాడు. ఇటువంటిది ఆ పట్నం చరిత్రలో కనివిని యెరుగని ఆజ్ఞ — వేలాది సంవత్సరాలనుంచి ఆ పట్నంలో మంటలుగానీ, నెగళ్లుగానీ మనుషులు ఎరుగనే ఎరుగరు; అగ్నిజ్వాలలు గురించీ, నృత్యంచేసే జ్వాలా జిహ్వాల గురించీ పూర్వకాలపు గీతాల్లో పాడుకునే విషయాలే తప్ప అంగారకవాసులకు మరేమీ తెలియదు వాళ్లకి.

విరిగి ముక్కముక్కలైపోయిన కుర్చీలూ బల్లలూ పుల్లలకింద ఉపయోగించి సార్వభౌమ సభా భవనం ఎదుట పేర్చిన మొట్టమొదటి బోగి మంటను గూసెవ్ వెలిగించాడు. "ఉల్లా, ఉల్లా" అని గొణుక్కుంటూ అంగారకవాసులు మంట చుట్టూ చేరారు. ఇక దాంతో వూరిలో అన్ని చౌకు ల్లోనూ బోగిమంటలు లేచాయి. ఆ ఎర్రని మంటల వెలుగులో భవనాల ఆదోకు గోడలమీద మిణుగురు నీడలు నాట్యమాడాయి, కిటికీ అద్దాల పైన వేయి అరుణకాంతులు వెలిగాయి.

ఇళ్ల కిటికీల దగ్గర నీలిరంగు ముఖాలు వీధుల్లోకి తొంగిచూశాయి. ఎన్నడూ ఎరగని ఈ వింత నెగళ్లనూ, చింకిపాతలు కట్టుకుని, విచారంతో వున్న ఈ తిరుగుబాటుదార్లనూ చూసేసరికి ఆ ముఖాల్లో దిగులూ, బాధ ప్రత్యక్షమయాయి. ఆ రాత్రి ఎందరో ఇళ్లు వదిలేసి పారిపోయారు.

పట్నంలో అంతా నిశ్శబ్దంగా వుంది. శతసహస్రాబ్దులు తమ గమ నాన్ని ఆపి, వెనక్కి మళ్లించి, తమ నిర్విరామ యాత్రను విసుగుదలతో మళ్లీ ముందుకు సాగించుతున్నాయా అన్నట్టుగా, బోగిమంటల ఫెళఫెళ కత్తి కఠాల్ల గణగణ — ఇది తప్ప మరే చప్పుడూ లేదు. వీధుల్లో వెలుగు తూన్న మంటలను చూసి ఆకాశాన జాలు బంతుల్లా కనబడుతూన్న నక్ష త్రాలే వింతగా కనబడ్డాయి — నెగిళ్లచుట్టూ కూచున్నవారు ఏనాడో మరచి పోయిన తారామండలాల చిత్రీకరణను చుడ్డానికని తమ ముఖాలను అప్ర

యత్నంగా ఎత్తి ఆకాశంకేసి చూశారు. గూసెవ్ తన సైనికులనూ వారి స్థానాలనూ రెక్కల జీనులో కూచుని ఎగిరుతూ తనిఖీ చేశాడు. ఆకాశోన్నతంనుంచి దిగి, చౌకు అంతటా బ్రహ్మాండమైన ఛాయను ప్రసరించుతూ, చౌకులో వాలాడు. నిజమైన ఆకాశపుత్రునిలా, శిలావిగ్రహ పీఠంనుండి దిగివచ్చిన మహామనిషిలా అతడు కనబడ్డాడు. అతన్ని చూసి, అంగారక వాసులు మూఢవిశ్వాస ఫలితమైన భయభక్తులతో ''మగత్సీత్ల్, మగత్సీత్ల్'' అంటూ ఒకరి చెవిలో ఒకరు చెప్పుకొనడం మొదలుపెట్టారు. వారిలో చాలామందికి అతనిని చూడడం ఇదే తొలిసారి అవడంచేత అతని దగ్గరకు మెల్లమెల్లగా భయపడుతూ భయపడుతూ వెళ్ళి అతన్ని ముట్టుకుని చూశారు కూడానూ. ''మనకిక చావు తప్పింది... మనం హాయిగా బతకొచ్చు... ఆకాశపుత్రుడు మనకి ప్రాణభిక్ష పెడుతున్నాడు,'' అంటూ పసిపిల్లల్లా కొందరు కంట తడిపెట్టారు.

దుమ్ముకొట్టుకుపోయిన పనిదుస్తులు తొడుక్కున్న శరీరాలు, కళ్ళు లోతుకుపోయి ముక్కులు మొనతేలి ఎండి కృశించి పోయున్న ముఖాలు, గిర్రున తిరుగుతూన్న యంత్రాల చక్రాలనూ చీకటికోణపు గనిపొరంగాలనూ తప్ప మరివేటినీ చూడడానికి అలవాటుపడని కళ్ళూ, సంతోష సాహస హావ భావాలను ప్రదర్శించేందుకు ఏమాత్రమూ నేర్పులేని చేతులు – మంటల రవ్వలను ప్రతిబింబించుతూన్న ఈ చేతులూ, ముఖాలూ, ఈ కళ్ళూ ఆకాశ పుత్రునిపై లగ్నమయాయి.

''భేష్, అలా ధైర్యంగా ఉండాలి, అబ్బాయిలూ! మీకేం భయం లేదు! హుషారుగా వుండండి!'' అంటూ గూసెవ్ వాళ్ళకి అభయమిచ్చాడు. ''ఇలా మీరు శాశ్వతంగా బాధలు పడుతూ వుండాలని ఎక్కడా రాసిలేదు.

ఏం భయపడకండి. మీరు ఎప్పుడైతే గెలుస్తారో – అప్పుడే మీ బాధలన్నీ పోయి, మీరు హాయిగా వుంటారు.''

ఆనాడు దరిదాపు అర్ధరాత్రి వేళకి గూసెవ్ సార్వభౌమ సభా భవనం మళ్ళీ చేరుకున్నాడు. మనిషి బాగా చలి పట్టిపోయున్నాడు. దానికితోడు ఆకలి దహించుకుపోతూంది. విలువంపు సరంబీ వున్న సభామందిరంలో, భారీ ఆయుధాలు ధరించిన నలభై ఏభై మంది అంగారకవాసులు నేలమీద పడుకుని నిద్రపోతున్నారు. నున్నగా అద్దంలా నిగనిగలాడుతూన్న గచ్చు అంతా, నమిలి పారేసిన హ్రావా ఉమ్ములతో నిండిపోయుంది. సభామందిరం నడిమధ్య, తూటా డబ్బాల కుప్పమీద కూచుని తన టార్చి లైటు వెలుగున కలంతో ఏదో రాసుకుంటున్నాడు గోర్. సభామందిరపు బల్లనిండా వున్నాయి తెరచిపెట్టిన డబ్బాలూ, ఫ్లాస్కులూ, రొట్టె పిసళ్ళూనూ.

బల్లపైన ఒక మూల కూచుని ఆబగా తినడం మొదలుపెట్టాడు గూసెవ్. తినడం అయిపోయాక పంట్లాంకు చేతులు రాసుకుంటూ తుడిచేసుకుని, ఫ్లాస్కులో వున్న దానిని తాగి, ఘుర్ఘురించి, బొంగురు గొంతుతో:

''శత్రువు ఎక్కడున్నట్టు? ఆ సంగతి చెప్పండి ముందు...''

గోర్ ఎర్రగా వాచిపోయున్న తన కళ్ళు పైకెత్తి – రక్తపు డాగులు చింకిగుడ్డతో బేండేజీ కట్టు కట్టిన గూసెవ్ తలనూ, అతని విశాల భుజ స్కంధాలనూ, ఎత్తు దవడ ఎముకల ముఖాన్నీ, ముళ్ళల్లా నిలబడున్న మీసాన్నీ, ఉబ్బి వున్న ముక్కు చెరమల్నీ – చూశాడు.

''ప్రభుత్వపు సేనలు ఎక్కడున్నాయని అడిగితే ఎవ్వడూ చెప్పడం లేదేమిటి?'' అన్నాడు గూసెవ్. ''చౌకులో చూస్తే, ఏ మూడొందల మందో

అక్కడా అక్కడా చెదిరున్నారు. వాళ్ల సైన్యమంతా పదిహేను వేల వరకూ వుండాలి కదా, మరి వాళ్లందరూ ఏమైనట్టు? ఎక్కడికి మాయమైపోయారంటా? గాలిలోకి ఎగిరిపోవడానికి వాళ్లేమి నలుసులా ఏమేనేనా? నిజంగా గాలిలోకే ఎగిరిపోయుంటే నాకు కనబడకుండా పోతారా? మనం గొప్ప ఇరకాటంలోనే పడ్డాం. ఏనిమిషమైనా సరే శత్రువు మన వెనక నుండే వచ్చి మన మీద పడొచ్చు,'' అన్నాడు గూసెవ్.

''తుస్కూబూ, ప్రభుత్వమూ, సేనలో మిగిలిన భాగమూ, ప్రజలు కొందరూ పట్నం అడుగున రాణి మాగ్ తవ్వించి నిర్మించిన సొరంగవ్యూహంలోకి రక్షణకోసం వెళ్లిపోయారు,'' అని జబాబు చెప్పాడు గోర్.

గూసెవ్ కుర్చీలోంచి చెంగున ఒక్క గంతేసి లేచాడు.

''ఈ సంగతి ముందే చెప్పకుండా ఇంతసేపూ వూరుకున్నావేమయ్యా?'' అన్నాడు గూసెవ్.

''తుస్కూబ్‌ని వెంట తరమడం మన తరంగాదు. మీరు కూచుని, ఆ తినేదేదో సావకాశంగా తినండి, ఆకాశపుత్రా!'' అంటూ ముఖం చిట్లించుకుని, తన అంగారకా జేబులోంచి ఒక పొట్లాం తీసి ఎర్రగా సీమ మిరపకాయ గుండలా కానొచ్చిన ఎండు హ్రావాను కాస్త నోట్లో వేసుకుని మెల్లగా నమిలాడు. అతగాడి కళ్ళు మసకలు కమ్మి నల్లబడ్డాయి. ముఖంమీద వున్న ముడుతలు నున్నబడ్డాయి. ''కొన్ని సహస్రాబ్దులక్రితం మా పూర్వీకులు అప్పటికింకా విద్యుచ్ఛక్తి కనిపెట్టకపోవడంవల్ల, ఇళ్లను వెచ్చచేసే మార్గం తెలియక, ఇప్పట్లో కట్టినట్టు పెద్దపెద్ద భవనాలు అప్పుడు కట్టలేకపోయారు. చలికాలంలో వెచ్చగా వుండేందుకని భూమిలో నిర్మించుకున్న సొరంగాల్లోకి వెళ్లిపోయేవారు. ప్రకృతిసిద్ధంగానే ఏర్పడిన గుహల్లో మండపాలు, సొరంగాలు, నడవలలో — ఆనాడు మా పూర్వీకులు నిర్మించిన బ్రహ్మాండ

మైన కుడ్యాలన్నిటినీ గ్రహాంతర్భాగంలో ఉత్పత్తి అవుతూన్న సహజ ఉష్ణం వల్లనేవాళ్లు వెచ్చచేయగల్గారు. భూగర్భబిలాల్లో వుండే ఉష్ణం ఎంత హెచ్చుగా వుండెనంటే, దానితో ఆవిరి ఉత్పత్తి చేశారు. ఆనాడు నిర్మించిన ఆదిమ ఆవిరియంత్రాలు ఈ నాటికి కూడా మా ద్వీపాలలో మారుమూలలో పనిచేస్తున్నాయి. పాతాళంలో నిర్మించుకున్న పట్టణాలను ఒకదానితో ఒకటి కలుపుతూన్న సొరంగాలు మా గ్రహం అంతటా వున్నాయి. ఆ సొరంగ వ్యూహంలో తుస్కూబ్ కోసమని వెతకడం కేవలం వృధాప్రయాసే అవుతుంది. అంగారక గ్రహాన్నంతనూ పరిపాలించి రెండు ప్రపంచాలపైనా ఏకఛత్రాధిపత్యం వహించిన రాణి మ్రాగ్ నిర్మించినట్టి సొరంగ వ్యూహం ప్లాను తుస్కూబ్ ఒక్కడికే తెలుసు, మరెవ్వరికీ తెలియదు. సోలత్సేరా నగరం అడుగున శాఖోపశాఖలుగా అల్లుకొనున్న సొరంగాలు జనసంకీర్ణములైన 500 నగరాలకూ, ఈనాడు నిర్జీవములై శిథిలావస్థలో వున్న వేయిపైచిలుకు పురాతన నగరాలకూ విస్తరించి వున్నాయి. ఈ సొరంగ వ్యూహంలో ఆయుధాల గుట్టలూ, వాయునౌకాశాలలూ ఎక్కడపడితే అక్కడున్నాయి. మనకున్న సైనికబలం చెదిరిపోయుంది. మనకి ఆయుధాలు కూడా అంతంతమాత్రంగానే వున్నాయి. తుస్కూబ్‌కి మంచి సైన్యం వుంది. భూస్వాములూ, హ్రావా తోటల యజమానులూ, ముప్పై య్యేళ్ల క్రితం జరిగిన మహామారణ యుద్ధాల అనంతరం పట్టణ భవనాలకు ఖామందులై కూచున్న మహామహులూ — వీరందరి వత్తాసూ వుంది తుస్కూబ్‌కి. అతగాడు తెలివైన ఘటం, అందులోనూ విశ్వాసఘాతకుడు కూడానూ. తనకు ప్రతిఘటనంటూ లవలేశమూ లేకుండా నిశ్శేషం చేసేందుకని అతగాడే కవ్వింపు చర్యలను చేయించాడు. స్వర్ణయుగం — స్వర్ణయుగం! ఛీ!'' అన్నాడు గోర్.

గోర్ అలసట పడిపోయి నిస్త్రాణతో తల పంకించాడు. బుగ్గల

మీద నల్లని మచ్చలు అవుపడ్డాయి. హ్వా ప్రభావం స్పష్టంగా కనబడుతూంది.

''తుస్కూబ్ స్వర్ణయుగం గురించి కలలు కంటాడు. అంగారక గ్రహ చరిత్రలో కడపటి శకాన్ని — స్వర్ణయుగాన్ని — తాను ఆవిష్కరిస్తాడట. కేవలం ఘరానా వ్యక్తులలే, కేవలం పరమానందానికి అర్హులైన వారు మాత్రమే ఈ యుగంలో భాగస్వాములవుతారు. సరిసమానత అసలు దుర్లభం; సరిసమానత అనేది లేనేలేదు పొమ్మంటాడు తుస్కూబ్. సార్వజనిక సౌభాగ్యం అనేది హ్వామైకంలో ఓలలాడుతూన్నవారి పగటికలలు తప్ప మరేమీకాదు. 'సరిసమానత, సార్వజనిక ధర్మమూ వీటికోసం తృష్ణ నాగరికత సాధించిన మహత్తర విజయాలనన్నిటినీ, నాశనం చేసిపారేస్తుంది' అన్నాడు తుస్కూబ్.'' అలా మాట్లాడుతూన్నంత సేపూ గోర్ నోటనుంచి చెంగావి నురుగలు అలా కారుతూనే వున్నాయి. గోర్ ఇంకా ఇలా అన్నాడు:

''అసమానతకీ అధర్మానికీ తిరోగమించుదాం! గతకాలపు శతాబ్దులన్నీ మనమీద 'ఇహి'లు ముసిరినట్టు ముసిరితే ముసురుగాక! బానిసలకు సంకెళ్లు తొడగండి, ఇనుపగొలుసులతో వాళ్లను లేతులకూ, యంత్రాలకూ కట్టేయండి. పశువుల మందలను తోలినట్టు వాళ్లను గని పొరంగాల్లోకి తోలండి — కన్నీటి కాల్వల్లో పడి దొర్లమనండి. అప్పుడు ధన్యులు పరమానందంలో పడి దొర్లుతారు. ఇదీ స్వర్ణయుగం... నెత్తీనోరూ కొట్టుకుంటే సరి... దానమ్మ సిగ్గోసిరి! ఎందుకెత్తానో ఈ జన్మ! ఛస్తే మేలు! ఛీ!''

నోట వున్న సిగరెట్టును అదేపనిగా నమలుతూ గూసెవ్ అతడికేసి చూసి:

''మాబాగా పప్పులో కాలేశారయ్యా మీరు!'' అన్నాడు.

గోర్ చాలా సేపువరకూ ఉలక్కుండా పలక్కుండా వూరికినే అలా కూచున్నాడు. తూటాల డబ్బాలమీద ముసలాడిలా నక్కి కూచున్నాడు.

''మీరన్నమాట అక్షరాలా నిజమే, ఆకాశపుత్రా! పురాతన తూమా వాసులం మేం ప్రపంచ రహస్యాన్ని తెలుసుకో లేకపోయాం. మీరు యుద్ధం చేస్తూండగా ఈవాళ చూశాను నేను. మీలో అగ్నిహోత్రం జ్వలించుతూంది. మీరు శక్తిమంతులూ సాహసికులూనూ. ఈ ప్రపంచ రహస్యాన్ని తెలుసుకో గల్గినవారు మీరే, భూలోకపుత్రులే. మాకు చేతకాదు. మాకు కాలం చెల్లిపోయింది. మేం ముసలి తుక్కులమైపోయాం. మా శరీరంలో వున్నది రక్తమాంసాలు కాదు — మా శరీరంలో వున్నది బుగ్గి బూడిదా. కాలాన్ని మా చేతులతో మేం నీళ్ళ కార్చేశాం,'' అన్నాడు గోర్.

గూసెవ్ పటకా బిగించుకున్నాడు.

''సరే, బుగ్గి బూడిదె అన్నారు మీరు. అయితే రేపు ఏం చేద్దామంటారు?''

''తుస్కూబ్ ఎక్కడున్నదీ రేప్పొద్దున్న మనం తెర-టెలిఫోనులో కనుక్కొని, పరస్పరం రాయితీలు ఇచ్చిపుచ్చుకునే మార్గంలో రాజీ బేరానికి దిగాలి.''

''ఇదిగో, నే చెబుతున్నా వినండి, కామ్రేడ్! ఒక గంటసేపు మీ ఇష్టం వచ్చినట్టూ మీరు ఏమేమిటో మాట్లాడారు,'' అంటూ గూసెవ్ అడ్డుతగిలాడు. ''అదంతా అటుంచండి, రేపు చెయ్యాల్సింది ఇదీ: అంగారక ప్రజలందరికీ రేపు ఒక ప్రకటన చెయ్యండి మీరు — రాజ్యాధికారం సర్వమూ కార్మికుల చేతిలోకి వచ్చేసిందని. బేషరతుగా అందరూ ప్రభుత్వాజ్ఞలను శిరసావహించాలని డిమాండు చెయ్యండి. నేనూ నమ్మకస్థులైన కొందరు కుర్రాళ్లూ వాయునౌకలమీద బయల్దేరి ధ్రువప్రాంతాలకి వెళ్తాం. వెళ్లి విద్యుదయస్కాంత స్టేషన్లని ఆక్రమించుకుంటాం. వాటిని ఆక్రమించుకుని, భూలోకానికి -- అంటే మాస్కోకి — వర్తమానం చేస్తాం వెంటనే

సహాయం పంపమని. వాళ్ళు ఆరునెలల లోపునే అన్ని వాయునౌకలూ సిద్ధం చేసుకుని ఇక్కడకు ఎగిరి వస్తారు...''

అలా అంటూ గూసెవ్ బల్లమీద కూచున్నవాడల్లా తుప్పున తుళ్లి పడ్డాడు — చటుక్కున బల్లను పట్టుకోబట్టిగాని, లేకుంటే కింద పడిపోయుండే వాడే. భవనం అంతా వుయ్యాల వూగినట్టు వూగింది. సరంబీ నల్లని ఛాయల్లోంచి జిలుగులు దిద్దిన అలంకరణాల గిలాబా పెచ్చులు టపటప కింద పడ్డాయి. నేలపై పడుకునున్న అంగారకవాసులు చెంగున లేచి, మతులు పోయి ఇటూ అటూ వెర్రిచూపులు చూశారు. మళ్లీ మరోకమారు, వెనుకటికంటె మరింత జోరుగా వూగింది భవనం. కిటికీ అద్దాలన్నీ ఫెళఫెళ విరిగి నేల రాలాయి. తలుపులు దభీమని తెరుచుకున్నాయి. హోరున చప్పుడు వినబడింది సభామందిరంలో. చౌకులోంచి పేలుడు శబ్దమూ, కేకలూ మెరలూ వినబడ్డాయి.

సభామందిరంనుంచి బయటకు వెళ్లిపోయేందుకని బయల్దేరిన వాళ్లందరూ గుమ్మాల్లో నిలబడిపోయి ఒక్క అడుగు వెనక్కి వేశారు. ఆకాశపుత్రుడు — లోశ్ — మందిరంలో ప్రవేశించాడు. మనిషిని పోల్చుకుందుకే వీల్లేదన్నమాట — ఆ చేరడేసి కళ్ళూ నల్లగా గుంటలు పడిపోయున్నాయి, వాటిలోంచి అదోక మోస్తరు వింత కాంతులు వెడలుతున్నాయి. అంగారకవాసులు వెనక్కి వెనక్కి తప్పుకుని, నేలమీద గొంతుక్కూచున్నారు. అతని తెల్లని తలవెంట్రుకలు ముళ్లల్లా లేచున్నాయి.

''వాళ్ళు పట్నాన్ని చుట్టుముట్టేశారు,'' అంటూ ఖణీగా మాట్లాడు లోశ్. ''ఆకాశంనిండా నౌకలే. కార్మిక పేటల్ని పేల్చిపారేస్తున్నాడు తుస్కూబ్,'' అని అన్నాడు లోశ్.

# తిరుగుదాడి

లోశ్, గోర్ను ఇద్దరూ పరుగెత్తి భవనం వెలుపల మెట్లదగ్గరున్న స్తంభాల వసారా చేరుకున్నారో లేనేలేదో మరో పేలుడు శబ్దం — రెండోది — బ్రహ్మాండం బద్దలైనట్టు వినబడింది. పట్టణం ఉత్తర భాగాల్లో నీలి రంగు విసనికర్రలా మంటలు లేచాయి. మంటల వెంటే పొగ మబ్బులూ భస్మపు మేఘాలూ ఆకాశాన్ని అంటాయి. ఆ చిచ్చర పిడుగు మార్మోత ఇంకా సమసిపోయిందో లేనేలేదో తుపానొకటి దానిమీద విరుచుకుపడింది. ఆకాశం అంతా ఎర్రని కాంతితో వెలిగింది.

ఆ నక్షత్రాకృతి చౌకునిండా వున్న సైనిక బలగం నుంచి ఏ చప్పుడూ వినబడ్డంలేదు. దూరాన మండుతూన్న మంటలను అంగారకవాసులు మౌనంగా చూస్తూ నిలబడ్డారు. వారి ఇళ్ళూ కుటుంబాలూ బూడిదపాలైపోతున్నాయి. వారి ఆశలు అడియాశలై మంటల్లో కలిసిపోయాయి.

లోశ్, గోర్నతో కొంత సేపు సంప్రతించిన మీదట గూసెవ్ తన వాయునౌకాదళాన్ని సమాయత్తపరచేందుకు సన్నాహాలు చేయసాగాడు. నౌక లన్నీ ఆయుధశాలలో వున్నాయి. కేవలం పెద్ద తూరీగ నౌకలు ఐదు మాత్రమే వున్నాయి చౌకులో. సరే అని చెప్పి, శత్రుసేనలు ఎక్కడున్నాయో, అవి ఏమి చేస్తున్నాయో ఏమి చెందుతున్నాయో తెలుసుకుందుకని, వీటిని రిక న్నాయ్‌సెన్స్ పనిమీద పంపించాడు గూసెవ్. దూరాన మండుతూన్న మంటల వెలుగులో ఈ నౌకల రెక్కలూ ఎర్రగా ప్రకాశిస్తూండగా, అవి ఆకాశ పథాన ఎగిరి వెళ్ళిపోయాయి.

ఆయుధశాలనుంచి కూడా అతనికి కబురు అందింది, అక్కడున్న సైనికబలగం కూడా వాయు నౌకలమీద బయల్దేరుతూందని. నగరంలో

అలముకొన్న నిశ్శబ్దం భయానకంగా అశుభసూచకంగా వుంది. గూసెవ్ తన మనుషులను తెర-టెలిఫోన్ల దగ్గరకు పంపించి, ఆయుధశాల ఆవరణలో వున్న నౌకలను బయల్దేరమని తొందరచెయ్యమన్నాడు. తానేమో కారు నీడలా చౌకు నలుమూలలా పరుగెత్తుతూ, పెద్దగా అరుస్తూ కేకలేసుకుంటూ చెదిరి వున్న సైనికులను శ్రేణులకింద సమీకరించాడు. ఈ పని పూర్తి చేసుకుని, అతడు మళ్ళీ భవనం మెట్లమీదకి వచ్చేసి, కనుబొమలు ముడి పెట్టుకుని, మీసం మెలిపెట్టాడు.

"ఆయుధశాల ఆవరణలో వున్న ఆ ల... కొడుకుల్ని" అంటూ గూసెవ్ మొదలెట్టేసరికి ఆ కొత్త పదం అర్థమేమిటో తెలియక గోర్ తబ్బిబ్బయి చూశాడు. "...కొడుకుల్ని కాస్త తొందర పెట్టండి మీరు," అని గూసెవ్ ఆ వాక్యం ముగించాడు.

గోర్ టెలిఫోను దగ్గరకెళ్ళాడు. కొసకి ఎలాగైతేనేమి అన్ని సన్నాహాలూ పూర్తి చేసుకుని, సైనిక బలగం నౌకలమీద బయలువెడలుతూన్నట్టు టెలిఫోను కబురందింది. మరికొన్ని నిమిషాలకు ఆ తూరీగ నౌకలు నగరపు ఆకాశవీధుల్లో కిందుగా ఎగురుతూన్నట్టు దట్టంగా వున్న పొగ మబ్బుల చాటునుంచి కనబడ్డాయి. కాళ్ళు ఎడంగా పంగ జాపుకొని, మెడ వెనక్కి విరచి, "V" అక్షర వ్యూహంలో ఎగురుతూన్న ఆ నౌకలను సంతోషంతో చూస్తూ నిలబడ్డాడు గూసెవ్. మరోగడియకల్లా మళ్ళీ మూడో పేలుడు శబ్దం వినబడింది.

ఆకాశంలో శ్రేణులుతీర్చి ఎగురుతూన్న నౌకలను తాకుతూ లేచాయి మంటల నాలుకలు. తూరీగనౌకలు చర్రున మరింత ఎత్తున ఎగిరి, నిటారుగా లేచిపోయి అంతర్ధానమైపోయాయి. ఉత్తరక్షణంలో – బుగ్గి మబ్బులూ పొగమేఘాలూ తప్ప మరేమీ కనబడలేదు.

గోర్ మెట్లమీద కొచ్చేశాడు. మెడలు బుజాల్లోకి కుంగిపోయాయి. ముఖం వంకర్లు పోతూంది. కాస్త సద్దు మణిగిన తరువాత గోర్ అన్నాడు:

"ఆయుధశాలని పేల్చేశారు. నౌకాదళం ధ్వంసమైపోయింది."

గూసెవ్ ఘుర్ఘురించి, మీసం నమిలాడు. స్తంభం ఒకదానికి చేరబడి, మంటలకేసి చూస్తూ నిలబడిపోయాడు లోశ్. గూసెవ్ముని వేళ్లమీద నిలబడి, గాజుపూసల్లా కళావిహీనంగా వున్న లోశ్ కళ్లల్లో కళ్లు పెట్టి చూస్తూ:

"ఇక బతికి బయట పడేవాళ్ల పని మూడినట్టే," అన్నాడు.

లోశ్ బదులు చెప్పలేదు. గూసెవ్ అదేపనిగా తల పంకించుతూ మెట్లు దిగి చౌకులోకి నడిచి వెళ్ళాడు. అక్కడున్న సైనికులను అతడేదో ఆజ్ఞాపించగానే, వీధుల్లో నిర్మించిన బారికేడ్ల దిశగా వారు శ్రేణులు తీర్చి నడుచుకుని వెళ్లిపోయారు.

మరో గడియకి గూసెవ్ ఎక్కిన రెక్కల జీను నీడ చౌకు మీదనుంచి సాగిపోతూంది. తన నౌకలోంచి కిందకి చూస్తూ గూసెవ్ కేకేశాడు: "ఆరె, మీ బొద్దు పాక్కా! చీమ నడకలూ మీరూనూ. త్వరగా నడిచి వెళ్లండి!"

చౌకు నిర్మానుష్యమైపోయింది. ఇప్పుడు సగానికిపైగా నగరంలో వ్యాపించిన మంటల వెలుగులో, ఆవలి దిశనుండి వ్యూహంతీర్చి వస్తూన్న తూరీగ నౌకలు తళతళ మెరుస్తున్నాయి. అవి తుస్కూబ్ నౌకలు.

అప్పుడన్నాడు గోర్:

"ఆకాశపుత్రా! మీకు ప్రాణాలు దక్కించుకోవాలనుంటే ఇదే సమయం."

లోశ్ బుజాలు ఎగరేశాడు. నౌకలు సమీపిస్తున్నాయి. అవి కిందుకు దిగుతున్నాయి. వాటిని ప్రతిఘటించేందుకని అగ్ని గోళపు గుళ్లు ఒకదాని

వెంట ఒకటి వీధులను అలముకున్న అంధకారంలోంచి ఆకాశంలోకి లేస్తున్నాయి. అవి తిరుగుబాటుదార్ల యంత్రాలు పేల్చుతూన్న గుళ్ళు. రెక్కల నౌకాశ్రేణులు చౌకుమీది ఆకాశంలో ఒక వలయం చుట్టి, వీధులపైనా, ఇళ్లపైనా ఎగిరేందుకు నానా దిశలుగానూ విడిపోయాయి. నిర్విరామంగా పేలుతూన్న అగ్నిగుళ్ల వెలుగులో వాటి పార్శ్వాలు తళతళ ప్రకాశించాయి. ఒక నౌకకు అగ్నిగుండు తగలగానే అది అంతర్ను దొర్లే సరికి, దాని రెక్క ఒకటి రెండు ఇళ్లకప్పుల నడుమ చిక్కుకుంది. కడమ నౌకలు చౌకులో దిగాయి. వాటిలోంచి వెండిలా తళుకులు మెరస్తూన్న చొక్కాలు తొడుక్కున్న సైనికులు తండోపతండాలుగా దిగి, వీధుల్లోకి పరుగెత్తారు. ఇళ్ళ కిటికీల నుంచీ, సందు మలుపులనుంచీ వీళ్లపై గుళ్లవర్షమూ రాళ్లవానా కురిసింది. ఎన్నో నౌకలు, ఇంకా ఎన్నో నౌకలు అలా వస్తూనే వున్నాయి. వాటి అంతులేని మందు నీడలతో చౌకు అంతా నిండిపోయింది.

విశాల భుజస్కంధాలున్న గూసెవ్ ఆకారం ఒక ఇంటి కప్పుమీదకి ఎగబాకడం చూశాడు లోశ్. వెంటనే గూసెవ్‌కేసి తిరిగాయి ఐదారు నౌకలు. గూసెవ్ ఒక పెద్ద రాతిబండను చేతబుచ్చుకుని తనకు దగ్గరగా వున్న నౌకమీదకి విసిరాడు. తళుకులు మెరుస్తూన్న రెక్కలు అదే సమయంలో అన్ని వైపులనుంచీ అతనిని చుట్టుముట్టేశాయి.

అంతవరకూ అదొకమోస్తరుగా మందకొడిగానే వున్న లోశ్‌కి దీనితో ఎక్కడలేని కదలికా వచ్చింది. చౌకుగుండా ఆ ఇంటికేసి పరుగెత్తాడు. నౌకలు ఇంటిమీద చక్కర్లు కొడుతూ, నిప్పులు కురిపిస్తూ గర్జిస్తున్నాయి. లోశ్ పళ్ళు బిగించి, తన నిశిత దృష్టితో చుట్టుపక్కలున్న వస్తువులన్నిటినీ గుర్తుపెట్టుకున్నాడు.

నాల్గు దాట్లలో చౌకు ఆవతలకు చేరుకుని, ఆ ఇల్లు సమీపించుతూ,

కన్నెత్తి చూసే సరికి, ఇంటి మేడ వరండా మీద చీమలపుట్టల్లా వున్న అంగారకవాస సైనికులు గూసెవ్‌ను చుట్టేస్తూండగా, వాళ్ల చేతులనూ కాళ్లను తప్పించుకుంటూ, వాళ్ల పట్టునుంచి భల్లూకంలా విడిపించేసుకుంటున్నాడు గూసెవ్. తన పీకను పట్టుకుందుకు ఒకడు ప్రయత్నించగా వాడిని పట్టుకుని ఒక్క విసురుతో గాలిలో ఎగరేశాడు గూసెవ్. కడమవాళ్లని తనతో ఈడ్చుకుంటూ పరిగెత్తుతున్నాడు మేడ వరండాలో. మరో నిమిషానికల్లా గూసెవ్ వరండాలో పడిపోయాడు.

లోశ్ దిగాలుబడి ఒక్క కేకేశాడు. ఆ ఇంటి అంతస్తుల చూరు పట్టుకుని మేడ వరండా మీదకి ఎగబాకాడు. కీచుగొంతుకలతో కేకలు పెడుతూ చీమలపుట్టల్లా కదలుతూన్న ఆ సైనికుల మూక కాళ్లకింద రక్తాలు కారుతూన్న గూసెవ్ ముఖమూ, పైకి తోసుకొస్తూన్న కనుగుడ్లూ కనబడ్డాయి లోశ్‌కి. లోశ్‌ను చూడగానే అంగారక సైనికులు అతనిమీద పడ్డారు. పరమ అసహ్యంతో చీమలని ఏరిపారేసినట్టు వాళ్లని వదలించేసుకుని, గూసెవ్‌ను చుట్టుముట్టిన వాళ్లను ఒక్కొక్కరినే చిదుగులను ఏరిపారేసినట్టు పిట్టగోడ మీదనుంచి కిందకి విసిరేశాడు. కాస్సేపటికల్లా వరండా ఖాళీ అయిపోయింది. గూసెవ్ నేలమీదనుంచి లేవ ప్రయత్నించాడు. కాని అతని తలకాయ ఇటుంచి అటు వాలిపోయింది. లోశ్ అతనిని పట్టుకుని లేవదీసి, మేడనుంచి దింపి, కింది అంతస్తుకి వచ్చేసరికి గుమ్మం ఒకటి తెరచి వుండడం చూసి, గదిలోకి దూకి, బయట మండుతూన్న మంటల వెలుగుతో నిండిన ఆ చిన్న గదిలో నేలపైవున్న తివాచిమీద గూసెవ్‌ను కూచోబెట్టాడు.

గూసెవ్ గురకతో ఊపిరి తీస్తున్నాడు. లోశ్ గుమ్మంల్లోంచి వీధిలోకి చూశాడు. నౌకలు ఇంటి డాబా మీదుగా ఎగిరి వెళ్లిపోతున్నాయి.

నౌకల్లోంచి సూదిముక్కు ముఖాలు తొంగిచూస్తున్నాయి. వాళ్ళు మళ్ళీ మరొకసారి దాడి చేస్తారనే లోశ్ నిశ్చయించుకున్నాడు.

"మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్!" అని పిలిచాడు గూసెవ్. అతడు లేచి కూచుని, తలకాయ రెండు చేతులతోనూ పట్టుకుని, నోటంట రక్తం వుమ్ముతున్నాడు. "మన మనుషులు ఐపూ జాడా లేకుండా నాశనమై పోయారు — యావన్మందీ కూడా... దండుమీద దండు, దండుమీద దండు మనమీద విరుచుకుపడి, దోమల్ని నలిపేసినట్టు మనవాళ్ళని నలిపి పారేశారు — మీరు నమ్ముతారో నమ్మరోగాని... మనవాడెవడేనా బతికి వుంటే మాత్రం, వాడు హడిలిపోయి, ఏ మూలో దాక్కుని వుండాలి. నన్ను ఒక్కడినీ వదిలిపెట్టేసి వాళ్ల మానాన వాళ్ళు కాలికి బుద్ధి చెప్పారు. ఆరె, దాని సిగ దరగా!" అలా అంటూ మెల్లగా లేచి నిలబడి, జోగిపోతూ గది ఈ కొసనుంచి ఆ కొసకి వెళ్ళి, అక్కడ ఏ సుప్రసిద్ధ అంగారకవాసి కంచు విగ్రహమో ఒకటుంటే, దాని ఎదుట నిలబడ్డాడు. "మీరిక్కడుండండి!" అని చెప్పి, ఆ విగ్రహాన్ని చేతబుచ్చుకుని తలుపు దగ్గరకు వెళ్ళాడు గూసెవ్.

"అలెక్సేయ్ ఇవానొవిచ్! ఎక్కడికి వెళ్తున్నారలా?"

"నాకేమీ పాలుపోవడం లేదు. ఏదేనా చేస్తేనేగాని నాకు మతి పోతుంది. నన్ను వెళ్ళనీయండి!"

గూసెవ్ ఇంటి డాబామీదకి పరుగెత్తాడు. డాబామీదనుంచి ఎగిరి వెళ్తూన్న నౌక తన రెక్కల కిందనుంచి గుళ్లవర్షం కురిపించింది. తటాలున దుబ్బుమని చప్పుడు. నౌక కుప్పకూలినట్టు కూలిపోయింది.

"భేష్!" అని సంతోషంతో ఒక్క కేక పెట్టాడు గూసెవ్.

లోశ్ అతనిని అక్కడనుంచి లాగేసి, ఒక్కడ వరండాలో వున్న గది లోకి తోసేసి, గదితలుపు బిడాయించేశాడు.

''అలెక్సేయ్ ఇవానొవిచ్! నామాట వినండి! మనం ఓడిపోయాం – ఏం కార్యం లేదు, అంతా సరి... మనం చేయాల్సింది ఒక్కటే – అయిలీతని రక్షించాలి మనం.''

''అందరూ ఎలా మట్టి కొట్టుకుపోతూన్నా సరే, మనసంతా ఆ పిల్లమీాదేవుంది...''

అలా అని, గూసెవ్ చటక్కున చతికిలపడి, తలకాయ పట్టుకుని, కోపంతో బుసకొట్టుతూ, కాళ్లు రెండూ నేలను కొట్టాడు.

''సరే,'' అన్నాడు గూసెవ్, ఇక ఏంచేసినా లాభంలేదనే తెలుసుకుని, కోపంతో మండిపోతూ, ''వాళ్లు నన్ను నిలువునా చీరేసి నా చర్మం వొలిచేస్తే వొలిచేసీయనిండి! ఈ ప్రపంచంలో న్యాయంలేదు! ఈ గ్రహమే అంత, దీని తస్సా చెక్కా! 'రక్షించండోయ్, బాబూ – మమ్మల్ని రక్షించండి!' అంటూ కేకలూ బొబ్బలూ పెట్టారు. ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని ఏడ్చారు. 'బతకాలని వుందండీ బాబోయ్!' అని బతిమాలుకున్నారు. బతకాలనే వుంది, వాళ్లకి, కాని నేనేంచేసేది? నా చేతనైనంతా నే చేస్తినాయె, నా రక్తం చిందించానాయె. అయినప్పటికీ, వాళ్లు మనని అధఃపాతాళానికి అణగదొక్కేశారు. మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్, ఇక ఇది చూసి నే భరించలేకుండా వున్నాను. ఏమైతే కానీయండి, ఈ ప్రజాకంటకుల్ని పళ్లతో కొరికి పారేస్తా...''

అతడు మళ్ళీ తలుపు దగ్గరకి వెళ్ళాడు. ఆ వెళుతూన్నవాడిని లోశ్ బుజాలు పట్టుకుని వెనక్కి లాగి, ఒక్క కుదుపు కుదిపి, ముఖంమీాద ముఖం పెట్టి, తెరిచూసి:

''ఇదొక పీడకల – అంత కంటె మరేమీా కాదు. పదండి, మనం ఇంటికి వెళ్లిపోదాం – ఇంటికి – భూలోకానికి,'' అన్నాడు.

గూసెవ్ ముఖం అంతా రక్తంతోనూ దుమ్ముతోనూ పులుముకొనుంది.

"పదండి పోదాం!" అన్నాడు గూసెవ్.

గదిగుమ్మం తలుపు తెరిచే సరికి విశాలమైన మేడమెట్లు అవుపడ్డాయి. ఆ మెట్ల కిందని ఒక సొరంగంలోకి దారితీస్తూ తిరుగుడుమెట్లున్నాయి. వీధిలో మండుతూన్న మంటల వెలుగు ఆ ఇంటి మిద్దెకు అమర్చిన పైకప్పు కిటికీలోంచి దూసుకొచ్చి, కిందకి చూస్తే కళ్ళు తిరిగిపోయేటట్టుగా సొరంగపు అట్టడుగున పడుతూంది.

ఇరుకుగా వున్న ఆ తిరుగుడుమెట్లు దిగడం మొదలెట్టారు లోశ్, గూసెవ్‌లు. ఆ పాతాళంలో అంతా నిశ్శబ్దంగా వుంది. కాని పైన పేలుడు ధ్వనులు మాత్రం మరింత బిగ్గరగా వినబడ్డాయి. నౌకల పృష్ఠభాగాలు ఇంటి మిద్దెను తాకిన గరగర శబ్దం స్పష్టంగా వినబడింది. ఆకాశపుత్రులు తలదాచుకున్న ఈ చిట్టచివరి రక్షణ ప్రదేశంపై అంగారకవాస సైనికులు దాడిచేయడానికి నిశ్చయించుకున్నట్టే అవుపడింది.

లోశ్, గూసెవ్‌లు ఆ తిరుగుడుమెట్లు దిగుతూనే వున్నారు. కాని అవి అనంతంగా వున్నట్టు కనబడింది. అంతకంతకు మరింత చీకటైపోతూంది. తటాలున చిన్న మనిషి ఆకారంలాంటిదేదో కింద వున్నట్టు కనబడింది వారికి. ఆ ఆకారం ఎంతో ప్రయాసపడి వారికేసి పాకుకుంటూ వస్తూన్నట్టుంది. వస్తూన్నదల్లా అది తటాలున ఆగిపోయి, బలహీనంగా కేకేసింది:

"వాళ్ళు ఏ నిమిషమైనా ఇక్కడకు జొరబడొచ్చు. మీరు తొందరపడాలి. ఈ సొరంగ వ్యూహంలోంచి బయటకి మార్గం అడుగున వుంది."

అది మరెవ్వరూ కాదు — గోర్. అతడికి తలమీద గాయం తగిలింది. నాలుకతో పెదవులు తడిచేసుకుంటూ అన్నాడు:

“పెద్ద సొరంగాలలోనే నడిచివెళ్లండి. గోడలమీద రాసి వున్న గుర్తులు చూసుకుంటూంటండి. ఇక సెలవు! మీరు మళ్ళీ మీ భూలోకానికి గనక తిరిగి వెళ్తే మాత్రం, మీవాళ్లతో మాగురించి చెప్పండి. భూలోకంలో మీరు హాయిగా జీవించుతారేమో. మాకు మాత్రం ఇక్కడ మంచు ఎడార్లూ, చావూ, బాధలూ తప్ప మరేమీ లేదు — వీటిని మేం అనుభవించి తీరాల్సిందే. అవును — ఘా అవకాశాన్ని మేం జారవిడుచుకున్నాం... జీవితాన్ని మేం ప్రేమించి వుండాల్సింది — ఉగ్రంగా, తీవ్రంగా — తీవ్రంగా...”

మీదనుంచి శబ్దం వినబడింది. గూసెవ్ దడదడ మెట్లు దిగాడు. గోర్‌ను తమతో కూడా తీసుకువెళ్దామనే అనుకున్నాడు లోశ్. కాని ఆ అంగారకవాసి మాత్రం పళ్లు బిగించి, మెట్ల స్తంభాలను గట్టిగా పట్టుకుని వదిలాడుకాడు.

“మీరు వెళ్లండి. ఇక్కడ చచ్చిపోవాలనే వుంది నాకు,” అన్నాడు.

లోశ్ గబగబా గూసెవ్ వెంటే మెట్లు దిగిపోయాడు. చిట్టచివరకి ఒక విశాలమైన గుండ్రని మెట్టు దగ్గరకి వచ్చారు. అక్కడనుంచి సొరంగం అట్టడుగుకి సరాసరి నిటారుగా కిందకి దిగిపోయాయి మెట్లు. అక్కడకు చేరేసరికి, అక్కడొక పెద్ద రాతిపలక అవుపడింది. ఆ రాతిపలకలో ఫ్రేమ్ ఒకటి దింపి వుంది. ఆ ఫ్రేమ్‌కి గుండ్రని గొళ్లెం ఒకటుంది. ఆ గొళ్లెం పట్టుకుని ఎంతో కష్టంమీద రాతిపలకని పైకెత్తారు: ఆ సందులోంచి పొడిగాలి ప్రవాహం ఠైంయ్‌మని కొట్టింది.

ఆ సందులోంచి మొట్టమొదట గూసెవ్ దిగాడు కిందకి. తరువాత

లోశ్ దిగాడు. లోశ్ దిగి, మళ్ళీ ఆ రాతిపలకను యథాస్థానంలో వుంచుతూండగా తలెత్తి చూసే సరికి, ఎర్రని సంధ్యారాగంలో, పైన ఎంతో ఎత్తున, ఎంతో దూరానే వున్న ఆ విశాలమైన గుండ్రని తిరుగుడుమెట్టు మీద సైనికుల ఆకారాలు కనబడ్డాయి. వాళ్ళు మెట్ను గబగబ దిగుతూ వస్తున్నారు. వాళ్ల దారికి అడ్డుగా గోర్ చేతులు చాపుకొని నిలబడ్డాడు. కాని వాళ్ళు అతనిమీద కురిపించిన దెబ్బల వర్షానికి ఆగలేక అతడు కింద పడిపోయాడు.

# రాణి మార్గ్ సొరంగవ్యూహం

లోశ్, గూసెవ్‌లు ఇద్దరూ చిత్తడివాసన కొడుతూన్న ఆ చీకటిలో తడుముకుంటూ అడుగుతీసి అడుగు వేసుకుంటూ నడిచారు.

''ఇక్కడ మలుపు వుందయ్యా, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్!'' అన్నాడు గూసెవ్.

''సొరంగం ఇరుగ్గా వుందా ఏమిటి?''

''లేదే, విశాలంగా వుంది. బార చాపినా ఇటూ అందడంలేదు అటూ అందడంలేదు.''

''మళ్ళీ స్తంభాలు వచ్చాయే! ఆగండి! ఎక్కడున్నాం మనం?''

...వాళ్ళా వ్యూహంలో నడవడం మొదలెట్టి అప్పుడే మూడుగంటలు పైచిలుకైంది. వాళ్ల దగ్గరున్న అగ్గిపుల్లలన్నీ అయిపోయాయి. ముష్టియుద్ధంలో గూసెవ్ టార్చిలైటు ఎక్కడో పడిపోయింది. ఆ అంధకారంలో తడుముకుంటూ వంగివంగి పాకుకుంటూ అడుగులు వేసుకుంటూ నడుచుకొస్తున్నారు.

సొరంగాలు మొదలూ కొసా లేకుండా శాఖోపశాఖలుగా విడిపోతూ, మళ్ళీ కలుసుకుని అల్లుకుపోతూ, ఎగుడు ఎక్కుతూ దిగుడు దిగుతూ ఎడ తెరిపీ లేకుండా వున్నాయి. నీళ్లచుక్కలు టక్కుటక్కుమంటూ కిందకు పడుతూన్న ఏకస్థాయి ధ్వని స్పష్టంగా అవిరామంగా వినబడుతూంది. చీకటిలో తేరిచూడడంచేత వారి కనుపాపలు వ్యాకోచించుకున్నాయి. దూరాన మసక మసకగా ఏవేవో బూడిదరంగు ఆకారాలు కనబడ్డాయి, కాని ఆ అవ్యక్తపు ఆకారాలు కేవలం భ్రమ తప్ప మరేమీ కాదని కాస్సేపటికల్లా తేలిపోయింది.

"ఆగండి!"

"ఎందుకని?"

"ఏదో అగాధంలా వుంది, బాబోయ్!"

అక్కడలా నిశ్శబ్దంగా నిలబడిపోయి, ఏమేనా వినబడుతుందేమో అని విన్నారు. సువాసన వేస్తూన్న పొడిగాలి వారి ముఖాలకు తగిలింది. ఎక్కడ నుంచో దూరాతిదూరంనుంచి, నిమ్నాతినిమ్నంనుంచి శ్వాసధ్వని వినబడుతూంది. ఇక వాళ్ళకి ఎదురుగా ఏమీ లేదనీ, ముందేదో ప్రమాదం రాబోతూందనీ వారికి బెంగ పడింది. నేల తడమగా గూసెవ్‌కి గులకరాయి ఒకటి చేతికి దొరికింది. దానిని ఆ అగాధంలో పడేశాడు. కొద్ది లిప్తల తరువాత రాయి నేలను తాకిన చప్పుడు లీలగా వినబడింది.

"ఇదేదో పాతాళ నూయిలావుంది."

"నూయి అడుగున ఏముందో?"

"ఏముందో ఏమీ తెలియడంలేదు."

సరే అని, మలుపు తిరిగే సరికి, గోడ ఒకటి అడ్డంగా వుంది. అటూ ఇటూ ఏమిటుందో అని తడమగా, ఇటూ అటూ పెచ్చులు రాల్తూ చేతికి

తగుల్తూన్న బీటలూ, ఆర్చీలూ తప్ప మరేమీ లేదు. కంటికి కనబడని ఆ నూతి అంచు గోడ దరినే వుంది — కుడివైపూ, ఎడమవైపూ, మళ్ళీ కుడివైపూ నూయే. కాస్సేపయాక అప్పుడు తెలుసుకొచ్చింది వాళ్ళకి, ఆ అంధకారంలో, గుడుగుడు గుంచం గుండారాగంలా, నూతిగోడ చుట్టూ తిరుగుతున్నామే అనీ, తాము వచ్చిన సొరంగం సందు ఎక్కడుందో తెలిసికో లేకపోతున్నామనీ.

వారిద్దరూ ఒకరికొకరు దగ్గరగా బుజాలూ బుజాలూ కలిపి, గతుకులుగా గరుగ్గా వున్న గోడకు వీపులు ఆనుకుని, నూతి అగాధపు అట్టడుగు నుంచి వినవస్తూ తమ మతిని భ్రమింపజేస్తూన్నట్టి నిట్టూర్పు ధ్వనిని వింటూ అలా నిశ్చేష్టులై నిలబడిపోయారు.

"దీనితో మన పని సరా ఏమిటి, అలెక్సేయ్ ఇవానొవిచ్?"

"అలాగే వుంది చూడగా".

మరో గడియ అయాక, లోశ్ అడిగాడు మెల్లగా, అదొకమోస్తరు ఏంత గొంతుకతో:

"అదిగో, అలా చూడండి — ఏమేనా కనబడుతూందా మీకు?"

"లేదే."

"ఎడమచేతికేసి చూడండి, దూరంగా."

"ఏమీ — ఏమీ కనబడ్డంలేదు."

లోశ్, ఈ కాలు తీసి, ఆ కాలుమీద నిలబడి, తనలో తానే మాట్లాడుకుంటూన్నట్టుగా అన్నాడు:

"జీవితాన్ని ఉగ్రంగా, తీవ్రంగా ప్రేమించాలి — అవును, అదీ మార్గం..."

"ఏమిటంటున్నారు?"

''ఏమీ లేదూ — వాళ్ళగురించీ, మన గురించీనీ.''

ఇప్పుడు గూసెవ్ కూడా ఈ కాలు తీసి ఆ కాలు మీద నిలబడి, నిట్టూర్చాడు.

''అదిగో, ఏదో వూపిరి తీస్తూన్నట్టు వినబడుతూంది. మీకూ వినబడిందా?''

''ఏమిటి — మృత్యువా?''

''మృత్యువో, ఏమిటో, ఎవడికి తెలుసు? మృత్యువు గురించి నేనూ చాలా ఆలోచించాను'' అంటూ గూసెవ్ చెప్పుకుపోయాడు, తనతో తానే మాట్లాడుకుంటూన్నట్టు. ''రణరంగంలో తుపాకి చేత పుచ్చుకుని బోర్లా పడుకునుండగా, చీకట్లో వర్షం పడుతూన్నప్పుడు — దాని గురించి ఏమి ఆలోచించుకున్నా సరే, కొసకి నీ కొక్కటే తోస్తుంది — చావు. రోడ్డు పక్కను చచ్చి పడున్న గుర్రంలా — చలితో గడ్డకట్టుకుపోయి, చావులో వెళ్ళిగిలించి — నువ్వు కూడా అలాగే ఏ రోడ్డు పక్కనో చచ్చి పడున్నట్టే నీ కళ్ళముందుంటుంది. నేను చచ్చిన తరువాత నా కేమిటవుతుందో — నాకు తెలీదు — తెలియక పోయినా బాధలేదు. కాని బతికున్నప్పుడు మాత్రం నాకు తెలియాల్సింది ఒకటుంది: ఆ చచ్చిన గుర్రంలాగానే కుళ్ళుతూన్న మాసంపు తునుకనేనా నేనూనూ? లేకుంటే నేనూ మనిషినేనా? — లేకుంటే ఏదైనా ఒకటేనా? చావు దగ్గరపడే టప్పటికి — నేనూ గుడ్లు తేలేసి, గజగజ వణకిపోయి, ప్రాణాలు వదలేస్తూన్న ఆ క్షణంలో — ఆ క్షణమప్పుడు, ప్రపంచం అంతా, నేను నా కళ్ళతో చూసినదంతా అపసవ్యంగా కనబడు తుందా? అలా వెళ్ళిగిలించి చచ్చిపడున్నది నేనేనా — ఏకాలంన్నాడో చిన్న ప్పుడు జరిగినది సహితమూ స్పష్టంగా జ్ఞప్తివుండి, నిండు ప్రాణాలతో జవసత్వాలతో వుండిన నేనేనా? నేను అలా చచ్చిపడుండగా — ప్రపంచం

అంతా యథాప్రకారం దాని ఘూనాన్నది కిమ్మన్నాస్తిగా అలా సాగిపోతూనే వుంటుందా? అదే నాకు అర్థంకాకుండా వుంది. పంథొమ్మిది వందల పథ్నా ల్గునుంచి మనుషుల్ని చంపడానికి మనం బాగా అలవాటుపడిపోయి — మనిషి అంటే లెక్కే లేకపోయింది — మనిషి అవుపించుతే సరి — గుండేసి పేల్చేయ్ — వాడక్కడికి సరి — అలా వెళ్లిపోయింది. అబ్బే, అంత సుళువుగా తీరిపోవడంలేదే. ఒకమాటు—నాకు గాయాలు తగిలి, బండిలో పడేసి తీసుకు పోతున్నారు. వెల్లకిలా పడుకుని ఆకాశాన వెలుగుతూన్న నక్షత్రాలకేసి చూస్తున్నా. అదేమిటో మరి — గుండెలు ఝల్లుమన్నాయి. నేను దోమనైతే నేమి, మనిషినైతేనేమి? — భేదం ఏముందనిపించింది. దోమకి కూడా తిండి కావాలి, అదీ నీళ్లు తాగుతుంది — దానికీ నాలాగే ఆకలి దప్పులుంటాయి. అదీ చస్తుంది. నేనూ చస్తాను. అలా అనుకుంటూనే ఆకాశాన వజ్రాల్లా ధగ ధగా మెరిసిపోతూన్న నక్షత్రాలకేసి చూశాను — అది ఆగస్టు నెల. వాటిని చూసే సరికి — ఆ వెలిగిపోతూన్న నక్షత్రాలన్నీ నాలోనే వున్నాయని తోచింది నాకు, మిస్తిస్లావ్ సెర్గేయెవిచ్. అలా అనిపించే సరికి, నాలో వున్న నరనరమూ గజగజగజ వణికిపోయింది. నేను దోమతో సమానమా? ఛీ, ఛీ! ఎంత మాత్రమూ కాదు — అనిపించింది. అలా అనిపించి, అదేమిటో — చంటిపిల్లాడిలా ఏడ్చేశాను — ఏమిటిదంతా? నేను దోమనికానే! మనిషి దోమకాడే. మనిషిని నిలునిలువునా చంపేయడం — తుపాకి మడమతో! వాడి బుర్ర బద్దలగొట్టడం— ఛీ! ఎంత ఘోరం, ఎంత పాపం! — అనిపించింది. ఇక ఇప్పుడేమో — విషవాయు వులు ప్రయోగిస్తున్నారు! నాకు బతకాలనుంది, నేను బతికి తీరుతాను — మిస్తిస్లావ్ సెర్గేయెవిచ్! ఈ అంధకారం ఇక నేను భరించలేను. ఇంతకీ — ఎందుకోసమని మనమిక్కడ నిల్చున్నట్టు?..''

''ఇదుగో ఇక్కడుంది,'' అన్నాడు లోశ్, వెనకటి లాగానే అదో మోస్తరు వింత గొంతుకతో.

సరిగ్గా ఆ క్షణంలో ఎంతో దూరాన ఏదో బద్దలైన శబ్దపు ప్రతిధ్వనితో ఆద్యంతాలు లేని ఆ సొరంగాలు దద్దరిల్లిపోయాయి. వారి కాళ్ళకిందున్న నూతి పళ్లెం అంచు, వారు ఆనుకునున్న గోడ గజగజ వణకిపోయాయి. చీకట్లోనుంచి రాళ్ళు ఎగిరొచ్చిపడ్డాయి. ఆ గర్జన తెరలు తెరలుగా కెరటాల్లాగు కొట్టుకొనివస్తూ, దూరాన మాయమైపోయింది. అది ఏదో పేలుడు. తుస్కాబ్ తన మాట నిలబెట్టుకున్నాడు. ఆ పేలుడు ఎక్కడ నుంచో వినబడుతూండడం కారణంగా, ఆ దూరాన్ని బట్టి చూస్తే తాము సోలత్సేర నగరం దాటి చాలా దూరం వచ్చేశామనే వారికి స్పష్టమైంది.

మరికొంతసేపటి వరకూ రాళ్ళు మాత్రం వాళ్ల చుట్టూరా అలా పడుతూనే వున్నాయి. తరువాత అంతా నిశ్శబ్దం. సొరంగం అడుగున ఇదివరకు వారికి వినబడిన శ్వాసధ్వని ఇప్పుడిక వినబడ్డం లేదన్న సంగతి మొట్టమొదట గూసెవ్ గమనించాడు. ఇప్పుడు ఆ నూతి అడుగునుంచి అదొక కొత్త మోస్తరు చప్పుళ్ళు వినబడుతున్నాయి – ఏదో మెత్తగా ముద్దగా వున్న వస్తువు కాగుతూ బుస్సుబుస్సుమంటూ లేస్తూన్న బుడగలతో మరుగుతూన్నట్టు. గూసెవ్ ఇక భరించలేకపోయాడు. గోడవెంట చేతులు బారచాపి, కేకలేసుకుంటూ, రాళ్లని కాలితో తోసేస్తూ దూరంగా జరిగిపోయాడు.

''నూతి పళ్లెం అంచు గుండ్రంగా చుట్టూరా వుందయ్యా! నేను చెప్పింది వినబడుతూందా మీకు? బయటికి మార్గం ఇక్కడే ఎక్కడో వుండితీరాలి. ఆయ్ బాబోయ్, తలకాయ దేనికో ఢీకొందయ్యా!'' కొంతసేపు అలా ఆ చీకటిలో గోడ తడుముకున్నాడు గూసెవ్. గోడకే ఇంకా అంటి

పెట్టుకుని కదలకుండా అలా నిలబడున్న లోశ్‌కి, గూసెవ్ గద్గద స్వరం తనకు ముందు ఎంతో దూరంనుంచి వస్తూన్నట్టుగా వినబడింది: "మ్విస్లావ్ సెర్గేయెవిచ్! ఇక్కడ — ఒక ఏదో గాని చేత్తో పట్టుకుందుకు ఒక పిడిలా వుందయ్యా — నైఫ్-స్విచ్! అర్, దీని తస్సా దియ్యా — నైఫ్-స్విచ్చయ్యా, బాబూ!"

కర్ణకఠోరంగా కీచుమని చప్పుడు. దానితో — ఆ పొట్టి ఇటుక క్యుపోలా అట్టడుగునుంచి, వొత్తుగా వున్న ధూళిమేఘంలోంచి దీపం ఒకటి గుప్పున వెలిగింది. ఆ క్యుపోలా కలశానికున్న బల్లపరుపు పైకప్పు వాసాలు, పావు అర హెచ్చుతగ్గులో పది మీటర్ల వ్యాసం వున్న గుండ్రని నిటారు సారం గంమీద పొంచుకొనున్న సన్నని చూరుబద్దీ అంచుపైన అనుకొని వున్నాయి.

గూసెవ్ ఆ నైఫ్-స్విచ్ పిడి ఇంకా పట్టుకునే వున్నాడు. విలు వంపు గోడకింద పాతాళ నూయి ఆవలి గోడను అంటి పెట్టుకునే వున్నాడు లోశ్. క్యుపోలా కలశానికున్న దీపం వెల్తురు కంట్లో పడకుండా చేయి నుదు టికి అడ్డం పెట్టుకుని, కాస్సేపయాక చేయి తీసేసి, పాతాళ నూతి అడు గున ఏమిటుందో చూదామని కిందకి తొంగి చూశాడు. తన వేళ్లకి అంటుకు నున్నదానినో విసరి పారేద్దామనుకున్నట్టుగా అతడు చేయి విదులించుకో వడం చూశాడు గూసెవ్. లోశ్ తలపైకెత్తే సరికి, అతని తలవెండ్రుకలు ముళ్లల్లా పైకి పొడుచుకునున్నాయి. హడలుతో గుడ్లు కిందకి రాలి పోతాయా అన్నట్టు ఉబ్బెత్తుగా లేచిపోయున్నాయి.

గూసెవ్ కేకేశాడు:

"ఏమిటి కనబడుతూంది మీకు?" అలా కేకేసి, ఇటుక కట్టు కట్టి వున్న సారంగంలోకి తానూ చూశాడు. పాతాళ నూతి అట్టడుగున ఏదో నల్లగా జేగురు రంగు చర్మం వున్నదేదో అష్టవంకర్లుగా చుట్టుకుపోతూంది.

బుస్సుబుస్సుమని ఎడతెరిపి లేకుండా ఒకటే బుస. గడగడమంటూన్న బుడగల శబ్దం అంతకంతకు మరింత గట్టిగానూ, మరింత భయానకం గానూ వినబడుతూంది. అదే వస్తువో ఏమిటో గాని దాని చర్మం అలా ఉబ్బి పోయి వాచిపోతూంది. చర్మంపైన ఎన్నో కళ్లు — గుర్రం కళ్లంతలేసి కళ్లు — వున్నాయి. ఆ కళ్లన్నీ పైనున్న దీపంకేసి చూస్తున్నాయి. చర్మానికి బొచ్చు పంజాలు ఎన్నో వున్నాయి...

"మృత్యువు బాబోయ్!" అని అరిచాడు లోశ్.

అదంతా ఒక రాక్షసి సాలీడుల పుట్ట. ఆ పాతాళ నూతిలో ఎంత కాలంగానో అవి పిల్లలు పెడుతూ పెరుగుతున్నాయి. ఆ పేలుడుకు అవి అదిరిపోయి, కదులుతూ పాకుకుంటూ, నూతిలోంచి బయటకు రావడానికి ప్రయత్నిస్తున్నాయి. బుస్సుబుస్సుమంటూ బుసకొడుతూన్నది — ఇవే. రాక్షసి సాలీడొకటి పాకుకుంటూ అంచుమీదకొచ్చింది.

లోశ్ దానికి దగ్గరసంటూ వున్నాడు. ఇదంతా చూసి గూసెప్:

"పారిపొండి!" అని ఒక్క కేకేసి, ఒక్క గంతుతో ఎగిరి, కలశం పైకప్పును తలకాయ రాసుకుని, ఎదుట నిలబడున్న లోశ్ పక్కనే చతికిల బడి, లోశ్ చెయ్యి పట్టుకుని సొరంగద్వారంలోకి అతడిని ఈడ్చుకుపోయాడు. అక్కడనుంచి ఇక తమ పిక్కసత్తువకొద్దీ ఒకటే పరుగు పరుగెత్తారు.

సొరంగం పైకప్పునుంచి అక్కడా అక్కడా దూరదూరంగా వెలుగుతున్నాయి దీపాలు. నేలమీద ఎత్తుగా పడుంది దుమ్ము. స్తంభాల అవశేషాలూ, శిలావిగ్రహాల శిథిలాలూ, పక్కనున్న సొరంగాలకు దారితీసే ద్వారాలూ అవుపడ్డాయి. ఎలాగైతేనేమి పరుగెత్తి పరుగెత్తి చిట్ట చివరకు, సొరంగద్వారం చేరకున్నారు. సొరంగం చివర చావడి పైకప్పు బల్లపరుపుగా వుంది. చావడిలో పొట్టి స్తంభాలున్నాయి. చావడి నడిమధ్య

ఒక స్త్రీ శిలావిగ్రహం. విగ్రహం విరిగిపోయుంది. కండలుతీరిన ముఖం. భయంకరమైన కోరచూపులు. విగ్రహంవెనకాల గోడలో అర్ధచంద్రాకారపు గూళ్ళున్నాయి. రాణి మార్గ్ విగ్రహమూ, అక్కడ పడున్న పాత్రసామాను తునుకలూ ధూళిమయమై వున్నాయి.

అక్కడలా నిలబడిపోయాడు లోశ్. అతడి కళ్ళు గాజుగోళీల్లా కళకాంతులులేకుండా వున్నాయి. మిడిగుడ్లు మిటకరిస్తూ చూస్తున్నాడు.

అతడు మతితప్పినవాడిలా వెనక్కి చూస్తూ: "ఇవిక్కడ కోటానుకోట్లుగా జీవిస్తున్నాయి. తమకాలం ఎప్పుడు వస్తుందా, అంగారక గ్రహాన్ని తమ సంతానంతో నింపేసి, ప్రాణకోటి అంతటిపైనా ఎప్పుడు రాజ్యమేలుదామా అని కాచుక్కూచున్నాయి..." అన్నాడు లోశ్.

చావడిలోంచి బైటకు వెళ్తున్న సొరంగాలన్నిటిలో పెద్ద సొరంగంలోకి లోశ్‌ను లాక్కుపోయాడు గూసెవ్. ఇక్కడ కూడా దూర దూరంగానే వెలుగుతున్నాయి దీపాలు. సొరంగంలోంచి చాలాసేపు వారు అలా నడిచి వెళ్ళారు. దారిలో ఒక వెడల్పాటి నూయి కనబడింది. నూతిమీద వంతెన వుంది. నూతి అడుగున బ్రహ్మాండమైన యంత్రాల ఇనుప అస్తిపంజరాలు పడున్నాయి. ఎంత నడిచినా గోడలనిండా దుమ్ము పట్టిపోయున్న ఆ సొరంగం తరగడంలేదు. ఇంకా ఇంకా అలా వుంటూనే వుంది. వారు అలసిపోయి, నిస్త్రాణ చెంది, నిస్పృహతో నేల కూలిపోవడానికి సిద్ధంగా వున్నారు. వినబడీ వినబడని గొంతుతో లోశ్ పదేపదే అనడం మొదలుపెట్టాడు:

"నన్ను వదలిపెట్టవయ్యా, బాబూ – నాకిక్కడ పడుకుని నిద్రపోవాలనుంది."

లోశ్ గుండెలు సమ్మెట బాదుల్లా దడదడా కొట్టుకుంటున్నాయి. తీవ్రమైన ఆ వేదనతో దహించుకుపోతూ, ఆ దుమ్ములో గూసెవ్ వెంట

తూలిపోతూ జోగిపోతూ నడుస్తున్నాడు. ముఖమంతా ముచ్చెమటలు పోసి పోయి, చెమట ధారలు కారుతూంది. నోరు తెరచుకున్న మృత్యువు విషపు కోరలు అతడు కళ్లారా చూశాడు. అయినప్పటికీ అంతకంటే బలో పేతమైన శక్తి అతనిలో ప్రభవించి, అతనిని ప్రాణాన్ని వదలకుండా చేస్తూంది. నిర్మానుషమై శూన్యంగా వున్న ఆ అనంత పాతాళ పథాలలోంచి ఆ శక్తే అతడిని నడిపించి తీసుకుపోతూంది.

తటాలున సొరంగం ఒక ఇరుకు మలుపు తిరిగింది. రొజుకుంటూ రొప్పుకొంటూ గూసెవ్ ఆ మలుపు తిరిగాడు. గూసెవ్ నిర్ఘాంతపోయాడు. కళ్లు మిరుమిట్లు కొల్పుతూ ఉజ్వలంగా వెలిగిపోతూన్న నీలమేఘచ్ఛాయ ఆకాశమూ, హిమకిరీట ధారియై దేదీప్యమానంగా ప్రకాశించుతూన్న పర్వతశిఖరమూ — లోశ్ స్మృతిపథంలో చిరాంకితమై నిల్చిన ఈ దృశ్యా నికి సొరంగద్వారమే చిత్రపటానికి ఒక చట్రంగా ఏర్పడి వారి కళ్ల ఎదుట ప్రత్యక్షమైంది. బయటికొచ్చి చూసుకునే సరికి వారు తుస్కూబ్ ఎస్టేటు సమీపంలో నిలబడున్నారు.

# హావో

“ఆకాశపుత్రా!” అని కీచుగొంతుకతో ఎవరో పిలిచారు.

లోశ్, గూసెవ్‌లు చిట్టడవి వైపునుండి ఎస్టేటును సమీపించ గానే, వారికి నీలిరంగు ఆకుల వెనకాతలున్న చిన్న సూదిముక్కు ముఖం ఒకటి కనబడింది. ఆ మనిషి మరెవ్వరూ కాదు — అయిలీత పైలట్ కుర్రాడే, బూడిదరంగు కోటు తొడుక్కునున్నవాడు. వాళ్లని చూసేసరికి

ఆ కుర్రాడికి ఎంత సంతోషం వేసిందంటే, ఇక చేతులు తట్టుతూ, గంతు లేస్తూంటే ఆ ముఖం అచ్చంగా పిల్ల ఖడ్గమృగం ముఖంలాగానే కనబడింది. చెట్లకొమ్మలు అసంటూ తీసుకుని, రిజర్వాయిర్ శిథిలాల మాటున వుంచిన రెక్కల నావకేసి చూపించాడు పైలట్ కుర్రాడు.

ఆ రాత్రి ప్రశాంతంగా గడచిపోయిందనీ, తెల్లవారు జామున దూరాన పేలుడు తనకు వినబడిందనీ, దట్టమైన పొగమేఘాలు కనబడ్డా యనీ చెప్పాడు. ఆకాశపుత్రులు మరణించి వుంటారని అనుకుని తన వాయు నావ చేరుకుని తాను మళ్ళీ అయిలీత వున్న ఏకాంత స్థలానికి వచ్చేశాననీ చెప్పాడు. అయిలీత కూడా పేలుడు విని, తన ఏకాంతస్థలం ఆవరణలో వున్న గుట్టపైకెక్కి, మంటలు చూసి, నావపై ఎస్టేటు దగ్గరకు ఎగిరి వెళ్ళి అక్కడ ఆకాశపుత్రుని కోసం నిరీక్షిస్తూ వుండాల్సిందని పైలట్ కుర్రాడిని ఆజ్ఞాపించిందట. ''తుస్కూబ్ సేవకులు నిన్ను పట్టుకున్నట్లా యెనా, నువ్వు నోరు మెదపకుండా చచ్చిపోవాల్సిందే సుమా; ఆకాశపుత్రుడు గనుక మరణించి వుంటే, అతడి శవం ఎక్కడుందో కనిపెట్టి, అతడి జేబులు వెతకి, జేబులో వున్న రాతిసీసా తీసుకొచ్చి తనకివ్వాల్సింద''ని, ఆమె ఆజ్ఞాపించిందట.

ఆ కుర్రాడు చెప్పినదంతా లోశ్ పళ్ళు బిగించి విన్నాడు. తరువాత, తన వొంటినిండా వున్న రక్తపు మరకలనూ ధూళినీ కడిగేసుకుందుకు గూసెవ్‌తో కూడా అతడు సరస్సుకు వెళ్ళాడు. అక్కడ వున్న ఒక చెట్టును కొట్టి, దాని చేవలోంచి బారెడు పొడుగు గద ఒకటి చెక్కి తయారు చేసుకుని, దానిని చేత పట్టుకున్నాడు గూసెవ్. తరువాత వారు ముగ్గురూ వాయు నావ ఎక్కి ఉజ్వల నీలంలోకి ఎగిరివెళ్ళిపోయారు.

గూసెవ్వూ, పైలట్ కుద్రాదూ, ఇద్దరూ కలిసి నావను ఒక గుహ లోకి లాగి, గుహ ద్వారం దగ్గర కూచుని మ్యాపు ఒకటి పరచి, మ్యాపును చూస్తున్నారు. ఆ సమయానికి కొండగుట్టపైనుంచి ఈహ పరుగెత్తు కుంటూ వచ్చింది. గూసెవ్‌ను చూసీ చూడడంతో ఆమె చప్పట్లు కొట్టింది. ప్రేమతో నిండిన ఆమె నయనాలు అశ్రుపూరితాలయాయి. గూసెవ్ ఆనందభరితుడై నవ్వాడు.

కొండ చరియనుంచి పవిత్ర ద్వారానికి దిగే మార్గం గుండా లోశ్ తొందరగా అడుగులు వేసుకుంటూ వెళ్ళాడు. చల్లగా వీస్తూన్న మలయ మారుతమే తనను ఆ మోకాలు పర్వతం మీదనుంచి దింపి, ఇరుకాటి కొండ కనుమల్లోంచీ, చిన్న వంతెనల మీదనుంచీ తనను ఎగరేసుకుపోయి నట్టు అనిపించిందతనికి. అయిలీతకీ, తనకీ విధాత ఏమని రాసిపెట్టాడో? తామిద్దరూ — అయిలీత, తానూ — ప్రాణాలతో బయటపడతారో, లేదో ఎవరు చెప్పగలరు? ఆ అనుమానం మెదడులో మెదలక ముందే ఆ తలంపు అక్కడికక్కడే అంతర్ధానమైపోయింది. ఇప్పుడు అన్నిటికంటే ముఖ్యమైనది ఆమెను — ''తారాజ్యోతి పుత్రిక''ను — తన కళ్ళార చూడగల్గుతాను కదా అనే తలంపు ఒకటే. ఆమె చిన్ని పలుచని వినీల వదనాన్ని అలా చూస్తూ, ఉవ్వెత్తున విజృంభించి వస్తూన్న ఆనంద ప్రవాహంలో ఓలలాడుతూ కొట్టుకొనిపోతూ మైమరచిపోవడం — అదొక్కటే తన కోర్కె.

గుహాంతర్భాగంలోని సరస్సుపైనున్న వారధిమీదనుంచి లేస్తూన్న ఆవిరి పొగర్లనడుమ అతడు పరుగున వెళ్తూండగా, పొట్టి స్తంభాల వరుస వెనకాల, పండు వెన్నెలలో కనబడుతూన్న పర్వత దృశ్యం అతడికి మళ్ళీ ఎదురైంది. జాగ్రత్తగా అడుగులు వేస్తూ అగాధపు అంచుపై వున్న వెడల్పు

రాతిమెట్లును చేరుకున్నాడు లోశ్. పవిత్ర స్వర్గద్వారం మబ్బుమబ్బుగా మెరుస్తూంది.

గాలి వెచ్చగా నిశ్చలంగా వుంది. తన శరీరంలో ప్రతి కోశంనుంచీ ప్రేమ తరంగాలు ఉప్పొంగిపోతున్నాయి — ఆ తామ్రవర్ణపు నాచుని, ప్రేమ తుది శరణ్యంపై ముద్రితమైన అడుగుజాడలను కళ్ళకద్దుకోవాలను కున్నాడు.

కిందను, అగాధం అట్టడుగున కొండరాళ్ల గొద్దు అంచులు కత్తుల్లా పైకి పొడుచుకొస్తున్నాయి. వినీల ఆకాశపు తెరముందు, హిమశిఖరాలు వజ్రాల్లా మెరుస్తున్నాయి. ప్రగాఢమైన కోర్కె అతని హృదయాన్ని ఆవహించింది. అయిలీత ఉల్లా గానం చేసిన చోట — ఆనాటి అగ్నిహోత్ర భస్మమూ, ఆమె పాదాలకింద నలిగిన గడ్డీ — ఉన్నది ఈ స్థలమే. తురాయి బల్లి ఒకటి బుసకొడుతూ రాళ్ళమీాదనుంచి జరజర పరుగెత్తింది. అది కొంత దూరాన ఆగి, తల వెనక్కితిప్పి అతనివైపు చూసింది.

రాతిలో అమర్చిన ముక్కోణపు తలుపు తెరచి, వంగి నడుస్తూ లోపలికి ప్రవేశించాడు లోశ్.

సరంబీనుంచి వేలాడుతూంది దీపం. తెల్లని బాలీసులపై తల పెట్టుకుని నిద్రపోతూంది అయిలీత. మోచేతిని తల వెనుక పెట్టుకుని ఆమె వెల్లకిలా పడుకునుంది. ఆమె పలుచని ముఖం విచారంగా మధురంగా వుంది. నిద్రలో ప్రత్యక్షమైన స్వప్నంవల్ల ఆమె కలతచెంది, మూాతలుపడిన కను రెప్పలు అదురుతున్నాయి.

లోశ్ ఆమె శయ్యను సమీాపించి, తల దగ్గర మోకరించి, సంతోషంలోనూ విచారంలోనూ భాగస్వామి అయిన తన అర్ధాంగిని ఆనందపర వశుడై తిలకించాడు. ప్రియతమమైన ఈ ముఖపద్మం నుంచి విచారాన్ని

పారదోలడానికి, ఈ యవ్వన మాధుర్యాన్ని వినాశంనుంచి కాపాడ్డానికి తాను ఎన్ని చిత్రహింసలనైనా భరించేందుకు సిద్ధమే. చెక్కిలిపై వాలిన ముంగురులలోని ఒక పాయ ఆమె శ్వాసకు మెల్లగా కిందకీ మీదకీ ఉయ్యల ఊగుతూంది.

ఆ పాతాళ పారంగవ్యూహంలోని ఆ అగాధపు నూతిలో తమ అదను కోసం కనిపెట్టుకొని బిగ్గరగా ఊపిరితీస్తూ, బుసలు కొడుతూ, మర్మర ధ్వని చేస్తూన్న ప్రాణికోటి హృదయవిదారక దృశ్యాన్ని లోశ్ తల్చుకు న్నాడు. అతని పెదవులనుంచి క్లేశభరితమైన మూలుగు ఒకటి అప్రయ త్నంగా బయటికి వచ్చేసింది. అయిలీత నిట్టూరుస్తూ నిద్రనుండి మేల్కొంది. లిప్తమాత్రకాలం లోశ్‌కేసి పరధ్యానంగా చూసి, మరుక్షణమే వెంటనే ఆమె కనుబొమల బాణాలు ఆశ్చర్యంతో పైకి ఎక్కుపెట్టుకున్నాయి.

"ఆకాశపుత్రా! తనయా, ప్రియతమా!" అని మెల్లగా, కోమల కంఠంతో పిలచింది.

తన నగ్నాన్ని కప్పుకుందుకు యత్నించలేదామె; కేవలం కన్యకకు స్వాభావికమైన స్వకీయ చైతన్యం ఫలితంగా ఆమె చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. ఆ వినీల వక్షోజాలు, పలుచని పిరుదులు — నక్షత్ర కాంతులల్లోంచే ఉద్భ వించినట్టు తోపించాయి. ఆనందప్రవాహంలో కొట్టుకొనిపోతూ, తన ప్రేయసి వైపు మౌనంగా చూస్తూ లోశ్ అలా మోకరించే వుండిపోయాడు. ఆమెనుంచి వెడలుతూన్న తిక్తమధుర పరిమళం అతనినొక ఝంఝానిలయ తుషారంలో ముంచివేసింది.

"కలలో నువ్వే అవుపడ్డావు," అంది అయిలీత. "నీ చేతుల్లో నువ్వు నన్ను ఎత్తుకుని అద్దాల మెట్లను ఎక్కుతూ ఎక్కడికో ఇంకా అలా అలా పైకి పైకి తీసుకెళ్లిపోతూన్నావు. నీ శరీరంలో రక్తాన్ని ప్రవహింపజేస్తూన్న

నీ హృదయ స్పందనాలను నా చెవులార విన్నాను. నా నవనాడులు నిస్త్రాణతో నిండిపోయున్నాయి. నాలో పొంగి పెల్లుబుకుతూన్న కోర్కెను నిలువరించుకుందుకు, నువ్వు ఒక్క క్షణం ఆగుతే బాగుండుననిపించింది. ప్రేమించడం ఎలాగో తెలుసుకోవాలనే వాంఛ నాలో తలెత్తింది. నిస్త్రాణ క్లేశముల బాధ — ఇంతవరకూ నాకు తెలిసిన బాధ ఇదొక్కటే... ఇప్పుడు నువ్వు నన్ను మేల్కొల్పావు,'' అంది. ఆమె కనుబొమలు ఇంకా విూదకెగిరాయి. ''నువ్వేమిటో కొత్తగా కనబడుతున్నావు. ఓ నా ప్రియతమా, మహామనీషీ!''

తన శయ్య ఆవలి మూలకి జరిగింది ఆమె. గోడకు ఒక మూల నక్కిపోయి ప్రాణం రక్షించుకుందుకు ఆఖరి పోరాటానికి సిద్ధమౌతూన్న జంతువు కూనలా ఆమె పెదవులు తెరచుకున్నాయి. లోశ్ బొంగురు గొంతుతో:

''నా దగ్గరకు రా,'' అన్నాడు.

ఆమె తల వూపింది.

''భయానకమైన 'ఛా'ను పోలి వున్నావు నువ్వు,'' అందామె.

ఆత్మసంయమం కోసం చేసిన బ్రహ్మాండ యత్నం ఫలితంగా గజ గజ కంపించిపోతూ, ముఖం చేతుల్లో పెట్టేసుకున్నాడు లోశ్. మళ్ళీ మరునిమిషమే అతడు కార్చిచ్చులా రేగిపోయాడు. ముఖానికి అడ్డుగా పెట్టుకున్న చేతుల్ని తీసేసుకున్నాడు. అయిలీత అతడిని ఆప్యాయంగా ప్రశ్నించింది:

''ఏమిటి?''

''నువ్వేమీ భయపడకు.''

ఆమె అతనికి దగ్గరగా జరిగి, మళ్ళీ మరొకసారి అతడి చెవిలో చెప్పింది:

''హావో అంటే నాకు భయం. నేను చచ్చిపోతాను.''

''నువ్వేమీ భయపడకు. హావో – అంటే అగ్ని. అగ్ని అంటే జీవం... హావోని చూసి భయపడక్కర్లేదు. నా దగ్గరకు రా, ప్రేయసీ!''

ఆమె కోసమని అతడు చేతులు చాచాడు. వినిపించీ వినిపించకుండా అయిలీత నిట్టూర్చింది. ఆమె కనుబొమలు వాలిపోయాయి. బడలికపడి వున్న ఆమె ముఖం బిగుసుకుంది. తటాలున ఆమె లేచి, దీపం ఆర్పేసింది.

మంచులా తెల్లగా వున్న లోశ్ జుట్టును ఆమె నిమిరింది.

గుహ వెలుపల తేనెటీగల ఝూంకారంలా ఏదో ధ్వనించింది. ఆ ఝూంకారం అయిలీతకు వినబడలేదు, లోశ్‌కీ వినబడలేదు. ఝూంకారం మరింత జోరైంది. బ్రహ్మాండమైన కందిరీగను పోలిన పెద్ద యుద్ధ విమానం ఒకటి తన ముఖభాగంతో రాతిని రాసుకుంటూ ఆ అగాధంనుంచి పైకి లేచింది.

ఆ వాయునౌక కొండ అంచు వరకూ లేచి గాలిలో తేలుతూంది. నౌకా పార్శ్వంనుంచి నిచ్చెన ఒకటి దిగింది. నిచ్చెన దిగాడు తుస్కూబ్. అతని వెంట కవచాలూ, డోరియా శిరస్త్రాణాలూ ధరించిన సైనిక బృందం దిగింది.

సైనికులు గుహకి ఎదురుగా అర్ధచంద్రాకారంగా వ్యూహం తీర్చి నిలబడ్డారు. రాతిలో అమర్చిన ముక్కోణపు ద్వారం సమీపించి, చేతనున్న దండంతో తలుపు తట్టాడు తుస్కూబ్.

లోశ్, అయిలీతలు ఇద్దరూ గాఢనిద్రలో మునిగున్నారు. తుస్కూబ్ వెనక్కి తిరిగి, దండంతో గుహకేసి చూపించి:

''వాళ్ళను పట్టుకోండి!'' అని సైనికులను ఆజ్ఞాపించాడు.

# పలాయనం

ఆ యుద్ధనౌక పవిత్ర ద్వారం కొండలపైన కొంతసేపు వలయాలు తిరిగి, అజోర దిశగా వెళ్లి ఎక్కడో దిగింది. ఆ నౌక వెళ్లిపోయిన తరువాతనే ఈహ, గూసెవ్‌లు పవిత్ర ద్వారం లోపలికి వెళ్లగల్గారు. తీరా వారు వెళ్లి చూసేసరికి, తలుపు దగ్గర రక్తపు మడుగులో లోశ్ బోర్లా పడిపోయున్నాడు.

గూసెవ్ అతడిని లేవదీశాడు — లోశ్‌కి ముక్కువెంట శ్వాసలేదు, కళ్లు మూతపడున్నాయి, గుండెలూ శిరస్సూ రక్తంతో పెచ్చులు కట్టి పోయున్నాయి. అయిలీత జాడ లేదు. ఈహ ఏడుస్తూ తన యజమాను రాలి వస్తువులను పోగుచేసింది. అయిలీత వస్తువులన్నీ ఎక్కడవక్కడే వున్నాయి గాని, ఆమె కేప్ మాత్రం అవుపడలేదు. ఆమెను ఎత్తుకుపోయిన వాళ్ళు — బతికున్న మనిషినే ఎత్తుకుపోయారో, చంపేసిన శవాన్నే ఎత్తుకు పోయారో మరి — ఆమెను ఆ కేప్‌లో చుట్టేసి యుద్ధవిమానంలో పడేసి వుంటారు.

''తారాజ్యోతి పుత్రిక''గా జన్మించిన ఆ మూర్తి భౌతికావశేషాల నన్నిటినీ ఈహ మూట కట్టింది. గూసెవ్ లోశ్‌ను తన వీపుపైన వేసు కున్నాడు. ఈహ, గూసెవ్‌లు ఇద్దరూ — బుడగలు కక్కుతూ మరుగు తూన్న కారునీళ్లపై వున్న వారధి మీదుగా, మబ్బుతెర చాటున మరుగు పడిన కొండ అంచు మెట్లు దిగుతూ — శాంతికీ జీవితానికీ చిహ్నాము లైన వడకు రాట్నాన్నీ, అయోల్ కన్యక ధరించే చారల ఓణీన్నీ తీసుకుని మగత్సీత్ల్ వెళ్లిన దారి వెంటే — వెళ్లారు.

గూసెవ్ కొండ ఎక్కి, కొండ గుహలో వుంచిన వాయునావను బయటికి ఈడ్చుకొచ్చి, లోశ్‌ను నావలోకి ఎక్కించి, అందులో పడుకో

బెట్టాడు. గూసెవ్ పటకా బిగించి, శిరస్త్రాణాన్ని నుదిటి మీదకి లాగుకొని, కఠినంగా అన్నాడు:

"నేను బతికుండగా వారు నన్ను పట్టుకో లేరు. భూలోకానికి తిరిగి వెళ్లగల్గితే మాత్రం — మేం తప్పకుండా ఇక్కడికి మళ్ళీ వచ్చితీరుతాం..." (దీని తరువాత మరేవో మూడు మాటలు ప్రయోగించాడు, గాని వాటి అర్థం ఏమిటో సరిగ్గా తెలియలేదు). అతడు నావలోకి ఎక్కి, కంట్రోల్ లీవర్లు పట్టుకున్నాడు. "ఇక మీరిద్దరూ ఇంటికే వెళ్తారో, మరెక్కడికే వెళ్తారో వెళ్ళండి! నా లోటుపాట్లను మన్నించి, నన్ను మాత్రం మర్చిపోకండి," అని, నావ పార్శ్వం మీదనుంచి వంగి, పైలట్ కుర్రాడితోనూ ఈహతోనూ కరచాలనం చేశాడు. "ఈహొష్క! నిన్ను నాతో రమ్మనడంలేదు. ఎందు కంటే నేను ప్రాణాలతో బైటపడతానో లేదో నాకే తెలీదు. నువ్వెంతో మంచి పిల్లవి, నా మీద నువ్వు చూపించిన ప్రేమకు మాత్రం ఎన్నో ధన్య వాదాలు. మేం — భూమాత పుత్రులం — ఇలాంటి విషయాలు ఎప్పుడూ మర్చిపోం, నిజంగానే సుమా! మరి నే వెళ్లొస్తా!"

ఆకాశాన ప్రకాశిస్తూన్న సూర్యునికేసి కళ్లు ముడుచుకుని చూసి, తల వూపి, ఆరోహణ ప్రారంభించాడు. నావలో ఎగిరిపోతూన్న ఆకాశపుత్రుని కేసి ఈహ, బూడిద రంగు బొచ్చుకోటు తొడుక్కున్న పైలట్ కుర్రాడూ అలా చూస్తూ, నిలబడ్డారు. గూసెవ్‌ను అడ్డంకొట్టడానికని పశ్చిమాన చంద్రపర్వతాల ఆవలనుండి ఎగిరి వస్తూన్న రెక్కల చుక్కను వారిద్దరూ గమనించనేలేదు. సూర్యకిరణాల చాటున గూసెవ్ అంతర్ధానమైపోగానే, ఈహ తన నిరాశ ఇక ఆపుకోలేక, నిస్పృహ చెంది నాచు మొలిచివున్న రాళ్ల మీద పడిపోయింది, పైలట్ కుర్రాడు దీనిని చూసి విచారంతో నిండిన తూమలోకాన్ని ఈహ కూడా వదలిపెట్టి వెళ్లిపోయిందేమో అనుకుని:

"ఈహ, ఈహ, హౌ తూవా మిగ్రాతూవ ముగ్రా..." అంటూ వలవల ఏడ్చేశాడు.

తనను అటకాయించడానికి వస్తూన్న యుద్ధనౌకను గూసెవ్ చూడనే లేదు. తన దగ్గర వున్న మ్యాపును చూసుకుని, తన పక్కనుంచి పరుగెత్తి వెళ్లిపోతూన్న లిజియజీర కొండలపై దృష్టి సారించి, తాము భూలోకం నుంచి ఎగిరి వచ్చిన అంతరిక్ష నౌకను వదలిపెట్టిన బొమ్మచెముడు తోట కేసి సరాసరి తూర్పు దిశగా నావను నడిపించాడు.

దుప్పటీలో చుట్టిన లోశ్ శరీరాన్ని తన వెనుకనున్న కుర్చీలో పడుకో బెట్టాడు గూసెవ్. ఆ దుప్పటీ గాలికి టపటప కొట్టుకుంటూంది. లోశ్ గాఢనిద్రలో వున్నాడేమో అన్నట్టుగా – అతని శరీరం నిశ్చేతనంగా వుంది. అలా వున్నప్పటికీ కూడా, శవానికి వుండే భీతావహమైన మెత్తదనం మాత్రం లేదు ఆ శరీరానికి – అంత వరకూ నయమే అనిపించింది గూసెవ్‌కి. తన కామ్రేడ్ పట్ల తనకెంత ఆత్మీయత వుండెనో, అప్పటికి గాని తెలియరాలేదు గూసెవ్‌కి.

ఇదీ జరిగిన సంగతి: గూసెవ్, ఈహోష్క, పైలట్ కుర్రాడూ ముగ్గురూ నావను దాచిపెట్టిన గుహ దగ్గర ఒకరినొకరు పరిహాసాలాడు కుంటూ అక్కడ కూచుని వుండగా, తటాలున కిందనుంచి తుపాకి గుళ్ల చప్పుడు వినబడింది. గుళ్ల చప్పుడు వెనువెంటే – పెద్ద కేక. మరునిమిషం అగాధంలోనుంచి యుద్ధనౌక ఒకటి డేగలా ఎగిరి వచ్చి, కొండ అంచుపైన లోశ్ నిర్జీవశరీరాన్ని జారవిడిచేసి ఎగిరి వెళ్లిపోయించి. కొండపైన ఆకాశం లోకి అది ఎగిరిపోయి, అక్కడ వలయాలు తిరుగుతూ, కిందను ఏమి జరుగుతూందో కనిపెట్టుతూంది.

గూసెవ్ తన వాయునావలో ఎగురుతూ, తుప్పున వూశాడు –

అంగారకలోకమంటే అతనికి ఇక చచ్చినంత విసుగెత్తుకొచ్చింది. అంతరిక్ష నౌకను చేరుకోగల్గితే ఎంత బాగుండునో కదా — అందులో వున్న వోద్కా సీసా మూత తీసి, లోశ్ గొంతుకలో కాసింత వోద్కా పోయగల్గితేనో? లోశ్ శరీరాన్ని ముట్టుకుని చూశాడు — శరీరం ఇంకా వెచ్చగానే వుంది. "ఇక బతకొచ్చు, ఫరవాలేదు," అనుకున్నాడు. అంగారకవాసుల తుపాకి గుళ్ళకి మానవ శరీరాలను దూసుకుపోయే శక్తి లేదని గూసెవ్‌కి స్వానుభవంవల్ల తెలుసు. "మరి — ఈపాటికి మూర్ఛలోంచి మేల్కోవలసిందేనే? ఎందుచేత మరింకా తెలివి రావడంలేదో?" అనుకున్నాడు. లోశ్‌కి ఇంకా స్పృహ రాక పోవడం చూసి దిగులుపడి, వెనక్కి తిరిగి సూర్యునికేసి చూశాడు. ఆ క్షణంలో కనిపెట్టాడు గూసెవ్ — ఆకాశంలోంచి యుద్ధనౌక ఒకటి తనను లంఘించుకుందుకని తన మీదకి చర్రున దిగుతూండడం.

దానిని తప్పించుకుందుకు గూసెవ్ చటుక్కున ఉత్తరం వైపుగా గిర్రున మలుపు తిరిగాడు. యుద్ధనౌక కూడా ఆ దిశగానే తిరిగింది. నౌక నుండి పసిమి పొగముద్దలు దూసుకొని వస్తూండడం చూశాడు గూసెవ్. వెంటనే గూసెవ్ అవరోహణ ప్రారంభించి, రెట్టింపు వేగంతో దిగాడు, ఆ విధంగా సందు చూసుకుని తప్పించుకు పోదామనే ఉద్దేశ్యంతో.

చెవిలో గింగురుమంటూ కొడుతూంది హిమశీతల వాయువు. ఆ గాలికి కళ్ళంట నీళ్లొచ్చేశాయి. కన్నీరు రెప్పవెంట్రుకలపైన గడ్డకట్టుకు పోయింది. చూపుకే అసహ్యంవేసుకొస్తూన్న ఇహి మంద ఇష్టం వచ్చినట్టొ రెక్కలు వూపుకొంటూ, గూసెవ్ నావను వాటి రెక్కలతో ఎదిరించడానికని లంఘించుకున్నాయి, కాని గురి తప్పి వెనక్కి దిగడిపోయాయి. తాను ఆకా శంలో ఏ ప్రాంతంలో ఎంత ఎత్తున ఎక్కడ ఎగురుతూన్నదీ చాలాసేపయే స్థాననిర్దేశం చేసుకో లేకపోతున్నాడు గూసెవ్. అన్ని గుర్తులూ అతడు

పూర్తిగా మర్చిపోయాడు. కణతల్లో రక్తం పోటుపెట్టేస్తూంది. పల్చబడిపోయిన గాలి మంచుకొరడాలతో తనను ఫెడీ ఫెడీమని బాదుతూంది. గూసెవ్ చర్రున అవరోహణం ప్రారంభించాడు. యుద్ధనౌక అతనిని మరి అందుకోలేక, ఎంతో వెనుకపడిపోయి, దిగ్మండలంలో అంతర్ధానమైపోయింది.

గూసేవ్ కిందకి చూసేసరికి, కనుచూపు మేర వరకూ రాగి రంగు ఎర్రని ఎడారి తప్ప మరేమీ కనబడ్డంలేదు. పేరుకి ఒక్క చెట్టు గానీ, ప్రాణంతో వున్నది గానీ ఒక్కటి కూడా ఎక్కడా కానరాలేదు — చెట్టుచేమలు లేని పర్వత పీఠభూముల మీద పరుగెత్తుతూన్న తన నావ ఛాయ, ఇసుక కెరటాలు, ధగధగ మెరుస్తూన్న రాతినేలమీది నెరియలు — ఎంత చూసినా ఇవే కనబడుతున్నాయి. కొండలమీద అక్కడక్కడున్న శిథిలగృహాలు భయంకరములైన నల్లని నీడలను ప్రసరిస్తున్నాయి. ఎక్కడ చూసినా ఎండిపోయిన కాల్వలతో నేల నెర్రెలు కొట్టి వుంది.

ఎడారి మైదానపు నున్నని అంచు చాటున సూర్యుడు అస్తమిస్తున్నాడు; కుంగిపోతూన్న సూర్యబింబపు తామ్రవర్ణ కాంతులు విచారభారంతో వెలవెలబోతూ వెలుగుతున్నాయి. ఇంతసేపై ఎగురుతూన్నా కూడా ఆ ఇసుక అలలూ, ఆ కొండలూ, మరణశయ్యపై వున్న తూమ శిథిలావశేషాలూ తప్ప మరేమీ కంట పడడంలేదు.

ఉండి వుండి ఒక్కమాటుగా చీకటైపోయి, రాత్రి ప్రవేశించింది. గూసెవ్ ఇసుక మైదానంమీద వాలాడు. నావలోంచి కిందకి దిగి, లోశ్ ముఖంమీద కప్పి వున్న దుప్పటీని తీసేసి, కనురెప్పలు పైకి ఎత్తి చూసి, గుండెమీద చెవిపెట్టి విన్నాడు. లోశ్ చనిపోనూ లేదూ, బతికీ లేదూ. లోశ్ చిటికినవేలుకున్న వుంగరంనుంచి సన్నని గొలుసు చివర బిరడా తెరచి వున్న సీసా ఒకటి వేలాడుతూండడం గూసెవ్ కళ్లపడింది.

"దీని సిగతరగా, ఈ వెధవ ఎడారి!" అని శాపనార్థాలు పెడుతూ గూసెవ్ నావనుంచి కాస్తదూరం నడిచి వెళ్ళాడు. నల్లని అనంత ఆకాశ పథాన హిమకాంతులు విరజిమ్ముతూన్న నక్షత్రాలు మిణుకు మిణుకుమంటు న్నాయి. వాటి వెలుగులో ఎడారి ఇసుక బూడిదలా కనబడుతూంది. ప్రశాంతత ఎంత ప్రగాఢంగా ఆవరించి వుందంటే, తన అడుగులకింద పడిన గోతులను పూడ్చేస్తూ గోతుల్లో జారిపోతూన్న ఇసుక రేణువుల జలజల శబ్దం సహితమూ అతనికి స్పష్టంగా వినబడింది. అతడి గొంతుక ఆర్చుకు పోతూంది. మనసంతా ఇంటిమీదే వుంది. "వెధవ ఎడారి తగలబడా!" అని తిట్టాడు. నావ దగ్గరకి మళ్ళీ వెళ్లిపోయి, చోదకస్థానంలో కూచుని కంట్రోళ్ళు పట్టుకున్నాడు. ఎటువైపు వెళ్లడం? ఏ దిశగా ఎగరడం? నక్షత్రాల చిత్రీకరణ అంతా కొత్త మోస్తరుగానూ అయోమయంగానూ వుంది.

గూసెవ్ మోటార్లను స్టార్టు చేశాడు. ప్రొపెల్లరు గిర్రున తిరిగింది. కాని కాస్సేపటికే బర్రుమంటూ ఆగిపోయింది. విదారక చూర్ణం అయిపోయింది.

"సరే, కానీ," అని గొణుక్కున్నాడు గూసెవ్. నావలోంచి కిందకి దిగిపోయి, వెనుక తాను తయారు చేసుకున్న లాఠీ కర్రను పటకాలో దోపుకొని, లోశ్‌ను చోదక ఆసనంలోంచి బైటకు లాగి: "మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్, ఇక మనం వెళ్దామయ్యా!" అంటూ లోశ్‌ను బుజాలమీద పడేసుకుని నడవడం మొదలెట్టాడు. ఇసుకలో కాళ్ళు కూరుకుపోతూన్నాయి. అడుగు తీసి అడుగు వెయ్యడమే కష్టమైపోతూంది. అలాగే నడుచుకుని నడుచుకుని వెళ్లగా, కొండ ఒకటి వచ్చింది. కొండకి మెట్లున్నాయి. మెట్ల మీద లోశ్‌ను దింపి, కొండకేసి చూశాడు. కొండ కొట్టకొనను, నక్షత్రాల వెన్నెల్లో మునిగి తేలుతూ వుంది ఒకే ఒక స్తంభం. గూసెవ్ నేలమీద

చతికిలబడి, బోర్లా పడుకున్నాడు. భరింపశక్యంకాని నిస్త్రాణ అతన్ని ఆవహించింది. చావుబడలికతో గుండెలు పేలిపోతాయేమో అన్నట్టు కొట్టుకున్నాయి.

కాల ప్రవాహం స్తంభించిపోయిందో, యథాప్రకారం పురోగమించుతూనే వుందో అతడికి తెలియే తెలియలేదు. మంచులాగున్న ఇసుకను తాకేసరికి నరాలు కరడుకట్టుకుపోయి, రక్తం ముద్దకట్టేసింది. ఇక ఆ మనోవేదన భరించలేక, లేచి కూచుని తల పైకెత్తి చుశాడు. ఎడారిపైన కొంచెం ఎత్తుగా ఎర్రగా ధుమధుమలాడుతూ వెలుగుతూన్న నక్షత్రం ఆకాశాన వేలాడుతూంది. పెద్ద పక్షికన్నులా కనబడిందా నక్షత్రం. గూసెవ్ దానికేసి నోరు వెళ్ళబెట్టుకుని చూశాడు.

"అది భూలోకం," అని అప్పుడు జ్ఞాపకం వచ్చింది గూసెవ్‌కి. లోశ్‌ని ఎత్తి బుజాన వేసుకుని, ఆ నక్షత్రంకేసే పరుగెత్తాడు. ఇక ఇప్పుడు గుర్తొచ్చింది తాము ఎక్కి వచ్చిన అంతరిక్ష నౌక ఎక్కడున్నదీ.

ఊపిరి గట్టిగా పీల్చుతూ, ఒళ్ళంతా ముచ్చెమటలు పోసిపోతూన్నా, ఒక్క లఘువున కాల్వలు దాటేస్తూ, రాతి తునుకలు కళ్ళల్లో పడినప్పుడు పెద్దగా అరుస్తూ, గూసెవ్ అలా మొండిగా పరుగెత్తుతూనే వున్నాడు. దిగ్మండలం కేసి అతడు పరుగెత్తూన్నకొద్దీ నల్లని దిగ్మండలం ఇంకా వెనక్కి వెనక్కి వెళ్ళిపోతూంది. ఎండిపోతూన్న గొంతుక కాస్త తడిచేసుకుందామని, పరుగెత్తుతూన్నవాడల్లా అడప దడప నేలమీద బోర్లా పడుకుని, ఇసుకలోంచి పైకి లేచి వస్తూన్న ఆవిరి పొగర్లని నోటితో పీల్చుకునేవాడు. మళ్ళీ వెంటనే తన మిత్రుణ్ణి బుజానికి ఎత్తుకుని, భూగ్రహం సారించుతూన్న ఎరుపు కాంతులకేసి అప్పుడప్పుడు చూస్తూ అలా కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళాడు.

ప్రపంచ శ్మశాన వాటిక నేలమీద అతని బ్రహ్మాండచ్ఛాయ ఏకాంతంగా సాగిపోతూంది.

అర్ధవలయాకృతిలో వున్న ఓల్గా తన అంచులో దిగ్మండలంపైకి తోసుకొస్తూంది. అర్ధరాత్రి వేళకి గుండ్రని లీత్‌హ బింబం నీలాంబుధిలో నావలా ఆకాశాన తేలుతూ మృదువైన తన రజిత కిరణాలను ప్రసరించుతూ ప్రత్యక్షమైంది. ఇసుక తిన్నెలు ఇప్పుడు జంట నీడలు సారిస్తున్నాయి. ఆకాశాన — వింత చందమామలు రెండు పరుగెత్తుతున్నాయి — ఒకటి మీదకీ, ఒకటి కిందకీనూ. వాటి వెలుగు చాటున తల్‌త్సేత్ల్ వెలవెలబోతూంది. లిజియజీర హిమకిరీట శిఖరాలు దూరాన కనబడ్డాయి.

అలా వెళ్లీ వెళ్లీ, ఎడారి అంచు చేరుకున్నాడు గూసెవ్. అప్పుడప్పుడే తెల్లవారుతూంది. బ్రహ్మచెముడు తోటల్లో అడుగుపెట్టాడు. బ్రహ్మచెముడు చెట్టును ఒకదానిని కాలితో ఒక్కతాపుతన్ని, అది కింద పడగానే దాని మట్ట విరిచి, దాని మెత్తని గుజ్జును వాపిరిగొట్టుగా తినేశాడు. నక్షత్రాలు అస్తమించాయి. ధూమ్రవర్ణపు ఆకాశంలో చెంగావి అంచు మబ్బులు తొంగి చూశాయి. ఆ ప్రాతఃకాలపు ప్రశాంతతలో తటాలున అతనికి స్పష్టంగా శబ్దం టక్కు టక్కుమంటూ అదే పనిగా ఇనుముమీద పడుతూన్న ఇనుపసుత్తి దెబ్బల శబ్దం — వినబడింది.

మరో నిమిషానికల్లా దాని అర్థం అతనికి తెలిసిపోయింది. ఆ బ్రహ్మచెముడు తోటలోంచి మూడు అల్లికస్తంభాలు కనబడ్డాయి — తనను వెంబడించిన యుద్ధనౌక స్తంభాలే అవి. ఆ చప్పుడు కూడా అక్కడనుంచే వస్తూంది. అంతరిక్ష నౌకను అంగారకవాసులు బద్దలు కొట్టేస్తున్నారని ఇప్పుడతనికి స్పష్టంగా తెలిసిపోయింది.

బ్రహ్మచెముడు చెట్ల మాటున గూసెవ్ చెరచెర పరుగెత్తాడు. తుప్పుపట్టి ఎర్రబడిన అంతరిక్ష నౌక బ్రహ్మాండపు మూపురం పక్కనే వుంది ఆ యుద్ధనౌక. సుత్తులు చేతబుచ్చుకుని అంగారకవాసులు అంత రిక్ష నౌకకున్న వెలుపలి బొడుపు రివెట్ల రేకును దబాదబా సమ్మెట్లతో బాదుతున్నారు. ఆ పనికి వాళ్ళు ఇప్పుడే దిగినట్టుంది. లోశ్‌ను అక్కడే దింపేసి, అతనిని నేలమీద పడుకోబెట్టి, తన పటకాలో దోపి వుంచుకున్న గద తీసి, చేత పుచ్చుకున్నాడు గూసెవ్.

"అరేయ్ లంజకొడుకుల్లారా!" అని ఒక్క అరుపు అరిచాడు గూసెవ్. యుద్ధనౌకకేసి ఒక్క పరుగున పరుగెత్తి, తన చేతనున్న గదతో యుద్ధనౌక లోహపు రెక్కను ఒక్క దెబ్బతో చితక్కొట్టేసి, మరొక వేటుతో స్తంభాన్ని కూలదోసేసి, ఇక పంజరాన్ని అదే బాదులు బాదాడు. దాంతో యుద్ధ నౌకలో వున్న సైనికులు నౌకలోంచి బిలబిల వచ్చేసి చెంగున నేలమీదకి గంతే శారు. గూసెవ్ లాఠీ దెబ్బలకి మొర్రో కుంయ్యోమంటూ, వాళ్ళ చేతుల్లో వున్న ఆయుధాలను అక్కడికక్కడే పారేసి, చిందర వందరగా పొదల్లోకి పలాయనం చిత్తగించారు. మరో గడియకల్లా తోట అంతా సాఫ్‌సీదాగా ఖాళీ అయిపోయింది — అజేయుడైన సర్వాంతర్యామి ఆ భూలోక పుత్రుడంటే వారికి సింహస్వప్నమే.

అంతరిక్ష నౌక గుండ్రని ద్వారం తెరిచి, లోశ్‌ను లోపలికి తీసుకు పోయాడు గూసెవ్. భూలోక పుత్రులిద్దరూ ఆ గోళంలోపలికి అంతర్ధాన మైపోయారు. తలుపు బిడాయించేసుకుంది. బ్రహ్మచెముడు డొంకల్లో దాగుకున్న అంగారకవాసులు ఇదివరకు తామెన్నడూ కనివిని ఎరగని వింత దృశ్యం చూశారు.

బ్రహ్మాండమైన ఆ తామ్రవర్ణపు అండం, పెద్ద భవనమంత ఎత్తున్న ఆ అండం, పెద్దపెట్టున గర్జించింది. దాని కిందనుంచి ఎర్రని

ధూళీ ధూమమూ ప్రళయ ప్రవాహపు తరంగాల్లా వెడలజొచ్చాయి. పిడుగుల్లాంటి పేలుడులతో తూమ గ్రహం దద్దరిల్లిపోయింది. ఆ బ్రహ్మాండ గోళం ఉరుములతోనూ పిడుగులతోనూ బ్రహ్మచెముడు తోటలోంచి తటాలున ఒక్క గంతుతో పైకిలేచి, ధూళిమేఘంలో ఒక్క గడియసేపు వేళ్లాడి, భయంకరులైన మగతీస్త్రీల్లిద్దరినీ వారి మాతృలోకానికి తీసుకుపోతూ, ఒక ఉల్కలాగున గభాలున ఆకాశంలోకి ర్ర్రైంయ్‌మని ఎగిరిపోయింది.

# మరుపు

"ఏం, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్! మనం ఇంకా బతికే వున్నాం!"

లోశ్ నోట్లో నిప్పులు పోసినట్టు అయింది. లోశ్‌కి తన శరీరంలో, తన రక్తనాళాల్లో, ఎముకల్లో — ద్రవజ్వాల వ్యాపించుతూన్నట్టనిపించింది. కళ్లు తెరిచాడు. పైన ఆకాశంలో చేతికి అందుకొస్తూన్నట్టుగా, చిన్న నక్షత్రం ఒకటి ఎర్రగా మండుతూంది. ఆకాశం వింతగా, రజాయికుట్టు కుట్టినట్టు సందూకా పెట్టెలోపల వున్నట్టుగా, పసుప్పచ్చగా, — కనబడింది. టక్కు, టక్కు, టక్కుమని ఏదో లయవేస్తూన్నట్టుగా దెబ్బలు కొడుతూంది. ఆ లయకి ఆ చిన్న నక్షత్రం అదురుతూంది.

"ఎంత వేళైంది?"

"గడియారం ఆగిపోయింది — దురదృష్టంకొద్దీనీ," అని ఒక గొంతుక జబాబిచ్చింది.

"చాలా సేపయే ఎగురుతున్నామా ఏమిటి?"

"ఆ, చాలా సేపయే, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్!"

"ఎక్కడికి వెళ్తున్నామేమిటి?"

"దాని సిగ తరగా! ఎక్కడికో నాకూ తెలీదయ్యా. అంధకారమూ, నక్షత్రాలూ — అంతకు తప్ప మరేవీ కంటికి కానరావడంలేదు... విశ్వాంతరాళంలో పడి కొట్టుకుపోతున్నాం — అంతే."

తన శూన్య స్మృతిని పరిశీలించుకుందుకు ప్రయత్నిస్తూనే లోశ్ కళ్లు మూసుకున్నాడేగాని, తన ధారణాశక్తిలో, రిత్తపోయిన జ్ఞాపకశక్తిలో అతనికేవీ ఆధారం దొరక్కపోవడంతో, మళ్ళీ ప్రగాఢమైన అపస్మారక్కపు నిద్రావస్థలో పడిపోయాడు.

అతడిమీద బూర్నీసులు వేసి, జాగ్రత్తగా కప్పి, గూసెవ్ అవేక్షణ నాళికల దగ్గరకి మళ్ళీ వెళ్లిపోయాడు. అప్పుడే అంగారక గ్రహం టీ సాసర్ కంటేనూ చిన్నదైపోయింది. దానిలో వున్న ఎండిపోయిన సముద్ర గర్భాలూ, గొడ్డుపోయిన ఎడారులూ, మెరుపు చుక్కల్లా దాని ఉపరితలంపైన కనబడుతున్నాయి. ఇసుకతో నిండిన తూమ బింబం చిన్నదైపోయింది; దానినుంచి అంతకంతకు మరింత దూరంగా అంధకార శూన్యంలోకి వెళ్లి పోతూంది అంతరిక్ష నౌక. అప్పుడప్పుడు ఏదో నక్షత్రకిరణం ఒకటి గూసెవ్ కళ్లల్లో పడుతూందేగాని, ఆకాశం అంతా ఎంత గాలించి వెతికినా ఎరుపు నక్షత్రం ఎక్కడా కనబడలేదతనికి.

గూసెవ్ ఒక ఆవలింత ఆవలించి, పళ్ళు బిగించాడు — ఈ విశ్వాంతరాళ శూన్యాన్ని చూస్తి చూసి అతడికి విసుగెత్తుతూంది. నౌకలో వున్న తినుబడి సరుకులనూ, ఆక్సిజనినీ, నీటి నిల్వలనూ తనిఖీ చేసి, బూర్నీసు కప్పేసుకుని, గజగజ అదురుతూన్న నౌక నేలపై, లోశ్కు ప్రక్కగా పడుకుని నిద్రపోయాడు.

తాను ఎంతసేపు నిద్రపోయాడో ఏమిటో అతనికేవీ తెలియేలేదు. కదుపులో దహించుకుపోతూన్న ఆకలితో అతనికి మెలకువ వచ్చింది. తన

పక్కనే పడుకున్న లోశ్, కళ్ళు తెరచి చూస్తున్నాడు — ముఖం రక్తనిహీనమై, పచ్చబడిపోయి, కళ్ళు గుంటలు పడి, అమాంతమూ ఒక్కసారే ముసలితనం వచ్చేసినట్టుంది. లోశ్ మెల్లగా అడిగాడు:

"ఎక్కడున్నాం మనం?"

"వెనకున్న చోటే — విశ్రాంతరాళంలో."

"అలెక్సేయ్ ఇవానొవిచ్, మనం అంగారక గ్రహానికి వెళ్ళామా?"

"మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్! మీ జ్ఞాపక శక్తి ఎగిరిపోయినట్టుందే, చూడగా!"

"అవును, నాకేమిటో అదోలా వుంది... వెనకటి సంగతులు కాస్త లీలగా గుర్తు రావడం మొదలయేసరికల్లా, సారాంశం తాడు టుప్పుక్కున తెగిపోయి, జ్ఞాపకశక్తి చటుక్కున అదేమిటోలాగ తుడుచుకుపోతూంది. నాకు ఏమిటి సంభవించిందో ఏమిటో, మరి — అంతా ఒక కలలా వుంది... గొంతుకలో పోసుకుందుకు కాస్త ఏదేనా ఇవ్వండి, బాబూ!"

లోశ్ కళ్ళు మూసుకుని, డగ్గుత్తికతో అన్నాడు:

"ఆమె కూడా — ఒక కలేనా ఏమిటి?"

"ఎవరు?"

లోశ్ జవాబివ్వలేదు. అతడు మెడ వాల్చేసి, మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

గూసెవ్ ఒకదాని తరువాత ఒకటి అన్ని అవేక్షణ గొట్టాల్లోంచీ ఆకాశమంతా కలియజూశాడు — చీకటి, చీకటి, చీకటి, కారు చీకటి తప్ప మరేమీ కనబడిందికాదతనికి. బూర్నీసు కప్పేసుకుని గొంతుక్కూచున్నాడు. ఒక ఆలోచన ఆలోచించేందుకుగానీ, ఒక విషయం జ్ఞాపకం తెచ్చుకుందుకుగానీ, దేని కోసమైనా నిరీక్షించేందుకుగానీ — దేనికీ మనసొప్పిందికాదు.

ఆలోచించడమూ, ఈ జ్ఞాపకం తెచ్చుకోవడమూ, ఈ నిరీక్షణా — అసలు ఎందుకని? లోహపు గోళం ఝూంకారం చేసుకుంటూ, నిద్రపుచ్చేందుకు వుయ్యాల వూపుతూన్నట్టుగా కంపించుతూ అనంత శూన్యంలో వాయువేగ మనోవేగాలతో దూసుకుపోతూంది.

కాలం, అనంత కాలం, భూప్రపంచానికి సంబంధించని కాలం — ఎడతెగకుండా వెనకపడిపోతూంది. గూసెవ్ అలా గొంతుక్కూచునే తిమిరావస్థలో పడిపోయాడు. లోశ్ నిద్రపోతున్నాడు. అతడి హృదయంపైనా, మనస్సుపైనా కంటికి దృశ్యంకాని ధూళిలా శాశ్వత శీతలం స్థిరపడిపోయింది.

దిక్కులు పిక్కటిల్లుతూ గుండెలు అవిసిపోయేటట్టి కేక తటాలున వినబడింది. గూసెవ్ ఒక్క ఎగురెగిరి లేచాడు — మిడిగుడ్లు మిటకరించుతూనూ. తనపైనున్న బూర్నీసు ముసుగును కాళ్లతో ఇటూ అటూ తన్నేసి, తలకున్న వలగుడ్డ బేండేజీ ముఖంమీదకి జారిపోతూ — లోశ్ పడుకున్నవాడల్లా మనిషంత మనిషీ లేచిపోయి నిలబడి కేకేస్తున్నాడు:

"ఆమె బతికే వుంది!"

చిక్కి శల్యమైపోయున్న చేతులు రెండూ పైకెత్తి, తోలుతో కుట్టిన నాకగోడలను బాదుతూ పీకుతూ అరుస్తున్నాడు:

"ఆమె బతికే వుంది! నన్నిక్కడనుంచి వెళ్లనీయండి — నాకు ఊపిరి సలపడంలేదు — ఆమె వుంది... వుంది!.."

చాలాసేపు వరకూ అతడలా గోడ బాదుతూనే వున్నాడు, అరుస్తూనే వున్నాడు. తరువాత అలసిపోయి, వొళ్ళు నిస్సత్తువతో పితపితలాడుతూ మెత్తబడిపోయి, గూసెవ్ చేతుల్లో కూలబడిపోయాడు. క్రమేపీ అతడు సంబాళించుకుని, కునుకు పట్టి, నిద్రపోయాడు.

గూసెవ్ మళ్ళీ బూర్నీసు కప్పేసుకుని కూచున్నాడు. తన మనస్సులో వున్న కోర్కెలన్నీ భస్మమైపోయాయి. యావత్తూ శరీరమూ తిమ్మిరి పట్టి పోయింది. విశ్వాంతరాళ నౌక లోహపు స్పందనాలకు అలవాటు పడిపోయిన చెవులకి మరే చప్పుళ్ళను వినే శక్తి లేకపోయింది. నిద్రావస్థలో వున్న లోశ్, ఏమిటేమిటో అలా గొణుగుతూనే వున్నాడు; ఉండి వుండి అతని ముఖం ఆనందంతో ఉజ్వలమైపోతూంది.

నేలపై నిద్రపోతూన్న తన మిత్రునివైపు కిందకు చూసి:

"మంచి పని చేస్తున్నావోయ్ నువ్వు; అలాగే ఇంకా నిద్రపో నాయనా. మేలుకోవడం ఎందుకని? వద్దు – అలాగే నిద్రపో... మేలుకొని నువ్వు చేసేది ఏముంది గనక – నాలానే బూర్నీసు ముసుగుపెట్టి, గొంతుక్కూచుని, మంచులో గడ్డకట్టుకుపోయి మోడుపై కూచున్న కాకిలా గజగజ వణక డమే కదా. ఈ రాత్రితో, ఈ కాళరాత్రితోనే చివరి గడియలు దగ్గర పడ్డాయి" అనుకున్నాడు. కళ్ళు మూసుకుందుకైనా ప్రయత్నించలేదు గూసెవ్. ఎదుట మెరుస్తూన్న ఇత్తడి మేకును చూస్తూ అలా కూచున్నాడు – అంతే... ఏది ఎలా పోయినా మాత్రం తనకేమిటి అనుకుని, సంపూర్ణమైన ఉదాసీనంతో అంధకార శూన్యంలోకి, విస్మృతీ తిమిరంలోకి – అలా దిగ జారిపోయాడు...

ఈ విధంగా ఎంతో కాలం, కోకొల్లగా కాలం గడచిపోయింది.

తటాలున అతనికి అదొకమోస్తరు కొత్త చప్పుడులు వినబడ్డాయి – అంతరిక్షనౌక ఇనుప గుల్ల ఏదో ఒక వస్తువును ఢీకొని గీసుకుంటూన్నట్టు.

గూసెవ్ కళ్ళు తెరిచాడు. తిమిరావస్థలోంచి అతడు మేల్కొన్నాడు. అప్పుడే అతనికి చైతన్యం వస్తూంది. అదేమి చప్పుడో అని నిదానంగా విన్నాడు.

రాళ్లగుట్టల మధ్యనుంచీ, ఇటుకముక్కలూ చిళ్ళపెంకుల కుప్పల మధ్య నుంచీ నౌక ముందుకు దూసుకుని పోతూన్నట్టుగా వుందా చప్పుడు. ఏదో వస్తువు ఒకటి నౌకపైన పడి, నౌకాపార్శ్వంనుంచి జారి, కిందకి పడి పోయింది. ఆ కరకర చప్పుడూ, గీసుకుంటూన్నట్టు కీచు కీచు శబ్దమూ మళ్ళీ మరింత గట్టిగా హెచ్చుగా వినబడ్డాయి. ఇక ఇప్పుడు నౌక రెండో పార్శ్వానికి కూడా ఏదో తగిలింది. దానితో నౌక అట్టట్ట ఊగిసలాడింది. లోశ్‌ని లేపాడు గూసెవ్. ఇద్దరూ పాకుకుంటూ అవేక్షణ గొట్టాల దగ్గ రకు వెళ్ళిచూసి — గతుక్కుమన్నారు, గుండెలు ఝల్లుమన్నాయి.

చీకటిలో వారి చుట్టుపక్కలంతా, వజ్రాల్లా ధగధగ మెరసిపోతూన్న స్ఫాటిక ఖండాలతో నిండిన క్షేత్రాలే. రాళ్ళూ, శిలలూ, స్ఫటికాలూ పొడుగాటి సన్నని కిరణాలను ప్రసరిస్తున్నాయి. జడలు కట్టిన బంతిలా సూర్యబింబం కాలరాత్రిలో ఎంతో దూరాన వేళ్లాడుతూంది.

"తోకచుక్క తలకాయలోంచి మనం పయనిస్తున్నామనుకుంటా," అన్నాడు లోశ్ మెల్లగా. "రియోస్టాట్లకు స్విచ్చివేయండి. ఎంత జోరు తోనైనా సరే, ఈ క్షేత్రంలోంచి మనం బైట పడాలి, లేకుంటే తోక చుక్క మనిని సూర్యుడి దగ్గరకు ఈడ్చేస్తుంది."

అన్నిటికంటే పైనున్న రేవుకిటికీ దగ్గరకు ఎక్కాడు గూసెవ్. లోశ్ రియోస్టాట్ల దగ్గర నిలబడ్డాడు. కరకర శబ్దమూ, గీసుకుంటూన్న కీచుకీచు చప్పుడూ ఇంకా జోరయాయి. గూసెవ్ కిటికీలోంచి చూస్తూ కేకేశాడు:

"కాస్త మెల్లగా — కుడిచేతి వైపు కొండ... వదలండి జోరుగా! పర్వతం, ఎదురుగా వస్తూంది పర్వతం... ఇక ఫర్వా లేదు, దాటేశాం... వదలండి, జోరుగా, జోరుగా వదలండి, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్!"

# భూమి

విశ్వాంతరాళంలో చర్రున దూసుకుపోతూన్న ధూమకేతువు తోకే — ఆ వజ్రపు క్షేత్రాలు. ధూమకేతువుయొక్క గురుత్వాకర్షణ క్షేత్రంలోకి నౌక లాగివేయబడి, ఉల్కామేఘంలోంచే చాలాసేపు పయనించింది. నౌకవేగం మరింతగా హెచ్చిపోయింది. గణితశాస్త్రపు పరమసూత్రాలు తమ గమనాన్ని అవి పాటించాయి — క్రమేణా నౌకా పథం దిశలోనూ, ఉల్కాకముల పథాల దిశల్లోనూ మార్పులు సంభవించి, అవి అంతకంతకు వేరైపోయి, విసనికర్ర ఈనెల చందాన అంతకంతకు మరింతగా విస్తృత మౌతూన్న కోణంలో దూరమైపోయాయి. ఆ బంగారువన్నె తుషారం — ఆ అనావిష్కృత ధూమకేతువు శిరస్సు, దాని తోక — ఉల్కాకముల ప్రవాహాలు — సూర్యుని బారినుంచి తప్పించుకునిపోయి విశ్వప్రదేశంలోకి శాశ్వతంగా అంతర్ధానమైపోయేందుకు — నిరర్థకమైన వక్రరేఖలో సాగిపోతున్నాయి. నౌకా పయనపు వక్రరేఖ అండవృత్త ఆకారాన్ని సమీపించుతూంది.

భూలోకానికి తిరిగి చేరుకోగల్గుతామనే ఆశ — తామింత వరకూ దుస్సాధ్యమే అని ఎంచిన ఆశ — లోశ్, గూసెవ్‌లకు నూతన జీవం చేకూర్చింది. వారిద్దరూ రేవుకిటికీలకి కళ్ళు అప్పగించి కూచున్నారు. సూర్యుని వైపు తిరిగున్న నౌకా పార్శ్వం అమితంగా వేడెక్కిపోయింది. వారు వేసుకున్న దుస్తులను తీసిపారేశారు.

ఇప్పుడు వజ్ర క్షేత్రాలు వారికి బాగా కిందుగా వున్నాయి. మొదట మెరుపుల రాసిగా కనబడి, రానురాను అవి పాంశు మిశ్రితమైన ధవళవర్ణపు తెరగా వెలవెలబోయి, అటు తరువాత అదృశ్యమైపోయాయి. మరికొంత

సేపటికి తన ఉపగ్రహాలతో పరివేష్టితుడై పంచరంగులతో మెరుస్తూన్న శనిగ్రహం దూరాన ప్రత్యక్షమయాడు.

తోకచుక్కచే మొదట ఆకర్షించబడిన అండాకృతి నౌక ఇప్పుడు సౌరమండలంలోకి తిరిగి వచ్చేస్తూంది.

మరికాస్సేపటికే, మెరుపు రేఖ ఒకటి చీకటిని దూసుకుపోయింది. కాని ఆ రేఖ మళ్ళీ కాంతివిహీనమైపోయి అంతరించిపోయింది. ఆ రేఖ సూర్యునిచుట్టూ పరిభ్రమించుతూన్న లఘుగ్రహాల గుంపు. వాటి గురుత్వాకర్షణ బలం ఫలితంగా లోహపు అండంయొక్క కక్ష్య వంపును మరింత అధికం చేసింది. నౌకకున్న పైకిటికీనుంచి చూస్తూన్న లోశ్‌కి వింతగా మెరుస్తూన్న సన్నని కొడవలి ఒకటి తరువాత కనబడింది. అదే శుక్రగ్రహం. ఇంచుమించు అదే సమయంలో, అవతలి కిటికీలోనుంచి చూస్తూన్న గూసెవ్ ఒక్కసారి రోజుకుని, ముచ్చెమటలు కమ్మి ఎర్రగా జేవురించిన ముఖాన్ని లోశ్‌కేసి తిప్పి:

''అదే, అదే – నిజంగానే అదిగో, అదేనండీ!..'' అని ఒక్క రంకె వేశాడు.

ఆ చీకటి నలుపులో రజిత వినీల గోళం ఒకటి ఉష్ణకాంతితో వెలుగుతూంది. దానికి ఒక పక్కగా చిన్నగోళం మరొకటి, ఉసిరికాయంతటిది తళతళ మెరుస్తూంది. నిజంగా పయనించాల్సిన కక్ష్యదాటి కాస్త ఆవలగానే వెళ్తూంది నౌక. అందుచేత దానిని సరిదిద్దడానికని లోశ్ ఒక ప్రమాద భరితమైన మార్గం అవలంబించేందుకు – డయన వర్తులరేఖనుండి దహన అక్షాన్ని మళ్లించేందుకుగాను నౌకకంఠాన్ని గుండ్రంగా తిప్పేందుకు – నిశ్చయించుకున్నాడు. అతడు అవలంబించిన ఉపాయం విజయవంత

మైంది. ప్రయాణదిశ మారింది. వెచ్చగా వెలుగుతూన్న ఆ చిన్నగోళం క్రమేణా ఉచ్చదశను అందుకుంది.

ప్రదేశ కాల అవిరతం అనవరతంగా సాగిపోతూంది. గూసెవ్ లోశ్‌లు అవేక్షణ గొట్టాలను గట్టిగా పట్టుకునే వున్నా, నేలమీద చెదురుగా పడి వున్న బొచ్చుకంబళ్లపైనా, బూర్నీసులపైనా అడప దడప అలా తూలి పడిపోతూనే వున్నారు. అంతకంతకు వారి బలం తగ్గిపోవడం మొదలు పెట్టింది. దాహంతో గొంతుక ఎండిపోయి నాలుక పిడచకట్టుకుపోతూంది. దురదృష్టవశాత్తూ వారు తెచ్చుకున్న నీళ్లన్నీ నిండుకున్నాయి. ఇలా అర్ధ తిమిరావస్థలో వుండగా, బొచ్చుకంబళ్ళూ, బూర్నీసులూ, సంచులూ అన్నీ నౌక గోడలవెంట తేలిపోతూండడం లోశ్ తటాలున గమనించాడు. సగం నగ్నంగా వున్న గూసెవ్ శరీరం నడిగాలిలో ఎగురుతూంది. అదంతా ఒక పీడకలేమో అని అనిపించింది. గూసెవ్ అవేక్షణ రంధ్రం పక్కనే పడిపోయాడు. పడి పోయిన వాడల్లా చప్పన కూడదీసుకుని, తనలో తనే ఏదో గొణుక్కుంటూ, గుండెలు పట్టుకుని, తన వుంగరాల జుట్టు తలకాయ వూపుకొంటూ లేచి నిలబడ్డాడు. అతని కళ్లనుండి కన్నీరు ధారాపాతగా బుగ్గలమీద పడి, కిందకి వాలిపోయున్న మీసాలవెంట కారుతూంది.

''మాతృలోకం, మన భూలోకం, మన భూమి!'' అంటూ కెవ్వు మని కేకేశాడు గూసెవ్.

భూగోళం చేత ఆకర్షించబడిన కారణంగా నౌక తన కంఠాన్ని భూమి దిశగా తిప్పుకొందని, తన చైతన్యపు మబ్బుతెర చాటునుంచి లోశ్ గ్రహించు కున్నాడు. అలా గ్రహించుకుని, రియోస్టాట్ల దగ్గరకు పాకుకుంటూ వెళ్ళి, వాటిని గుంజాడు — అండం గజగజ కంపించి, గర్జించడం మొదలుపెట్టింది. కిటికీలోంచి తొంగి చూశాడు లోశ్ ఏమిటి జరిగిందో తెలుసుకుందామని.

బ్రహ్మాండమైన జలమయ గోళం సూర్యకిరణాలలో ప్రక్షాళితమై, చిమ్మచీకటిలో వేలాడుతూంది. దాని మహాసముద్రాలు నీలంగానూ, ద్వీప తీరాలు ఆకుపచ్చగానూ వున్నాయి. ఒక ఖండాన్ని మేఘాలు ఆవరించాయి. చెమ్మగావున్న ఆ గోళం నెమ్మదిగా తిరుగుతూంది. వారి కళ్లు చెమ్మగిల డంచేత వారు దాన్ని సరిగా చూడలేకపోయారు. చెమ్మరించిన ఆ వినీల కాంతిబాణానికి స్వాగతం చెప్పడానికి, ప్రేమగీతికలు గానం చేస్తూన్న వారి హృదయాలు రెక్కలు కట్టుకుని ఎగిరి వెళ్ళాయి. మానవాళి మాతృభూమి! జీవిత విద్యుల్లత! విశ్వజగత్తు హృదయసీమ!

ఇప్పుడు భూగోళం సగం ఆకాశాన్ని ఆక్రమించేసింది. రియోస్టా ట్లని ఎంత మేరకు గుంజేందుకు వీలవుతుందో అంత మేరకూ గుంజేశాడు లోశ్. అయినా నౌక ఇంకా జోరుగానే పయనించుతూంది – నౌకా పంజరం చుట్టూ వున్న గుల్ల బాగా వేడెక్కిపోయింది, లోపలున్న రబ్బరు అస్తరూ, తోలు మెత్తాలూ ఎర్రగా కాలుతున్నాయి. తనకింకా మిగిలున్న బలాన్నం తనూ ఉపయోగించి రేవుకిటికీ పైనున్న మూతను పక్కకు జరిపాడు. ఆ సందులోంచి రైంయ్‌మంటూ కొట్టింది మంచుగాలి, గ్రహాంతర దిమ్మరులై తనను వదలిపెట్టి పోయిన పుత్రులను కౌగలించుకుందుకు భూదేవి తన చేతులు చాచింది.

అతి భయానకంగా వుండెను ఆ తాకిడి. ఆ తాకిడి జోరుకి అంతరిక్ష నౌక గుల్ల బీటలు వారిపోయింది, నౌక పచ్చిక దిబ్బలోకి లోతుగా కూరుకు పోయింది.

ఆనాడు జూన్ మూడో తేదీ, ఆదివారం. మిచిగాన్ సరస్సు తీరాన, అంతరిక్ష నౌక భూమిపై దిగిన చోటుకు ఎంతో దూరంగా, పడవ షికార్లు

కొడుతున్నవారూ, ఆరుబయట రెస్టారెంట్లలోనూ కేఫేలలోనూ విశ్రాంతి తీసుకుంటూన్నవారూ, టెన్నిస్, గోల్ఫ్, ఫుట్బాల్ ఆడుతూన్నవారూ, మబ్బులేని ఆకాశంలో గాలిపడగలు ఎగిరేస్తూన్నవారూ — మర్మరధ్వని చేస్తూన్న జూన్ మాసపు వృక్షరాసి మధ్య తమ వారాంతపు సెలవను హాయిగా గడపేందుకు ఆ సరస్సు పచ్చని తీరానికి వచ్చిన వేలాది రిజాలా జనం అందరూ, పూర్తిగా ఐదు నిమిషాలపాటు సాగిన అదొక మోస్తరు భయానకమైన శబ్దాన్ని విన్నారు.

కిందటి ప్రపంచ యుద్ధం అనుభవజ్ఞులు ఆకాశాన్ని కలియజూసి, భారీ ఫిరంగి గుళ్లు 'హుంయ్' మంటూ ఇలాంటి శబ్దమే చేసేవని వాక్రుచ్చారు. వారిలో అనేకులు అండాకృతినున్న ఛాయ ఒకటి గభాలున నేలపై పరుగెత్తడం చూశారు.

ఆ దెబ్బతిన్న అంతరిక్ష నౌకను గంట లోపలనే బ్రహ్మాండమైన జనసందోహం చుట్టవేసింది. నాలుగు చెరగులనుంచీ ఆ చుట్టుపక్కల వున్న జనం — కొందరు పొలాల కంచెలను ఎక్కి కొందరూ, మోటారు కార్లలో ఎక్కివచ్చి కొందరూ, సరస్సు వినీల జలాలపై పడవలు వేసుకుని కొందరూ — తండోపతండాలుగా పోగడ్డారు. నల్లగా పొగ చూరి, పెద్దపెద్ద కందెన మరకలు కట్టి, చొట్టలువారి బీటలు పడినట్టి ఆ కోడిగుడ్డు ఆకారపు వాయునౌక పచ్చిక దిబ్బలో కూరుకుపోయి ఒకపక్కకు ఒరిగిపోయుంది. అక్కడ మూగిన జనంలో ఎవరికి తోచినట్లుగా వారు అనేక రకాల సిద్ధాంతాలు చేయసాగారు — ఒక దానిని మించి అసందర్భంగా వుంది మరొక సిద్ధాంతం. గుండ్రని నౌకాద్వారపు సగం తెరిచి వున్న తలుపుమీద: "ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్. పెట్రోగ్రాడ్నుండి అంతరిక్ష యానం ఆరంభం, ఆగస్టు 18, 192..." అని చిత్రించి వున్న వాక్యాన్ని చదువుకున్న

తరువాత వారి ఆశ్చర్యోద్రేకాలు ఇక చెప్పడానికి వీల్లేదు. అన్నిటికంటే మరీ ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, ఆనాడు జూన్ 3, 192... ఒక్క మాటలో చెప్పాలంటే, ఆ వాక్యం చిత్రించి అప్పుడే మూడున్నర సంవత్సరాలైందన్నమాట.

చిత్రవిచిత్రంగా నిగూఢంగా వున్న ఆ పరికరం లోపలనుంచి తటాలున సన్నని మూలుగులు వినబడ్డాయి. అవి వినబడడంతో జనం హడిలిపోయి నిశ్శబ్దంగా వెనక్కివెనక్కి తప్పుకొన్నారు. ఒక జట్టు పోలీసు బలగం, ఒక డాక్టరూ, కెమేరాలు పట్టుకుని ఒక డజనుమంది పత్రికావిలేకరులూ రంగంమీద ప్రత్యక్షమయారు. వీరందరూ కలిసి, ఆ గుండ్రని ద్వారం తలుపు తెరచి, సగం నగ్నంగా వున్న ఇద్దరు మనుషుల శరీరాలను జాగ్రత్తగా బయటికి తీశారు. వారిద్దరిలోనూ ఒక మనిషి చిక్కి శల్యమైపోయి జుత్తు నెరసిపోయి, ఎముకల పోగులా వున్నాడు — మనిషి వొంటిమీద స్మార్కం లేదు. రెండో మనిషికి ముఖంనిండా గాయాలు తగిలి, ముఖమంతా రక్తం వోడుతూంది; చేతులు విరిగి వున్నాయి, పాపం అతడు ఘోరంగా మూలుగుతున్నాడు. జనంలోనుంచి అభిమాన, సానుభూతి పురస్సర వచనాలు బయల్దేరాయి. విశ్వలోక యాత్రికులను ఇద్దరినీ ఒక కారులో ఎక్కించి ఆస్పత్రికి తీసుకెళ్ళారు.

కిటికీ అవల పిట్ట ఒకటి నిర్మల కంఠంతో ఆనందంగా పాడుకుంటూంది. అరుణ కిరణాల గురించీ, వినీలాకాశం గురించీ ఆ పిట్ట గానం చేస్తూంది. పడకలో దిండుపై తల వాల్చి, వింటున్నాడు లోశ్. కళ్ళు గుంటలు పడి, ముడుతలుపడిన ముఖంనుండి కన్నీటి ధారలు ప్రవహిస్తున్నాయి. ఆ గానం తానెక్కడో ఇదివరకు విన్నాడు. కాని — ఎక్కడ?

ఉదయాన వీస్తూన్న ఆ చల్లని గాలికి మెల్లగా అల్లల్లాడుతూన్న కిటికీ తెరల ఆవల, మంచు బొట్లు రాలివున్న గడ్డిచెట్ల ఆకుల నీడలు తళతళ మెరుస్తున్నాయి. చెమ్మగిలిన ఆకుల నీడలు కిటికీ తెరలపై దోబూచులాడుతున్నాయి. పిట్ట కీచు కీచుమని కూస్తూంది. దూరాన అడవి చాటునుంచి తెల్లని మబ్బు ఆకాశంలోకి లేస్తూంది.

ఈ భూలోకంకోసమూ, ఈ మేఘాలకోసమూ, టపటపమంటూ పడుతూన్న వర్షం కోసమూ, తళుకులు విర జిమ్ముతూన్న హిమ బిందువుల కోసమూ, పచ్చని కొండలపై విహరించుతూన్న మహా మనీషుల కోసమూ ఎవరి హృదయమో మహ పరితపించుకుపోతూంది. అతనికి జ్ఞాపకం వచ్చింది — ఈ భూగోళానికి అనంత దూరాన అరుణకాంతులు మేల్కొల్పిన ఉదయాన అయిలీత స్వప్నాల గురించి పిట్ట ఒకటి గానం చేసింది. అయిలీత... కాని, అయిలీత అనే వ్యక్తి వుండడం నిజమేనా? లేకుంటే కలేనా? కాదు, కాదు. సంధ్యారాగంలాంటి విసీల దేహం, విచారభారంతో కుంగిపోతూన్న సుందర కోమల వదని ఒకతె బోగిమంట దగ్గర కూచుని, ఏనాటి ప్రేమగీతికనో పాడుతూండిన కాలం గురించి కీచుకీచుమంటూ తన పక్షి భాషలో ఆ పిట్ట గానం చేస్తూంది.

అందుచేతనే గుంటలు పడి లోతుపోయిన దవడల మీాదనుండి కన్నీటి ధారలు లోశ్ ముఖాన ప్రవహించుతున్నాయి. తారా మండలాల ఆవల వుండిపోయిన వ్యక్తిని గురించీ, తల నెరిసిపోయి, ముఖం ముడుతలుపడి, ఆకాశాలు దాటివచ్చిన ఆ ముసలి స్వాప్నికుని గురించీ పాడుతూంది ఆ పిట్ట.

గాలికి నెమ్మదిగా ఆడుతూంది తెర. తేనె పరిమళం, మంటి సువాసన, నీటిచెమ్మ కమ్మని తావి ఆ గదిలోకి మెల్లగా ప్రవేశించాయి.

ఇలాంటి ఒకనాటి ఉదయాన స్కాయిల్స్ ఆస్పత్రి దగ్గర ప్రత్యక్ష

మయాడు. "ఏ మండోయ్, అభివందనాలు!" అంటూ అతడు హృదయ పూర్వకంగా లోశ్‌ని పలకరించి, కరచాలనం చేసి — పడక పక్కనే వున్న ముక్కాలి పీటమీద కూచుని, తలనున్న టోపీని వెనక్కి తోసి:

"చూడగా ఈ ప్రయాణం మీ వొంటి కేమీ పడినట్టు లేదే, నేస్తంగారూ!" అని మొదలెట్టాడు కుశలప్రశ్న. "గూసెవ్‌ని ఇప్పుడే చూసి వస్తున్నా. మంచి హుషారైన మనిషి: చేతులు రెండింటికీ పలాస్త్రీ కట్టు, విరిగిన దవడ — మనిషి మాత్రం పూలరంగడే. భూమిమీద మళ్ళీ కాలు పెట్టినందుకు మహా కుషీగా వున్నాడు. అతని భార్యపేర పెట్రోగ్రాడ్‌కి టెలిగ్రాంవేసి, ఐదువేల డాలర్లు పంపించాను. మా పత్రికవాళ్ళకి కూడా మీ గురించి టెలిగ్రాం పంపించాననుకోండి — మీ 'ప్రయాణ విశేషాలు' వ్యాసం కోసం బోలెడంత డబ్బు మీకోసం మూల్గుతూందండీ. కాని — ఒక్క సంగతండోయ్ నేస్తంగారూ! — మీ పుప్పుకాన్ని మాత్రం మీరింకా బాగా మెరుగుపరచాల్సి వుంటుంది సుమండీ — భూమిమీద వాలడంలో మాత్రం మీరు గొప్పమతాబా కాల్చారు! ఆ నాడు పెట్రోగ్రాడ్‌లో ఏ ముహూర్తాన మిమ్మల్ని కలుసుకున్నానో — తల్చుకుంటే ఆశ్చర్యమే వేస్తుంది — అప్పుడే నాలుగేళ్ళు కావస్తూందే! ఇదిగో, నా మాట విని — ఒక్క గ్లాసు బ్రాందీ పుచ్చుకోండి — సంజీవిలా పనిచేస్తుంది, ఏమనుకున్నారో!"

చికిత్సితునికేసి మందహాసంతోనూ ఆదరంతోనూ నిండిన చూపులు సారించుతూ, స్కయిల్స్ గణగణమంటూ బాతాఖానీ సాగించాడు. కావితేరిన అతని ముఖం కలుపుకోలుతనంతో ఉట్టిపడుతూంది, తీరని జిజ్ఞాసతో కళ్ళు తొణికిసలాడుతున్నాయి. అతనితో కరచాలనం చేయడానికని లోశ్ చేయి అందిచ్చి:

"మిమ్మల్ని చూడ్డానికి నాకెంతో సంతోషంగా వుందండీ, స్కయిల్స్ గారూ!" అన్నాడు.

# ప్రేమవాణి

జ్ఞానొవ్స్కయ ఎంబాంక్‌మెంటు మీద మంచు చెక్కలు నాట్య మాడుతున్నాయి, పేవ్‌మెంట్లని తుడిచి పారేస్తున్నాయి, వీధి దీపాల చుట్టూ నృత్యం చేస్తున్నాయి. అవి ద్వారాలపైనా, కిటికీ గడపలపైనా తెల్లని తివాచీలను పరచి, మంచుతుపానులో కొట్టుకొనిపోయి, నదికి ఆవల వున్న పార్కులో మూలుగుతూ గర్జిస్తున్నాయి.

లోశ్ తన కోటుకాలరు పైకి ఎత్తి, రైంయ్‌మని కొడుతూన్న ఎదురు గాలికి వంగి, ఎంబాంక్‌మెంటుమీద దిగువదిశగా నడుస్తున్నాడు. ఎదురు గాలికి మెడకు చుట్టుకున్న మఫ్లర్ మెడ వెనుక్కి ఎగురుతూంది. ముఖాన కొడుతూన్న మంచు చిటుకు చిటుకుమని పొడుస్తూంది. రోడ్డుమీద పడిన మంచుకు కాలు జారుతూంది. ఫ్యాక్టరీలో పని ముగించుకుని తన అలవాటు చొప్పున తాను ఏకాంత జీవనం చేస్తూన్న ఫ్లాటుకు వెళ్లిపోతున్నాడు లోశ్. అతని వెడల్పు అంచు టోపీ, ముఖాన్ని సగంవరకూ కప్పేస్తూన్నట్టుగా చుట్టుకున్న మఫ్లరూ, వంగిన బుజాలూ, వీటికి తోడు నెరిసిన జుట్టు గాలికి రేగిపోతూన్నా సరే లెక్కచేయకుండా ఎదుటివారిని పలకరించేప్పుడూ వంగి నమస్కారం చేస్తూన్నప్పుడూ, ఇదివరకెన్నడూ ఏ మానవమాత్రుడూ చూచి ఎరగని దృశ్యాలను వీక్షించిన అతని కళ్లలో ప్రత్యక్షమయే వింత చూపులూ — ఆ పేటలో వున్న వాళ్లకి సుపరిచితమే.

వెనకటి కాలంలోనైతే, మెడకు చుట్టుకున్న మఫ్లర్ గాలికి ఎగురుతూ, మంచుతుపానులో తిరుగుతూన్న ఈ వింత మనిషిని చూసి ఏ బాలకవో తప్పకుండా ఆవేశం పొంది వుండేవాడే. కాని కాలం మారిందిప్పుడు: మంచుతుపాన్లూ, నక్షత్రాలూ, మేఘాలకావల వున్న ప్రపంచాలూ కవు

లను మంత్రముగ్ధులను కావించడంలేదు. దేశమంతటా మార్మోగుతున్న సమ్మెట బాదులూ, కోత రంపాల ఝూంకారమూ, వంకకొడవలి మర్మరధ్వనీ, చేతికొడవలి గరగరా — భూదేవి పాడుతూన్న ఈ ఉల్లాస గీతాలు విని ఉజ్వలి తులవుతున్నారు.

లోశ్ భూలోకానికి తిరిగివచ్చి ఆరు నెలలైంది. అంగారక గ్రహాన్ని దర్శించి మానవు లిద్దరు భూమిని తిరిగి చేరుకున్నారని లోకానికి చాటిచెప్పిన మొదటి టెలిగ్రాం రేకెత్తించిన జిజ్ఞాస అప్పుడే చల్లారిపోయింది. లోశ్, గూసెవ్‌లు ఇద్దరూ నూటయాభై విందులలోనూ, రాత్రిభోజనాల్లోనూ, విజ్ఞానశాస్త్రీయ సమావేశాల్లోనూ తాము మర్యాద ప్రకారం భుజించాల్సిన భక్ష్యాలు ఆరగించారు. పెట్రోగ్రాడ్‌నుంచి తన దగ్గరకు రావాల్సిందని మాష పేర గూసెవ్ టెలిగ్రాం వేసి, ఆమె వచ్చిన తరువాత ఆమెనొక బొమ్మలా ముస్తాబుచేశాడు, కొన్ని వందల ఇంటర్వ్యూలు జరిపాడు, మోటారు సైకిలు ఒకటి కొన్నాడు, గుండ్రని గాగుల్స్ పెట్టుకోవడం మొదలెట్టాడు, అంగారకవాసులతో తాను చేసిన యుద్ధాల గురించీ, సాలీడుల గురించీ, తోకచుక్కల గురించీ, తానూ లోశ్వూ ఇంచుమించు గ్రేట్ బేర్ ద్వీపం మీద దిగాల్సిందే గాని, తలవెంట్రుక వాసిలో తప్పిపోయిందన్న విషయం గురించీ వీరితోనూ వారితోనూ అడిగిన వారితోనూ అడగని వారితోనూ అందరితోనూ చెబుతూ యూరప్, అమెరికాలలో ఆరునెలలపాటు పర్యటించాడు. పర్యటన ముగించుకుని సోవియట్ రష్యా తిరిగివచ్చేసి, "అంగారకగ్రహ శ్రమజీవులలోని పరిశేష జనాభా రక్షణార్థం సైనిక దళాలను అంగారక గ్రహానికి పంపించేందుకు సంఘం" ఒకదానిని స్థాపించాడు.

లోశ్ పెట్రోగ్రాడ్‌లోని ఒక ఇంజనీరింగు కార్ఖానాలో, అంగారక

...అతనికి నిద్రలో వినబడింది — కోపావేశంతో వున్న తేనెటీగల ఝూంకారంలాంటిచప్పుడు. వెనువెంటనే ఎవరో తలుపు కొట్టారు. అయిలీత ఉలికిపడి లేచి, గజగజ వణకిపోతూంది. గుహలో గాఢాంధకారంగా వుండడం చేత అతనికి అయిలీత కనబడే లేదు, కాని ఆమె గుండెలు దడదడ కొట్టుకోవడం మాత్రం అతడికి వినబడింది. తలుపు కొట్టడం మళ్ళీ ప్రారంభమైంది. ఇక అప్పుడు వినబడింది తుస్కూబ్ గొంతు: "వాళ్లను పట్టుకోండి!" ఆ అరుపు వినబడగానే లోశ్ అయిలీతను తన దగ్గరకు తీసుకున్నాడు. ఆమె గాద్గదికంగా అతనితో అంది:

"ఇక ఇదే సెలవు, ప్రాణనాథా, నా భర్తా! ఆకాశపుత్రా!"

ఆమె వేళ్లతో అతని ముఖం తాకింది. అప్పుడు లోశ్ ఆమె చేతి కోసం తడుముకుని, విషం వున్న సీసాను లాగేసుకున్నాడు. అతి త్వరగా గుక్క తిప్పుకోకుండా ఆమె అతని చెవిలో చెప్పింది:

"నన్ను రాణి మాగ్‌కి అంకితం చేశారు. మా అంగారక గ్రహంలో పురాతనంనుంచీ వస్తూన్న భీతావహమైన మాగ్ సంప్రదాయం ప్రకారం, తాను తీసుకున్న దీక్షను తానే భగ్నం కావించిన కన్యకకు శిక్ష ఏమిటంటే, పాతాళ పారంగవ్యూహంలో వున్న నూతిలో పారేయడం. ఆ నూతుని నువ్వు చూడనే చూశావు... కాని ఆకాశపుత్రుని ప్రేమను నేను స్వీకరించకుండా వుండలేకపోయాను. నాకు పరమానందం తప్ప మరొకటిలేదు. నా జీవితానికి నువ్వు ప్రాణం పోశావు. అందుకు నేను నీ కెంతో కృతజ్ఞురాలను. హావో సహస్రాబ్దికి నన్ను నువ్వు తిరిగి పంపించేస్తున్నావు. హృదయేశ్వరా! భర్తా! నీకు నా కృతజ్ఞాభివందనలు!.."

అయిలీత అతనిని ముద్దుపెట్టుకుంది. ఆమె పెదవులపై తేలియాడుతూన్న విషబిందు తిక్తమధుర వాసనలను అతడు ఆఘ్రాణించాడు.

సీసాలో ఇంకా చాలా విషమే మిగిలి వుండడం చూసి, ఆ మిగిలిన కారునలుపు విషపు చుక్కలను అతడు వెంటనే మింగేశాడు. అయిలీత అప్పుడే ఆ విషాన్ని పెదవులతో తాకింది. తలుపు కొట్టడం విని, లోశ్ పడకలోంచి లేచాడు. కాని తాను మూర్ఛపోతూన్నట్టు తోచిందతనికి. తన కాళ్ళూ, చేతులూ తనవి కావనిపించింది. పడక మళ్ళీ చేరుకుని, అయిలీత శరీరంమీద పడి ఆమెను కౌగలించుకున్నాడు. అంగారకవాసులు గుహలోపలికి చొరబడే సరికి, అతనికి వంట్లో చలనం లేదు. అతనిని తన భార్యనుండి విడదీసి, ఆమెను కేప్‌లో చుట్టేసి తీసుకుపోయారు వాళ్లు. ఇక తనకు మిగిలిన ఆ రవంత బలంతోనూ అతడు లేచి ఆమె నల్లని కేప్ అంచును పట్టుకుని వారిని నిలవరించబోయాడు. కాని వెంటనే అగ్ని కణాలు విజృంభించాయి. అతనికి సరాసరి గుండెలపై ఒక పోటు తగిలింది, దానితో అతడు తూలిపోయి, గుహకున్న ఆ చిన్న బంగారు తలుపు దగ్గర పడిపోయాడు...

ఎదురు గాలికి వంగి, లోశ్ ఎంబాంక్‌మెంటు మీదనుంచి దిగువ దిశగా పరుగున పరుగెత్తాడు. అప్పుడు సుడిగాలితో లేచిన మంచు దుమారంలో చిక్కుకుని ఒక్క నిమిషం ఆగి, ఆనాడు విశ్వాంతరాళ వినీలాంధకార శూన్యంలో తాను కేకపెట్టినట్టుగానే ఇప్పుడు కూడా ఒక కేక పెట్టాడు:

"ఆమె బతికే వుంది, బతికే వుంది — అయిలీత, అయిలీత!.."

భూతలంపై మొట్టమొదటి సారిగా ఉచ్చరించబడిన ఆ పదాన్ని తటాలున గాలి మోసుకుపోయి, వికటాట్టహాసంతో విలయతాండవం చేస్తూన్న మంచు చెక్కల మధ్య చిందరవందరగా చెదరగొట్టేసింది. లోశ్ తన గడ్డాన్ని మఫ్లర్‌లో మరింత కిందకి దించేసుకుని, జేబుల్లో చేతులు పెట్టేసుకుని, తూగిపోతూ తూలిపోతూ ఇంటివైపు నడిచాడు.

ఇంటి గుమ్మం ముందు కారు ఒకటి నిలబడుంది. కారు దీపాల నుంచి వెడలుతూన్న తేజోబాణాలలో చిన్నచిన్న తెల్లని మంచు చెక్కలు తువ్వతప్పన ఎగురుతున్నాయి. బొచ్చుకోటు తొడుక్కొని ఒక మనిషి ఇంటి ముందరి పేవ్‌మెంటువిూద నిలబడి గడ్డకట్టుకు పోయిన తన బూడ్సు జోళ్లతో టక్కు టక్కుమని గచ్చువిూద కదం తొక్కుతున్నాడు.

"విూ కోసమే వస్తా, మ్స్తిస్లావ్ సెర్గేయెవిచ్," అన్నాడు ఆ మనిషి సరదాగానూ. "కారులో ఎక్కండి, వెళ్దాం!"

ఆ వచ్చిన మనిషి గూసెవ్. ఆ సాయంకాలం ఏడు గంటలకి రేడియో-టెలిఫోను స్టేషనువారు ఏవో అతి శక్తవంతములైన కొత్త సిగ్నల్సు అందుతాయని నిరీక్షిస్తున్నారట. ఆ కోడ్ సిగ్నల్సు ఏమిటో, వాటిని ఎలా అర్థం చేసుకోవాలో అక్కడివారి కెవ్వరికీ తెలీదు. ఒక వారంరోజులై ప్రపంచంలోని అన్ని వార్తాపత్రికలూ ఈ సిగ్నల్సు ఏమిటో అని ఆశ్చర్యపడుతున్నాయి — బహుశ అవి అంగారక గ్రహం నుంచి వస్తున్నాయేమో అని అనుకుంటున్నారు. నిగూఢమైన ఆ సిగ్నల్సు వినడానికని రేడియో స్టేషనువారు లోశ్‌ని ఆహ్వానించారు — అని గూసెవ్ చెప్పాడు.

లోశ్ మారుమాటాడకుండా కారులోకి ఎక్కాడు. తెల్లని మంచు చెక్కలు దీపాలనుంచి విజ్రుంభించుతూన్న కాంతి శంకులలో ఉన్మాదంగా నృత్యం చేస్తున్నాయి. ముఖాన చల్లని గాలి విసరి కొడుతూంది. పట్నంలోని వినీలకాంతి దీపాలు, ఎంబాంక్‌మెంటు పొడుగునా మెరుస్తూన్న లాంతర్లు — వందలాది దీపాలు నెవానది మంచు ఏడారివిూద మెరుపులు విరజిమ్ముతున్నాయి. ఎక్కడో దూరాన ఐస్-బ్రేకర్ నావ ఒకటి కూత కూస్తూంది.

క్రాస్నియె జోరి వీధి చివరను మంచుతో నిండిపోయిన ఖాళీ స్థలంలో వున్న చిన్న గోపురపు ఇంటి ముందు ఆగింది కారు. మంచుమేఘాలను

చుంబించుతూన్న బురుజులూ, తీగెల వలలూ దిక్కుమాలినట్టుగా మొర్రో మని మూలుగుతున్నాయి. మంచు పెచ్చులతో పూత పూసిన తలుపు తెరచి, లోశ్ లోపలికి ప్రవేశించి, వెచ్చగా వున్న ఆ చిన్న ఇంట్లోకి గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్లి, మఫ్లరూ టోపీ తీసేసి, అక్కడ పెట్టేశాడు. గులాబీరంగు గుండ్రని బూరెబుగ్గలున్న మనిషి ఒకతను తన వెచ్చని బొద్దు చేతులతో చల్లగా ఎర్రగా వున్న లోశ్ చేతులను కరచాలనం చేసి, లోశ్‌తో ఏదో వివరించి చెప్పాడు. గడియారం ముళ్లు ఏడు గంటలకు దగ్గరపడుతున్నాయి.

లోశ్ వైర్‌లెస్ సెట్టు దగ్గర కూచుని, చెవులకి ఇయ్యర్-ఫోన్లు తగిలించుకున్నాడు. గడియారపు ముళ్లు మెల్లగా నడుస్తున్నాయి. ఆహా! కాలం, ఈ ఉన్మాద హృదయ స్పందనాలు, హిమశీతల విశ్వజగత్ ప్రదేశం!..

మెల్లని కంఠం, రహస్యం చెబుతూన్నట్టు అతని చెవినిబడింది. వెంటనే లోశ్ కళ్లు మూసుకున్నాడు. మళ్లీ అతని చెవినిబడింది — ఆ భీతావహమైన మెల్లని గుసగుస ఏదో చిత్రమైన మాట ఒకటి అవ్యక్తంగా పదే పదే వినవచ్చింది. లోశ్ తన ధ్యానాన్నంతనీ కేంద్రీకరించి విన్నాడు. తన గుండెలను బాదిన మెల్లని చిచ్చర పిడుగు గర్జనలా, దూరాతిదూరం నుంచి, భూలోకానికి సంబంధించని భాష జాలికొల్పుతూ పునశ్చరణ చేస్తూంది:

"ఎక్కడున్నావు నువ్వు, ఎక్కడున్నావు నువ్వు, ఎక్కడున్నావు నువ్వు, ఆకాశపుత్రా?"

ఆ గొంతుక గాలిలో లీనమైపోయింది. భయానకంగా ఉబ్బిపోయి, వెర్రి చూపులు చూస్తూన్న కళ్లతో లోశ్ తేరి చూశాడు... అయిలీత కంఠస్వరం, ప్రేమవాణి, అమరవాణి, తీరని కోర్కెకు చిహ్నమైన వాణి, విశ్వాంతరాళ ప్రదేశం దాటి తనను చేరుకుంది — తనను పిలుస్తూంది, బతిమాలుకుంటూంది, దీనంగా వేడుకుంటూంది: "ఎక్కడున్నావు నువ్వు, ఎక్కడున్నావు నువ్వు, ప్రియతమా?.."

పా ఠ కు ల కు మ న వి

ఈ పుస్తకం గురించీ, దీని అనువాదం గురించీ
మీ అభిప్రాయాలను ''రాదుగ'' ప్రచురణాలయానికి
దయచేసి తెలుపండి.
మీ అభిప్రాయాలను ఈకింది చిరునామాకు పంపండి:

Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

